# జగద్గురు మహోపదేశము

(శంకర భగవత్పాదుల అద్వైత సిద్ధాంత సారం)



ప్రణేత :

బ్రహ్మశ్రీ యల్లంరాజు శ్రీనివాసరావు

శ్రీమత్

# జగద్గురు మహోపదేశము

(శంకర భగవత్పాదుల అద్వైత సిద్ధాంత సారం)

ప్రణేత

సాహిత్య విద్యాప్రవీణ - వేదాంత విద్యాధురీణ

**బ్రహ్మశ్రీ యల్లంరాజు శ్రీనివాసరావు**

విజయవాడ

# జగద్గురు మహోపదేశము

గ్రంథకర్త :

**బ్రహ్మశ్రీ యల్లంరాజు శ్రీనివాసరావు**

పంచమ ముద్రణము : మార్చి, 2014

మూల్యం :

***పుస్తకములు దొరుకుచోటు :***

1. **బ్రహ్మశ్రీ యల్లంరాజు శ్రీనివాసరావు**
   యఫ్-1, శ్రీవేంకటసాయి టవర్స్,
   పాపరాజు వీధి, సత్యనారాయణపురం,
   విజయవాడ - 520 011.
   ఫోన్ : 0866-2538526

2. **యం. సుధాకర్**
   సత్యనారాయణపురం,
   విజయవాడ - 520 011.
   సెల్ : 94405 24168

# విషయ సంగ్రహము

## ఆశంసితం

సాక్షా దుమా పతి విభూతి సవాప తారః
శ్రీమాన్ జగద్గురు రభాషత శంకరో యత్
తత్ క్షీర సాగర మివ ప్రవి మథ్య-సార
మిచ్ఛామి దాతు మిహ - తేన బుధా రమంతామ్

# ఉపోద్ఘాతము

జగద్గురు శ్రీ శంకర భగవత్పాదులొక అనన్య సామాన్యమైన వ్యక్తి. ఆయన మన భారతదేశంలో జన్మించటం నిజంగా మన భారతీయుల కొక గర్వకారణం. అయితే ఆయన ఏ శతాబ్దంలో జన్మించాడనే విషయం మాత్ర మిప్పటికీ వివాదాస్పదంగానే ఉంది. క్రీస్తుకు పూర్వమని కొందరంటే తరువాత అని కొందరంటున్నారు. అయినా ఏ శతాబ్దంలో ఎప్పడు జన్మిస్తేనేమి, ఎప్పడూ, ఎక్కడా అనేవి మనకు ప్రధానం కావు. ఆయన భాషలోనే చెబితే అవి కేవలం వ్యావహారికమే. అలాంటప్పడనవసరంగా వాటిని గురించి మనం తలబ్రద్దలు చేసుకోవటం దేనికి. అనావశ్యకం. ఆయన ఎప్పడైనా జన్మించి ఉండవచ్చు. ఎక్కడైనా జన్మించి ఉండవచ్చు. మొత్తంమీద అలాంటి మహానుభావుణ్ణి మాత్రం మనమిక చరిత్రలో మరలా చూడబోమే. ఏమి కారణం. ఆయన ఈ మానవ లోకాని కుపదేశించిపోయిన విజ్ఞానమలాంటిది. అది పరిపూర్ణమైన అద్వైత విజ్ఞానం. సృష్టికంతా సారం మానవుడైతే-మానవుడికి సారమాతని విజ్ఞానమైతే, ఆ విజ్ఞానానికంతటికీ పరమసారమద్వైత విజ్ఞానమే.

అదేమిటి-మానవుడీలోకంలో ఆర్జించిన విజ్ఞానమెంతో ఉంది గదా. లోక జ్ఞాన Common Sense ముంది శాస్త్రజ్ఞాన Scientific sense ముంది. కళాజ్ఞాన Artistic sense ముంది. ఇన్ని జ్ఞానాలుండగా ఇందులో దేనికీ లేని విశిష్టత ఈ అద్వైత విజ్ఞానానికే ఎలా ఏర్పడిందని ప్రశ్న వస్తుంది వాస్తవమే. మానవుడార్జించిన విజ్ఞానమెంతో ఉంది. సందేహం లేదు. కాని ఎంత ఉన్నా, ఎన్ని ఉన్నా అవన్నీ చివరకు నిరుపయోగమే. కారణమేమంటే వాటిన్నింటిలోనూ రెండు ప్రబలమైన దోషాలున్నాయి. ఒకటి అపేక్ష Relativity. మరొకటి బాధ Controversity అపేక్ష అంటే దీని తరువాత ఏమిటనే ప్రశ్న. ఈ ప్రశ్న మనం సాధించిన ప్రతి విజ్ఞానంలోనూ పొడచూపుతుంది. చూడండి. మనమే విజ్ఞానాన్ని ఎంత సాధించినా ఇంకా సాధించవలసింది ఉండనే ఉంటుంది. సాధించింది ఒక బిందువైతే సాధించవలసింది ఒక మహాసముద్రం. ఎంత ఈదినా దాని తీరం చేరుతామనే ఆశ ఎప్పటికీ లేదు జీవితంలో. కాబట్టి అపేక్ష అనే దోషమొకటి ఉంది మన జ్ఞానానికి.

అలాగే బాధ అనే దోషం కూడా ఒకటుంది. బాధ ఏమిటి. బాధ అంటే మనమెందులో ఎంత జ్ఞానం సంపాదించినా అది పనికి రాకుండా పోవటం.

ఇది కూడా మన కనుభవ సిద్ధమే. చూడండి. ప్రతి రంగంలోనూ మన మెంతెంతో పరిశోధన చేస్తున్నాము. ఎన్నెన్నో విషయాలు తెలుసుకొంటున్నాము. అవన్నీ అప్పటికప్పుడు సత్యమనే నమ్ముతుంటాము. కానీ అంతకన్నా ముందుకు పోయి మరి ఒక క్రొత్త రహస్యం కనుగొనే సరికంతకు ముందరిదంతా బలాదూరవుతున్నది. అది మరి కొంతదూరం ప్రయాణం చేసే సరికి పేలవమయి పోతున్నది. ఈ విజ్ఞాన యాత్ర ఇలా నిరంతరమూ కొనసాగవలసిందే గనుక చివరకంతా బాధితం కాక తప్పదు. ఏతావతా తేలిందేమంటే మానవుడార్జించిన ఆర్జిస్తున్న ప్రతి ఒక్క విజ్ఞానమూ కూడా అపేక్షా బాధలనే ఈ రెండు దోషాలకూ గురి కావలసిందే. అది నీవు లోకజ్ఞానమని చెప్పు. శాస్త్రమని చెప్పు. కళాజ్ఞానమని చెప్పు. ఏదైనా సరే. రెండింటి కబంధ హస్తాల నుంచీ తప్పించుకొని బయటపడడం కల్ల.

కాగా ఈ రెండవ లక్షణాలూ లేని విజ్ఞానమేదైనా ఉందంటే అది ఒక్క అద్వైత విజ్ఞానమే. ఎంచేతనంటే అసలద్వైతమని పేరు పెట్టటంలోనే ఉన్నదా రహస్యం. అద్వైతమంటే ఏమిటి. రెండవ పదార్థమంటూ ఏదీలేదు. ఉన్నదంతా ఒక్క ఆత్మచైతన్యమే నని గదా, చైతన్యం తప్ప మరొకటేదీ లేదన్నప్పుడిక అపేక్ష ఏముంది. బాధ ఏముంది. ఇది గాక మరొకటున్నదని ఒప్పుకొన్నప్పుడే వాటి రెంటికీ అవకాశమేర్పడేది. లేకుంటే అసలాస్కారమే లేదు వాటికి. అపేక్షా బాధలు రెండూ లేవంటే అది ఒక పరిపూర్ణమైన జ్ఞానం కాక తప్పదు. ఇలాటి పరిపూర్ణమైన జ్ఞానమే అద్వైత జ్ఞానం.

అంతేకాదు. పరిపూర్ణ మెప్పుడయిందో అప్పుడిక పురుషార్థమనేది కూడా దానితోనే పరిసమాప్తమవుతున్నది. పురుషుడు కోరేదేదో అది పురుషార్థం The aim and goal of human life. పురుషుడంటే మానవుడే, మానవులందరూ కోరే పదార్థాలు రెండే ప్రపంచంలో. అన్నీ తెలుసుకోవాలని ఒకటి. అనవరతమూ సుఖంగా బ్రతకాలని ఒకటి. ఇంతకు మించి మరేదీ కానరాదు. ఇందులో మొదటి దానికి జిజ్ఞాస అనీ, రెండవదానికి ముముక్ష అనీ పేరు పెట్టారు మన ప్రాచీనులు. ఇవి రెండూ నెరవేరే వరకూ పురుషార్థమనే దానికి మనం నోచుకోలేము. అద్వైత మన్నప్పుడింకొక భావానికే అసలాస్కారం లేదనిగదా చెప్పాము. అలాంటప్పుడిక జిజ్ఞాస ముముక్షలు మాత్రమెక్కడివి. ఇవి కూడా వాటిపాటి కవి నమసి పోవలసిందే. పోతే పురుషార్థమనేది మన కప్రయత్నంగానే సిద్ధిస్తుంది. అంచేత మానవుడు

సాధించిన అన్ని విజ్ఞానాలకూ ఆఖరిమెట్టు అద్వైత విజ్ఞానమే. అవి సాపేక్షమైతే Relative ఇది నిరపేక్షం Absolute. అవి సబాధమైతే Contradicted ఇది నిర్బాధం Uncontradicted ఇది అద్వైత విజ్ఞానానికుండే విశిష్టత.

ఇలాంటి విలక్షణమైన జ్ఞానాన్ని మనకు బోధించగలిగారంటే అలా బోధించిన భగవత్పాదులెంతటి మహనీయులో వేరుగా చెప్పబని లేదు. అసలు వారికి భగవత్పాదులని బిరుద మేర్పడటంలోనే మనకీ విషయ మవగత మవుతుంది. తెలియవలసినదంతా తెలుసుకొని దాన్ని అనుభవానికి తెచ్చుకొన్న పూర్ణ పురుషులే భగవత్పాదులు. శంకరులలాంటి పూర్ణ పురుషులు. వారికి పరమార్థమంతా చేతిలో వెన్నముద్దలాగా స్వానుభవానికి వచ్చింది. అనుభవమనేది లేకుంటే ఏదిగానీ ఒక సిద్ధాంతంగా Doctrine or theory బయటికి రాదు. మానవుల సిద్ధాంతాలన్నీ Concepts వారి వారి అనుభవాలకు ప్రతీకలే Indications. సిద్ధాంతా లన్నిటికీ తలమానిక మద్వైత సిద్ధాంతమని గదా ప్రతిపాదించాము. అలాంటప్పుడది ఎవరి అనుభవానికి రాకుండానే ఎలా అవతరించగలదు. ఒకవేళ అవతరించిందని వాదించినా దాని కర్థమేముంది. కాబట్టి దాని నొక సిద్ధాంతంగా శంకర భగవత్పాదులు లోకానికి చాటారంటే ఆయన కది ముందుగా అనుభవ గోచరమయి ఉండవలసిందే, ఇందులో అనుభవానికి తెచ్చుకోవటం వల్లనే ఆయన భగవత్పాదులయ్యారు. అలా తెచ్చుకొన్న విజ్ఞానాన్ని మరలా ఈ మానవ సమాజాని కుపదేశించి పోవటంవల్ల ఆయన జగద్గురువులు కూడా అయ్యారు.

అయితే మనకిక్కడ ఒక ఆశంక కలగవచ్చు. శంకరులు బోధించారని చెప్పే ఈఅద్వైత విజ్ఞానమంతకు ముందునుంచీ మన ఉపనిషద్వాఙ్మయంలోనే ఉంది గదా. ఇక ఆయన మనకు క్రొత్తగా చేసిన బోధ ఏమిటి అని. అదీ వాస్తవమే. ఉపనిషత్తులలోనే ఉన్నాయి అద్వైత జ్ఞాన రత్నాలన్నీ. సందేహం లేదు.కాని అవి బాగా లోతుకు దిగి గాలించినప్పడే చేతికందేది. ఆ పాతతః చూచామంటే వాటిలో ఒక్క అద్వైతమే గాదు. సాంఖ్యయోగాది ద్వైతవాసనలు కూడా గుబాళిస్తుంటాయి. ఎక్కడికక్కడే మనకుపనిషత్తుల భావమిదే కావచ్చుననే భ్రాంతి ఏర్పడుతుంది. మనకేమిటి. అసలు పెద్ద పెద్ద మతాచార్యులకే ఏర్పడింది ఇలాంటి అపోహ. కనుకనే ఎవరికి తోచినట్లు వారు ఉపనిషద్వాక్యాలకు వ్యాఖ్యానాలు వ్రాస్తూ వచ్చారు. దానితో అసలుపనిషత్తాత్పర్య Import మేమిటో ఎవరికీ అంతు పట్టకుండా మరగున

బడిపోయింది. అలాంటి పరిస్థితిలో అవతరించారు శంకర భగవత్పాదులు. అలా అవతరించి పరస్పర విరుద్ధంగా కనపడే భావాలనన్నిటినీ సమన్వయించి ఉపనిషత్తులన్నిటికీ కలిపి ఒక్క అద్వైతమే వివక్షిత Intention మని ఆయన సిద్ధాంతం చేశారు.

ఇది ఒక్క ఉపనిషత్తులకేగాదు. ఆ మాటకు వస్తే శ్రుతులకన్నింటికీ కూడా అద్వైతమే పరాయణమని ఆయన చేసిన తీర్మానం. ఋగ్యజుస్సా మాథర్వణాలనే నాలుగు శ్రుతులూ ఒక జ్ఞానకాండనే గాక విధ్యుపాసన రూపమైన కర్మకాండను గూడా ప్రతిపాదిస్తాయి. ఇందులో జ్ఞానకాండ అనబడే ఉపనిషత్తులొక వేళ అద్వైత భావాని కనుకూలమైనా కర్మకాండ మాత్రమలా అయినట్టు కనిపించదు. కర్మ అనేది దాని స్వరూపాన్ని బట్టి చూచినా అది ఇచ్చే స్వర్గాది ఫలాన్ని బట్టి చూచినా కేవల మీద్వైత ప్రపంచంతోనే ముడిబడి ఉన్నట్టు తోస్తుంది. కానీ చిత్రమేమంటే ఆ కర్మలు కూడా కామ్యవర్జితంగా ఆచరిస్తే చాలు. మానవుడికి చిత్తశుద్ధిని ప్రసాదించి తద్వారా జ్ఞానోత్పత్తికే దోహదం చేస్తాయి. అప్పటి కుపనిషత్తులు సాక్షాత్తుగా Direct నైతే కర్మోపాసనలు రెండూ పరంపరగా Indirect సాధనాలవుతాయి అద్వైతానికి. దీనిని బట్టి కాండద్వయాత్మకమైన శ్రుతికంతటికీ అద్వైతమే పరమార్థమని ఏక వాక్యతను Uniformity నిరూపించారు శంకరులు.

శ్రుతులకు నిరూపించ గలిగారంటే ఆ శ్రుతుల అడుగుజాడలలో పయనించేవే మను యాజ్ఞవల్క్యాది స్మృతులు కూడా. కాబట్టి వాటికి కూడా నిరూపించి నట్టయింది. పోతే ఈ శ్రుతి స్మృతులలోని భావాలనే కథా రూపంగా బయట పెడతాయి ఇతిహాస పురాణాలు. కనుక వాటికి కూడా ఇదే తాత్పర్యమని చాటినట్టయింది. మొత్తంమీద శ్రుతి స్మృతి పురాణేతి హాసభేద భిన్నమైన సమస్త వాఙ్మయానికీ అద్వైత జ్ఞానమొక్కటే చివరకు పరాయణమని ఆయన చేసిన సమన్వయం.

మరి ఈ సమన్వయ ప్రయత్నమింతటితో ఆగలేదు. శాస్త్ర ప్రమాణాన్నే గాక లౌకికమైన ప్రత్యక్షాదులను కూడా ఆయన దాని పరిధిలోకే లాగ గలిగారు. అది మరీ అద్భుతం. **"అహం బ్రహ్మాస్మి - ఇత్యేద దవ సానా ఏవ సర్వే విధయః సర్వాణిచ ప్రమాణాని"** అని ఆచార్యులవారు సెలవిచ్చిన వాక్యం. అహమ్ బ్రహ్మాస్మి అనే అఖండాత్మ భావంతో సమాప్తమయ్యేవే సకల కర్మలూ, సర్వ ప్రమాణాలూ. సర్వ ప్రమాణాలూ అన్నప్పుడొక వాఙ్మయ జగత్తే Litarary World గాదు. చరాచర

రూపమైన ఈ భౌతిక జగత్తు Material world కూడా కలిసి వస్తున్నది. వాఙ్మయ జగత్తు శబ్ద ప్రమాణానికైతే మిగతా జగత్తంతా ప్రత్యక్షాదులకు గోచరమయ్యేదే. దీనిని బట్టి మనకు తెలిందేమిటి. స్థావర జంగమాత్మకమైన సృష్టి కంతటికీ కూడా అద్వైత విజ్ఞానమే ఏకైక లక్ష్యమనీ దాని కభిముఖంగా అణువు మొదలు ఆకాశం దాకా ప్రతి ఒక్కటీ ఈ లోకంలో పయనిస్తున్నదనీ ఒక గొప్ప సమన్వయ Grand synthesis మేర్పడుతున్నది.

ఇలాంటి సర్వతోముఖమైన Comprehensive సమన్వయమిప్పటి వరకూ ప్రపంచ చరిత్రలో ఏ మతాచార్యుడూ చేయలేదు. ఇక చేయబోడు. ప్రతిఒక్కరూ తత్త్వాన్ని ఏకముఖంగానే చూచి సిద్ధాంతాలు చేస్తూ వచ్చారే గాని సమష్టిరూపంగా దర్శించిన వారు కాదు. వారి దృష్టి చూస్తే గ్రుడ్డివాండ్లు ఏనుగును చూచిన వ్యవహారం జ్ఞాపకం వస్తుంది. ప్రతి ఒక్కడూ ఏనుగును చూచినవాడే. కాని పూర్తిగా మాత్రం కాదు. అందులో తోక పట్టుకొని ఒకడు బల్లెంలాగా ఉందంటే-తొండం బట్టుకొని ఒకడు రోకలిలాగా ఉందంటాడు. అది దాని సమష్టి రూపమెలా అవుతుంది. అలాగే ఈ దర్శనాలలో ఏదీ కూడా సమగ్రమైనది కాదు. కాదు గనుకనే శంకర భగవత్పాదులందులో ప్రతి ఒక్క దానిని సరి దిద్దవలసి వచ్చింది.

శంకరుల వారికి షణ్మత స్థాపకులని ఒక పేరున్నది. శైవం వైష్ణవం, శాక్తేయం, గాణాపత్యం, సౌరం, కౌమారం ఈ ఆరింటినీ షణ్మతాలని వ్యవహరిస్తారు. ఇవి ఆరూ కూడా ఆస్తిక దర్శనాలే. అయితే ఎవరికి వారు తమ దైవతమే సర్వోత్కృష్టమని వాదిస్తారు. అది కేవలం పాక్షికమైన దృష్టి షణ్మతాలనేవి అసలు భగవంతుడిలోని షడ్గుణాలను బట్టి అవతరించాయి. జ్ఞానైశ్వర్యశక్తి బలవీర్య తేజస్సులనేవే ఆ షడ్గుణాలు. అవి ఆరూ అభిన్నంగానే ఉన్నాయి భగవత్తత్త్వంలో. అభిన్నమైన ఈ గుణాలను పరస్పర విలక్షణంగా భావించటం మూలాన్నే ఇన్నిమతాలేర్పడ్డాయి. వీటిలో వైష్ణవం జ్ఞాన ప్రధానం. శైవమైశ్వర్య ప్రధానం. శాక్తేయం శక్తి గుణ ప్రధానం. ఇలా ఒక్కొక్క గుణాన్ని వేరు చేసి తీసుకోటంవల్ల దైవం వేరు కావటం వల్లఅవి పరస్పర విద్వేషాలకు నాందీ పలికింది. నిజానికిన్ని గుణాలూ లేవు. ఇన్ని దైవతాలూ లేవు. షడ్గుణ సంపన్నుడైన భగవానుడొక్కడే. గుణాలన్నీ ఆయన తాలూకు విభూతులే Aspects అని సమన్వయించి చూపారు భగవత్పాదులు. "సచ భగవాన్ జ్ఞానైశ్వర్య బలవీర్య తేజశ్శక్తిభి స్సదా సంపన్నః" అని గీతా భాష్య ముఖంలో ఆయన సెలవిచ్చిన సూక్తి. ఇదీ వారు చేసిన షణ్మత స్థాపన.

అప్పుడెప్పుడో ఆయన షణ్మతాలకు చేసిన సమన్వయం ఇప్పుడున్న షణ్మతాలకు కూడా సరిపోతుందంటారు అభిజ్ఞులు. ఇప్పుడున్న షణ్మతాలు మన హైందవం మినహాయిస్తే ఆరు. బౌద్ధం-జైనం, క్రైస్తవం-మహమ్మదీయం యూదుమతం-జరదుష్ట్ర మతం. ఇవి కూడా భగవంతుడిలోని షాడ్గుణ్యానికి ప్రతీకలే గాని వేరు గావు. ఒక్కొక్క గుణాన్ని ప్రధానంగా తీసుకొని ఒక్కొక్క మతం చలామణిలోకి వచ్చినట్టు కనిపిస్తుంది. ఈ దృష్టితో చూస్తే బౌద్ధం శాక్తేయానికీ, జైనం శైవానికీ, క్రైస్తవం కౌమారానికీ, మహ్మదీయం వైష్ణవానికీ యూదుమతం గాణాపత్యానికి, జరదుష్ట్ర మతం సౌరానికీ, సహోదరాలని చెప్పవచ్చు. అంచేత వాటిని సమన్వయించారంటే శంకరులు వీటిని కూడా సమన్వయించారనే అర్థం. సర్వతోముఖమైన దృష్టికి దేశకాలాలనే అవధులుండ బోవని దీనిని బట్టి మనకు తేటపడుతున్నది.

షణ్మతాలంటే శైవ, వైష్ణవాదులనే గాక షడ్దర్శనాలని కూడా అర్థమే. న్యాయ, వైశేషిక, సాంఖ్య, యోగ పూర్వోత్తర మీమాంసలకు షడ్దర్శనాలని పేరు. ఇందులో న్యాయవైశేషికాలు రెండూ హేతువాద ప్రధానాలు. ఆత్మేశ్వర తత్త్వాలను హేతువాదంతో నిరూపిస్తారు తార్కికులు. అంతవరకూ ఫరవాలేదు. కాని అవి రెండూ పరస్పర భిన్నమని వాదిస్తారు. పైగా ఆత్మను కూడా ఒకద్రవ్యమని Substance పేర్కొంటారు. అది అర్థం లేని మాట. అంతేగాదు. వీరు సత్కార్యవాదులు గారు. అసత్కార్యవాదులు. వీరి దృష్టిలో సృష్టికి పూర్వ మీ ప్రపంచాని కస్తిత్వం లేదు. తరువాత క్రొత్తగా ఆరంభమయిందని వర్ణిస్తారు. ఇది కూడా యుక్తిసహం కాదు. అంచేత శంకరులీ రెండంశాలనూ సవరించవలసి వచ్చింది.

అలాగే సాంఖ్య యోగాలను కూడా సంస్కరించాడాయన. సాంఖ్య యోగాలలో సాంఖ్యమనేది నిరీశ్వరం Atheistic. యోగం సేశ్వరం Theistic అయితే వీరిద్దరూ సత్కార్యవాదులే. ప్రపంచం సృష్టికి పూర్వ మవ్యక్తంగా ఉండి తరువాత వ్యక్త Manifest మవుతుందని వీరి వాదం. ఇందులో సత్కార్యమని చెప్పటం వరకూ ఆచార్యుల వారి కొప్పదలే. కాని అవ్యక్తం వ్యక్తంగా పరిణమిస్తుందని చెప్పటం మాత్రం సమ్మతం కాదు. అలాగే వారి జీవనానాత్వవాదమూ స్వతంత్ర ప్రకృతివాదమూ, ఆయనకెంత మాత్రమూ సరిపడలేదు. కాబట్టి ఆ రెండింటినీ ఆయన యథోచితంగా పరిష్కరించాడు.

అలాగే పూర్వోత్తర మీమాంసల మీద గూడా ఆయన ఈ పరిష్కరణా యుధాన్నే ప్రయోగించవలసి వచ్చింది. మీమాంస అంటే వేద తాత్పర్య The import of veda మేమిటనే విచారణ. అది పూర్వమనీ, ఉత్తరమనీ రెండు భాగాలు. రెండూ వేద ప్రామాణ్యాన్ని అంగీకరించేవే. అందులో పూర్వ మీమాంస శరీరానికి భిన్నంగా జీవుడనే వాడొకడున్నాడనీ వాడికి కర్మ ఫలానుభవ ముందనీ అందుకోసం వాడికి లోకాంతర జన్మాంతరా లేర్పడుతాయనీ, వర్ణిస్తుంది ఇంతవరకూ శంకరుల కెలాటి ఆక్షేపణా లేదు. వ్యావహారికంగా ఈ కలాపమంతా ఒప్పకొంటాడాయన. కాని జీవుడికి విలక్షణంగా మరేమీ లేదు. తుదకు ఈశ్వరుడు కూడా లేడనే మీమాంసకుల మాట ఎంత మాత్రమూ ఒప్పకోడాయన. అలాగే జ్ఞానరహితమైన కర్మలచేతనే పరమ పురుషార్ధం ప్రాప్తిస్తుందని వారు వాదించటం కూడా ఆయనకు సబబుగా తోచలేదు. కనుక వాటి రెండింటికీ తగిన పరిష్కారం చేసి చూపాడాయన.

పోతే ఇక ఉత్తర మీమాంసకు లొకరున్నారు. వారికి వేదాంతులని కూడా పేరున్నది. వేదాలకు చివరిదైన ఉపనిషత్తులు వీరికి ముఖ్య ప్రమాణం. కర్మ మీమాంసకుల మాదిరి గాక సాక్షిరూపమైన ఆత్మతత్త్వమొకటి ఉందని వీరు గుర్తించారు. అంతవరకూ బుద్ధిమంతులే. కాని వేదాంతులనే వారంతా అద్వైతులు కారు. వారిలో ద్వైతులూ ఉన్నారు. విశిష్టాద్వైతులూ ఉన్నారు. వారిద్దరి అభిప్రాయాలూ వేరు. వారు జీవాత్మ పరమాత్మలకు భేదం చెబుతారే గాని అభేదాన్ని సుతరామూ అంగీకరించరు. అంతేగాక ఈ కనిపించే జగత్తంతా సత్యమే గాని ఆభాస గాదు వారి దృష్టిలో. సృష్టి అనేది యథార్థంగానే జరిగిందని వారి మతం. ఇదుగో ఇలాంటి భేద దృష్టి వేదాంతుల కుండటాన్ని ఏ మాత్రమూ మన్నించరు భగవత్పాదులు. కనుక మిగతా వారివలెనే వీరిని కూడా ఆయా సందర్భాలలో చక్కదిద్ది సరియైన మార్గం చూపుతూ వచ్చారు. ఈ విధంగా షడ్దర్శనాలలోనూ అంతర్లీనంగా ఉండే లోపాలను నివరించి గుణాలను సమర్థించటంవల్ల కూడా ఆయనకు షణ్మత స్థాపకుడనే ప్రసిద్ధి ఏర్పడి ఉండవచ్చు.

మొత్తంమీద జగద్గురువుల సమన్వయ దృష్టి మరి ఏ మతాచార్యునికీ కానరాదు. ఒక మధుకరం లాంటి దృష్టి అది. మధుకరమన్ని పుష్పాలపైనా వాలుతుంది. అన్ని రసాలనూ సేకరిస్తుంది. ఒకే మధురసంగా మారుస్తుంది. మనమూ మధువును సేవిస్తుంటే ఇది పనస-ఇది ఆమ్ర-ఇది బదరి-ఇది కదళి

అనే భేదం మనసుకు రాదు. అంతా కలిసి ఒక సమష్టిగా అనుభవానికి వస్తుంది. ఇలాంటి ఒకానొక సమష్టి రూపమైన దృష్టి ఆచార్యుల వారిది. ఇంత గొప్ప దృష్టి అలవడటంవల్లనే ఆయన శ్రుతి స్మృతి పురాణేతి హాసరూపమైన వాఙ్మయానికంతటికీ ఏకవాక్యతా రూపమైన చక్కని సమన్వయాన్ని సాధించగలిగారు. ఈ సమన్వయం మూలాన్నే అద్వైత విజ్ఞానమనేది మొదటి నుంచీ మన ఉపనిషత్తులలోనే గుప్తమయి ఉన్నప్పటికీ స్వామివారి చేతిలోబడి అది మరలా ఒక సానబెట్టిన రత్నంలాగా ప్రకాశించగలిగింది. సరిక్రొత్తగా మనకు భాసించగలిగింది. భగవత్పాదులే లేకపోతే ఇంత అనర్ఘమైన రత్నాన్ని బయటికి తీసేవారూ లేరు. దాని కాంతి రేఖలు మన మనః ఫలకాలమీద ప్రసరించేవీ కావు.

మరి ఇంత విలువైన నిక్షేపాన్ని మనకాయన ప్రసాదించి పోయారంటే మనమా మహనీయుడి కెంతగా ఋణపడి ఉన్నామో చెప్పనక్కరలేదు. మనమంటే ఒక్క భారతీయులమే గాదు. భూమండలంలో ఉండే సమస్త మానవులూ కూడా ఋణగ్రస్తులే. ఈ ఋణ భారం నుంచి విముక్తులం కావాలంటే మనమంతా కలిసి చేయవలసిన కార్యమేమిటి. ఆయన ప్రసాదించి పోయిన అద్వైతామృత రసాన్ని తనివితీర ఆస్వాదించి అమర్త్య భావాన్ని అందుకోటమే తప్ప మరేదీ గాదు.

అయితే ఈ పాటికి మనమెంతో విజ్ఞానమార్జించాము గదా. అద్వైత విజ్ఞానమొక్కటి లేకపోతే మనకు మొక్క పోయిందేమిటని అడగవచ్చు. మనమెంత విజ్ఞానమార్జించినా - ఎన్ని అంతరిక్షయానాలు సాగించినా - అదంతా కేవలం సాపేక్షమే Relative ననే మాట మరచిపోరాదు. సాపేక్షమైన జ్ఞానమది ఎంత గొప్పదైనా నరే, మానవుడి సమస్యను పూర్తిగా పరిష్కరించలేదు. తీరే సమస్య తీరుతుంటే మరలా క్రొత్తది వచ్చి నెత్తిన పడుతుంటుంది. అన్ని సమస్యలూ తీరటమంటూ ఎప్పటికీ సంభవం కాదు. తీరే పరిస్థితే ఉంటే ఇంతకాలం నుంచీ మనమింత నాగరికత గడించినందుకది ఎప్పుడో తీరిపోవలసింది. ఏదీ నాగరికత పెరిగే కొద్దీ సమస్య కూడా దానితోపాటు పెరగటమే గాని తరగటం లేదే. దీనిని బట్టి సాపేక్షమైన మన లౌకిక విద్యలలో సమస్యకు పరిష్కారమే లేదని స్పష్టమవుతున్నది. మానవుడి సమస్యనే తీర్చలేనిదది విద్య ఎలా అయింది. కనుకనే ఈ శాస్త్రాలూ, కళలూ, అసలు విద్యలే గావు. అవిద్యలు Neseience

పొమ్మన్నారు మన ప్రాచీనులు. అవిద్యా క్షేత్రంలో ఎంత కృషి చేసి ఏమి ప్రయోజనం. ఊషర క్షేత్రంలో సల్పిన కృషి లాగా అది నిష్ఫలమే. మరి ఫలితమే కావాలంటే నిరపేక్షమైన Absolute బ్రహ్మవిద్యనే పట్టుకోవాలి మానవుడు.

అది జగద్గురువులు బోధించిన ఈ అద్వైత విజ్ఞానం తప్ప మరొకటి నభూతమ్ నభవిష్యతి. సకల సంశయోచ్ఛేదకమైన ఆత్మ విజ్ఞాన Subjective మది. కాబట్టి దాని ముందు మిగతా అనాత్మ విద్య Objective లన్నీ బలాదూరయి పోవలసిందే. అంచేత జిజ్ఞాసా శీలుడైన మానవుడెప్పటికైనా సరే, సంగీతమనీ, సాహిత్యమనీ ఇలాంటి కళలతోనూ, వైద్యమనీ, జ్యోతిషమనీ ఇలాంటి శాస్త్రాలతోనూ తన విలువైన కాలాన్ని వెళ్ళబుచ్చటం శ్రేయోదాయకం కాదు. కేవలం ప్రేయోదాయకమే అవి. ప్రేయస్సు వేరు. శ్రేయస్సు వేరు. తాత్కాలికమైన ఆనందాన్ని ఇచ్చేది ప్రేయస్సు. సార్వకాలికమైన నిర్వృతిని ప్రసాదించేది శ్రేయస్సు. అలాంటిది మానవులకీ శాంకరమైన విజ్ఞానమొక్కటే. ఎంతటి మేధావంతుడికైనా కళా తపస్వికైనా జీవితంలో చిట్టచివరకది తప్ప వేరు శరణం లేదు. కాదనుకొంటే ఈ జీవితమొక శుష్కమైన అరణ్యమే.

ఇలాంటి అమూల్యమైన విజ్ఞానాన్ని జగద్గురువులు మనకందించి పోయినందుకు మనం దానినందుకొని అనుభవించగలగాలి. దాని కోసం భగవత్పాదుల రచనలన్నీ ఆమూలా చూడంగా పరిశీలించి చూడటం తప్ప మరి ఒక మార్గం లేదు. వారి కావించిన రచనలు కూడా ఒకటిగాదు. రెండు గావు. పరశ్శతంగా ఉన్నాయి. అయితే వాటిన్నటిలోనూ మకుటాయ మానంగా కనిపించేవి వారి భాష్యగ్రంథాలు మాత్రమే. అవి మూడూ మూడు మహా సముద్రాలనే చెప్పవచ్చు. అద్వైత వేదాంత రత్నాలన్నీ అందులోనే నిక్షిప్తమయి ఉన్నాయి. ఒక రత్నాకరాన్ని మథించినట్టే వాటిని మథించి మన మా రత్నాలనన్నిటినీ వెలికి తీయవలసి ఉంటుంది.

కాని ఇదికూడా అంత సుకరమైన పనిగాదు. భగవత్పాదుల శైలి ఎంత సరళ Simple మైనదో అంత శాస్త్రీయ Scientific మైనది. ఎంత ప్రసన్నమైనదో Clear అంత గంభీర Deep or Profound మైనది. ఎంత సంక్షిప్త Precise మైనదో అంత సాంగోపాంగ Comprehensive మైనది. ఒక్క మాటలో చెబితే అన్యూనానతిరిక్తమైనదా రచన. ఒక్క మాట వేయటానికి లేదు. తీయటానికి లేదు. ఎంత భావమో అంత భాష. ఎంత భాషో అంత భావం. అలాంటి చిక్కనమైన రచన నవగాహన చేసుకోవటమే కష్టసాధ్యం. దీనికి తోడు అవి స్వతంత్రమైన గ్రంథాలు కావు. ఆయా మూల గ్రంథాలకు స్వామివారు చేసిన

వ్యాఖ్యానాలు. అంచేత వేదాంత శాస్త్ర ప్రమేయ (Scope of the subject) మంతా మనకొక్క చోట లభించదు. ఒక్క వరసలో కూడా లభ్యం కాదు. మణులూ, మాణిక్యాలలాగా అమూల్యమయిన ఆయన భావాలన్ని అక్కడక్కడ చెల్లాచెదురుగా పడిపోయాయి. వాటన్నిటినీ మరలా ఒక వరుసలో పెట్టుకొని చూస్తే గాని అసలైన శాస్త్రార్థ Subject matter మేమిటో మన కవగతం కాదు.

ఇలాంటి ప్రతిబంధకాలున్నంత వరకూ హిరణ్యనిధి లాగా పదార్థమక్కడే ఉన్నా అది మన అనుభవానికి రాదు. రాకనే చాలామంది జిజ్ఞాసువులు సరియైన మార్గమేదో తెలియక బాధ పడుతున్నారు. కొందరిదే మార్గమని చెప్పి దిక్కు తెలియక అపమార్గం పట్టిపోతున్నారు. మరికొందరికి మనకంతు పట్టే విషయం కాదు. ఒకవేళ కొంత తెలిసినా దానివలన సద్యః ఫలమేముందని ఉదాసీనత చూపుతున్నారు. ఇంకా కొందరు ప్రబుద్ధులయితే ఇది అనుభవానికి విరుద్ధం-కేవల ముఋసుపోకకు చేసే ప్రసంగమని కూడా సిద్ధాంతీకరిస్తున్నారు.

ఇన్ని అపోహలకూ కారణమొక్కటే. అది శాంకరమైన అద్వైత దర్శనం మనకందవలసిన రీతిలో అందకపోవటమే. శాస్త్ర సిద్ధాంత Theory మెంతగా ప్రతిపాదించారో భగవత్పాదులు. దాని అనుభవ మార్గం Practice కూడా అంతగానే నిరూపించారు. ఏ ఒక్కటీ కప్పిపుచ్చలేదు. అన్ని రహస్యాలూ ఆయిన రచనల్లోనే మనకు దర్శనమిస్తాయి. అయితే వాటి నొకటి కూడా తప్పి పోకుండా ఉన్నదున్నట్టు బయటపెట్టే నాథుడు లేడు. అటు ప్రాచీనులలో లేరు. ఇటు నవీనులలోనూ లేరు. ప్రాచీన పండితులున్నారంటే సాంప్రదాయికంగా చదువుకొన్నారే గాని అన్ని విషయాలనూ సమన్వయించే జ్ఞానం లేదు వారికి. ముక్కకు ముక్క విరిచి అర్థం చెప్పమంటే బ్రహ్మాండంగా చెబుతారు. అనవసరమైన తర్క వ్యాకరణ ప్రసంగాలతో కాలక్షేపం చేసి అవసరమైన చోట మౌనం వహిస్తారు. అది ఒక ఛాందసం. పోతే ఇక నవీనుల కిలాంటి ఛాందసం లేదు గాని వారిదొక ఆకాశ తాండవం. అసలు విషయానికి కట్టుబడక దాన్ని విడిచిపెట్టి అవీ ఇవీ ఏ కరువు పెడుతూ ఏదో విను వీధుల్లో ప్రయాణం చేస్తారు. శాస్త్రకారుడి ఉద్దేశమొకటైతే తామొకటి ఊహించి అందులో జొనపటానికి ప్రయత్నిస్తారు. కనుక ఇదీఒక హడావుడే. మొత్తం మీద రెండూ రెండు గానే అయి కూచున్నాయి. దీనితో పైన పేర్కొన్న అపోహలు లోకంలో తొలగిపోవటమలా ఉంచి అలాగే నిలిచిపోయే ప్రమాద మేర్పడింది.

ఇలాంటి ప్రమాదాన్ని నేను చాలాకాలం నుంచీ గమనిస్తూనే ఉన్నాను. దీని నెలాగైనా తొలగించి మొదట మన తెలుగువారికైనా ఉపకారం

చేయాలని నాకు మనసులో ఒక ఉబలాట మేర్పడింది. అయితే వట్టి ఉబలాటం మాత్రమే అయితే ప్రయోజనం లేదు. దానికి దగిన అధికార సంపత్తి Equipment కూడా పోగు చేసుకోవాలి. అలాగైతే గాని అది కార్యరూపాన్ని ధరించబోదు. అందుకోనమని ఆచార్యులవారి భాష్యార్ణవంలో నేను బహుకాలం నుంచీ మజ్జ నోన్మజ్జనం కావిస్తూ వచ్చాను. ఇంకా కాలహరణం చేశానంటే కాలమే నన్ను హరించవచ్చు ననే భయమొకటి ఇటీవలన ఏర్పడింది. అది మనకు మొదటికే మోసం. అంచేత తగినంత సామర్థ్యమబ్బిందని ఇంకా నమ్మకం లేకపోయినా పరమాత్మ మీద భారం వేసి ఇప్పటికీ తీరులో దీన్ని బయట పెడుతున్నాను. భగవత్పాద భాష్యార్థ మీమాంసా ఫలమిది. సరళమైన తెలుగు భాష అనే పళ్ళెరంలో పెట్టి దీనిని మీకు సమర్పిస్తున్నాను. ఇందులో నా ప్రజ్ఞ ఏమీ లేదు. అంతా శ్రీవారి కటాక్షమే. మహా అయితే వారు సూచనా మాత్ర సారంగా చెప్పిన కొన్ని భావాలను నేను ఆధునికుల బుద్ధుల కనుగుణంగా అక్కడక్కడ వివరించి ఉండవచ్చు. అదీ వారి కటాక్షమే. ఆ కటాక్ష బలమే నాకు వారి సిద్ధాంతంలో ఇమిడి ఉన్న అన్ని రహస్యాలనూ సాక్షాత్కరింప జేసింది.

అది కూడా నామనోనేత్రానికారే ఆరు భూమికలలో సాక్షాత్కరిస్తూ వచ్చింది. వాటినే నేను ఆరధ్యాయాలలో పొందుపరిచి మీ ముందు పెడుతున్నాను. ఈ అధ్యాయాలకు నేను చేసిన నామకరణం కూడా నా స్వకపోల కల్పన కాదు. భాష్యకారులక్కడక్కడ తమ భాష్యంలో వ్యవహరిస్తూ వచ్చిన మాటలే. వాటిలో మొదటిది సత్యం-మిథ్య. రెండవది వ్యావహారికం-పారమార్థికం. మూడు పురుష తంత్రం-వస్తుతంత్రం. నాలుగు అధ్యారోపం-అపవాదం. అయిదు కర్మ-జ్ఞానం. పోతే ఆరు జీవన్ముక్తి-విదేహ ముక్తి. మొత్తానికీ ఆరింటిలో అద్వైత విద్య ప్రమేయమంతా కలిసి వస్తుందని నా విశ్వాసం. ఒక విధంగా చెబితే శాంకరమైన షట్ఛాస్త్రి ఇది. జిజ్ఞాసువులైన పెద్దలు-పిన్నలు దీనిని సాంతంగా శాంతంగా ప్రత్యక్షరమూ పరిశీలిస్తే పూర్వోక్తమైన అపోహలు తొలగటమే గాదు. జగద్గురు మహోపదేశమనే అమృత రసాన్ని చూరగొని అమృతత్వాన్నే Immortality అందుకోగలరు. తన్మూలంగా వారి జీవితమూ నా జీవితమూ కూడా చరితార్థం కాగలదని సవినయంగా మనవి చేస్తున్నాను.

ఇట్లు

**గ్రంథకర్త**

# 1. సత్యం - మిథ్య

జగద్గురు మహోపదేశంలో మొట్టమొదట మనం విచారించవలసిన ఘట్టం సత్యమూ–మిథ్యా. అద్వైత సౌధ నిర్మాణానికంతటికీ ఇవి రెండూ రెండు పునాది రాళ్ళవంటివి. సత్యమేదో Reality మిధ్య ఏదో Falsity తెలియకపోతే ఇక ఏది తెలిసినా ప్రయోజనం లేదు. అంతేకాదు. సత్యాన్నే మిథ్యగానూ మిథ్యనే సత్యంగానూ భావించి బోల్తాపడే ప్రమాదం కూడా ఉంది. కాబట్టి గట్టిగా విమర్శించి చూడవలసిన విషయమిది.

సృష్టినంతా గాలించి చూస్తే మనకు కనిపించే పదార్థాలు Categories మూడే. ఒకటి మనలాంటి జీవుడు. రెండు మన ఎదుట కనిపించే జగత్తు. మూడు ఈ రెంటికీ మూలభూతమని భావించే ఈశ్వరుడు. ఇంతకుమించి మరి ఒక పదార్థమేదీ కానరాదు సృష్టిలో. ఇందులో జీవుడనేవాడు మధ్యవర్తి. వాడికొక అగ్రం జగత్తయితే మరొక అగ్రం ఈశ్వరుడు. ఈ రెండింటిలో జగత్తనేది కేవలమొక మూర్తమైన Actual పదార్థం. ఈశ్వరుడనేది ఒక అమూర్తమైన Ideal భావం. పోతే జీవుడనే వాడిటు జగత్తులాగా మూర్తమూకాదు. అటు ఈశ్వరుడిలాగా అమూర్తమూ కాదు. ఒకవిధంగా చెబితే మూర్తామూర్తమైన తత్త్వమది.

జీవ జగదీశ్వరులనే ఈ మూడు తత్త్వాలను గురించే లోకంలో ఏ మానవుడు గానీ ఆలోచించవలసింది. ఇంతకుమించి మన ఆలోచనకు తగిలే విషయంకూడా వేరొకటి ఏదీ కానరాదు. సృష్ట్యాదినుంచీ ప్రతి ఒక్క ఆలోచనాపరుడూ సాక్షాత్తుగానో పరంపరగానో ఈ మూడింటిని గూర్చే ఆలోచన సాగిస్తూ వచ్చాడు. అందులో కొందరీ మూడూ–దేనిపాటికది– స్వతంత్రమైన సత్యాలని చాటారు. వారు ద్వైతులు. మరికొందరు మూడూ సత్యాలే అయినా ఈశ్వరుడు మాత్రమే స్వతంత్రమైన సత్యం – మిగతా రెండూ దాని విశేషాలని Attributes భావించారు. వీరు విశిష్టాద్వైతులు.

పోతే ఇక మూడవవారున్నారు. వారి మూడింటిలో ఈశ్వరుడనేది ఒక్కటే అసలు సత్యం. దానికి భిన్నంగా జీవజగత్తులు రెండూ సత్యమేకావు. అవి కేవలం మిథ్యా భూతమని పేర్కొంటారు. వీరే అద్వైతులు.

ఇందులో ద్వైతమనేది సమస్యను సమస్యగానే చూపుతుంది లోకానికి, విశిష్టా ద్వైతం సమస్యను కొంత పరిష్కరించటానికి ప్రయత్నిస్తుంది. అద్వైతమలా కాక సమస్యను పూర్తిగా పరిష్కరించి చూపుతుంది. అద్వైతమంటే అసలుద్వితీయమైన పదార్థమే లేనిదని గదా అర్థం. ద్వితీయమే లేకపోతే ఇక ఏ ప్రశ్నకుగానీ ఆస్కారమెక్కడిది. అంచేత సమస్యలన్నీ అక్కడికి పరిష్కారం కావలసిందే, సమస్యను పరిష్కరించిందే సిద్ధాంతం. కనుకనే మొదటి రెండింటినీ పూర్వపక్షం చేసి కడపటిదైన అద్వైతానికే పట్టాభిషేకం చేశారు శంకర భగవత్పాదులు. అంటే ఏమని అర్థం. వారి దృష్టిలో జీవుడు లేడు. జగత్తులేదు. అవి రెండూ మిథ్యా భూతమే. పోతే ఒక సత్యమైన పదార్థమొక్క ఈశ్వరుడేనని సిద్ధాంతం.

అయితే ఇది ఎంత సిద్ధాంతమని చెబుతున్నా వినటానికి మనకు చాలా విడ్డూరంగా కనిపిస్తుంది. ఎంచేతనంటే ఇది మన అనుభవానికే విరుద్ధమయిన మాట. ఆబాల గోపాలమూ లోకంలో ఎవరి అనుభవంలో చూచినా జీవజగత్తులనేవి సత్యంగానే భాసిస్తున్నాయి గాని అసత్యమని తోచటంలేదు. అసత్యమయితే అసలనుభవానికే వచ్చేవికావు. నిత్యమూ అనుభవానికి వస్తున్నప్పుడవి అసత్యమెలా అవుతాయి. ఆ మాటకువస్తే ఇంకా ఈశ్వరుడనేదే అసత్యమని చెప్పవలసి వస్తుంది. ఎంచేతనంటేఅది జీవితంలో ఎప్పుడూ మన అనుభవానికి రావటం లేదు. అలాంటప్పుడనుభవ దూరమయిన దాని నున్నదని చాటటమేమిటి. అనుక్షణమూ అనుభవానికి వచ్చే వాటిని లేవని త్రోసిపుచ్చటమేమిటని ప్రశ్న వస్తుంది.

దీనికి శంకరులిచ్చే సమాధానమేమంటే ఒకటి మన అనుభవానికి రావచ్చు, రాకపోవచ్చు. అనుభవానికి వచ్చినంత మాత్రాన అది సత్యమూ కాదు. రానంత మాత్రాన అసత్యమూ కాదు. అనుభవానికి వచ్చిందే సత్యమయ్యేట్టయితే ఆకాశంలో మన కంటికి కనిపించే నల్లని వర్ణం నిజంగానే అక్కడ ఉందని ఒప్పుకోవలసి వస్తుంది. అలాగే అనుభవానికి రానిదంతా అసత్యమయ్యేట్టయితే ఈ అనంత విశ్వంలో మనం చూడని లోకాలెన్నో ఉన్నాయని చెబుతారు శాస్త్రజ్ఞులు. అదంతా

అబద్ధమని త్రోసి వేయవలసి వస్తుంది. అంచేత మనకు కలిగే అనుభవాన్ని బట్టి కాదు సత్యాసత్యాలను మనం నిర్ధారణ చేయవలసింది. మనకు కలిగే అనుభవమంతా మన ఇంద్రియాలమూలాన్నే గదా. చక్షురాదులైన ఈ యింద్రియాలు సరిగా పని చేస్తాయని ఏమిటి నమ్మకం చేస్తే చేస్తాయి. లేకుంటే లేదు. చేసినపుడు కూడా సమగ్రమయిన స్వరూపాన్ని చూపజాలవవి. కాబట్టి ఈ ఇంద్రియాల అనుభవాన్ని బట్టి పోతే ఏదీ నిర్ణయించలేము. అయితే మరి దేనినిబట్టి నిర్ణయించాలంటారు. ఆయావస్తువుల స్వభవాన్ని బట్టి మాత్రమే నన్నారు పెద్దలు.

వస్తు స్వభావాన్ని బట్టి నిరూపించటమే శాస్త్రం Science చేసే పని. శాస్త్రజ్ఞుల అనుభవమే ఒక అక్షర రూపాన్ని ధరించి కనిపిస్తే అది శాస్త్రమయింది. శాస్త్రజ్ఞుడైన వాడేది చెప్పినా అది ఒక ఉబుసుపోకకు చెప్పడు. లేక ఊహాగానాలు చేయడు. ఆయా వస్తువుల లక్షణాలను సాక్షాత్తుగా పరిశోధించి తదనుగుణంగా ఒక సిద్ధాంతం చేస్తాడు. వస్తు గుణానుసారి అయిన సిద్ధాంతం కాబట్టి అది తప్పకుండా మనకు ప్రామాణిక Authority మవుతుంది. మరి ఇలాంటి పరిశీలనా బుద్ధి సాధారణంగా లోకులకుండదు. వారు తమకేది అనుభవానికి వస్తే అదంతా వస్తు స్వరూపమే నని భ్రాంతి పడతారు. బాగా లోతుకు దిగి వివేచన చేయబోరు. అంచేత అది శాస్త్రం మాదిరి మనకు ప్రామాణికం కానేరదు. కానేరదు గనుకనే లౌకిక జ్ఞానమది ఎలాంటిదైనా – శాస్త్రజ్ఞానం దగ్గర తల ఒగ్గవలసి వస్తుంది. ఇలాంటి శాస్త్రాలొకటి గాదు, రెండు గావు. మానవుడు పుట్టినప్పటి నుంచీ ఇప్పటిదాకా అసంఖ్యాకంగా ప్రచారంలో ఉన్నాయి. వైద్య జ్యోతిష భౌతిక రసాయనాదులైన శాస్త్రాలన్నీ ఇలాంటివే. ఇవన్నీ ఆయా రంగాలలో సామాన్యమైన లోకజ్ఞానం కన్నా ఎన్నో రెట్లు సమీచీనమైన జ్ఞానాన్ని మనకందజేస్తున్నాయి.

పోతే ప్రస్తుత మీ అద్వైత విజ్ఞానాన్ని మనకు ప్రసాదించేది కూడా ఇలాంటి ఒక విశిష్టమైన శాస్త్రమే. మిగతా శాస్త్రాలలాగా ఇది కూడా ఆయా శాస్త్రకారుల పరిశోధనా ఫలితమే. మరి దీనికి శాస్త్రకారులెవరని అడగవచ్చు. వసిష్ఠవామ దేవాదులైన మన ప్రాచీన మహర్షులే దీనికి శాస్త్రకారులు. వారందరూ మనలాటి సామాన్యజనుల పాలిటి కాప్తులు. ఆప్తి అంటే తత్త్వసాక్షాత్కారమని Revelation of truth నిర్వచనం. అలాంటి సాక్షాత్కారం పొందిన వారెవరో వారి కాప్తులని పేరు.

పూర్వమొకప్పుడు మన ఋష్యాదులంతా గాఢమైన తపస్సమాధిలో కూచుని అతి నిగూఢమైన సత్యాలను దర్శించగలిగారు. సాక్షాత్తుగా వారు దర్శించిన ఆ సత్యాలే గ్రంథరూపంగా వెలువడితే అది వేదమయింది. ఋగ్యజుస్సా మాథర్వణాలనే గదా మనమిప్పుడు వేదాలని పేర్కొంటున్నాము. ఇవి కేవలమూ వారికి కలిగిన దర్శనమే vision కాబట్టి పౌరుషేయం కావు. అంటే మానవుడుతన బుద్ధిబలంతో కల్పించినవి కావని భావం. ఇది వారికి నిశ్చితంగా కలిగిన జ్ఞానం కాబట్టి దీనికి నిగమ Conclusion మని కూడా పేరు వచ్చింది. మనదాకా అవిచ్ఛిన్నంగా వస్తూ ఉంది కాబట్టి అదే ఆగమ Tradition మయింది. వచ్చి మనచెవిలో పడింది కాబట్టి శ్రుతి అయింది. అలా పడి మరలా మనకు వినిపిస్తున్నది కాబట్టి చివరకదే శబ్దమయింది.

మొత్తానికిప్పుడు మనకు శబ్దరూపంగా కనిపించే వేద వాఙ్మయమంతా ఒకప్పుడు మన ఋష్యాదులు పరిశోధించి తెలుసుకొన్న సత్యమే. కాబట్టి అది మనకు ప్రామాణికమని వేరుగా చెప్పనక్కరలేదు. లోకజ్ఞానం కన్నా శాస్త్రజ్ఞానం ప్రామాణికమైతే శాస్త్రాలలో కూడా పౌరుషేయమైన మిగతా వాటికన్నా అపౌరుషేయమైన ఈ వేదం ఇంకా ప్రామాణికమని భావించాలి మనం. అంతేకాదు. ఈ వేదంలో కూడా కేవల కర్మకాండను బోధించే పూర్వభాగం కన్నా తత్త్వజ్ఞానాన్ని ప్రసాదించే వేదాంతం లేదా ఉపనిషత్తులనేవి అన్నింటికన్నా పరమ ప్రామాణికమని ఒప్పుకోక తప్పదు. అలాంటి ప్రమాణరాజమైన ఉపనిషత్తులీ ప్రపంచానికి చాటించే పరమార్థమేమిటి. **"సర్వమ్ ఖల్విదమ్ బ్రహ్మ"** ఈ కనిపించే జగత్తంతా ఈశ్వరుడే. **"అయమాత్మా బ్రహ్మ"** ఈ జీవుడు కూడా ఈశ్వరుడే. **"ఏకమేవా ద్వితీయమ్ బ్రహ్మ"** త్రికాలాలలోనూ ఉన్నదొక్క ఈశ్వరుడనే పదార్థమే తప్ప అంతకు భిన్నంగా మరి ఒక తత్త్వమేదీ లేదు. జీవుడు లేడు. జగత్తూ లేదు. రెండూ కేవలం మిథ్యా భూతమే–అని ఇలాంటి పరిపూర్ణమైన అద్వైత భావాన్నే చాటుతున్నాయి. దీనినిబట్టి అద్వైతమే చివరకు సిద్ధాంతమని ప్రతిపాదించటంలో ఎలాటి ఆక్షేపణకు గానీ ఇక చోటు లేదంటారు శంకర భగవత్పాదులు.

అయితే ఇక్కడ మన మెదుర్కోవలసిన సమస్య ఇక ఒక్కటే. అది ఏమంటే శాస్త్రమనేది ఎంత ప్రామాణికమైనా–అది లోకంతో పూర్తిగా తెగతెంపులు చేసుకోలేదు.

మరలా దానిని మన లోకానుభవంతో సరి పోల్చుకొని చూచే అవకాశముండి తీరాలి. ఇలాంటి అవకాశం సాపేక్షమైనవి కాబట్టి మిగతా శాస్త్రాలలో కావలసినంత ఉంది. పోతే ఈ వేదాంత విషయమలాంటిది కాదు. ఇది నిరపేక్షమైన శాస్త్రం. మనతో సహా మనంచూచే ఈ ప్రపంచమంతా లేదని కొట్టివేస్తున్నది. ఏదీ లేకపోతే ఇక ఉన్న సత్యాన్ని మనం సరిపోల్చుకొని చూడటమెలాగ. పోల్చుకో లేకపోతే అది యథార్థమో కాదో మనకేమిటి నమ్మకం. మనకు గాకపోయినా మన పూర్వుల కనుభవ గోచరమే గదా అంటే–దానికి మాత్రమేమిటి ప్రమాణం–అని ప్రశ్న వస్తుంది.

దీనికి కూడా సమాధానమిచ్చారు శంకరభగవత్పాదులు. వేదాంతమేదీ లేదని కొట్టి వేసిందంటే – అది మానవుడి అనుభవానికి వచ్చినప్పటి మాట. అంతవరకూ వ్యావహారికంగా ఈ ప్రపంచమూ ఉంటుంది. జీవుడూ ఉంటాడు. కాబట్టి నిరపేక్షమైన సత్యాన్ని కూడా సరిపోల్చుకుని చూచే అవకాశమెప్పుడూ ఉంది మనకు. అందుకే విచారణ Enquiry చేయమని చెబుతారు భగవత్పాదులు. విచారణ అంటే అలా సరిపోల్చుకొని చూచే ప్రయత్నమే. ఇందులో రెండు భాగాలుంటాయి. ఈ విచారణలో ఒకటి హేతువు. మరొకటి దృష్టాంతం. హేతువనేది అనుమాన ప్రమాణానికి Conception జవాబు చెబితే – దృష్టాంతం ప్రత్యక్ష ప్రమాణానికి Perception చెబుతుంది. ప్రత్యక్షానుమానాలంటే అవి ఎక్కడో లేవు. మనదగ్గరే ఉన్నాయి. చక్షురాదులైన మన బాహ్యేంద్రియాలే ప్రత్యక్ష ప్రమాణం. మరి అంతరింద్రియమైన మనస్సే అనుమానం. ఈ రెండే మనకున్న జ్ఞానసాధనాలు. ఈ రెండింటి పరిధిలోకి రాగలిగితే చాలు. మనమిక దేనినైనా విశ్వసిస్తాము. ప్రస్తుత మాగమం పేర్కొనే విషయం మన మనస్సుకు కూడా అతీతమైనది. కనుకనే మనం విశ్వసించలేక పోతున్నాము. దానినే మనం హేతుదృష్టాంతాలతో విచారణ చేశామంటే అది మొదట అనుమాన స్థాయికీ – ఆ తరువాత ప్రత్యక్ష స్థాయికీ దిగివచ్చే అవకాశ మేర్పడుతుంది. దిగి వచ్చిందంటే ఇక మన పూర్వుల అనుభవానికి వచ్చిందని చెప్పే సత్యమే మన అనుభవానికీ వచ్చి తీరుతుంది. సందేహం లేదు.

ఆ మాటకు వస్తే సత్యమనేది ఎప్పుడూ మనం తయారుచేసే పదార్థం కాదు. తయారయితే అసలది సత్యమే కాబోదు. అంతకు ముందునుంచీ ఉన్న సత్యాన్నే మేము దర్శించామని చెబుతున్నారు మహర్షులు. అయితే అది వారి అనుభవమే

గాని మన అనుభవం కాదు. నిజంగానే సత్యమైననాడది మన అనుభవానికి కూడా రావాలి గదా. ఇదిగో అలా వస్తుందా రాదా అని తేల్చుకోటానికే ఈ విచారణ. విచారణ లేకుండా అంగీకరిస్తే అది నదీ తీరంలో ఫల వృక్షాలున్నాయనే మాటలాగా ఒక కట్టు కథ అయినా కావచ్చు. అలాగని శాస్త్రనిరపేక్షంగా విచారణ సాగించామంటే అది ఒక శుష్కతర్కమైనా కావచ్చు. రెండూ మనకు నిష్ప్రయోజనమే. విచార శూన్యమైన శాస్త్రమూ పనికిరాదు. శాస్త్రాధారం లేని విచారణ పనికిరాదు. ఎప్పుడు గానీ శాస్త్రం చెప్పిన విషయాన్ని ఆధారం చేసుకొని సక్రమంగా విచారణ సాగిస్తూ పోవాలి. అలాగయితేనే అది ఒక నిశ్చయాత్మకమైన- సప్రయోజనమైన - విజ్ఞానాన్ని మనకందిస్తుందంటారు భగవత్పాదులు.

అందుకేనేమో ఆచార్యుల వారసలు స్వతంత్రమైన శాస్త్ర గ్రంథమేది గానీ రచించలేదు. అంతకు పూర్వం నుంచీ ప్రచారంలో ఉన్న శాస్త్రాలకే అపూర్వమైన భాష్యాలు రచించి వెళ్ళిపోయారు. భాష్యమంటే ఏదో గాదు. ఇలాంటి విచారణే. ఈ విచారణకే మీమాంస అనీ-మననమనీ-తర్కమనీ-యుక్తి అనీ - ఉపపత్తి అనీ - చాలా నామధేయాలున్నాయి. **"వేదాంత వాక్య మీమాంసా - వాక్యార్థ విచారణా - శ్రవణ వ్యతిరేకేణ మననమ్ విదధతీ తర్కమప్యత్రా దర్తవ్యమ్ దర్శయతి- ఆగమోపపత్తిభ్యామ్ నిశ్చితోర్థః"** అని ఆయా సందర్భాలలో అన్ని మాటలూ ప్రయోగిస్తూనే వచ్చా రాచార్యులవారు. **"ఆగమోపపత్తి భ్యామ్ నిశ్చతోర్థః శ్రద్ధేయో భవత్యవ్యభిచారాత్"** అని ఘంటా పథంగా చాటారాయన. శాస్త్రం ప్రతిపాదించిన విషయం సరియైనదా కాదా అని తేల్చుకోవాలంటే దాని కుపపత్తిని కూడా జోడించాలట. అప్పుడుగాని మనకది అవ్యభిచారి Unimpeachable అయిన సత్యమని నిర్ధారణ కాదు. అంచేత ప్రస్తుత మీ అద్వైత వేదాంతం పేర్కొనే సత్య-మిథ్యా విభాగం కూడా ఎంత వరకు సమంజసమో మనం విచారణ మూలంగానే తేల్చుకోవలసి ఉంది.

సత్య-మిథ్యా విభాగాలలో కూడా మొదట మిథ్యా విభాగాన్ని గూర్చే మనం చర్చిద్దాము. మిథ్య అనేది ఏదో తెలిసిపోతే ఇక మిగిలింది సత్యమని మనం చెప్పకుండానే తెలుసుకోవచ్చు. పైగా వేదాంత సంప్రదాయం కూడా అదే. కాదు కాదని ప్రతిషేధిస్తూనే తత్త్వాన్ని గ్రహించాలంటారు సంప్రదాయజ్ఞులు. కాబట్టి

విచారణే మనం మొదట సాగించవలసింది. అందులోనూ జగన్మిథ్యాత్వం మీద ఆధారపడివుంది జీవ మిథ్యాత్వం. అంచేత ప్రప్రథమంగా మనం జగత్తుయొక్క మిథ్యాత్వాన్ని గురించే ఆలోచిద్దాము.

# జగన్మిథ్యాత్వం

జగత్తంటే ఏమిటి. నామ రూపాత్మకంగా మనకండ్ల ముందు పరచినట్టు కనిపించే ఈ చరాచర ప్రపంచమే. పృథివ్యాదులైన పంచభూతాలతో నిర్మాణ మయిందిది. పంచభూతాలూ అచేతనాలే. Insentient. కాబట్టి పాంచ భౌతికమైన ఈ ప్రపంచం కూడా అచేతనమే. అచేతన మెప్పుడయిందో అప్పుడు దీనికి తానున్నాననే ప్రజ్ఞ Consciousness లేదు. ఉన్నాననే జ్ఞానం లేకపోతే ఏదిగాని ఉండలేదు. ఒకటి ఉండాలంటే ఆ ఉనికి కొక సాక్షి Spectator కూడా ఉండి తీరాలి. అసాక్షికమైన ఉనికి సృష్టిలోనే అసంభవం. మరి సాక్షి అనేది ఏదో గాదు జ్ఞానమే. ఏదో ఒక జ్ఞానానికి గోచరమవుతూనే ఉండాలి ప్రపంచమంతా. జ్ఞానానికి గోచరంకాదు. అయినా ప్రపంచ ముందనే మాట హేతువాదానికి నిలవదు. అది ఎలాంటిదంటే రూపమనేది కనిపిస్తూ ఉంది. నాకు మాత్రం రెండు నేత్రాలూ లేవని చెప్పటంలాంటిది. నేత్రాలు లేకపోతే ఎలా చూడగలిగావు. చూడకపోతే ఎలా చెప్పగలిగావు. కాబట్టి అచేతనమైన ప్రపంచం తనపాటికి తానుండటమనేది అసంభవం. ఉండాలంటే ఏదో ఒక జ్ఞానానికి విషయ Object మవుతూనే ఉండాలది.

అయితే ఈ విషయంలో ఇంకా సందేహమనేది వెంటాడుతూనే ఉంటుంది మనలను. మన జ్ఞానానికి గోచరిస్తేనే ప్రపంచముండటమేమిటి. ప్రపంచమనేది ఒకటి ఉంటేగదా మనం దాన్ని చూస్తున్నాము. మనం దాన్ని సృష్టించటం లేదు గదా. మనం పుట్టకముందునుంచీ ఉన్నదది. మనం చచ్చిన తరువాత కూడా ఉండబోతుంది. అలాంటప్పుడు జ్ఞానముంటే అది ఉండటమేమిటి. అర్థంలేని మాట. మీదు మిక్కిలి అది ఉంటేనే జ్ఞానంచేత దాన్ని మనం గ్రహించగలుగుతున్నామని మనకందరికీ కలిగే పెద్ద సందేహం.

వేదాంత మార్గంలో ఇది చాలా విషమమైన ఘట్టం Dilemma. ఈ ఒక్క అంశం మీదనే ఎటూ పరిష్కరించ లేక లోకంలోని తత్త్వవేత్త Philosphers లందరూ

చెదరిచెరి ఒక మార్గం పట్టిపోయారు. ప్రపంచమే ముందని కొందరి మతమైతే - దాన్ని గ్రహించే జ్ఞానమేముందని కొందరిమతం. మొదటివారికి భౌతికవాదులనీ Materialists రెండవవారికి భావవాదులనీ Idealists పేరు వచ్చింది. ఎవరి వాదానికి తగిన ఉపపత్తులు వారు చూపుతూ రావటంవల్ల ఏదీ ఇదమిత్థమని తేలటం లేదు. కానీ శంకరులీ గడ్డయిన సమస్యనుకూడా అవలీలగా పరిష్కరించారు. ఆయన భౌతిక వాదం తప్పు-భావవాదమే సరియైనదని తేల్చివేశారు. అది ఎలాగని అడిగితే ఆయన చెప్పే సమాధానమిది.

ప్రపంచమనేది మనకెప్పుడూ జ్ఞేయంగా As Known భాసించవలసిందే గాని పదార్థంగా As Thing దాని కస్తిత్వం లేదు. జ్ఞానపరిధిలోకి వచ్చినప్పుడే దాన్ని ఉందని తెలుసుకోగలుగుతున్నాము. ఆ పరిధి దాటిందంటే అది అసలు ఉందో లేదో మనకు తెలియదు. మనకు తెలియకపోతే నేమి. దానిపాటి కది ఉండవచ్చుగదా అని వాదించరాదు. దానిపాటికది ఉంటుందని చెబుతున్నది కూడా ఎవరు. నీవేగదా. చెబితే అది నీకు మరలా జ్ఞేయ Object of knowledge మయి కూచుంటుంది. కాబట్టి దానిపాటికది ఉండాలంటే ఉందని నీ వనటం గాదు. అది అనుకోగలిగిందో అప్పుడది జ్ఞానమే అవుతుంది. కాని నీకు జ్ఞేయం కాలేదు. కానీ నీకెప్పుడూ అది జ్ఞేయమే అవుతూ ఉన్నది జీవితంలో. కాబట్టి నీ మాదిరి అనుకొనే జ్ఞానం దానికి లేదు. మరి జ్ఞానమున్న నీవూ అనుకోక జ్ఞానం లేని తానూ అనుకోకపోతే ఇక ఉందని వాదిస్తున్నావే ఆ ఉనికి ఎవరిది. తల్లిదండ్రులిద్దరూ వదిలేసిన బిడ్డలాగా అనాథ అయిపోయిందా ఉనికి. ఉనికి అనేది ఒక ధర్మం. దానికొక ఆశ్రయమనేది ఉండి తీరాలి. అది దాన్ని గమనించే చైతన్యమే తప్ప మరొకటి కావటానికి లేదు. కనుకనే ప్రపంచానికి ప్రపంచంగా అస్తిత్వం లేదు. జ్ఞేయంగానే దాని కస్తిత్వమని చెప్పటం. ఒక జ్ఞానమనేది ముందుగా సిద్ధమయి ఉంటేనే దానికది గోచరిస్తూ బ్రతుకుతున్నదనటంలో సందేహంలేదు.

అయితే జ్ఞానమనే సరికది ప్రస్తుతం మనకున్న జ్ఞానంలాంటిదేననే ఆశంక కలగవచ్చు, మనలో ప్రతిఒక్కరికీ. జ్ఞానముందనే విషయం మన కనుభవ సిద్ధమే.అలా ఉండటం మూలాన్నే ప్రతిక్షణమూ మన మీ ప్రపంచాన్ని చూడగలుగుతున్నాము. అలాంటప్పుడు ప్రపంచం జ్ఞానానికి గోచరిస్తుందంటే అది మనజ్ఞానానికేనని

భావించటంలో ఆశ్చర్యంలేదు. కానీ వచ్చిన ఇబ్బంది ఏమంటే మన జ్ఞానానికీ ప్రపంచమెంత ఉందో అంతా గోచరించటం లేదు. ఎంత కాలముంటుందో అంత కాలమూ భాసించటం లేదు. చూడబోతే దేశకాలాలనేవి రెండూ అడ్డుతగులుతున్నాయి మన జ్ఞానానికి. వాటి రెండింటినీఅతిక్రమించి పోయేస్తోమత దీనికి కానరాదు. జ్ఞానమైనా ఇది కేవలం పరిచ్ఛిన్నమే Restricted గాని అభివ్యాపకం Pervasive కాదు. అలాంటప్పుడండ పిండ బ్రహ్మాండాత్మకమైన ఈ సృష్టికంతటికీ అది సాక్ష్యమెలా ఇవ్వగలదు. ఇవ్వకపోతే ఆమేరకది అస్తిత్వాన్ని కోలుపోవలసిందే గదా.

అంచేత ప్రపంచానికి సాక్షి జ్ఞానమే అయినా మనబోటి జీవుల జ్ఞానం కాదని తేలిపోయింది. పోతే ఇక జ్ఞానమనేది ఏది. ఏదో ఒక జ్ఞానానికి గోచరిస్తూనే ఉండాలని చెప్పా మీ ప్రపంచం. దేనికీ గోచరించకపోతే అసలిది అస్తిత్వానికే నోచుకోలేదు. దీనినిబట్టి మన జైవమైన జ్ఞానానికి భిన్నంగా మరి ఒక జ్ఞానముందని ఒప్పుకోక తప్పదు. అది మరలా నీ నా జ్ఞానంలాగా దేశకాల పరిచ్ఛిన్నమైతే ప్రయోజనం లేదు. వాటి రెండింటి అవధులనూ దాటి అనంతంగా వ్యాపించి పోవాలి. అలా వ్యాపిస్తే గాని అనంతమైన విశ్వానికది సాక్షిగా నిలబడలేదు. ఇదుగో ఇలాంటి సర్వవ్యాపకమైన జ్ఞానానికి Universal conscious ness ఈశ్వరుడని పేరు పెట్టారు మన పెద్దలు. జీవ జగత్తులకు విలక్షణంగా ఈశ్వరుడనే మూడవ పదార్థాన్ని ఒప్పుకోటానికిదే కారణం. ఇలాంటి ఒక ఐశ్వరమైన జ్ఞానం నిత్యమూ సాక్షిగా నిలిచి చూస్తుంటే దాని వెలుగులో ఈ చరాచర జగత్తూ మనకు జ్ఞేయరూపంగా ఇలా సాక్షాత్కరిస్తున్నది.

సరే. జగత్తుకు జ్ఞానమనే సాక్షి ఒకటి కావాలన్నారు. బాగానే ఉంది. అయితే మరి ఈ జ్ఞానానికేమిటి సాక్షి. దానికి కూడా ఒక సాక్షి ఉండాలి గదా అని మరలా ఆక్షేపణ వస్తుంది. దానికి సాక్షి అక్కరలేదు పొమ్మన్నారు శంకర భగవత్పాదులు. అచేతనానికైతే సాక్షి అంటూ ఒకటుండి తీరాలి. ఎందుకంటే దానికి తానున్నాననే ప్రజ్ఞ లేదు. పోతే జ్ఞానమనేది జ్ఞేయ జగత్తులాగా అచేతనం కాదు. అది చైతన్యరూపమే. అలాంటి దానికి సాక్షి దేనికి. దీపానికి మరొక దీపంతో ఎలా నిమిత్తం లేదో స్వయంగా సాక్షి అయిన జ్ఞానానికి కూడా మరొక సాక్షితో నిమిత్తం లేదు. ఉంటుందని పట్టు పడితే దానికేమిటి సాక్షి దానికేమిటని ప్రశ్న వస్తుంది. అది అనవస్థ అనే

దోషానికి దారి తీస్తుంది. అనవస్థ అంటే ఎక్కడికీ నిలవక పోవటం. కాబట్టి ఐశ్వరమైన ఈ జ్ఞానానికి సాక్షి అక్కరలేదు. అది దాని పాటికది ప్రకాశిస్తూ ఈ సమస్త విశ్వాన్నీ ప్రకాశింపజేస్తున్నది. మొత్తానికి అది ఉంటేనే ఈ ప్రపంచముంది, లేకుంటే లేదు.

రెంటికీ ఇలాంటి అవినాభావ సంబంధముండటం మూలాన్నే ఈశ్వరుడికి భిన్నంగా అసలీ జగత్తనేది లేదు పొమ్మన్నారు అచార్యులవారు. ఎంచేతనంటే అది ఉంటేనే ఇది ఉందని ఎప్పుడన్నామో అప్పుడా రెండూ ఒక దానికొకటి కార్యకారణా లవుతాయి. రెండు పదార్థాలలో ముందుగా సిద్ధమై ఉన్నదేదో అది కారణం Cause. తరువాత దాని నుంచి ఉద్భవించేదేదో అది కార్యం Effect. ప్రస్తుత మీశ్వరుడూ – జగత్తూనని రెండే ఉన్నాయి పదార్థాలు. అందులో ఈశ్వరుడనేది సాక్షి కాబట్టి అది ముందే సిద్ధమయి ఉండాలి. ముందున్నది గనుకనే అది కారణం. పోతే అందులో నుంచి రావలసిందే కాబట్టి ఈ జగత్తంతా దానికి కార్యం.

కార్యకారణాలు రెండింటిలో కారణానికి భిన్నంగా దాని కార్యమనేది ఉండబోదని అద్వైతుల సిద్ధాంతం. దీనికే అనన్యత్వవాద Doctrine of total Identity మని పేరు. అనన్యత్వమంటే అన్యం గాకపోవటమే. కార్యమనేది దాని కారణంకన్నా అన్యం కాదు. దీనికి దృష్టాంతంగా ఒక మట్టినీ కుండనూ తీసుకొని చూడవచ్చు. మట్టి కారణమైతే కుండ దానికి కార్యం. మట్టిని విడిచి కుండ ఎక్కడా లేదు. ఎందుకంటే రెండింటికీ గూడా సత్తా Existance ఒక్కటే. కారణసత్తా ఏదో అదే దాని కార్యానికీ సత్తా. అంతకు మించి దీనికొక స్వతంత్రమైన సత్తా లేదు. కార్యకారణాలు రెండూ అప్రవిభక్త దేశకాలాలంటారు భాష్యకారులు అంటే ఏమన్న మాట. కారణమెంత మేరలో ఉందో అంత మేరలోనే ఉంటుంది కార్యం. అది ఎంత కాలముంటుందో ఇదీ అంత కాలమే ఉంటుంది. అంతేగాని దీనికొక విలక్షణమైన ఉనికి అంటూ లేదు. ప్రస్తుతం కుండ అనే పదార్థమొకటి ఉందని చెప్పామంటే ఎక్కడ ఉందది. మట్టి ఉన్నంతవరకే ఉంటుందది. మట్టి మన్నంతవరకే మనుతుంది. దాని సరిహద్దులను దాటి ఇది ఒక అంగుళం పోలేదు. పోతే కుండ అనేదే అసలు లేకుండా పోతుంది. కాబట్టి కారణసత్తాయే కార్యసత్తా. దానికి వ్యతిరిక్తమైన సత్తా దీనికెప్పుడూ లేదు.

సత్తాలు వేరుగా లేకపోతే ఇక వస్తువులనేవి రెండుండటానికి వీలులేదు. రెండు వస్తువులుండాలంటే వాటి సత్తాలుకూడా రెండుండి తీరాలి. ఇక్కడ మనకు కనిపించేది ఒక్కటే సత్తా. సత్తా ఒక్కటే అయి పదార్థాలు రెండెలా అవుతాయి. కాబట్టి వస్తువనే దొక్కటే. అయితే ఆ రెండవ దేమిటని అడగవచ్చు. అది వస్తువు కాదు. దాని ఆభాస. ఒకటి ఉండి కనిపిస్తే అది వస్తువు. లేకుండానే కనిపిస్తే ఆభాస. ఒక జలాశయంలో జలం కనిపిస్తుందంటే అది వాస్తవంగా అక్కడ ఉండే కనిపిస్తున్నది. మరి ఎండ మావులలో అలా కాదు. అక్కడ నీరనే పదార్థం నిజంలో లేకపోయినా పొంగి పొర్లుతున్నట్టే భాసిస్తుంది. నిజంగా ఉన్నదక్కడ సూర్యకిరణాలేగాని నీరు గాదు. అదే మనకు దూరానికి జలంలాగా భాసిస్తున్నది. దీనినిబట్టి మనం గ్రహించవలసిందేమిటి. కారణ ద్రవ్యంకంటే భిన్నంగా దాని కార్యం ఉండబోదు. కారణం వస్తు Substance వైతే కార్యమనేది దాని ఆభాస Appearance మాత్రమే.

అయితే ఎంత ఆభాస అయినా మనకంటికి కనిపిస్తున్నది గదా అని అడగవచ్చు. నీవు కనిపిస్తున్నదని చెప్పేది అసలు కార్యమే కాదు పొమ్మంటారు శంకరులు. కార్యంకాక మరేమిటి. కారణమే ఒకానొక రూపంలో కనిపిస్తుంటే అది చూచి నీవు కార్యమని భ్రమపడుతున్నావు. ఇంతెందుకు. ఒక సర్పముంటుంది. అది చుట్ట చుట్టుకొని పడుకొన్నప్పుడొకవిధం–కదలి ముందుకు పోతున్నప్పుడొక విధం–పడగ ఎత్తి బుసకొడుతున్నప్పుడొక విధం–పైనబడి కరవ వచ్చేటప్పుడొక విధం. నాలుగు దశలలో నాలుగు రూపాలుగా కనిపిస్తుందది. ఎన్ని రూపాలుగా కనిపించినా అక్కడ ఉన్నదొకే ఒక సర్పం. ఒక్కొక్క దశలో ఒక్కొక్క సర్పం లేదు. ఒకే సర్పమెత్తిన అవతారాలవి. రూపాలవి. ఈ రూపానికే సంస్థాన Constitution or phase మని పేరు పెట్టారు భగవత్పాదులు. కారణం తాలూకు సంస్థానం చూచి మనం కార్యమని దానికొక క్రొత్తపేరు పెట్టాము. ఎంత పెట్టినా క్రొత్తగా ఒకటి ఏదీ రాలేదు. ఉన్నదల్లా ఒక్క కారణద్రవ్యమే. దానికదనంగా మరేది కనిపించినా అది కేవలం దాని రూపమూ form లేదా సంస్థానమే Phase. కాబట్టి దానికన్నా అది వేరుగాదు.

వేరుగాదని చెప్పటానికి మరొక నిదర్శనంకూడా ఉంది మనకు. కారణానికేగుణా లున్నవో అవే దాని కార్యంలోనూ కనిపిస్తాయి. అంతకుమించి అదనంగా మనకందులో ఏదీ కనిపించదు. ఇది వేదాంతులే గాక భేదవాదులైన తార్కికులు

కూడా అంగీకరించిన సత్యం. **"కారణ గుణాః కార్యమను ప్రవిశంతి"** అని వారే సిద్ధాంతం చేశారు. ఇదే సిద్ధాంతమైననాడిక కారణానికి భిన్నంగా కార్యమనేది ఎలా ఉండగలదని ప్రశ్నిస్తారు భగవత్పాదులు. ఒక ఘటమనే కార్యముందంటే అందులో ఎంత దూరం తడవిచూచిన మనచేతికి తగిలేది మృత్తికే. అంతా మృత్తిక గుణాలే అయినప్పుడిక ఘటమనేది ఎక్కడ ఉంది. అయితే మృత్తికకు భిన్నంగా ఒక లావుపాటి గుండ్రని రూపం మనకు గోచరిస్తుంది గదా అని అడగవచ్చు, ఆ రూపమూ దానిని వర్ణించే ఘటమనే నామమూ-ఇవి రెండూ నామమాత్రమేగాని వాస్తవంలో అక్కడ ఉన్నది మృత్తిక అనే మూలద్రవ్యమే. మృద్గుణాలకంటే అదనంగా ఏ గుణాలూ లేవక్కడ. ఒకవేళ ఉన్నట్టు కనిపించినా మరలా అదేమిటని తడవిచూస్తే మృత్తికగానే గుర్తించగలం, ఇలా కారణ స్వరూపాన్ని దాని కార్యంలో గుర్తించటానికే ప్రత్యభిజ్ఞ Recognition అని పేరు. ప్రత్యభిజ్ఞా దృష్టితో చూస్తే అంతా కారణమే. కార్యమనే పొలకువే కానరాదు చివరకు.

అయితే ఇది మృద్ఘటాదులైన కొన్ని దృష్టాంతాలలో సరిపడితే పడవచ్చుగాని అన్ని దృష్టాంతాలలో సరిపడుతుందని ఏమిటి నమ్మకం. ఆ మాటకు వస్తే క్షీరదధి దృష్టాంతముంది. అలాగే బీజవృక్ష దృష్టాంతముంది. అవికూడా కార్యకారణాలే గదా. మరివాటిలో మనకిలాంటి ప్రత్యభిజ్ఞ కలగటం లేదే అని ప్రశ్నరావచ్చు. అందులోకూడా కలుగుతుందనే అంటారు స్వామివారు. కార్యకారణ సంబంధమున్న చోట అంతా ప్రత్యభిజ్ఞ కలిగి తీరవలసిందే. అయితే కొన్నింటిలో అది ఎందుకు కనిపించటం లేదంటే పరిణామ విప్రకర్షం Distance in Evolution వల్ల నంటారాయన. విప్రకర్షమంటే దూరమని అర్థం. కారణానికీ-కార్యానికీ-మధ్య పరిణామ క్రమంలో ఎన్నో మజిలీలు Stages తటస్థపడ్డాయి. ఇవి గోడలమాదిరడ్డు తగలటంవల్ల ఒక దానికొకటి దూరమయిపోయి తన్మూలంగా కార్యాన్ని చూడగానే దానికారణ గుణాలను తటుక్కున పోల్చుకోలేక పోతున్నాము. మనం పోల్చుకోలేక పోయినా అవి మాత్రమెక్కడికీ పరారయిపోవు. అక్కడే మరుగుపడి ఉంటాయి. కొంచెం లోతుకు దిగి అంచెలవారిగా విచారణ సాగిస్తేచాలు. మరలా దాని స్వరూప మందులోనే మనకు క్రమంగా బయటపడుతుంది. అసలు విషయమేమంటే కొన్నిటిలో కారణమతి స్పష్టంగా కనిపిస్తుంది. కొన్నింటిలో స్పష్టాస్పష్టంగా భాసిస్తుంది. మరి

కొన్నిటిలో కేవల మస్పష్టమయి పోతుంది. ఇంతకు స్పష్టాస్పష్టతలలోనే తేడా గాని అసలు దాని లక్షణాలందులో లేక గాదు.

అసలా లక్షణాలే లేకుంటే దీనికది కారణమనీ-దానికిది కార్యమనీ ఎలా చెప్పగలం. చెప్పగలిగామంటే రెండింటికీ ఏదో ఒక సాజాత్యముంటేనే గదా. సాజాత్యం లేదంటావో మట్టినుంచే కుండ రావటమేమిటి. విత్తనం నుంచే వృక్షం రావటమేమిటి. విజ్జోడుపడి ఒకదాని నుంచి వేరొకటి రావచ్చు గదా. కాని అలా జరగటం లేదెక్కడా. మట్టినుంచే ఘటం వస్తుంది. విత్తునుంచే చెట్టు వస్తుంది. అలాగే వస్తున్నాయంటే అప్పటికీ కార్యమనేది అంతకు పూర్వమే ఉండకతప్పదు. ఉండకపోతే ఒక్కసారిగా అది ఎలా ఊడి పడుతుంది. పడిందని చెప్పావంటే అభావం నుంచి భావం వస్తుందని చెప్పినట్టవుతుంది. అభావం నుంచి భావమెప్పుడూ రాదు. భావం నుంచే భావమేర్పడుతుంది. అభావం నుంచే వచ్చేట్టయితే ఘటం తాలూకు అభావం ఒక మట్టిలోనే ఏమి-పటంలో మఠంలో కూడా ఉంది. మరి వాటిలో దేనిలో నుంచీ రావటం లేదేమి ఘటం.కాబట్టి ఘటమనే కార్యమంతకు ముందు నుంచీ దాని కారణమైన మృత్తికలోనే గుప్తమయి ఉండాలి. ఇలా కార్యం కారణంలో గుప్తమయి ఉండటం మూలాన్నే మరలా కార్యంలో ఎక్కడ చూచిన దాని కారణ గుణాలనే మనం గుర్తించగలగటం. అంటే ఏమన్నమాట. కార్యమని ఇప్పుడు మనమేది చూస్తున్నామో అది మొదటి నుంచీ దాని కారణమే గాని అంతకన్నా విశేషమేమీ లేదు.

ఒకవిధంగా చెబితే అవ్యక్తమైన Latent రూపం వ్యక్తం Patent కావటాన్నే కార్యమని మనం వ్యవహరిస్తున్నాము. అవ్యక్తంగా ఉన్నప్పుడు దానికి కారణమని పేరు. అదే వ్యక్తమయి కనిపిస్తే దానికి కార్యమని పేరు. వ్యక్తావ్యక్త దశలలోనే మార్పుగాని వస్తు స్వరూపంలో మార్పులేదు. అక్కడ ఉన్న వస్తువొక్కటే. దానికి చెందిన సూక్ష్మరూప మొకటైతే-స్థూల రూపం మరొకటి. ఇంతెందుకు ఒక పెద్ద కంబళముందనుకోండి. అందులో చిత్రవిచిత్రమైన రంగులూ రేఖలూ ఎన్నో ఉండవచ్చు. ఎన్నో గజాల ఆయామమూ విస్తారమూ, కలిగిందేకావచ్చు. కానీ చుట్టచుట్టి మడిచి ఒక మూల పడవేసి ఉన్నంతవరకూ ఏమీ ప్రయోజనం లేదు. అందులో ఉన్న విశేషమేదీ మనకంటి కగపడదు. అగపడాలంటే దాని నివతలికి

తెచ్చి మడత విప్పి బాగా పరచి చూడాలి. అప్పుడందులోని ప్రతి ఒక్క మర్మమూ మనం చక్కగా గుర్తించవచ్చు. అలా గుర్తించామంటే అప్పటికప్పుడది క్రొత్తగ సృష్టి అయిందనా అర్థం. ఉన్నదేదో అప్పుడూ ఉంది, ఇప్పుడూ ఉంది. ఎటు వచ్చీ అప్పట్లో అది వ్యక్తం కాలేదు. ఇప్పుడయింది. అంత మాత్రమే.

ఈ సూక్ష్మాన్ని గ్రహించలేక కొందరు కార్యమనేది క్రొత్తగా ఆవిర్భవస్తున్నదంటే మరి కొందరు పరిణమిస్తున్నదని వాదిస్తారు. రెండు వాదాలు అర్థం లేనివన్నారు శంకర భగవత్పాదులు. ఆరంభ వాదాన్ని ఒప్పుకొంటే అంతకుముందు లేని పదార్థమొకటి సరిక్రొత్తగా ఊడిపడిందని చెప్పవలసి వస్తుంది. పరిణామ వాదాన్ని ఒప్పుకొంటే ముందున్న రూపం మారిపోయి క్రొత్త రూపమొకటి ఏర్పడిందని చెప్పవలసి వస్తుంది. ఏ విధంగా చెప్పినా అది అశాస్త్రీయమే. ఎందుకంటే లేని పదార్థమెప్పుడూ రాదు. ఉన్న పదార్థమెక్కడికీ పోదు. ఒక పదార్థమిప్పుడుందంటే ఇంతకు ముందు కూడా ఉందది. ఇక ముందు కూడా ఉండబోతుంది. ఏదీగానీ నిరన్వయమూ అభావాంతమూ కావటానికి లేదు. ఇది సర్వులూ ఒప్పుకొన్న సిద్ధాంతం. కాబట్టి ఆరంభమూ Creation కాదిది–పరిణామమూ Evolution కాదు.

అయితే మరి కార్యమనేది ఎలా వచ్చిందని ప్రశ్న. దీనికి వివర్తమని Manifestation జవాబిస్తారు జగద్గురువులు. వివర్తమేమిటి. కారణమే మరొక భంగిమలో కనిపిస్తే దానికి వివర్తమని పేరు. ఇందులో చమత్కారమేమంటే ఏ భంగిమలో కనిపించినా – అది కారణమే గాని మరొకటి గాదు. కారణ ద్రవ్యాన్ని విడవకుండా అంటిపెట్టుకొనే ఉంటుందా రూపం. ఎక్కడికక్కడ రూపాలు మారినా అది మాత్రమను స్యూతంగా మనకు దర్శనమిస్తూనే ఉంటుంది గానితెగిపోవటమంటూ ఉండదు. తెగిపోయిందంటే అది ఇక మన కంటికెక్కడా కనపడగూడదు. ఏదీ అలా కనపడకుండా ఎక్కడ పోయింది. ఎప్పుడు చూచినా – ఎక్కడ చూచినా – దాని కార్యరూపాలలో అదే మనకు సాక్షాత్కరిస్తున్నదాయె. అలా చివరదాకా అదే ఉన్నప్పుడిక ఏదిగాని క్రొత్తగా వచ్చిందేమిటి. మారిందేమిటి. వచ్చినట్టు మారినట్టు కేవలం భాసిస్తున్నదంత మాత్రమే. ఇదుగో ఇలాంటి భాసకే వివర్తమని నామకరణం చేశారు వేదాంతులు. దీనికే తాదాత్మ్య సంబంధమని కూడా నామాంతరం. ఈ తాదాత్మ్య సంబంధం తప్ప మరి ఒక సంబంధమే లేదు కార్యకారణాలకు. తాదాత్మ్య

మంటే రెండూ ఒక్కటేనని అర్థం. కాబట్టి ఇంతకూ కార్యమనేది ఒకటి ఎప్పుడూ రాలేదు, పోలేదు. అది నూటికి నూరు పాళ్ళు దాని కారణాని కనన్యమని సిద్ధాంతం.

పోతే ప్రస్తుత మీ సిద్ధాంతాన్ని మనం జగదీశ్వరులనే మూలతత్త్వాల కన్వయించు కోవలసివుంది. జగదీశ్వరులకున్న సంబంధం కూడా ఇలాంటి కార్యకారణ సంబంధమే నని నిరూపించాము. అందులో జగత్తు కార్యమైతే ఈశ్వరుడు కారణం. కారణమంటే ఇది మిగతా కారణాలవంటిది కూడ కాదు. ఇందులో ఒక విశేషముంది. లోకంలో మనం చూచే కారణాలన్నీ ఒక దానికి కారణమైతే - మరొక దానికి కార్యమవుతాయి. ఉదాహరణకు ఒక కొయ్యబల్లకు కారణమైతే- చెట్టుకది కార్యం. మరి చెట్టు కొయ్యకు కారణమైతే విత్తనానికది మరలా కార్యం. ఇలా ఎంతదూరమైనా పరుగెడుతుందీ కార్యకారణ పరంపర. మొత్తం మీద కార్యంగాని కారణమంటూ ఒక్కటీ లేదు ప్రపంచంలో. ప్రస్తుత మీ ఈశ్వరుడనే కారణమలాంటిది గాదు. మొత్తం ప్రపంచానికే కారణం కాబట్టి అది ఇక దేనికీ కార్యం గాదు. కార్యంగాని కారణమది. అందుకే దాన్ని ఆది కారణమనీ - మూలకారణమనీ కారణ కారణమనీ వర్ణిస్తారు వేదాంతులు.

అంతేకాదు. పైన చెప్పినదే కాక మరొక విశేషం కూడా కనిపిస్తుందీ ఈశ్వర కారణంలో అదేమిటంటే అసలు కారణమనేది ఒకటిగాదు. అది మూడు విధాలు. ఒకటి ఉపాదానం Material రెండు నిమిత్తం Agent. మూడు సహకారి Instrument. కుండకు మట్టి ఉపాదానమైతే కుమ్మరి నిమిత్త కారణం. పోతే దండమూ- చక్రమూ, జలమూ-సూత్రమూ-ఇలాటివన్నీ సహకారులు ఇవి మూడూ కలసి పని చేసినప్పుడే ఏ కార్యమైనా రంగంలోకి వచ్చేది. లోకంలో ఇవి మూడూ దేనిపాటి కది వేరు వేరుగా ఉంటాయి. ఉపాదానం నిమిత్తం కాదు. నిమిత్తం సహకారి కాదు. ఒకదానికొకటి విలక్షణం. కానీ ప్రస్తుతం ఈ ఈశ్వరుడి విషయంలో అలా కాదు. మూడూ ఒక్కటే. అంటే అర్థం. ఉపాదానమైనా అదే. నిమిత్తమైనా అదే. సహకారి అయినా అదే. ఏమి కారణం. చరాచర ప్రపంచానికంతటికీ కలిపి అది ఒక్కటే కారణమని గదా నిరూపించాము. ఒక్కటే నన్నప్పుడిక వేరొక కారణమనే గంధమే లేదు. అంచేత మూడింటి పనీ అది ఒక్కటే చేయవలసి వస్తుంది.

దీనిని బట్టి మన కర్థమయిందేమిటి. అన్ని కారణాలూ ఒక్క ఈశ్వరుడే కాబట్టి ప్రపంచ నిర్మాణానికిక దేని అపేక్షాలేదు. సామగ్రీ అక్కరలేదు. సహాయమూ అక్కరలేదు ఈశ్వరుడు తన్ను తానే స్వయంగా మలుచుకొని ఈ చరాచర ప్రపంచంగా మనకు భాసిస్తున్నాడని తెలుసుకోవాలి మనం. ఒక బంగారమే తనపాటికి తాను హారనూపుర కేయూరాదులైన ఆభరణాలుగా మారి కనిపిస్తే ఎలా ఉంటుందో అలాంటిదీ ఇది. హారనూపురాదుల లాంటివే మనకు కనిపించే వన నదీ పర్వత సముద్రాదులైన పదార్థాలన్నీ. హారనూపురాదులన్నీ సువర్ణమయినట్టే అణువు మొదలు ఆకాశందాకా ఉన్న ఈ పదార్థాలన్నీ కూడా ఆ ఈశ్వర స్వరూపాలే. అంతకన్నా వేరు కావు.

అయితే కారణ గుణాలే దాని కార్యంలో కనిపించాలనే సిద్ధాంతముంది గదా. ఈశ్వరుడే జగత్తు కంతా కారణమయినప్పుడీ జగత్తులో కూడా ఈశ్వర గుణాలు కనిపించాలి గదా. మరి అలాంటి లక్షణాలెక్కడ కనిపిస్తున్నాయని ప్రశ్న రావచ్చు. దీని కాచార్యుల వారిచ్చే సమాధానమిది. ఈశ్వర గుణాలీ ప్రపంచంలో ఎక్కడ దాఖలా అవుతాయనే ప్రశ్నేలేదు. అంతా ఈశ్వర స్వరూపమే అయినప్పుడిక దాఖలా అనే ప్రశ్నేముంది. ఎక్కడ బడితే అక్కడే తార్కాణ కావాలవి. అవుతాయి కూడా. అసలీశ్వరుడి గుణాలనే వేమిటి. గుణాలే అనుకొంటే అవి రెండే రెండున్నాయి ఒకటి సత్తు. మరొకటి చిత్తు. సత్తంటే ఉండటమనీ చిత్తంటే ప్రకాశించటం లేదా కనిపించటమనీ అర్థం. ప్రపంచంలో నీవే పదార్థాన్నైనా పట్టి చూడు. అది ఉంటుంది. కనిపిస్తుంటుంది. చంద్రమండలానికి వెళ్ళినా సరే. అక్కడీ పదార్థాలు కూడా ఉంటాయి. నీ కంటికి కనిపిస్తుంటాయి. ఇంతకు మించి నీవెక్కడ గానీ చూడదగిన విశేషమేదీ లేదు. అదేమిటి. పొడుగూ-పొట్టీ-లావూ-సన్నమూ-ఎరుపూ-నలుపూ-మంచీ-చెడ్డా- ఎన్నో ఉన్నాయి గదా విశేషాలని శంకించవచ్చు. అవి కూడా ఉన్నాయి, కనిపిస్తున్నాయి. అంతకంటే విశేషమేముందని. విశేషమని ఏది చెప్పినా చివరకది కూడా ఉండవలసిందే. కనిపించవలసిందే. ఈ ఉనికినే అస్తి అన్నారు. కనిపించటాన్నే భాతి అన్నారు వేదాంతంలో. అస్తి భాతి అన్నా - సత్తా స్ఫురత్తలన్నా-సచ్చిత్తులన్నా మూడూ పర్యాయాలే. ఈ సచ్చిత్తులే ఇంతకూ ఈశ్వర గుణాలనేవి. ఈ గుణాలే ఈశ్వర కార్యమైన ఈ ప్రపంచంలో కూడా ఎక్కడ బడితే అక్కడ రాజ్యమేలుతున్నాయి. అలాంటప్పుడిదంతా ఈశ్వర స్వరూపమేనని చెప్పటంలో అభ్యంతరమేముంది.

అంచేత చివరకు ఫలితాంశమేమంటే ప్రపంచమని మన చుట్టూ ఏదేది కనిపిస్తున్నదో ఏదేది మన లోపల అనిపిస్తున్నదో అదంతా వాస్తవంలో ఏదో గాదు. ఆ ఈశ్వర చైతన్యమే. ఆ చైతన్యమే ఒక నర్తకుడిలాగా అనేక భూమికలు ధరించి మనకిలా భాసిస్తున్నది. **"మూలకారణ మేక మేవ ఆ అంత్యాత్కార్యాత్తేన తేనకార్యా కారేణ నటవత్సర్వ వ్యవహారా స్పదత్వమ్ భజతే"** అని ముక్తకంఠంతో చాటారు భగవత్పాదులు. నటుడనేవా డొక్కడే అయినా పెక్కు పాత్రలు ధరిస్తాడు. పెక్కు రీతులలో అభినయిస్తాడు. అయితే ఎన్ని పాత్రలు ధరించి ఎన్ని విధాల అభినయించినా అన్నింటిలో వున్నదొకే ఒక పురుషుడు. అలాగే మొట్టమొదటిదైన అవ్యాకృతం Primordial matter దగ్గరి నుంచీ కట్టకడపటిదైన మానవ శరీరం దాకా అన్ని ఆకారాలూ ధరించి అన్నింటిలో ప్రవేశించి అన్ని వ్యవహారాలు నిర్వహిస్తూ ఉన్నది కూడా ఆ పారమేశ్వరమైన చైతన్యమొక్కటే. దాని విభూతి శకలాలే ఈ చరాచరప్రకృతి అంతా. దానికి బాహ్యంగా ప్రపంచమని చూపగల, చెప్పగల, పదార్థమంటూ ఒకటీ ఏదీ కానరాదు. అంటే ప్రపంచమనేది కేవలం మిథ్యాభూతమే నని అర్థం.

## జీవమిథ్యాత్వం

ఇక్కడికి మనం జగన్మిథ్యాత్వాన్ని నిరూపించగలిగాము. పోతే ఇక జీవ మిథ్యాత్వాన్ని నిరూపించవలసి వుంది. జీవుడు కూడా జగత్తులాగా మిథ్యా భూతమే. అయితే దానికీ దీనికి మిథ్యాత్వంలో ఒక చిన్న తేడా వుంది. చైతన్యం వికృతమైన రూపం జగత్తయితే అవికృతమైన రూపం జీవుడంటా రాచార్యులవారు. వికృతి అంటే మార్పు ఏమాత్రంగానీ మార్పు చెందకుండా ఆ ఈశ్వరుడే జీవుడనే పేరుతో ఈ శరీరంలో ప్రవేశించాడని చెబుతున్నది శాస్త్రం. కనుక జగత్తులాగా అచేతనుడు కాదు జీవుడు. ఈశ్వరుడి లాగా చేతనుడు. చైతన్యమనేది ఇరువురికీ సమానమైన ధర్మం. ఎటు వచ్చీ ఈశ్వర చైతన్యం పరిపూర్ణమైతే ఇది శరీర మాత్ర పరిచ్ఛిన్నమయి భాసిస్తుంది. కనుకనే జగదీశ్వరులకు రెంటికీ కార్యకారణ సంబంధం చెబితే జీవేశ్వరుల కంశాంశి సంబంధం చెబుతారు వేదాంతులు. అంశి అంటే సమష్టి. అంశమంటే అందులో ఒకభాగం. దావానలం అంశి అయితే విస్ఫులింగమొక అంశం. మహా సముద్ర మంశి అయితే తరంగమనేది ఒక అంశం. ఇలాంటి ఒక

అంశమే జీవుడు కూడా ఈశ్వర చైతన్యంలో పరిచ్ఛిన్నమని చెప్పామంటేనే ఇక అది అంశం కాక తప్పదు.

అయితే ఒక చిన్న ఆశంక. చైతన్యమనేది ఒక దావానలం లాగా, సముద్రం లాగా, సావయవమైన పదార్థం కాదు. అది నిరవయవమైన తత్త్వం. అలాంటి దానిలో జీవుడనే అంశమెలా ఏర్పడింది. నిజమే. ఏర్పడటానికెంత మాత్రమూ వీలు లేదు. కానీ జగత్తనే కార్యమొకటి వస్తుతః దానికి భిన్నంగా లేకపోయినా ఉన్నట్టు భాసించటం లేదా. అలాగే నిరంశమైన చైతన్యంలో జీవుడనే అంశం కూడా ఒక ఆభాసే గాని వాస్తవం కాదు. వాస్తవం కాకుండా ఎలా భాసించగలిగింది. దానికి కారణ మాయా ఉపాధుల తోడి సంసర్గమే నన్నారు జగద్గురువులు. ఉపాధి ఏమిటని అడగవచ్చు. సహజంగా లేక మధ్యలో వచ్చి సంక్రమించేదేదో అది ఉపాధి Accessory. సహజం కాదు కనుకనే అది వస్తుధర్మం కాదు. వస్తుధర్మం కాకపోయినా అది వస్తువు నాకర్షిస్తుంది. తన గుప్పిటిలో ఇరికించు కొంటుంది. తనమేరకే దాన్ని కుంచించి చూపుతుంది.

ఈ రహస్యం తార్కాణ కావాలంటే మనమొక అద్దాన్ని తీసుకొని చూడవచ్చు. అద్దమనేది ఒక ఉపాధి. అందులో తొంగి చూస్తే మనకు మన ముఖం కనిపిస్తుంది. ఇప్పుడా కనిపించే ప్రతి ముఖమెక్కడిది. మన ముఖమేనా. కాదు. మనముఖం మన దగ్గరే ఉంది. అది అద్దం పగల గొట్టుకొని పోయి అందులో ప్రవేశించలేదు. మరిఏమిటది. ఎక్కడి నుంచి వచ్చింది. ఎక్కడి నుంచీ రాలేదు. అది ఒక ఆభాస. మన వద్ద ఉన్న ముఖమే అద్దంలో ఉన్నట్టు భాసిస్తున్నది. అంచేత అది మన ముఖంకన్నా భిన్నం కాదు. అలాగే ప్రస్తుత మీ శరీరాది సంఘాతం కూడా మన కద్దంలాంటి ఒక ఉపాధి. అఖండమైన చైతన్యం మన ముఖంలాగానే ఇందులో వచ్చి ప్రతిఫలించింది. ప్రతిఫలించి దాని మేరకే నిలిచి పోయింది. ఇలా నిలిచిపోయిన చైతన్య ఖండాన్నే మనమిప్పుడు జీవుడని పేర్కొంటున్నాము. ఇది కేవల మా బింబానికి ప్రతిబింబమే. ప్రతిబింబ మనేది దాని బింబానికెలా వ్యతిరిక్తం కాదోఅలాగే ఈ జీవ చైతన్యం కూడా ఆ మహా చైతన్యానికి వ్యతిరిక్తం కాదనే గ్రహించాలి మనం.

అయితే బింబమూ-ప్రతిబింబ మంటే అవి మూర్తమైన పదార్థాలు కాబట్టి ఒక ఉపాధిలో ప్రవేశించటాని కక్కడ ఆస్కారముంది. ప్రస్తుత మీ చైతన్యమనేది

మూర్తమైన పదార్థం కాదు. పైగా సర్వవ్యాపకమైన తత్త్వమది. అలాంటప్పుడీ శరీరమనే ఉపాధిలో అది ఎలా ప్రవేశించగలిగింది. ప్రవేశించకపోతే ఎలా భాసించ గలిగింది. కాబట్టి ఈ చెప్పిన దర్పణ దృష్టాంతమెంత మాత్రమూ చెల్లనేరదని ఆక్షేపణ వస్తుంది. దీనిని సవరించటానికా అన్నట్టు వేరొక దృష్టాంతాన్ని కూడా సెలవిస్తారు శంకర భగవత్పాదులు. అదే ఘటాకాశ దృష్టాంతం ఒక కుండ మనమారు బయట పెట్టి చూస్తే అందులో మనకొక ఖాళీ కనిపిస్తుంది. అది ఆ కుండ మేరకే పరిమితమై కనిపిస్తుంది. అలా కనిపించిన మాత్రాన ఆ కుండలో ఉన్న ఖాళీనే ఖాళీ అనగలమా. ఖాళీ అనేది అంతటా ఉంది. కుండ లోపలా ఉందది. వెలపలా ఉంది. మహాకాశమే గాని అది ఘటాకాశం కాదు. అంతటా ఉన్న ఆకాశమే ఘటంలో కూడా సంక్రమించ గలిగింది. రూపమంటూ లేకపోయినా రూపమున్న పదార్థం మాదిరే ప్రవేశించిందది. ఆ మాటకు వస్తే అసలది ప్రవేశించనే లేదు. అమూర్తమైనది మూర్తంలో ఎలా ప్రవేశించగలదు. అమూర్తమనే సరికది వ్యాపకమవుతుంది. వ్యాపకం వ్యాప్యంలో ఎప్పటికీ ఇమడ లేదు. కాబట్టి ఆకాశం ఘటంలో ప్రవేశించిందనే మాట పొరబాటు. నిజానికి ఘటంలో ఆకాశం కాదు. ఆకాశంలోనే ఘటం ప్రవేశించింది. ఒకదాని చర్య మరొక దాని కారోపిస్తున్నాము మనం. అది మన భ్రాంతి, ఘటమనేది ఆకాశంలోకి రాగానే ఆ ఘటం మేర కొక ఆకాశం కనిపించింది మనకు. ఆ మేరకే చూచి దాన్ని ఘటాకాశమన్నాము మనం. ఘటాకాశమనీ మహాకాశమనీ రెండాకాశాలు లెవెక్కడా. ఉన్నదెప్పుడూ ఒకే ఒక ఆకాశం. ఘటమనే ఉపాధి మధ్యలో రావటం మూలాన ఒకే ఆకాశం రెండుగా చీలి మనకు కనిపిస్తున్నది. కేవల ముపాధి జన్యమే గాని అది వస్తు ధర్మం కాదు.

అలాగే ప్రస్తుత మీ శరీరం కూడా ఘటంలాంటి ఒక ఉపాధి. కర్మ వశాత్తూ ఇది చిదాకాశంలోకి దూసుకు రావటం మూలాన అఖండమైన ఆ చైతన్యం ఖండ రూపంగా భాసిస్తున్నది. ఆకాశంలాగా చైతన్యం కూడా రూప రహితమే. అయినా ఈ శరీర సంపర్కం కారణంగా ఒక రూపమేర్పడింది దానికి. వాస్తవంలో ఇది దాని రూపం కాదు. శరీర రూపం. శారీరకమైన రూపం మన అజ్ఞానం వల్ల దాని కారోపించాము. తన్మూలంగా అది శరీరంలో బందీ అయినట్టు మనకు భాసిస్తున్నది. వాస్తవానికది శరీరంలో లేదు. ఆకాశం మాదిరే అది శరీరం లోపలా వెలపలా

కూడా వ్యాపించి ఉంది. కనుకనే జీవచైతన్యమనీ ఈశ్వర చైతన్యమనీ రెండు లేవు. రెండు ఆకాశాలెలా లేవో రెండు చైతన్యాలు కూడా అలాగే లేవు అయినా ఉన్నట్టు కనిపిస్తున్నదంటే అది కేవల ముపాధి కృతమే గాని వస్తు సిద్ధం కాదు. కాబట్టి ఘటాకాశంలాగా జీవుడనేది కూడా ఒక మిథ్యాభూతమైన తత్త్వమే.

అయితే శరీరాదులైన ఉపాధులున్నంత వరకూ అలా భాసించక తప్పదు గదా అలాంటప్పుడది మిథ్య అని ఎలా భావించటమని మరలా ప్రశ్న వస్తుంది. ఇక్కడే దృష్టాంత దార్ష్టాంతి కాలకున్న తేడా. దృష్టాంతమనేది కొంత వరకే వేదాంతంలో ఆ తరువాత దానికి వీడ్కోలు చెప్పవలసిందే నంటారు స్వామివారు. ప్రస్తుతం ఘటమనీ దర్పణమనీ పేర్కొన్నామంటే అవి వాటిలో ప్రతిఫలించిన ఆకాశాదుల కంటే వేరుగా స్వతంత్రంగా ఉన్న పదార్థాలు. ఘటమూ ఉంది ఆకాశమూ ఉంది. ఇదీ దృష్టాంతంలో ఉన్న విషయం. పోతే ఇక దార్ష్టాంతిక విషయమలాంటిది కాదు. చైతన్యం కంటే శరీరాదులైన ఉపాధులు వేరుగా లేవసలు. శరీరమంటే అది ఒకటి గాదు. త్వఙ్మాంసాదులూ - ఇంద్రియాలూ - ప్రాణమూ - మనస్సూ - ఆఖరు కహంకారమూ-ఈ సంఘాతానికంతటికీ కలిసి శరీరమనిపేరు. దీనినే పిండాండమని కూడా పిలుస్తారు శాస్త్రజ్ఞులు. ఈ పిండాండమనే దెక్కడి దసలు. వెలపల కనిపించే బ్రహ్మాండంలో ఒక భాగమే ఇది. ఆకాశాదికమైన భౌతిక జగత్తుకంతా బ్రహ్మాండమని పేరు. బ్రహ్మాండమంతా ఎలాంటిదని వర్ణించాము మనం. ఈశ్వర చైతన్యానికి భిన్నంగా అది ఎక్కడా లేదు కేవలం మిథ్యాభూతమని గదా నిరూపించాము. బ్రహ్మాండమే వట్టిదని తేలినప్పుడందులో ఏక దేశమైన ఈ సంఘాతం మాత్రం గట్టిదెలా అవుతుంది. ఇదీ దానితో పాటు మిథ్యాభూతమే కావలసి ఉంటుంది. బాహ్య ప్రపంచంలో లాగా దీనిలో కూడా పంచభూతాలే పని చేస్తున్నాయి. మనస్సూ-ప్రాణమూ- కొంత విలక్షణంగా కనిపించినా అవి కూడా భౌతికమే పొమ్మన్నారు శాస్త్రజ్ఞులు. మనస్సన్న వికారమైతే ప్రాణం జల వికారమట. పోతే అహంకారం కూడా భౌతికమేనని వారి తీర్మానం.. అలాంటప్పుడు ప్రపంచం కాని పదార్థమేముంది ఇందులో. లేకుంటే ప్రపంచంతో పాటు ఇది కూడా మిథ్యా కోటిలో చేరవలసిందే గదా.

శరీరమే మిథ్య అయిననాడిక జీవుడు కూడా హుళుక్కే అవుతాడు. ఎంచేతనంటే శరీరమనే ఉపాధి నాధారం చేసుకొనే గదా జీవభావ మేర్పడింది. ఆ ఆధారానికే బ్రతుకు లేకపోతే ఇక ఆధేయానికెక్కడిది. 'నిమిత్త స్యాపాయే నైమిత్తిక స్యాపాయః' అన్నారు శాస్త్రకారులు. నిమిత్త మిక్కడ శరీరం. ఇది ఘటాకాశానికి ఘటంలాగా ఆధారమయి కనిపిస్తున్నది చైతన్యానికి. ఘటమున్నంత వరకే ఘటాకాశమున్నట్టు ఈ సంఘాతమున్నంత వరకే జీవుడనే పేరు. ఆ తరువాత ఘటాకాశమెలా లేదో అలాగే జీవుడనే వాసన కూడా లేదు. ఆ తరువాత అని మాట సామెతకు చెప్పిందే గాని అసలెప్పుడూ లేదీ ఉపాధి. ఒకప్పుడున్నదంటే మరొకప్పుడెలా పోయిందని ప్రశ్న వస్తుంది. ఉన్నదెప్పుడూ తొలగిపోదు. తొలగిపోతే అది ఉన్నదే కాదు. చైతన్యానికి భిన్నంగా జగత్తు లేదని పేర్కొన్నామంటే అది ఎప్పుడో ఒకప్పుడని కాదు. ఎప్పుడూ లేదనే అభిప్రాయం. అంచేత మనకిప్పుడు కనిపిస్తున్నా ఈ శరీరం లేనిదే. అది లేనందువల్లనే దానినంటి పట్టుకొన్న జీవుడు కూడా లేడని సిద్ధాంతం.

# ఈశ్వర సద్భావం

మొత్తం మీద జీవుడూ మిథ్యే – జగత్తూ మిథ్యేనని తేల్చుకొన్నాము. దీనితో మిథ్యా విభాగాన్ని గూర్చిన విచారణ సమాప్తమయింది. పోతే ఇక మిగిలింది సత్య విచారణ. సత్యమైన పదార్థమేమిటీ అని ఇప్పుడు ప్రశ్న. పరిశేష న్యాయంగా ఇక సత్యమనేది ఒక ఈశ్వరుడే కావలసి ఉంది. ఏమి కారణం. జీవ జగదీశ్వరులని మూడే మనం మొదట పరిగణించిన పదార్థాలు. ఆ మూడింటిలో జీవ జగత్తులు రెండూ కేవలం మిథ్యాభూత మని తేలిపోయింది. పోగా ఇక శేషించిన పదార్థం ఈశ్వరుడే గదా. కాబట్టి అది ఒక్కటే ఇక సత్యం కావలసి ఉంటుంది.

అయితే దాని పాటికది కావాలి గాని ఇవి మిథ్య అయితే అది సత్యం కావటమేమిటి. ఏమో వీటి మాదిరి అదికూడా మిథ్యా భూతమే కావచ్చు గదా అని ఆశంక రావచ్చు. అలా కావటానికి వీలు లేదన్నారు శంకరులు. ఎందువల్లనంటే ఆ లెక్కలో మూడూ మిథ్యే కావలసి వస్తుంది. మూటికి మూడూ మిథ్య అయితే ఇక సత్యమైన దేమిటి. సత్యమైన పదార్థమే లేదంటావా అప్పుడివి మిథ్య అని చెప్పటానికి ప్రమాణమే Evidence లేకపోతుంది. ప్రమాణం లేకుండా ప్రమేయ Object మనేది

సిద్ధించదు. ప్రమేయమిక్కడ మిథ్యాత్వం. అది సత్యమైన తత్త్వమొక్కటైనా ఉంటేనే గాని దాన్ని ప్రమాణంగా తీసుకొని మిగతా వాటికి చెప్పటానికి లేదు. అన్నీ మిథ్య అయిన నాడిక దేన్ని పట్టుకొని దేనికి చెప్పాలా మిథ్యాత్వం. చెప్పలేకపోతే అదే సత్యమని ఒప్పుకోవలసి వస్తుంది. కాని జీవ జగత్తులను రెండింటినీ మనం మిథ్య అని ఇంతవరకూ సహేతుకంగా నిరూపణ చేసి కూచున్నాము. ఇక అవి ఏ పరిస్థితిలోనూ సత్యం కావటానికి లేదు. అలాంటప్పుడిక తద్వ్యతిరిక్తమైన ఈశ్వర తత్త్వమొక్కటే సత్యమని ఒప్పుకోక తప్పదు.

అసలు వీటి మిథ్యాత్వమే దాని సత్యత్వాన్ని మనకు చాటుతుందంటారు శంకరులు. అదేమిటి. మిథ్య అంటే లేదనిగదా చెప్పారు. లేని పదార్థాన్ని ఎలా సూచిస్తుందని ఆశ్చర్యపడనక్కరలేదు. లేనిదంటే బొత్తిగా లేనిదని గాదు అర్థం. బొత్తిగా లేనిదైతే అసలది మనకంటికే కనిపించేది కాదు. కనిపించే రూపమబద్ధమైనా దాని కాధారమైన దెప్పుడూ సత్యమే, సత్యమైన దాన్ని ఆధారం చేసుకొనే కనిపిస్తుంటుందీ అసత్యం. **"నహి మృగ తృష్ణి కాదయోపి నిరాస్పదా భవంతి"** ఎండ మావులలాంటివి కూడా నిరాధారం కావంటారు భగవత్పాదులు. దాని కాధారమైన సూర్యరశ్మి అక్కడ ఉండనే ఉంది. అలాగే ప్రస్తుత మీ జీవజగత్తులు మిథ్య అన్నామంటే వీటికాధారమైన ఈశ్వరచైతన్యమెప్పుడూ ఉంది. సత్యమైన ఆ చైతన్యాన్ని వదలకుండానే ఈ రెండూ మనకిలా భాసిస్తున్నాయి. దానికి దూరమైతే అసలివి భాసించనే లేవు. ఇంతకూ రహస్యమేమంటే ప్రతి ఒక్కటీ లోకంలో దానిపాటికది అసత్యమే అయినా దాని అధిష్ఠానం మేరకు మరలా అది సత్యమే. అంటే కార్యదృష్ట్యా మిథ్య-కారణ దృష్ట్యా సత్యమని భావం. అన్నింటికీ కారణమీశ్వర చైతన్యమని గదా ప్రతిపాదించాము. కాబట్టి నామరూపాదికమైన ఈ జగత్తంతా ఆ చైతన్య రూపంగా సత్యం తమ విశేష రూపాలుగా మిథ్యా అని అర్థం చేసుకోవాలి మనం. ఈ ధర్మసూక్ష్మాన్నే ఛాందోగ్య భాష్యంలో ఇలా బయటపెడతారు భగవత్పాదులు. **"సర్వంచ నామరూపాది సదాత్మనైవ సత్యమ్ స్వతస్తు అనృతమేవ"** నామరూపాదులన్నీ వాటిపాటికవి స్వతహాగా అనృతమే. సందేహంలేదు. కాని వాటినే సద్రూపంగా చూడగలిగితే మరలా అవే సత్యమవుతాయట.

ఇదుగో ఇదీ మిథ్య అనే మాటకు శంకర భగవత్పాదులిచ్చిన నిర్వచనం. ఈ సూక్ష్మం తెలియక శంకరుడు ప్రపంచాన్ని మిథ్య-మాయ- అని త్రోసిపుచ్చాడు

ఆయన ప్రచ్ఛన్న బౌద్ధుడు కేవలం శూన్యవాది అని నానావిధాల నిందిస్తున్నారు. శంకరుడెప్పుడూ శూన్యవాదికాదు. ఆ మాటకు వస్తే శూన్యవాదులు బౌద్ధులు. బౌద్ధుల శూన్యవాదాన్ని అదే పనిగా ఖండించారాయన, అలా స్వయంగా ఖండించి ఆయనే మరలా శూన్యవాదాన్ని చేపట్టటమా. అర్థంలేని మాట. శూన్యవాదమనేది కేవల మసద్వాదం. ఏదీ లేదని చెబుతుందది. పోతే శంకరుల దసద్వాదం కాదది సద్వాదం. అంతా ఉన్నదనే ఆయన సిద్ధాంతం. ప్రపంచమంతా సద్వివర్తమే. సద్వివర్తం గనుకనే ప్రతి ఒక్కదానిలో ఆ సత్తనే దాని స్వరూపమే మరలా మనకు సాక్షాత్కరిస్తున్నది. అణువు మొదలుకొని ఆకాశందాకాఎప్పుడు దేన్ని చూచినా మనం దాన్ని ఉన్నదనే చూస్తాముగాని లేదని చూడము. ఇదే సత్తనే దాని తత్త్వమన్నింటిలోనూ అంతర్లీనంగా ఉందనేందుకు దాఖలా. అసలీ నామరూపాది విశేషాలు కూడా దానికి చెందినవే. అదే. దానినే మనం నామరూపాదులుగా గ్రహిస్తున్నాము. కాబట్టి **"నాఽ సత్త్వమ్ కస్యచిత్క్వచి దితి బ్రూమః"** దేనినీ సృష్టిలో అసత్యమనిచెప్పగూడదంటారు శంకరులు.

అయితే ఇక ఆయన అసత్యమనేదేమిటి. అసత్యమనేది ఏదీ లేదు వాస్తవంలో సత్యమైన చైతన్యమే నామరూపాత్మకంగా భాసిస్తే ఆ భాసించే మేరకు దాని నసత్యమన్నాము. ఎందుకంటే అది ఈ చైతన్యం కంటే ఏదో విలక్షణమని నీవు చూస్తున్నావు. చైతన్య విలక్షణమైనదెక్కడ ఉంది సృష్టిలో. లేదనిగదా ముందు ప్రతిపాదించాము. అంచేత అలా లేని దాని నున్నట్టు భావించటమే అసత్యం. ఒక రజతాన్ని మనం శుక్తికగా Oyster చూస్తే అది రజతంగా సత్యమేగాని శుక్తికగా సత్యమని చెప్పలేవుగదా, అలాగే ఒక రూపంలో ఉన్నదాన్ని మరొక రూపంలో చూస్తే అది అసత్యమని చెప్పక తప్పదు. ప్రస్తుతం జీవజగత్తు లిలాంటి అసత్పదార్థాలె. పరిశుద్ధమైన బ్రహ్మచైతన్యాన్నే మన మా రూపంలో దర్శిస్తున్నాము కాబట్టి అసత్యమవి. కాని రహస్యమేమంటే అసత్యమైనా ఇవి సత్యమైన చైతన్యం తాలూకువే కాబట్టి వీటిని పట్టుకొని పోతే మరలా మనలనా చైతన్యం దగ్గరికే అవి తీసుకెళ్ళుతాయి. కనుకనే వీటి రెండింటి మిథ్యాత్వమే మనకా ఈశ్వరుడి సత్యత్వాన్ని సూచిస్తుందని చెప్పటం.

ఈ సూచనకే లక్షణమని పేరు పెట్టారు మన పెద్దలు. లక్ష్యాన్ని మనకు పట్టి ఇచ్చేదేదో అది లక్షణం. లక్ష్యమనేది ఈశ్వర చైతన్యమే. దాని అస్తిత్వాన్ని మనకు

చాటి చెబుతాయి కాబట్టి జీవ జగత్తులు రెండూ దానికి లక్షణమవుతున్నాయి. ఎలా అవుతాయని అడగవచ్చు. అది ఎలాగో ఇంతకు ముందే కొంత వర్ణించి ఉన్నాము. అయినా ప్రసంగం వచ్చింది కాబట్టి పాఠకుల సౌకర్యార్థం మరలా ప్రస్తావన చేయవచ్చు, తప్పులేదు.

జీవ జగత్తులలో జగత్తనేది దానికెలా లక్షణమో మొదట పరిశీలిద్దాము. దృష్టాన్ని బట్టి అదృష్టాన్ని ఊహించమన్నారు పెద్దలు. **"న హి దృష్టే అనుపపన్నమ్ నామ"** అన్నట్టు కనిపించే దాని విషయంలో మనకెప్పుడూ సందేహం లేదు. ఎటు వచ్చీ కనపించని ఈశ్వరుడి విషయంలోనే మనకు పట్టుకొన్న సందేహం. అది ఈ కనిపించే జగత్తును బట్టే మనం విచారణ చేసుకోవచ్చు. జగత్తంటే అది ఒక అచేతనమైన పదార్థం. అచేతనమెప్పుడూ దానిపాటికది భాసించలేదు. దాన్ని భావింపజేయటాని కొక చేతన పదార్థం కావాలి. ఆ చేతన పదార్థమే ఈశ్వరుడు. పోతే జగత్తనేది ఒక సంహతమైన Compound పదార్థం. అది ఒకటి కాదు. అనేక పదార్థాల కూడిక అది.ఎన్నో కలిసి ఒక పదార్థంగా ఏర్పడ్డాయి. అలాంటి సంహతమైన దెప్పుడూ తన కోసం కాదు. తనకు విలక్షణమైన మరొక అసంహతం Simple కోసమే ఏర్పడుతుంది. అలాంటి అసంహతమైన పదార్థమే ఈశ్వరుడు. అలాగే ఈ ప్రపంచమంతా సాపేక్షం. మరొక దాని అపేక్ష లేకుండా ఇందులో ఏదీ సిద్ధించదు. ఆ మరొక దాని కింకొక దాని అపేక్ష ఉంది. ఇలా ప్రతి ఒక్కటీ సాపేక్షమయినప్పుడేది గానీ ఎలా సిద్ధిస్తుంది. చూడబోతే ఇది చెట్టు ముందావిత్తు ముందా – అనే సామెత క్రిందికి వచ్చింది. అంచేత పరస్పర సాపేక్షమైన ఈ ప్రపంచం సిద్ధించాలంటే నిరపేక్షమైన తత్త్వమొకటి అంతకు ముందే సిద్ధించి ఉండాలి. అలాంటి నిరపేక్ష తత్త్వమే ఈశ్వరుడు. ఈ విధంగా జగత్తుకుండే లక్షణాలను బట్టే తద్విలక్షణమైన ఈశ్వర తత్త్వాన్ని మనం గ్రహించవచ్చు.

పోతే జగత్తు మాదిరే జీవుణ్ణి బట్టి కూడా గ్రహించవచ్చు ఈశ్వర సద్భావాన్ని. జీవుడంటే జ్ఞాన స్వరూపుడేనని గదా పేర్కొన్నాము. అయితే అది పరిమితమైన జ్ఞానం. అపరిమితం కాదు. అపరిమిత జ్ఞానమే ఈశ్వరుడంటే. అది ఈ పరిమిత జ్ఞానంలోనే మన మర్థం చేసుకోవచ్చు. పరిమితమనేది ఎప్పుడూ పరిపూర్ణమైన భావాన్నే సూచిస్తుంటుంది. ఒక నిప్పురవ మన కంటికి కనిపించిందంటే ఎక్కడో

ఒక అగ్నిహోత్రం ప్రజ్వలిస్తూ ఉండక తప్పదు. ఒక జల బిందువు మన ఒంటికి సోకిందంటే ఎక్కడో ఒక పెద్ద జలాశయం ఉండక మానదు. అలాగే మనబోటి ప్రాణికోటి కంతటికీ ఇప్పుడంతో ఇంతో చైతన్యమనేది తరతమ భావంతో కనిపిస్తూ ఉంది. కాష్ఠ లోష్టాదుల లాగా అసలు లేకపోలేదు. ఉంటే నిండి నిబిడీకృతమై తొణికసలాడటం లేదు. వెలితిగా కనిపిస్తూ ఉన్న ఈ జీవ చైతన్యాన్ని బట్టి చూస్తే రాశీభూతమైన ఒక మహాచైతన్యమేదో ఉండి తీరాలని సులభంగా మన మూహించ గలం. ఏతావతా తేలిందేమిటి. తమ పాటికి తాము కేవలం మిథ్యాభూతమే అయినా ఈ జీవజగత్తులు రెండూ – ఆ ఈశ్వరుడే సత్యమని చాటటానికి మరలా చక్కని సాధనాలుగా పని చేస్తున్నాయి.

అయితే ఈ రెండింటి లక్షణాన్ని బట్టి డొంక తిరుగుడుగా గ్రహించవలసిందేనా – లేక ఆ ఈశ్వరుడనే దానికొక స్వరూపమంటూ ఏదైనా ఉందా – అని మరలా ప్రశ్న వస్తుంది. ఉంది. స్వరూపమంటూ లేకపోతే మరొక దాని నిమిత్తంగా ఏర్పడే సిద్ధి అది సిద్ధేకాదు. ఉన్నట్టుండి ఆ నిమిత్తం తొలగిపోతే ఇదీ పోతుంది. అది మొదలు చెడ్డ బేరం. ఇలా మొదలు చెడ్డ బేరమయ్యే గదా జీవజగత్తులు రెండూ మిథ్య అని ఇంతకు ముందే మనం నిర్ణయించింది. అదే పొరబాటు మరలా ఈశ్వరుడి విషయంలోనూ జరిగితే ఏమి ప్రయోజనం. పైగా మిథ్యాభూతమైన జీవజగత్తులకు స్వరూప Essense మీశ్వరుడేనని చెప్పాము. అలాంటప్పుడా ఈశ్వరుడికే స్వరూపం లేదంటే ఏమి మర్యాద. జీవజగత్తులలాగా అది కూడా మిథ్య అయి మరొక దానిమీద ఆధారపడవలసి వస్తుంది ఇవి మూడూ గాక మరొక పదార్థమనేదే లేదు గదా సృష్టిలో. అంచేత ఎటు చూచినా జీవజగత్తుల లాగా స్వరూప రహితం కావటానికి లే దీశ్వరుడు. స్వతస్సిద్ధమైన Selfreliant తత్త్వం గనుక తప్పకుండా దానికొక స్వరూపమంటూ ఉండి తీరాలి.

అయితే ఏమిటా స్వరూపమని అడగవచ్చు. ఈశ్వరుడి స్వరూపమనే దేమిటో ఇంతకు ముందే ఏ కరువు పెట్టాము. శుద్ధమైన చైతన్యమే దాని స్వరూపం. **"శుద్ధమ్–బుద్ధమ్–ముక్త"** మని వర్ణిస్తారు శంకర భగవత్పాదులు. ఆకాశం శుద్ధమైన పదార్థమే. కాని బుద్ధం కాదది. అంటేజ్ఞానం లేదని అర్థం. పోతే జీవుడనే తత్త్వం బుద్ధమే. కాని ముక్తం కాదు. అది ఒక శరీరమనే ఉపాధికి బద్ధమయి ఉంది.

ఇలాంటి శరీర బంధం కూడా లేక సర్వతో వ్యాప్తమైనదేదో అది ముక్తం. భాష్యకారులు చేసిన ఉపనిషత్తులు చేసినవర్ణనకు ప్రతిధ్వని రూపమే. తైత్తిరీయమనే ఉపనిషత్తిలా వర్ణిస్తుంది. **"సత్యమ్-జ్ఞానమ్-అనంతమ్-బ్రహ్మ"** సత్యమూ జ్ఞానమూ అనంతమూ అయినదేదో అదే ఆ ఈశ్వర స్వరూపం. సత్యమంటే ఏమిటి. ఏ రూపంలో ఏది నిశ్చయిస్తామో ఆ రూపాన్ని వ్యభిచరించకపోతే అది సత్యం. వ్యభిచరిస్తే అనృతం. అనృతానికే వికారమని గూడా పేరు. **"వాచారం భణమ్ వికారో నామ ధేయమ్"** వికారమనేది కేవలం కనిపిస్తున్నదనే మాటేగాని **"మృత్తికే త్యేవ సత్యమ్"** మృత్తిక అనేదొక్కటే సత్యమన్నారు. దీనిని బట్టి సద్రూపమైన తత్త్వమే మిగతా వికారరూపమైన జగత్తుకంతా కారణమని చెప్పినట్టయింది. కారణమనే సరి కది మృత్తికలాగా ఒక జడ పదార్ధమేమోనని మరలా మనకు భ్రాంతి కలగవచ్చు. అంచేత దానిని జ్ఞానమని కూడా వర్ణించిందుపనిషత్తు. సత్యమేకాక అది జ్ఞానంకూడా. దీని మూలంగా అది ఒక మృత్తిక మాది రచేతనంకాదు చేతనమైన తత్త్వమని చాటి నట్టయింది. జ్ఞానమనేసరికి దానికి జ్ఞేయ Object of Knowledge మేమిటని మరలా ప్రశ్న రావచ్చు. ప్రతి జ్ఞానానికీ ఒక జ్ఞేయమనేది ఉండి తీరుతుంది. జ్ఞేయమంటే జ్ఞానానికి గోచరించే పదార్ధమే గదా. ఏదో ఒక పదార్ధం గోచరిస్తుంటేనే జ్ఞానమనేది దాన్ని గ్రహిస్తుంటుంది. ఏదీ గోచరించకపోతే దేనినని గ్రహిస్తుందది. గ్రహించకపోతే అది జ్ఞానమెలా అవుతుందని ప్రశ్న. దీనికి సమాధానమే అనంతమనే మూడవ మాట. అంతం లేనిదేదో అది అనంతం. అంతమంటే ఏమిటి. ఒక పదార్ధానికి విజాతీయమైన పదార్ధమెక్కడ ఏర్పడుతుందో అక్కడికది అంతం. ప్రస్తుతం జ్ఞానానికి విజాతీయమంటూ ఏదీలేదు. ఏదైనా ఉన్నట్టు కనిపిస్తే అది ఈ జీవజగత్తులు రెండే. జగత్తు కార్యం కాబట్టి దానికి భిన్నంకాదని ఇంతకుముందే నిరూపించాము. పోతే జీవుడు కేవలం చేతనుడే కాబట్టి దానికి విలక్షణంగా ఎప్పుడూ లేడు. రెండూ దానికి విజాతీయం కాకపోతే ఇక దానికంత మేముంది. అందుకే దాని ననంతమన్నారు.

సత్యం జ్ఞానమనంతమనే మూడు లక్షణాలూ కలియబోసుకొని చూస్తే చివరకది తప్ప మరి ఒక పదార్ధమేదీ లేదని బోధపడుతున్నది. ఏదీ లేకపోతే దానికిక ఈశ్వరుడనే పేరుకూడా చెల్లదు. ఈశితవ్య Commandable మైన పదార్ధముంటేనే ఈశ్వరుడు

Master. ఏమిటా ఈశితవ్యం. జీవుడూ-జగత్తూ. ఈ రెంటినీ ఈశనం చేసేవాడు గనుకనే అతడీశ్వరుడు. ప్రస్తుతమవి రెండూ దానికి భిన్నంగా లేనేలేవని గదా ప్రతిపాదించాము. అలాంటప్పుడిక దేనిమీద ఈశనం చేయాలది. కాబట్టి ఈశ్వరుడనే నామమే అప్పుడెగిరిపోతుంది. పోతే మరి ఏమని పేర్కొనాలి ఆ పదార్థాన్ని, బ్రహ్మమని పేర్కొనాలంటా రాచార్యులవారు. జీవజగత్తు లొకటి ఉన్నవని భావించి దాని నీశ్వరుడని వ్యవహరిస్తూ వచ్చామే గాని అసలు పరిశుద్ధమైన ఆ తత్త్వానికి బ్రహ్మమనే పేరు. బ్రహ్మమనే మాటకు మూడు భూమికలలో మూడు నిర్వచనాలు సెలవిచ్చారు జగద్గురువులు. **"బృహత్త్వాత్ బ్రహ్మ"** అన్నింటికన్నా పెద్దది కాబట్టి అది బ్రహ్మం. **"బృంహణ త్వాత్ బ్రహ్మ"** ఆకాశాదికమైన సమస్త ప్రకృతినీ తన గర్భంలో ఇముడ్చుకొనేది కాబట్టి కూడా అది బ్రహ్మం. అంతేకాదు. **"బర్హణత్వా ద్బ్రహ్మ"** అన్ని పదార్థాలనూ తనలో ఇముడ్చుకోటమే గాక వాటన్నిటినీ నిశ్శేషంగా తనలో లయం చేసుకోవటంవల్ల కూడా అది బ్రహ్మమే. **"నిశ్శేష సంసార బీజా విద్యా ద్యనర్థ నిబర్హణా"** త్తని భాష్యంలోనే సెలవిచ్చారు. ఇలా సజాతీయ విజాతీయాది భేదాలన్నీ లయమైపోతే ఇక మిగిలేది శుద్ధమైన చైతన్యమే. ప్రజ్ఞాన ఘనమని వర్ణించిం దుపనిషత్తు. సైంధవఘనంలాగా ప్రజ్ఞాన ఘనమది. ఒక లవణ పిండం ఎక్కడ ఏ కణం రుచి చూచినా అది లవణరసమే. అంతకుమించి రసాంతర స్పర్శలేదు దానికి. అలాగే ఈ బ్రహ్మమనేది కూడా విజాతీయ భావ సంపర్కమే మాత్రమూ లేని ప్రజ్ఞానైక రసస్వరూపం. అంచేత ఆ చైతన్యమనే దొక్కటే దాని స్వరూపమని గ్రహించాలి మనం.

సరే ఇంతవరకూ బాగానే ఉంది. కాని ఇలాంటి తత్త్వాన్ని మనం పట్టుకోట మెలాగా అని ఇప్పుడు ప్రశ్న. పైన చెప్పిన రెండు లక్షణాలూ ఉన్నాయి గదా అంటే అవి లక్షణమే గాని ప్రమాణం కాదు. లక్షణం వేరు. ప్రమాణం వేరు. లక్షణమొక పదార్థముందని దాని అస్తిత్వాన్ని మాత్రమే నిరూపిస్తుంది. పోతే ప్రమాణమలా కాదు. దాని స్వరూపం ఫలానా అని మన మనసుకు తెచ్చుకోటానికి తోడు పడుతుంది. లక్షణం పదార్థాన్ని పరోక్షంగా సూచిస్తే ప్రమాణం దాన్ని ప్రత్యక్షంగానే పట్టి ఇస్తుంది. ప్రమ అంటే జ్ఞానం. ప్రమకు సాధనం కాబట్టి అది ప్రమాణం. జ్ఞాన సాధనమని అర్థం. చక్షురాదులైన మన ఇంద్రియాలిటువంటి సాధనాలే. వాటి మూలంగా మనం రూపరసాది ప్రమేయాలనన్నింటినీ అనుభవానికి తెచ్చుకోగలుగుతున్నాము.

ప్రస్తుత మా స్వరూపాన్ని గ్రహించటానికి కూడా ఇలాంటి ప్రమాణమేమిటా అని మన అన్వేషణ.

ప్రమాణమేదీ దానికక్కరలేదంటారు భగవత్పాదులు. అచేతనానికైతే దానికొక ప్రమాణం కావాలి. ఎంచేతనంటే దానికి తానున్నాననే ప్రజ్ఞలేదు. పోతే ప్రస్తుత మీ బ్రహ్మమనేది అచేతనం కాదు. పరిపూర్ణమైన చేతన పదార్థమది. చేతనం గనుకనే తానున్నాననే ప్రజ్ఞ దానికెప్పుడూ ఉన్నది. అసలు ప్రజ్ఞాన స్వరూపమే అది "ప్రజ్ఞానమ్ బ్రహ్మ" అని ఉపనిషద్వాక్యం. అలాంటప్పుడిక దానికి ప్రమాణంతో పని ఏముంది. ప్రమాణమంటే తెలుసుకొనే సాధనమేనని గదా చెప్పాము. తెలుసుకొనే స్తోమత దానికే ఉన్నప్పుడిక సాధనం చేసే మేలేమిటి దానికి. జ్ఞానమే గదా దాని స్వరూపం. అలాంటి జ్ఞానానికి మరలా సాధనం దేనికి. అనావశ్యకం. జ్ఞానమంటే అది ఒక దీపంలాంటిది. దీపాన్ని వెలిగించటానికి మరి ఒక దీపమెలా అక్కరలేదో జ్ఞానానికి కూడా మరి ఒక జ్ఞానమక్కరలేదు. ఉంటుందని వాదిస్తే దానికేమిటి దానికేమిటని ప్రశ్న వస్తుంది. అది అనవస్థా దోషానికి Ad Infinitum దారి తీస్తుంది. కాబట్టి పారమేశ్వరమైన జ్ఞానం స్వతః ప్రమాణ Self evident మని ఒప్పుకోక తప్పదు.

స్వతః ప్రమాణమయితే అది ఇక ప్రమేయకోటినే Field of objectivity దాటి పోతుంది. ప్రమేయమంటే ఏదో ఒక ప్రమాణానికి గురికావటం. ఇలా గురి అవుతుంది గనుకనే ఈ లోకమంతా ప్రమేయమయింది. పోతే ఈశ్వరచైతన్యమలా కావటం లేదు కాబట్టి అది ప్రమేయం కాదు. అప్రమేయమే అవుతుంది. అప్రమేయ మయితే మరి దాన్ని పట్టుకోటమెలాగ. పట్టుకోలేకపోతే ఉందని చెప్పి ఇక ఏమి ప్రయోజనమని మరలా ప్రశ్న వస్తుంది. వేదాంతంలో ఇది చాలా గడ్డయిన ప్రశ్న. పదార్థమేమో ఉందని చెబుతున్నారు. కాని దాన్ని అనుభవానికి తెచ్చుకొనే మార్గం కనపడటం లేదు. ఏమిటి దీనికి పరిష్కారం. చూడబోతే దీనికి పరిష్కారమే లేదా అనిపిస్తుంది.

కాని జగద్గురువుల దృష్టి అనన్యాదృశం. పరిష్కారమే లేదనిపించే ఈ సమస్య కొక అమోఘమైన పరిష్కారాన్ని సెలవిచ్చారాయన. అది ఎలాగోచూతాము. బ్రహ్మమనేది దేనికీ ప్రమేయం కాదంటే అప్పటికి దానిపాటి కదే ఉందని అర్థం. దానిపాటికదే ఉందని ఎవరన్నారు. మరొక పదార్థమే లేదు గదా అనటానికి. కాబట్టి

దానిపాటికని పరోక్షంగా కాదు చెప్పవలసింది. నాపాటికి నేనున్నానని అపరోక్షంగానే అనుకోవాలది. చైతన్య స్వరూపమే కాబట్టి దానికి "నేను" అనే భావనేర్పడటాని కభ్యంతరం కూడా లేదు. అచేతనానికైతే ఏర్పడదు గాని దానికది సహజంగానే ఏర్పడుతుంది. అప్పటికి చైతన్యమంటే అది ఎప్పుడూ "నేను-నేను" అనే స్ఫురణే తప్ప మరేదీ గాదని అర్థమయింది. ఈ నేననే స్ఫూర్తి ఇప్పుడు మనలో ప్రతి ఒక్కరికీ ఉంది. ఇది మనకందరికీ అనుభవసిద్ధమే. మనలో ప్రతి క్షణమూ తోచే ఈ నేననే స్ఫురణకే ఆత్మ Self or subject అని పేరు పెట్టారు వేదాంతులు. అయితే ఇది ప్రత్యగాత్మ Individual self. అంటే మన పిండ శరీరంలోనే ఉండి నేను అనుకొనే ఆత్మ అని అర్థం. పోతే ఈ ఆత్మను బట్టి బ్రహ్మాండ శరీరాన్నంతటినీ వ్యాపించిన ఆత్మకూడా ఇలాంటిదేనని అర్థం చేసుకోవచ్చు మనం. ఇది ప్రత్యగాత్మ అయితే అది పరమాత్మ Universal Self అన్నారు. ఈ పరమాత్మే బ్రహ్మమనేది. అది కూడా ప్రత్యగాత్మ లాగా "నేను" అనే స్ఫురణ మాత్రమే కాబట్టి నాలాగే ఉంటుందని అనుభవానికి తెచ్చుకోవటం సులభమే.

అసలు ప్రత్యక్కని Inner పరాక్కని outer రెండుగా పేర్కొంటున్నామే గాని నిజంలో ఇన్ని ఆత్మలు లేవు. ఉన్నాయని చెబితే అందులో ఒకటి మరొక దానికి ప్రమేయం Object కావలసి వస్తుంది. ప్రమేయమైతే అది అనాత్మ Nonself అవుతుంది గాని ఆత్మకాదు. కాబట్టి ఆత్మ అనే దెప్పుడూ ఒక్కటే తప్ప రెండుండటానికి వీలులేదు. ఆ ఒక్కటీ కూడా ప్రత్య గ్రూపంగానే ఉండాలి గాని పరాగ్రూపంగా ఉండరాదు. పరాగ్రూపమైతే అది నాకు దూరమవుతుంది. నాకు దూరమైనప్పుడది నేనెలా అవుతాను. నేను గాకపోతే అనాత్మ అవుతుందే గాని ఆత్మ అనిపించుకొనే అర్హత లేదు దానికి. కాబట్టి ఆత్మ అనేదెప్పుడూ ఏకమే. అది ప్రత్యగ్రూపమే. అంటే నేను-నేనని ప్రస్తుతం మన అందరి అనుభవానికి వస్తున్న ఈ ప్రత్యగాత్మే అసలాత్మ అన్న మాట. అయితే ఆ పరమాత్మ అనేదేమిటింతకూ. పరమాత్మ అంటూ ఒకటి ఎక్కడా లేదు వాస్తవానికి. ప్రత్యగాత్మే ఆత్మ. అదే శరీరాద్యుపాధులతో మమేకమయి పోవటం మూలాన సంకుచితమయి భాసిస్తున్నది. సంకుచితమయ్యే సరికి ప్రపంచానికంతటటికీ అది సాక్షి కాలేకపోతున్నది. సాక్షి లేకపోతే ప్రపంచమసలుండనే లేదని పేర్కొన్నాము. అంచేత ప్రపంచానికంతా ఒక సాక్షి ఉండాలని చెప్పి దీని

కతీతంగా వేరొక ఆత్మ నూహించి దానికి పరమాత్మ అని పేరు పెట్టాము మనం. అది ఈ ఉపాధులున్నంతవరకూ మనకు దూరంగా ఎక్కడో ఉన్నట్టు భాసిస్తుంటుంది. ఎప్పుడీ ఉపాధులన్నీ లేవని మనం భావిస్తామో అప్పుడా దూరంగా కనిపించిన పరమాత్మే దగ్గరగా వచ్చి ప్రత్యగాత్మ గానే మన కనుభవమిస్తుంది.

ఇంతకూ ఈ గందరగోళానికంతా కారణ మీ ఉపాధి వర్గమే తప్ప మరేదీ గాదు. ఉపాధులంటే ఈ శరీరాది సంఘాతమేనని గదా చెప్పాము. త్వగింద్రియం దగ్గరి నుంచీ అహంకారాందాకా మనలను పూసుకొనిఉన్నదీ సంఘాతం. నిజానికిందులో ఏ ఒక్క అంశమూ నేను గాదు. నాకీ ఉపాధి లక్షణాలేవీ కానరావు. ఎప్పటి కప్పుడవి మారుతున్నా నేను మాత్రం మారకుండాఅలాగే నిలిచి ఉన్నాను. నేనుకూడా మారాలంటే అంతకు ముందున్న నా స్వరూపం పోయి క్రొత్తది రావాలి గదా. నాకున్న రూపమేమిటీ. నేననే స్ఫురణమే. అంతకుమించి మరేదీ లేదు. ఆ ఒక్కటీ పోతే ఇక నేననే దెక్కడ ఉంది. ఎక్కడా లేకుండా పోవాలి నేను. కాని అలా ఎప్పటికీ జరగదు. ఏ క్షణంలో ఎవడిని పలకరించినా నేనున్నాననే పలుకుతాడు గానిఎప్పుడూ నేను లేనని చెప్పలేదు. ఒకవేళ నీవు లేదనుకొన్నా అది లేకపోయేది కాదు. ఆగంతుకమైతే తొలగిపోవచ్చు గాని నీ స్వరూపమే అయినదెలా పోగలదు. పైగా ఎంతెంత లేదని భావిస్తే అంతంత బలపడుతుందది. అసలు లేదని భావించటానికైనా నీవుండి గదా భావించవలసింది. నీవుంటే ఇక నీ స్వరూపమున్నట్టే గదా. దేనినైనా వదులుకోగలం గాని మన స్వరూపాన్నే మనం వదలుకో లేము. వదలుకోవాలంటే వదలుకొనేదీ – వదలుకోబడేదీ కూడా అదే కావలసి వస్తుంది. అది ఆత్మాశ్రయ దోషం క్రిందికి వస్తుందంటారు శాస్త్రజ్ఞులు. అగ్ని తన్ను తాను కాల్చుకోలేదు. ఆటకాడు తన భుజాలమీద తాను నిలుచోలేడు. అలాగే ఆత్మకూడా తన్ను తాను కాదనుకోలేదు.

అయితే కాదనుకోకపోతే అది మనకెప్పుడూ అనుభవానికి రావాలి గదా. ఏదీ నిద్రలో రావటం లేదది. మూర్ఛలో రావటం లేదు. జ్వరంలో రావటం లేదు. మరి మరణంలోనైతే అసలే రావటం లేదే. స్వరూపమే అయినప్పుడు రావాలి గదా అని ఆక్షేపణ రావచ్చు. వాస్తవమే. రావటంలేదు. కాని ఆ రావటం లేనిదెవరికని అడుగుతున్నా రాచార్యులవారు. రాకపోవటమనేది ఒక అభావం Absence.

అభావమని  చెప్పటానికక్కడ సాక్షి ఏమిటి. ఏదో ఒక చైతన్యముండి గదా అది అభావమని గ్రహించవలసింది. చైతన్యమున్నదంటే ఇక ఆత్మ ఉందనే గదా అర్థం. చైతన్యమే గదా ఆత్మ అంటే. మరి అభావమనే మాట కర్థమేమిటి. ఆత్మ అభావం కావాలంటే ఆ అభావానికి కూడా అదే సాక్షి కావాలి. భావానికెలా సాక్షో అది అభావానికి కూడా అలాగే సాక్షి. కాబట్టి దాని కభావమెప్పుడూ చెప్పలేవు. చెప్పబోతే ఆ చెప్పేదే ఆత్మ అవుతుంది. అంచేత అది ఎప్పుడూ ఉంది.

ఎప్పుడూ ఉంది గనుకనే అది మనకెప్పుడూ అనుభవానికి వచ్చే తీరాలి. మరి మనకెందు కనుభవానికి రావటంలేదని గదా ప్రశ్న. వస్తూనే ఉంది. అసలు రాకపోవటమంటూ లేదు. మన స్వరూపమే అయినప్పుడెలా రాకపోతుంది. అంతో ఇంతో వస్తూనే ఉంది అనుభవానికి. కానీ రావలసినంత స్వచ్ఛంగానూ పరిపూర్ణం గానూ మాత్రమే రావటం లేదది. జాగ్రదవస్థలో అన్నిఇంద్రియాలు పని చేస్తుంటే అది బాగా మనకు సన్నిహితమయినట్టు తోస్తుంది. స్వప్నంలో ఇంద్రియ వృత్తులన్నీ లయమై మనసు మాత్రం పని చేస్తుంటే ఆమేరకుందని భావిస్తాము. మరి సుషుప్తిలో మనసుకూడా పని చేయక ఒక ప్రాణం మాత్రమే కదులుతుంటే అప్పుడంతవరకే అర్థం చేసుకొంటాము దాని అస్తిత్వాన్ని. పోతే ఇవన్నీఒక ఎత్తు చివరకు మరణమనే దొక ఎత్తు. ఆ దశలో ఇంద్రియాలేమిటి-మనస్సేమిటి- ప్రాణమేమిటి అన్ని వృత్తులు ఒక్కసారిగా ఆగిపోతాయి. దానితోఈ చెప్పిన ఉపాధులన్నింటితోనూ మనకు సంబంధం తెగిపోతుంది. అప్పుడీ ఆత్మకూడా వాటితో పాటే అభావమయి పోయినట్టు మన కనిపిస్తుంది.

ఈ విధంగా జీవితాంతమూ మనః ప్రాణాదులైన ఉపాధుల నెక్కడికక్కడ చూచి అవే నేనని భావించటంవల్లనే మన ఆత్మ మనకు పదహారు కళలలో భాసించటంలేదు. ఈ ఉపాధులే లేకపోతే మన ఆత్మకిక ఎలాటి అవధులూ ఉండబోవు. ఉపాధులుపాధులని మాటేగాని అసలీ ఉపాధులే గగన కుసుమాలనిచాటుతున్నది శాస్త్రం. ప్రపంచమంతా మిథ్య అని గదా తీర్మానించాము. అలాంటప్పుడీ శరీరాద్యుపాధులు మాత్రమెక్కడ ఉన్నాయి అవీ లేవు నిజానికీ. అయితే ఉన్నాయని భ్రమ పడుతున్నాము. కాబట్టి ఆ భ్రమ పోగొట్టుకోటమే మనం చేయవలసిన పని. అది పోతే చాలు. ఇక ఆత్మ బదులూ అనాత్మ బదులూ కూడా ఉన్నదొకే ఒక ఆత్మ

అని ఆకళింపుకు వస్తుంది. అది ఇక ప్రత్యక్కా-పరాక్కా- అని ప్రశ్నేముంది. అంతా మన స్వరూపమే అయినప్పుడిక ఏదీ మనకు బాహ్యంగా ఉండటానికి లేదు. జగత్తూ ఉండలేదు. ఆ మాటకు వస్తే ఈశ్వరుడూ ఉండలేడు. మనఅఖండ స్వరూపాన్ని గుర్తించనంతవరకే అవి రెండూ మనకు వేరుగా భాసించేది. గుర్తించగలిగితే అవి రెండూ మనలోనే చేరిపోతాయి. అప్పుడంతా కలిసి మనకు ప్రత్యగాత్మ రూపంగానే అనుభవానికి వస్తుంది.

దీనిని బట్టి మన మర్థం చేసుకోవలసిందేమంటే జీవజగత్తులనే ఉపాధులున్నంత వరకూ వాటి నీశనం చేసే చైతన్యమొకటి ఉండక తప్పదు. అప్పుడు దాని కీశ్వరుడని పేరు. ఆ జీవ జగత్తులు రెండూ మిథ్యాభూతమని ఎప్పుడు తేలుతుందో అప్పుడదే బ్రహ్మం. దానినే ఈ శరీరాదులకు వెలపల ఎక్కడో ఉందని మనం భావించినంత వరకూ అది పరమాత్మ. పోతే మన ఈ శరీరాదులు కూడా బాహ్య జగత్తులాగా మిథ్యే గదా అని నిశ్చయం చేసుకొని చూచామంటే అప్పుడీ జగత్తు లేదు. జీవుడూలేడు. పరమాత్మా లేదు. అంతా కలిసి చివరకు ఆత్మ స్వరూపమే. స్వరూపమే కాబట్టి అది ఎప్పుడూ అభావం కాదు. అభావం కాకపోతే అది నిత్యసత్యమైన పదార్థం. సజాతీయ విజాతీయ స్వగత భేద రహితమది. సజాతీయం దానికి జీవుడు. విజాతీయం జగత్తు. పోతే స్వగతమనేది దానికే ఉన్నవని భావించే నామరూపక్రియాది విశేషాలు. ఇవన్నీ అవిచారిత సిద్ధమేగాని సక్రమంగా విచారణ చేసి చూస్తే అంతా దాని స్వరూపమే. కనుక దాని కభిన్నమే. దానికి భిన్నంగా ఇక ఏది ఉందని భావించినా అది కేవలం మిథ్యా భూతమేనని చివరకు తీర్మానం.

## సారాంశం

ఇక్కడికి సత్యమనే రెండవ విభాగాన్ని కూడా విమర్శించి చూచాము. దీనితో సత్య మిథ్యా విచారణలు రెండూ కూడా సమాప్తమయినట్టే. పోతే ఇంతవరకూ జరిగిన మీమాంస కంతటికీ సారాంశమేమిటని ఇప్పుడు ప్రశ్న. జీవుడూ-జగత్తూ-ఈశ్వరుడూ నని మూడు పదార్థాలు పరస్పర భిన్నంగా కనిపిస్తున్నాయి మన దృష్టిలో. మూడూ దేనిపాటికది సత్యమే నని కూడా మనం భావిస్తుంటాము. ఇది కేవలం మన లోకానుభవమే గాని శాస్త్ర ప్రమాణం వల్ల ఏర్పడింది కాదు. శాస్త్రానికి శాస్త్రమైన

వేదాంతాన్ని బట్టి విచారణ చేయగా సత్యంగా ఉన్నదొక్క ఈశ్వర చైతన్యమేనని దానికి భిన్నంగా సృష్టిలో మరేదీ లేదని స్పష్టమయింది. జీవజగత్తులు భిన్నంగా కనిపిస్తున్నా అది అవిచార మూలకమే కాబట్టి కేవలం మిథ్యాభూతమేనని కూడా ఋజువయింది. అలాగే సత్యమైన ఆ చైతన్యం మనకెక్కడా గోచరించటం లేదంటే అది సాక్షాత్తూ మన ఆత్మ స్వరూపమే కాబట్టి నిత్యమూ అనుభవానికి వస్తూనే ఉందని కూడా నిరూపణ అయింది. మొత్తం మీద అఖండమైన ఆత్మ చైతన్యమొక్కటే ఉంది సృష్టిలో. మరొకటేదీ లేదు. జీవుడూ లేడు- జగత్తూ లేదు. ఉందని చెప్పినా అది కేవలం మిథ్యాభూతమే. ఎంత లేదని వాదించినా ఇది ఎప్పటికీ సత్యమేనని సారాంశం.



# 2. వ్యావహారికం-పారమార్థికం

కడచిన అధ్యాయంలో మన మఖండమైన బ్రహ్మ చైతన్యమొక్కటే సత్యమనీ దానికి భిన్నమైన పదార్థం మరి ఏదీ లేదనీ నిర్ధారణ చేశాము. అలాంటప్పుడు న్యాయమైతే మనకిక సృష్టిలో ఏదిగానీ అగపడగూడదు. అయినా ఒక జీవుడనీ, జగత్తనీ, నిత్యమూ అనుభవానికి వస్తూనే ఉన్నాయి. ఎంత మిథ్య అని భావించినా అవి మన అనుభవానికి రావటం మానలేదు. అనుభవాన్ని కాదని ఎలా త్రోసిపుచ్చగలం. అది కేవలం ఆత్మవంచన అవుతుంది. అలాగని శాస్త్రప్రమాణాన్నే కాదందామంటే అది సక్రమంగా విచారణ చేసి తెల్చుకొన్న సిద్ధాంతం. ఎలా కాదనగలం. పోనీ రెండింటినీ పరిగ్రహిస్తే సరిపోదా అంటే అవి రెండూ పరస్పర విరుద్ధమయి కూచున్నాయి. కొంచెమైనా పొందికలేదు వాటికి. ఈ పరిస్థితిలో వీటి రెండింటినీ మనమెలా సమన్వయించుకోవాలని ప్రశ్న వస్తుంది.

## సమన్వయం

శంకరులీ ప్రశ్నను చాలా దూరమాలోచించారు. చూడబోతే ఇది ఎగదీస్తే బ్రహ్మహత్య, దిగదీస్తే గోహత్య అన్నట్లున్నది. ఇటు లోకానుభవాన్నీ కొట్టి వేయలేము. అటు శాస్త్రాన్నీ కాదనలేము. అయితే శాస్త్రమనేది లోకానుభవం కన్నా ప్రామాణికమని చెప్పారు గదా అని అడగవచ్చు. ప్రామాణికమే. సందేహం లేదు. కాని అది మానవుడి అనుభవానికి వచ్చినప్పటి మాట. శాస్త్రమనుభవానికి వచ్చినప్పుడే మనం లోకానుభవాన్ని కాదనగలిగేది. అంతవరకూ అది కేవలమొక సిద్ధాంతం మాత్రమే. సిద్ధాంత బలంతోనే నిత్యమూ నలుగురికీ కలిగే అనుభవాన్ని కొట్టివేసే అధికారం మనకు లేదు. ప్రస్తుతం మనకందరికీ ఈ ప్రపంచమనే దొకటి కనిపిస్తూ ఉంది. కనిపిస్తూ ఉన్నదాన్ని కాదని ఎలా అనగలం. కాదంటే అది మన అనుభవాన్నే కప్పి పుచ్చినట్టవుతుంది గదా. అనుభవాన్ని కప్పి పుచ్చటంకన్నా అపహాస్య మేమున్నది.

ఇలాంటి అపహాస్యత పాలయిన వారే బౌద్ధులలో ఒక శాఖవారైన విజ్ఞాన వాదులు. మానవుడి విజ్ఞానాన్ని మించి బాహ్యంగా మరే పదార్థమూ లేదు. ఉన్నదంతా అంతరమైన విజ్ఞానమేనని వాదిస్తారు. ఒకప్రక్క మీరు బాహ్యమైన ప్రపంచమొకటి

చూస్తూనే అది లేదని ఎలా వాదిస్తారని వారికి చీవాట్లు పెట్టారు శంకర భగవత్పాదులు. అయితే శంకరుల మాయా వాదం కూడా ఇదే గదా అని మన కనుమానం కలగవచ్చు. ఇలాంటి అనుమానం మనకే గాదు. అనేకమంది మాతాచార్యులకే కలిగి ప్రచ్ఛన్న బౌద్ధుడని పేరు పెట్టి ఆయనను పరిహసించారు కూడా. కాని నిజమాలోచిస్తే బౌద్ధుల విజ్ఞానవాదం వేరు. శంకరుల మాయావాదం వేరు. రెంటికీ పర్వత సర్షపాలకున్నంతటి తేడా ఉంది.

విజ్ఞానవాదులు ప్రపంచమసలు లేనే లేదు పొమ్మన్నారు. శంకరులు లేదని ఎప్పుడూ చెప్పరు. ఈశ్వర చైతన్యానికి భిన్నంగా లేదని మాత్రమే ఆయన చెప్పిన మాట. అంటే అర్థం. ఈ ప్రపంచం ఘటపటాది రూపంగా లేదనే గాని చైతన్య రూపంగా అది ఎప్పుడూ ఉండనే ఉంది. అయితే ఆ రూపంగా భావించి చూడటం లేదు మనం. దానికి బదులు ఘట పటాది రూపంగానే దర్శిస్తున్నా మీ ప్రపంచాన్ని. ఊరక దర్శించటమే కాదు. అదే సత్యమని దానితో ప్రతి క్షణమూ వ్యవహరిస్తున్నాము. తన్మూలంగా కలిగే సుఖదుఃఖాదులు కూడా యధార్థంగానే ఉన్నవని అనుభవిస్తున్నాము అయినా ఇది ఆ బ్రహ్మచైతన్య వివర్తమే కాబట్టి అదే ఈ రూపంలో కనపడుతూ ఉంది కాబట్టి ఆ మేరకీ వ్యవహారం కూడా ఉందనే ఒప్పుకోవలసి వస్తుంది. అసలే లేదని త్రోసి వేయరాదు. పైగా ఇది ఒక నా నీ అనుభవం కాదు. లోకంలో ముప్పాతిక మూడు పాళ్ళమంది అనుభవం. నీవు కాదన్నా మరొక డనుభవిస్తూనే ఉంటాడు. కాబట్టివాళ్ల అనుభవం మేరకైనా తాత్కాలికంగా ఈ వ్యవహారముందని మనం ఒప్పుకోవలసిందే నంటారు శంకరులు.

ఇలా వ్యవహారం నిమిత్తంగా ఒప్పుకొన్నది కాబట్టి దీని కాయన వ్యావహారిక సత్యమని Relative truth నామకరణం చేశారు. వ్యవహారిస్తూ ఉన్నంత వరకూ సత్యమని ఏది భావిస్తామో అది వ్యావహారిక సత్యం. జీవజగత్తులనేవి రెండూ ఇలాంటి ఒక వ్యావహారికమైన సత్యమే. అయితే ఎంత సత్యమని చాటినా అది కేవలం మన బోటి మానవుల అనుభవాన్ని బట్టి చెప్పటమే గాని వస్తు స్వభావాన్ని బట్టి కాదు. వస్తువక్కడ ఏమిటా అని పరిశీలిస్తే మాత్రం జీవుడూ లేడు. జగత్తూ లేదు. రెండింటి బదులూ ఉన్నదొక్క ఈశ్వరుడే మరలా. దీనికే ఆయన పారమార్థిక సత్యమని Absolute truth పేరు పెట్టారు.

అయితే వ్యావహారికమనీ, పారమార్థికమనీ సత్యాన్ని రెండుగా విభజిస్తే అది మన అద్వైత సిద్ధాంతానికే ముప్పు గదా అని మరలా ఆక్షేపణ రావచ్చు. అద్వైతానికెప్పుడూ అలాంటి ముప్పు లేదు. సత్యమనేది దానిపాటికది స్వయంగా విభక్తమయి ఉంటే మనమలా శంకించటం న్యాయమే. కాని అది స్వయంగా ఏర్పడిన విభాగం కాదు. కేవలం లోకదృష్టిని బట్టి ఏర్పరచుకొన్న విభాగమేనని చెబుతున్నాము. అలాంటప్పుడది వాస్తవమెలా అవుతుంది. వాస్తవం కానప్పుడది వస్తువునేమీ చేయలేదు. ప్రస్తుత మాకాశంలో మన దృష్టి దోషం మూలంగా ఒక మాలిన్యాన్ని చూస్తున్నాము. అంతమాత్రాన అది నిర్మలమైన ఆకాశాన్ని మలినం చేయగలదా. ఆకాశ మాకాశమే. దానిని మనం మలినంగా చూస్తున్నా ఆ మాలిన్యమక్కడ లేదు. మన దృష్టి దోషమే అది.

అలాగే వ్యావహారికంగా భాసిస్తున్న ఈ జీవ జగత్తులు కూడా నిజంలో లేవు. మన దృష్టి దోషం కారణంగా ఉన్నట్టు భాసిస్తున్నాయి. అంతమాత్రమే. అంచేతనే వీటి మూలంగా పారమార్థికమైన అద్వైత తత్త్వానికి ఎలాటి హానీ లేదు. హాని లేదు సరిగదా - ఇలాంటి విభాగమొకటి తాత్కాలికంగా చేయటం వల్ల జటిలమైన అనేక సమస్యల నతి సులభంగా పరిష్కరించగలిగారు జగద్గురువులు. వ్యావహారికమని చెప్పి ఆయన మనందరికీ కలిగే లోకానుభవాన్నీ సమర్థించారు. అలాగే పారమార్థికంగా ఉన్నదొకే ఒక సత్యమని చాటి శాస్త్ర సిద్ధాంతాన్నీ నిలబెట్టారు. ఇలా రెంటినీ రెండు భూమికలలో సమర్థించి పరస్పర వైరుధ్యం లేకుండా సమన్వయించటంలోనే ఉన్నదాయన గారి అసాధారణమైన ప్రతిభ.

# సృష్టి విచారం

అయితే అప్పటికీ మనమింకా ఒక సమస్యకు జవాబు చెప్పవలసి వస్తుంది. అదేమిటంటే నిజంలో ఎప్పుడూ ఉన్నదొక్క పారమార్థికమే గదా. అది ఏకమేగాని అనేకం కాదుగదా. అలాంటప్పుడనేకంగా అది ఎలా మారిపోయింది. మారిపోవటం వల్లనే గదా జీవజగత్తులనేవి రంగంలోకి వచ్చింది. అలా రాకపోతే మన మీ వ్యావహారికమనే విభాగమే చేయవలసిన అగత్యం లేదు గదా. కాబట్టి మనమలా

చేయవలసి వచ్చిందంటే అప్పటి కావస్తు స్వభావంలోనే ఒకానొక దౌర్బల్యం ఉండి తీరాలని ప్రశ్న వస్తుంది.

వాస్తవమే. వస్తు స్వభావంలోనే In its very nature ఉంది అలాంటి దోషం. సందేహం లేదు. దీనికొక దృష్టాంతం కూడా మనవి చేస్తాను. మనం చీకట్లో నడిచి పోతుంటే కొంతదూరాన మనకంటికొక తెల్లని పొడుగు పాటి పదార్థంకనిపిస్తుంది. అది చూచి వెంటనే మనం పామని భయపడతాము. వాస్తవానికది పాము గాదు. త్రాడు. త్రాడు త్రాడు లాగా ఉండక పాములాగా ఎందుకు భాసించింది. అలా భాసించే స్వభావం దానికుండటం మూలాన్నే గదా. పాముకుండే లక్షణాలు కొన్ని త్రాడుకున్నాయి. సన్నగా తెల్లగా పొడుగ్గా ఉండటం పాముకుండే స్వభావం. అదే త్రాడుకూ ఉంది. అందుకే దీన్ని చూడగానే అది జ్ఞప్తికి వచ్చింది. ఇలాంటి జ్ఞప్తి మనకే పీటనో చేటనో చూస్తే రాదు. త్రాటిని చూచినప్పుడే వస్తున్నది. అలా వస్తున్నదంటే ఏమిటి దానికి నిమిత్తం. త్రాడులో మాత్రమే అలాంటి స్వభావం ఉండటంవల్ల మరేదీ గాదు. అదే పామనేది వస్తుతః అక్కడ లేకపోయినా ఉన్నట్టు భాసింపజేసింది. మిగతా వస్తువులలో ఆ స్వభావం లేదు కాబట్టి భాసింపజేయలేదు. అప్పటికి ఒక వస్తువు మరొక వస్తువుగా భాసిస్తున్నదంటే దానికి నిమిత్త మావస్తు స్వభావమేనని తేలిపోయింది.

ఇలాంటి ఒకానొక స్వభావమే ప్రస్తుత మా ఈశ్వరుడికి కూడా ఉంది. దానికే ప్రకృతి అనీ, మాయ అనీ, శక్తి అనీ, ఇంతకు ముందు మనం పేర్కొని ఉన్నాము. ప్రకృతి అనే మాటకు స్వభావమనే గదా అర్థం. ఇలాంటి స్వభావమొకటి ఉండటం మూలాన్నే అదే మనకీ జీవ జగద్రూపంగా భాసిస్తున్నది. భాసిస్తున్నదంటే కార్యరూపమైన వీటి రెండింటి లక్షణాలూ మూలకారణమైన దాని మాయాశక్తిలోనే అంతర్లీనమై ఉన్నాయన్న మాట. పాము లక్షణాలు త్రాడులో ఎలా అంతర్లీనమై ఉన్నాయో అలాగే ఉన్నాయి అవి. **"తే యదంతరా తద్బ్రహ్మ"** అని శాస్త్రమే ఘోషిస్తున్నది. అంతేకాదు. ఈశ్వరుడి శక్తి ఎప్పుడయిందో అప్పుడది ఈశ్వరుడిలాగా పరిపూర్ణమే కావాలి గాని అపరిపూర్ణం కాగూడదు. అంటే ఎలాగంటే అలా మారిపోయే లక్షణాలన్నీ దానికుండి తీరాలని భావం. **"పరాస్యశక్తి ర్వివిధైవ శ్రూయతే"** అని ఇంతకు ముందు ప్రతిపాదించాము.

పైగా మరొక విశేషమేమంటే ఈశ్వరుడికున్న ఈ శక్తి మిగతా లౌకిక పదార్థాలకుండే శక్తిలాంటిది కాదు. మృత్సువర్ణాది పదార్థాలకు కూడా శక్తి ఉంది లోకంలో. దానితో అవి కటక కుండల కేయూరాదులైన ఆభరణ విశేషాలుగానూ మారిపోగలవు. కానీ వచ్చిన ఇబ్బంది ఏమంటే అలా మారిపోతున్నట్టు వాటికేమాత్రమూ గుర్తింపు లేదు. కారణం అవి కేవలమూ అచేతనమైన పదార్థాలు కావటమే. మరి చేతనమైన జీవజాలం కూడా ఉంది ఈ లోకంలో. జరాయుజాదులైన ఈ జీవులకు కొంత శక్తి ఉన్నా అది ఉన్నట్టు వారు గమనించగలిగినా ఆ శక్తిఅనేది ఎంతోగాదు. అది ఆయా జీవులకు ప్రతినియతమూ Individually fixed పరిచ్ఛిన్నమూ Limitted అయి ఉంటుంది. కాబట్టి అదీ చెప్పుకోదగిన విషయం కాదు. పోతే ప్రస్తుతం మనం చెప్పుకొనే ఈశ్వరుడి విషయం అలాంటిది గాదు. ఈశ్వరుడు మృత్సువర్ణాదుల మాదిరి అచేతనుడు కాదు. చేతనుడైనా జీవుడి మాదిరి అపరిపూర్ణుడు కాడు. పరిపూర్ణ చేతను డాయన. ఆయన శక్తికూడా పరిపూర్ణమే. పరిపూర్ణమైన ఆ శక్తి Infinite power ఒకటి తన కధీనమై ఉన్నదని గుర్తించగలడు. దానిని వశీకరించుకొని చిత్ర విచిత్ర భూమికలు forms ధరించినట్టు మరలా తాను అనుసంధానం చేసుకోనూ గలడు. మూడు దశలలోనూ బాహ్యమైన సామగ్రిని దేనినిగానీ అపేక్షించబోడు. అలాంటప్పుడా ఈశ్వరుడీ సృష్టినంతా అసహాయంగా నిర్వహించాడని చెప్పటంలో ఆశ్చర్యమేముంది. ఆయన మాయాశక్తి విలాస మలాంటిది. అదే ఈ చరాచర ప్రపంచాన్నంతటినీ ఒక చిత్రపటంలాగా తీర్చిదిద్దింది.

అయితే ఇప్పుడు ఉన్నట్టుండి మరలా మనం పొగలోనుంచి సెగలోవచ్చి పడ్డట్టయింది. సృష్టిని సమర్థించబోయి మనం స్రష్టకే Creator ముప్పు తెచ్చిపెట్టాము. చరాచర సృష్టినంతా తన మాయాశక్తి సహాయంతో ఆ ఈశ్వరుడే గదా సృష్టించాడని పేర్కొన్నాము. అలాంటప్పుడీ సృష్టిలోని అవక తవకల కన్నింటికీ ఆయనే ఇక జవాబుదారీ వహించవలసి వస్తుంది. సృష్టిలో మనకు ముఖ్యంగా కనపడే అవక తవకలు రెండే. ఒకటి వైషమ్యమూ, మరొకటి నైర్ఘృణ్యమూ అన్నారు బాదరాయణులు. వైషమ్యమంటే అన్నీ ఒక తీరుగా లేకపోవటం చూడండి. ఈ సృష్టిలో స్థావరాలూ, జంగమాలూ అని రెండు జాతులు. అందులో స్థావరాలైన వృక్షలతా గుల్మాదులు కదలలేవు, మెదలలేవు. వాటికీ మనలాగే ప్రాణముంది.

అన్నపానాది క్రియలున్నాయి. కానీ మనలాగా ఎక్కడికీ పోలేవవి. ఎవరు తమ్ము బాధించినా ఏమీ చేయలేవు. పోతే ఇక మనబోటి జంగమాలున్నాయి. వీటిలోనూ జరాయుజాలనీ, అండజాలనీ, స్వేదజాలనీ ఒకటిగాదు ఎన్నో జాతులు. ఒక్కొక్క జాతిలో అర్బుదన్యర్బుదాలు జీవరాసులు. అందులోనూ ఒకదానికి మరొక దానికి సంబంధమే లేదు. దేని శరీర నిర్మాణం దానిది. దేనిప్రవృత్తులు Tendencies దానివి. అంతా ఒక పారమేశ్వరమైన సృష్టి అయినప్పుడింత వైషమ్యమేర్పడటానికి నిమిత్తమేమిటి. ఇంత ఉచ్చావచంగా ups & downs సృష్టి జరిగిందంటే అది ఎంత వైషమ్యం.

పోతే ఇక నైర్ఘృణ్యమనే దోషం. దాని కసలంతే లేదు సృష్టిలో. నైర్ఘృణ్యమంటే నిర్ఘృణత్వం లేదా నిర్దయ. కేవలం వైషమ్యం వరకే గాదు. దానితోపాటు దయా దాక్షిణ్యాలు కూడా లేవా పరమేశ్వరుడికి. లేకపోతే ఇంత విషమంగా సృష్టించి ప్రాణికోటి కిన్ని బాధలు తెచ్చిపెట్టడు. బాధపడని జీవే లేదు గదా సృష్టిలో. మనలాంటి మానవుల మాట అలా ఉంచి మూగజీవులైన పశుపాక్ష్యాదులమాట ఏమిటి. అంతకన్నా నికృష్టంగా బ్రతికే స్థావరాల పరిస్థితి ఏమిటి. ఒకదానికన్నా ఒకటి కన్నా కష్టంగా బ్రతుకుతున్నాయి. రోలు పోయి మద్దెలతో మొరపెట్టుకొన్నట్టు ఒకదాని వేదన నొకటి ఆర్చలేదు. తీర్చలేదు. **'శోచ్యఃకమను శోచసి'** అన్నారు వ్యాసభగవానులు. నీవే శోచనీయుడవయి మరొకరికి శోకోప శమనం చేసేదేమిటి. మనకు కలిగే ఆ శోకమైనా ఒక రకం కాదు. మూడు రకాలు. ఆధిభౌతిక, మాధ్యాత్మిక, మాధిదైవికం. దీనికే తాపత్రయమని నామకరణం చేశారు. ఈ త్రయంలో ఏదో ఒకటి మనమీద దాడి చేయని క్షణమంటూ ఎప్పుడూ ఉండబోదు. ఈ త్రిపురాసురులు పెట్టే హింస ప్రతి ఒక్క ప్రాణీ భరించవలసిందే. తప్పటం లేదు.

ఈ రీతిగా ఇంత విషమమూ, ఇంత నిర్ఘృణమూ అయిన విధానంలో ఈ సృష్టి జరిగిందంటే దీనికంతటికీ ఎవడు బాధ్యుడు. సృష్టికర్తఅయిన ఆ ఈశ్వరుడే గదా. మరి ఈశ్వరుడంటే పరిశుద్ధమూ, పరిపూర్ణమూ అయిన ఒకానొక తత్త్వమని గదా ప్రతిపాదించారు. పరిశుద్ధమైతే దానికింత మంది ప్రాణుల నిలా నిష్కారణంగా బాధించాలనే కక్ష దేనికి. పరిపూర్ణమైతే అసలింతమంది ప్రాణులనింత ఉచ్చ నీచాత్మకంగా సృష్టించటం దేనికి. ఏవం విధమైన రాగద్వేషాలకు గురి అయిన

వాడస లీశ్వరుడెలా అవుతాడు. వాడూ మనలాంటి ఒక జీవుడే కావలసి వస్తుంది. మహా అయితే జీవులలోనే సర్వశక్తులూ అలవడిన ఒక పెద్ద జీవుడంత మాత్రమే. అని ఒక పెద్ద ఆక్షేపణ.

ఈ ఆక్షేపణకు శంకర భగవత్పాదులు చెప్పే సమాధానమిది. సృష్టిలో వైషమ్య నైర్ఘృణ్యాలున్నాయనే మాట వాస్తవమే. ఈ సృష్టి చేసిన వాడా పరమేశ్వరుడనే మాటకూడా వాస్తవమే. కానీ ఎంత వాస్తవమైనా తన పాటికి తాను నిరంకుశంగా సాగించలేదీ సృష్టి నా ఈశ్వరుడు. అలా నిర్నిమిత్తంగానే సాగించి ఉంటే దీని దోషమాయన మెడకు గట్టిగా చుట్టుకొనేదే సందేహం లేదు. కాని నిమిత్తమనే దొకటి ఉంది దీనికి. మనమింతకు పూర్వమొక విషయం చెప్పుకొన్నాము. ఎప్పుడైనా ఒక వస్తువు మరొక వస్తువుగా భాసిస్తుందంటే దానికి నిమిత్త మావస్తు స్వభావమేనని కేవల మా వస్తుస్వభావమే గాదు. ఆ మాటకు వస్తే దాని నలా దర్శించే మానవుడి దృష్టికూడా అందుకు నిమిత్తమే. రెండూ ఒసగూడినప్పుడే అలా భ్రమ పడటాని కాస్కార మేర్పడుతుంది. ఆ రెంటిలో ఏ ఒకటి లోపించినా అది సంభవం కాదు. ఇదీ మనం గ్రహించవలసిన రహస్యమిక్కడ.

ఇంతకు ముందిచ్చిన ఉదాహరణనే మరలా మనమిప్పుడు పరిశీలించి చూతము. త్రాడనేది పాముగా ఎందుకు భాసించింది. దానిలో పాము లక్షణాలు కొన్ని ఉండటంవల్లనని గదా పేర్కొన్నాము. అలాగే మనం దాన్ని పామని అపోహపడి చూడటంవల్ల కూడా అలా భాసించి ఉండవచ్చు. మనం చూడకపోతే లక్షణాలున్నా అది అలా భాసించబోదు. త్రాడు త్రాడుగానే కనిపించేది. ఇంతెందుకు. చీకట్లోపోయే ప్రతివాడికీ త్రాడు పాములాగా కనిపిస్తుందా. లేదు. ఎవడు పామని భ్రమిస్తే వాడికి మాత్రమే అలా భాసిస్తుంది. మిగతా వారందరికీ మరలా అది త్రాడే. కేవలమది వస్తుస్వభావమే అయితే అందరి దృష్టికీ ఒకలాగే భాసించాలి గదా. ఒకరికి పాముగా ఒకరికి త్రాడుగా ఎందుకు గోచరిస్తున్నది. కాబట్టి వస్తుస్వభావమనేది ఒక్కటేగాదు నిమిత్తం. వస్తు స్వభావమూ, మన అజ్ఞానమూ, రెండూ కలిసి నిమిత్తమవుతాయి. అలా కాకపోతే ఎంత మారే స్వభావమున్నా వస్తువు వస్తువుగానే ఉండిపోతుంది గాని మరొక వస్తువుగా మారిపోవలసిన అగత్యం లేదు దానికి.

దీనిని బట్టి మనమర్థం చేసుకోవలసిందేమంటే ఆ ఈశ్వరుడికి కూడా చిత్ర విచిత్రంగా పరిణమించే స్వభావమెంత ఉన్నా తనపాటికి తానెప్పటికీ మారబోడు. ఎందుకంటే స్వభావమొక్కటే చాలదలా మారటానికి. మరొక నిమిత్తం కూడా దానికి జతపడాలని చెప్పాము. మరి ఆ నిమిత్తమేమిటని అడగవచ్చు. అది ఏదో గాదు. మనందరికీ అంటిపట్టుకొని ఉన్న అజ్ఞానమే. మనకున్న ఈ అజ్ఞానమనేది నిమిత్తంగా చేసుకొనే ఆ పరమేశ్వరుడీ సృష్టి అనే నాటకాన్ని ఇలా ప్రదర్శిస్తున్నాడు. మరో మాటలో చెబితే మానవుడజ్ఞాన దృష్టిలో చూస్తుంటే ఈ సృష్టి ఇలా చిత్ర విచిత్రంగా భాసిస్తున్నది.

దీనికొక అద్భుతమైన దృష్టాంతాన్ని మనకు వర్ణించి చెబుతారు భగవత్పాదులు. మనదేశంలో ఇంతకు పూర్వమింద్రజాలమనే విద్య ఒకటి బాగా ప్రచారంలో ఉండేది. అందులో రజ్జుక్రీడ Rope-Trick అనేది ఒక భాగం. ఒక లావుపాటిమోకు నాకాశంలోకి విసరి ఐంద్రజాలికుడొకడు దానిని పట్టుకొని ప్రాకిపోతాడు. చూపుమేర దూరం దాటిపోయి కొంతసేపటికి వాడు తన పరికరాలతో సహా చెక్కలు ముక్కలై క్రిందబడతాడు. అలాపడి మరలా కొంతసేపయిన తరువాత యథాపూర్వంగా లేచి నిలబడతాడు. ఇలాంటిదీ వాడు ప్రదర్శించే విద్య.

ఈ విద్య నెన్నిమార్లు తిలకించారో ఆ పరమహంస పరివ్రాజకులు. ఎక్కడ బడితే అక్కడ తన భాష్యంలో దాని నుదాహరిస్తారు. అందులోనూ ఒక్కొక్క సందర్భంలో ఒక్కొక్క రహస్యాన్ని తద్ద్వారా బయటపెడతారు. ప్రస్తుతాంశానికి సంబంధించిన అలాంటి రహస్యమేమిటో ఇప్పుడు పరిశీలిద్దాము. ఈశ్వరుడనేవాడొక ఐంద్రజాలికుని వంటివాడు. వాడాకాశంలోకి విసరిన మోకులాంటిదీ సృష్టి అంతా. దీనినెప్పుడూ విడవకుండా గ్రుడ్లప్పగించి చూచే ప్రేక్షకుల లాంటివారే మనబోటి జీవకోటులన్నీ. పోతే అక్కడ ప్రేక్షకుల మీద కనికట్టనేది పనిచేసినట్టే మనమీద కూడా ప్రస్తుత మజ్ఞానమనేది పనిచేస్తున్నది. ఐంద్రజాలికుడి శక్తీ, ప్రేక్షకుల కనుకట్టూ రెండూ కలిసి కారణాలక్కడ. ఏది లేకున్నా ప్రదర్శన నిలిచిపోతుంది. అలాగే ఇక్కడ కూడా ఈశ్వరుడి మాయాశక్తికి మనబోటి జీవుల అజ్ఞానం తోడవుతున్నది. మన అజ్ఞానమే షరీకు గాకపోతే సృష్టి అనే ప్రసక్తే లేదు. కనుకట్టే లేకపోతే గారిడీ ఎక్కడిది. అలాగే జైవమైన ఈ అజ్ఞానమే లేకపోతే ప్రపంచ సృష్టి అనేదే అబద్ధమన్నారు భగవత్పాదులు.

అయితే దీనిపైన కూడా ఒక ఆక్షేపణ వస్తుంది. అదేమిటంటే ఇంద్రజాలంలో కనుకట్టనేది ప్రేక్షకులు కొనితెచ్చుకొన్నది గాదు. అది కూడా ఆ ఐంద్ర జాలికుడు బలవంతంగా వారిమీద పడవేసిందే. కనుకనే వాడు కల్పించిన కనుకట్టున్నంత వరకూ ప్రదర్శన చూస్తారు. అది ఉపసంహరిస్తేచూడటం మానివేస్తారు. ప్రేక్షకుల తప్పేమీ లేదక్కడ. అంతా ఆ ఐంద్రజాలికుడిదే. వాడు చూపితేనే గదా వీరు చూస్తున్నారు. అలాగే ఈశ్వరుడే ఐంద్రజాలికుడన్నప్పుడిక్కడ కూడా ఆ ఈశ్వరుడిదే కావాలి అపరాధమంతా. ఆయన చూపకుంటే సృష్టి ఎక్కడిది. ఆయన ఇవ్వకుంటే మనకు దానిని చూచే దృష్టి ఎక్కడిది. కాబట్టి మీరెంత మనోహరంగా వర్ణించినా ఈ దృష్టాంతం మన సమస్యకు పరిష్కారం కాదనటం స్పష్టం.

దీనికి శంకరులిచ్చే సమాధానమేమంటే దృష్టాంతమనే దాన్ని మనం తెగేదాకా బిగించరాదు. ఒక విషయం బొత్తిగా అర్థం కాకపోతే దాన్ని సులభంగా బోధించడానికి శాస్త్రం మనకొక దృష్టాంతాన్ని That which illustrates చెబుతుంది. అది ప్రతి ఒక్క అంశంలోనూ దార్ష్ఠాంతికంతో That which is illustrated సరితూగాలని నియమంలేదు. వివక్షితమైన అంశమేదో దానితో సరిపోలితే చాలు. మిగతా అంశాలలో తేడా ఉన్నా ఫరవాలేదు. అలాకాక నూటికి నూరుపాళ్ళూ సరిపడాలని పట్టుపడితే ఇక అది దృష్టాంతమే కాదు దార్ష్ఠంతికమే అయి కూచుంటుంది. అది మొదటికే మోసం. కాబట్టి ఐంద్రజాలికుడి దృష్టాంతాన్ని కూడా కొంతవరకే తీసుకోవాలి మనం. వస్తు స్వభావమే కాకుండా మానవుడి దృష్టి దోషం కూడా కారణమని చెప్పటమే దాని ఆశయం. అంతకుమించి ఈ దృష్టి దోషానికి కూడా సబబేమిటని ప్రశ్నిస్తే ఇక దృష్టాంతం పరిధినే దాటిపోవలసి వస్తుంది మనం.

అలా దాటిపోయి చూచామంటే మనకొక నమ్మశక్యం గాని నిజం బయట పడుతుంది. అదేమిటంటే ఇంద్రజాలంలో ఐంద్రజాలికుడనేవాడు ప్రేక్షకులకు భిన్నంగా ఒకడున్నాడు. ప్రేక్షకులే ఐంద్రజాలికుడు కాదు. కాదు గనుకనే వాడు తన శక్తితో వారిపైన కనుకట్టు ప్రయోగించే అవకాశమేర్పడింది. పోతే ప్రస్తుత విషయమలాంటిది కాదు. అసలిక్కడ జీవుడి కంటే విలక్షణంగా ఈశ్వరుడనే వాడెక్కడా లేడు. జీవుడి స్వరూపమే ఈశ్వరుడు. మనలో ఉండే ఆత్మే Indi-self గదా బ్రహ్మ Uni-self మని పేర్కొన్నాము. అయితే ఈ సత్యాన్ని మనమింకా గుర్తించలేదంత

మాత్రమే. గుర్తించలేక ఉపాధులే నేనని భ్రమించాము. దాని మూలంగా మనం జీవులమని భావించి మన కతీతంగా ఈశ్వరుడనే ఒక భావాన్ని కల్పించుకొన్నాము. వాస్తవంలో ఈ శరీరాద్యుపాధులన్నింటినీ ప్రవిలయం Dissolve చేసుకొని చూస్తే చాలు. మనమే ఆ ఈశ్వరుడని అనుభవానికి వస్తుంది. వస్తే ఇక ఈ సృష్టి ఏమిటీ – ఎవరు చేశారు. ఎందుకిలా ఉంది. అనే ప్రశ్నే లేదు. ఎంచేతనంటే అప్పుడిక మనకు భిన్నంగా ప్రపంచమూ లేదు, జీవుడూ లేదు, దేవుడూ లేదు. బ్రహ్మ చైతన్యానికి బాహ్యంగా మరి ఏ భావమూ Entity లేదని గదా ప్రతిపాదించాము. అలాంటప్పుడెవరి నడగాలి మన మీ ప్రశ్న. మనమే బ్రహ్మమయినప్పుడిక ప్రశ్న ఏముంది. దీనిని బట్టి ప్రపంచ సృష్టి అనేది అసలెప్పుడూ జరగనే లేదని మనకు బోధ పడుతుంది. ఒకే ఒక ఆత్మ తప్ప మరేదీ లేదన్నప్పుడిక సృష్టి అనే దాని కాస్కారమే లేదు గదా. అయితే మనకిలాంటి ప్రశ్న లెందుకుదయిస్తున్నాయని ప్రశ్న. మన అజ్ఞానం వల్లనే ఉదయిస్తున్నా యంటారు ఆచార్యులవారు. ఎందుకంటే మనకు జ్ఞానమనేదే ఉంటే జీవ జగదీశ్వరులనే త్రిపుటి కరగిపోయి అంతా ఆత్మ స్వరూపంగానే భాసించేది. అందుకు నోచుకోకపోవటం వల్లనే ఈ ప్రశ్నలన్నీ. మనమొక జీవులమనీ, మనకు నియంత ఒక ఈశ్వరుడున్నాడనీ వాడు చేసిన ఈ విషమమైన సృష్టి మూలంగా మనమిలా కష్టపడుతున్నామనీ ఇదంతా మన అజ్ఞాన కల్పితమే. కల్పితం సత్యమెలా అవుతుంది కనుకనే అసలు జరగనే లేదీ సృష్టి అని చెప్పటం. దీనినే అజాతవాదమని పేర్కొన్నారద్వైతులు. మరి జరగకున్నా కనిపిస్తున్నదే అంటే అబద్ధమే. ఒకటి ఏర్పడకుండానే ఎలా కనిపిస్తుంది. అయినా కనిపించిందంటే అది మన కనిపించిన మేరకే ఉంది గాని వాస్తవంలో లేదు. దీనికే దృష్టి సృష్టి వాదమని పేరు పెట్టారు వారు.

ఇంతకూ సృష్టి అని ఏది పేర్కొంటున్నామో వాస్తవానికది ఈశ్వర సృష్టి కాదు. అంతా జీవసృష్టే. కాబట్టి ఈ సృష్టిలోని లోటుపాట్లకు వేటికీ ఆయన జవాబుదారు కాడు. లేకున్నా ఉన్నదని దర్శించి ఊరక బెదిరిపోయే మానవుడి అజ్ఞానమే దానికి జవాబుదారు. అజ్ఞానమే గాక వస్తు స్వభావం కూడా ఉంది గదా అని అడగవచ్చు. నిజమే. నీవు వస్తువని పేర్కొనేవా డీశ్వరుడే గదా. వాడు కూడా వాస్తవంలో నీకు భిన్నంగా ఎక్కడా లేడు. నీకున్న అజ్ఞానం వల్లనే వాడెక్కడో ఒకడున్నట్టు ఊహించావు. వాడు తన మాయాశక్తి మూలంగా ఈ సృష్టినంతా చేస్తున్నట్టు భావించావు. కాబట్టి వస్తు స్వభావమని చెప్పినా అదీ మన అజ్ఞాన కల్పితమే. దాని విజృంభణమే. మరేదీ

# అజ్ఞాన స్వరూపం

అయితే ఈ అజ్ఞానమనేదేమిటి ? అది ఎక్కడిది ? అని ఇప్పుడు ప్రశ్న. ఈ ప్రశ్న అడగవద్దన్నారు శంకర భగవత్పాదులు. ఎందుకని. అజ్ఞానమనేది వదలకుండానే అడుగుతున్నావు నీవా ప్రశ్న. అజ్ఞాన వలయంలోనే తిరుగుతూ ఈ అజ్ఞానమనే దేమిటని అడిగితే ప్రయోజనమేముంది. పైగా అది ఏమిటని అడిగే అవకాశం కూడా లేదు నీకు. అజ్ఞానమేమిటని అడగాలంటే జ్ఞానంతోనే గదా అడగాలి నీవు. జ్ఞానంతో అడగాలంటే ఇక అజ్ఞానమేమిటి నీ ముఖం. అది జ్ఞానమే అవుతుంది. కరదీపిక చేత బుచ్చుకొని కటికి చీకటి నన్వేషిస్తే అది మనకు కనిపిస్తుందా పెడుతుందా. ఆ దీపకాంతిలోనే అది లీనమయిపోతుంది. అలాగే అజ్ఞానమనేదేమిటి ఎక్కడిది అని ప్రశ్నిస్తే చివరకు జ్ఞానమే అవుతుందది. జ్ఞానం లేకపోవటమే అసలజ్ఞాన మంటే. అది ఒక పదార్థంగా ఎక్కడా లేదు. జ్ఞానం లేనంతవరకూ ఉన్నట్టు భాసిస్తుంది. అది ఉదయించిందంటే తొలగిపోతుంది. అప్పుడీ అజ్ఞానమనే దంతకు ముందూలే-దప్పుడూలే-దెప్పుడూ లేదని గ్రహించగలడు మానవుడు. ఇంతకూ మనకు జ్ఞానం కలిగేవరకు అదేమిటి? ఎందుకు? అని ప్రశ్న వేసినా సుఖం లేదు. కలిగిన తరువాత ఇక ప్రశ్న వేయనే అక్కరలేదు. అంచేత దాన్ని గూర్చిన చర్చే మన కనవసరం పొమ్మంటారాయన.

పోనీ ఏమిటనే ప్రశ్న వద్దు మనకు. ఎప్పటి నుంచీ ఏర్పడిందని అయినా అడగవచ్చునా అంటే అదీ పనికి రాని ప్రశ్నేనన్నారు. ఎందుకంటే అజ్ఞానమనేది ఎప్పుడూ లేదని నిర్ధారణ అయినప్పుడది ఇక ఎప్పటి నుండి అని ప్రశ్నేముంది. అంతమేగాని ఆది లేదు దానికి. జ్ఞానముదయిస్తే అంతమవుతుందది. అలా అంతమయ్యేదాకా ఉంటూనే ఉందది. ఎప్పటి నుంచీ అంటావేమో. ఎప్పటి నుంచీ నీకు జ్ఞానం లేదో అప్పటి నుంచే ఎప్పటి నుంచీ లేదు జ్ఞానం అని అడిగితే అంతకన్నా హాస్యాస్పదం లేదు. జ్ఞానమనేది ఇక మీదట మనకు కలగవలసింది. అది ఇంతకు ముందెలా ఉంటుంది. ఉంటే ఇక అజ్ఞానమెక్కడిది. కాబట్టి ఇంతకు ముందున్నదంతా మన కజ్ఞానమే. అది ఇప్పుడున్నట్టు మన కనుభవ సిద్ధమే గదా. ఇప్పుడున్నదంటే ఇంతకు ముందు కూడా ఉన్నదని చెప్పనక్కరలేదు. ఆ ముందనేది ఆలోచిస్తూ

పోతే ఎంత ముందుకైనా పోతుంది కాలంలో. కనుకనే అజ్ఞానానికాది లేదని చెప్పటం, బ్రహ్మ పదార్థంలాగా అది కూడా అనాది సిద్ధమే. అయితే బ్రహ్మమనేది అనంతం Infinite కూడా. ఇది అనాదేగాని సాంతమైన Finite పదార్థం.

అనాది సిద్ధమైన అజ్ఞానాన్నే అవిద్య Nescience or Illusion అని కూడా వ్యవహరిస్తారు వేదాంతులు. జీవజగత్తులనేవి ఏర్పడటానికీ అవిద్యే మూలకారణం. కనుకనే వేదాంతంలో దీనికి కారణ శరీర Causal Body మని పేరు వచ్చింది. శరీరమనగానే కరచరణాద్యవయవాలే ఉండనక్కరలేదు. వస్తుస్వరూపాన్ని కప్పి పుచ్చేది ఏదైనా అది ఒక శరీరమే Cover. ప్రస్తుత మీ అవిద్య అనేది చైతన్య ప్రకాశాన్ని ఒక నీడలాగా కప్పి పుచ్చుతున్నది. కప్పిపుచ్చే సరికఖండమైన ఆ చైతన్య మా మేరకు పరిచ్ఛిన్నమై పోయింది. ఆ పరిచ్ఛిన్నమైన చైతన్యభాగమే జీవుడని పేర్కొన్నాము. అప్పటిక విద్యవల్ల ఏర్పడిందే జీవభావం. ఈ అవిద్య అనే ఆవరణమే పని చేయకపోతే పరిపూర్ణ బ్రహ్మ స్వరూపులమనే జ్ఞానమే మనకుండేది. ఏదీ అది మనకెక్కడ ఉందిప్పుడు. మీదు మిక్కిలి కేవలమొక అల్పజ్ఞుడైన జీవుడనే భావమే ఉంది మనకు. ఇలాంటి భావం మనకుండటమే చాలు జీవుడవిద్యా కార్యమని చెప్పటానికి తార్కాణం.

జీవుడిలాగా జగత్తుకూడా అవిద్యాకార్యమే. అవిద్య అనే దానికి రెండు శక్తులున్నాయి. ఒకటి ఆవరణ శక్తి Contraction మరొకటి విక్షేపశక్తి Distraction ఇందులో ఆవరణ శక్తి జీవభావానికి దారితీస్తే విక్షేపమనేది జగద్భావానికి దారి తీస్తుంది. చైతన్యం పరిచ్ఛిన్నమయి గదా జీవుడయిందని చెప్పాము. పరిచ్ఛిన్నమైన భాగం పోగ మిగతా చైతన్యభాగమంతా ఏమయినట్టు. విక్షేపశక్తి పని చేసి దాన్ని చైతన్యానికి విలక్షణంగా చూపుతున్నది. చైతన్యానికి విలక్షణ మచేతనమే గదా. అదే ఈ పాంచ భౌతికమైన జడ ప్రపంచం. ఒక విధంగా చెబితే అవిద్య అనేది సత్యాన్ని మరుగు పరుస్తున్నది. అసత్యాన్ని బయట పెడుతున్నది. ఆవరణ ముఖంతో అది సత్యాన్ని మరుగు పరిస్తే విక్షేప ముఖంతో అసత్యాన్ని బయట పెడుతుంది. ఆవరణం వల్ల జీవ భావమేర్పడితే విక్షేపం వల్ల జగద్భావ మేర్పడింది. రెంటికీ అవిద్యే కారణం కాబట్టి దానికి కారణ శరీరమనే పేరు సార్థకమయింది.

ఈ కారణ శరీరమింతటితో నిలవలేదు. అది సూక్ష్మశరీర Subtle Body మనే మరి ఒక శరీరాన్ని సృష్టించింది. అవిద్య మూలంగా జీవజగత్తు లేర్పడ్డాయని

గదా ఇంతకు ముందు మనం పేర్కొన్నది. అందులో చేతనుడైన జీవుడికీ జగత్తులోని పదార్థాల ననుభవించాలనే కామమేర్పడింది. కామమనేది అమూర్తమైన ఒక భావం. కాబట్టి దానికి సూక్ష్మ శరీరమని పేరు పెట్టటం సమంజసమే. ఇది కూడా అవిద్యలాగా చైతన్యాన్ని మరుగు పరిచేదే కాబట్టి శరీరమయింది. దీనిలో మనస్సూ, ప్రాణమూ అనేవి రెండు ప్రధానమైన పరికరాలు. వీటిలో ప్రాణంవల్ల జీవుడు కర్త అయితే మనస్సువల్ల భోక్త అవుతున్నాడు. ఈ కర్తృత్వ భోక్తృత్వాలే Planning and Execution అసలు జీవుడి స్వరూపం. ఒకటి కార్యాన్ని నిర్వర్తించటం. మరొకటి దాని ఫలాన్ని అనుభవించటం. ఇంతకన్నా జీవుడికి జీవనమంటూ మరొకటి లేదు. రెండింటికీ మనః ప్రాణాలే ఆలంబనమని చెప్పాము. వీటి మూలంగానే జీవుడికీ లోకంతో నిత్యమూ లావాదేవీ. రెండింటికీ కామమనేదే ప్రేరణశక్తి Impulse కామోపహతుడైన జీవుణ్ణి గుర్తు పట్టాలంటే అతడి దూతలీ మనః ప్రాణాలే గదా. కనుకనే జీవోపాధులైన వీటి రెండింటికీ కలిసి లింగ శరీరమని కూడా నామాంతరం. దాగి ఉన్న భావాన్ని సూచించేదేదో అదే లింగం.

పోతే ఈ సూక్ష్మమూ లేదా లింగ శరీరమనేది మరో మూడో శరీరం కూడా అవతరించటానికి హేతువయింది. అదే మనకు కనిపించే ఈ స్థూల శరీరం Gross Body కర్మ ప్రధానమైనదిది. అవిద్య కామాన్ని సృష్టిస్తే కామంకర్మ నుత్పాదిస్తుంది. ఒక విషయాన్ని కామించినప్పుడా కామాని కనుగుణంగా దానిని పొందే ప్రయత్నం చేయటం కూడా సహజమే. ఇలాంటి ప్రయత్నమే కర్మ. ఈ కర్మ అనేది మరలా రెండు విధాలు. ఒకటి చేయటమైతే, మరొకటి అనుభవించటం. రెంటికీ మనః ప్రాణాలే గదా ఆలంబనమని చెప్పాము. కాబట్టి ప్రతి ఒక్క పనీ మనః ప్రాణాలవల్లనే జరగవలసి ఉన్నది. మరి ఈ మనః ప్రాణాలనేవి అధికారులవంటివి. సొంతంగా అన్ని పనులూ చేసుకోలేవు. వాటి క్రింద పనులు చేయటానికి కొందరు నౌకర్లు కావలసి ఉంది. అవే ఇంద్రియాలు. ఇందులో మనసు క్రింద పని చేసేవి చక్షురాదులైన జ్ఞానేంద్రియాలైతే ప్రాణం క్రింద చేసేవి పాణిపాదాదులైన కర్మేంద్రియాలు. ఇవన్నీ అమూర్తమైన శక్తి విశేషాలు కాబట్టి ఎక్కడో గాలిలో ఉండే వ్యవహారం కాదు. అన్నింటికీ కలిసి మూర్తమైన ఒక అధిష్ఠానం Basis ఎంతైనా అవసరం. అది

మరలా వాటిలాగా సూక్ష్మమైతే సుఖం లేదు. స్థూలమైన బాహ్యజగత్తుతో సంబంధం పెట్టుకోవాలంటే స్థూలమైన కవచమే ఒకటి తయారుకావాలి. లేకుంటే అవి ఒకచోట నిలవలేవు. పని చేయలేవు.

ఇలాంటి ఒక కవచమే అన్నమయమైన ఈ స్థూల శరీరం. ఛాందోగ్యం చాటినట్టుగా ఇది అన్నంలోపుట్టి అన్నంతో పెరుగుతున్నది. చివర కన్నంలోనే లయమవుతుంది. అన్నమంటే ఏదోగాదు. పృథివీ తత్త్వమే. కనుకనే స్థూలమంతా అన్నమయమన్నాము. ఈఅన్న ప్రభావంవల్లనే ప్రాణమనో విజ్ఞానాలు దెబ్బ తినకుండ పని చేస్తున్నాయి. బ్రతకగలుగుతున్నాయి. పోతే వీటికిమూలమైన కామమనేది ఫలిస్తే చాలు. అది అవిద్యారూపమైన ఆనందానికి దోహదం చేస్తున్నది. అంచేత వేదాంతులు చెప్పే పంచకోశాలు కూడా ఈ శరీర త్రయంలోనే కలిసి వస్తాయి మనకు. అన్నమయ కోశం స్థూలమైతే ప్రాణ మనోవిజ్ఞాన మయాలనే కోశాలు మూడు సూక్ష్మమైతే అయిదవదైన ఆనందమయకోశమే అవిద్యా రూపమైన కారణ శరీరం.

ఏతావతా ఈ శరీర త్రయ నిర్మాణంతో చైతన్యం తాలూకు అవరోహణ యాత్ర సమాప్తమయింది. అనాది సిద్ధమైన అవిద్యే లేకుంటే శుద్ధమైన చైతన్యం కదలకుండా అలాగే ఉండేది. అచ్యుతం చ్యుతం కావలసిన అగత్యం లేదు. కాని ఉన్నట్టుండి అవిద్య అనే కారణ శరీరమొకటిచుట్టుకొనే సరికది చ్యుతమై కామనకు Desire లోనయింది. కామమనే ఈ సూక్ష్మశరీరం క్రమంగా స్థూలీభవించి తద్ద్వారా బాహ్యమైన లోకంతో చైతన్యానికి లావాదేవీ ఏర్పడింది. ఈ లావాదేవినే కర్మ అని పేర్కొంటున్నాము. ఇందులో కర్మ భూమి జగత్తయితే కర్మ కర్త జీవుడు. జీవుడంటే సూక్ష్మ శరీరోప హితమైన చైతన్యాంశమే నని గదా చెప్పాము. అది అలా ఉపహితం Veiled కావటానికేమిటి కారణం. ఉపహితమంటే నిజంలో కాకపోయినా అయినట్టు భాసించటమే గదా. అలాంటి దానికి కారణమేమయి ఉంటుంది. అవిద్య తప్పితే.

ఈ అవిద్యా పిశాచం ఒక పిండాండస్థాయి Micro cosmic లోనే గాదు. బ్రహ్మాండ స్థాయి Macro cosmicలో కూడా పని చేస్తుంది. తన్మూలంగా అక్కడాకూడా కారణమనీ, సూక్ష్మమనీ, స్థూలమనీ మూడు శరీరాలూ యథోచితంగా ఆవిర్భవించాయి. ఆ కారణాని కవ్యక్తమూ, అవ్యాకృతమూ Unmanifest matter

అని పేరు. సూక్ష్మానికి సూత్రమని పేరు. పోతే స్థూలానికి విరాట్టని పేరు. ఇవి మూడూ చైతన్యాని కక్కడా ఉపాధులే. వీటిచేత ఉపహితమైన ఆ చైతన్యాన్ని వరుసగా ఈశ్వరుడనీ, హిరణ్యగర్భుడనీ, వైశ్వానరుడనీ వ్యవహరిస్తారు. వీరు ముగ్గురూ పిండాండోపహితులైన ప్రాజ్ఞతైజస విశ్వులనే జీవులకు సహ యాత్రికులు. అయితే విశేషమేమంటే వీరికున్న ఉపాధి సాత్త్వికోపాధికాబట్టి దానికి వారధీనం కారు. మీదు మిక్కిలి అదే వారికి వశవర్తి అయి ఉంటుంది. పోతే మనబోటి జీవుల విషయమలాంటిది కాదు. మనది రాను రాను రజస్తమస్సులతో మలినమైన ఉపాధి కనుక దానికి మనమంతా అంతకంతకు బందీ అయిపోయాము. తత్కారణంగా వారు దేవతలైతే, మనం మానవులమైతే, మనకన్నా తగ్గు జాతివి పశుపక్ష్యాదు లయ్యాయి. ఇదంతా అవిద్యా పిశాచి విలయ తాండవ వినోదఫలమే.

మొత్తానికి చుట్టూ ప్రదక్షిణం చేసి అక్కడికే వచ్చాము మరలా అన్నింటికీ మూలకారణ మవిద్యేగాని మరొకటేదీ గాదు. పోతే ఈ అవిద్య అనేదేమిటింతకూ. విద్యమానం Existant కానిదేదో అది అవిద్య అన్నారు. ఎక్కడాలేని పదార్థమది. ఎందుకంటే అది వస్తువుగాదు. వస్తువనేది బ్రహ్మ చైతన్య Supreme conscience మొక్కటే. ఉండేదేదో అదిగదా వస్తువంటే ఉండేది ఎప్పుడూ చైతన్యమే. మిగతాది ఇక ఏదైనా దాని ఆభాసమే Appearance గాని వస్తువు Reality గాదు. అంటే వస్తువులాగా భాసిస్తుందే గాని విచారిస్తే ఏమీ ఉండబోదు. ఇలాంటి ఏమీలేని పదార్థమే అవిద్య అనేది. అదే అసత్యమయినప్పుడిక దాని సంతానమైన ఈ జీవజగత్తులు మాత్రం సత్యమెలా అవుతాయి. అవిద్య రంగంలో ఉన్నంతవరకే ఇవి ఇలా కనిపిస్తుంటాయి. అది ఎప్పుడు తెర మరగవుతుందో ఇవీ అప్పుడే ఒక స్వప్నంలాగా కరిగిపోతాయి. అయితే అది ఎప్పుడు తొలగుతుందా అవిద్య. విద్య ఎప్పుడుదయిస్తుందో అప్పుడు దానిపాటికదే తొలగిపోతుంది. సూర్యోదయంకాగానే అంధకారం తొలగటం లేదా. అలాగే ఈ అవిద్య అనే అంధకారం కూడా. అప్పుడిక జీవుడూ లేడు - జగత్తూ లేదు. అంతా కలిసి అలికినట్టు ఒకే చైతన్య రూపంగా అనుభవానికి వస్తుంది.

# దశాద్వయ విభాగం

దీనిని బట్టి అవిద్య ఉన్న దశ ఒకటీ – అది లేని దశ ఒకటీ – రెండు దశల నొప్పుకోవలసి వస్తున్నది మనం. ఈ అవిద్యాదశనే వ్యావహారికమనీ, విద్యాదశనే పారమార్థికమనీ పేర్కొన్నారు భగవత్పాదులు. ఇలా ఈ రెండు దశల నంగీకరించటం మూలంగా ఆయన ఎన్నో గడ్డయిన సమస్యలను పరిష్కరించగలిగారు. అన్నిటిలో ప్రధానమైన దిటు లోకానికీ – అటు శాస్త్రానికీ రాజీ కుదర్చటం. శాస్త్రమున్నదంతా బ్రహ్మమే మరేదీ లేదని చాటుతుంది.కాని మన లోకానుభవం దానికి పూర్తిగా విరుద్ధంగా కనిపిస్తుంది రెంటికీ లంగరందటమెలాగ. ఆచార్యులవారు కనిపెట్టిన ఈ గురుకీలకమైతే రెంటినీ సరిపెట్టగలదు. ఎలాగ అని అడగవచ్చు. భేదమనేది పారమార్థికంగా కాకపోయినా వ్యావహారికంగా అంగీకరిస్తున్నాము గదా. అంచేత ఆ మేరకు లోక వ్యవహారానికేమీ ఆటంకం లేదు. యథేచ్ఛగా సాగవచ్చు. దైనందినానుభవానికి విరుద్ధంగా పోవలసిన ప్రమేయం లేదు. మీదు మిక్కిలి దాని నామోదించినట్టవుతుంది. అలాగే వ్యావహారికంగా ఎంత భేదం కనిపిస్తున్నా అది ఆ కనిపించే మేరకే గాని లోతుకు దిగి చూస్తే మరలా అది హుళక్కే. పారమార్థికంగా ఏదీ లేదక్కడ. మృగతృష్ణికలో నీరు దూరానికి కనిపించినా దగ్గరికి వెళ్ళి చూస్తే వట్టిదే గదా. అలాగే ఇదీ వట్టిద. కాబట్టి సర్వమూ బ్రహ్మమేనని చాటే శాస్త్ర వచనానికీ తిరుగులేదు. ఈ ప్రకారంగా ఒకవైపు మానవుడి లోకానుభవాన్నీ మరొకవైపు శాస్త్ర సిద్ధాంతాన్నీ రెండింటినీ సమర్థించగలిగారు భగవత్పాదులు. ఇది రెండందాలా పదునైన కత్తిలాంటిది. అద్వైత వేదాంతం గనుకనే ఇలాంటి సమన్వయం సాధ్యం కాగలిగింది. మరొక దర్శనంలో దీనికి పరిష్కారమే లేదు.

# లోకవ్యవహారం

ఇది అర్థంగాక చాలామంది లోకంలో శంకరుని అద్వైతమే ఒప్పుకొంటే కొంప మునుగుతుంది. లోకానుభవానికే స్వస్తి చెప్పవలసి వస్తుందని వాదిస్తారు. అది కేవలం వారి అవిచార మూలకమేగాని మరేమీ గాదు. అద్వైత మొప్పుకొన్న మాత్రాన లోకవృత్తానికెప్పుడూ ముప్పులేదు. లోకమంటే ఏమిటది. ప్రత్యక్షానుమానాలకు గోచరమయ్యేదే గదా. ప్రత్యక్ష అనుమానాలంటే ఏమిటవి. ప్రమాణాలు. ప్రమాణ

సిద్ధమైన దసత్యమని ఎవరనగలరు. శంకరులు కూడా ఆ మేరకది సత్యమనే చాటుతున్నారు. అయితే వాటికన్నా అతీతమైన ప్రమాణంతో నిరూపిస్తే మాత్రమిది అసత్యమని తేలుతుందంటారాయన. ఆ అతీతమైన ప్రమాణమేమిటి. ఉపనిషచ్ఛాస్త్రం. దాని దృష్ట్యా పరీక్షిస్తే అంతకుముందు ప్రపంచ రూపంగా భాసించిందప్పుడు బ్రహ్మ రూపంగా దర్శనమిస్తుంది. దానితో ఇక లోక వ్యవహారమనే మాటకే ఆస్కారంలేదు. దానికి పూర్తిగా మనమప్పుడు తిలాంజలి ఇవ్వవలసి వస్తుంది.

అయితే మనమలా చూచినప్పటి మాట అది అంతవరకూ అవిద్యా దోషం మనలనింకా అంటిపట్టుకొనే ఉంటుంది. కాబట్టి ప్రత్యక్ష గోచరమైన వ్యవహారాన్ని గోచరించే వరకైనా ఒప్పుకోక తప్పదు. గోచరమవుతున్నా లేదు పొమ్మంటే అది పొరబాటు. అలా అన్నవారే విజ్ఞానవాదులైన బౌద్ధులు. అద్వైతులలా అనరు. ప్రపంచ మెంతెంత గోచరిస్తుంటే అంతంత ఉన్నదంటారు. గోచరించటం మానినప్పుడే లేదంటారు. **"యావత్తావ దభ్యుపగమ్యతే" "యథా దృష్టమ్ గృహ్యతే"** అని ఇలా ఎన్నో చోట్ల తమ అభిప్రాయాన్ని స్పష్టం చేస్తారు భాష్యకారులు. రజ్జువును సర్పంగా చూచినంత దనుకా సర్పమనేది ఉంది గదా. దానివల్ల కలిగే భయకంపాదులు కూడా ఉన్నవే గదా. అలాగే అంతా బ్రహ్మమనే ప్రబోధ కలిగేంత వరకూ ఈ ప్రపంచం కూడా ఉండక తప్పదు. ఆ తరువాత నీ వుండమన్నా ఉండదది. అప్రయత్నంగానే తొలగిపోతుంది. ప్రతిదినమూ మనం చూచే స్వప్నమే దీనికి మంచి నిదర్శనమన్నారు భగవత్పాదులు. స్వప్నంలో మనమెన్నో దృశ్యాలు ప్రత్యక్షంగా చూచినట్టే చూస్తుంటాము అవన్నీ మనకప్పటి కప్పుడెంతో యదార్థంగానే భాసిస్తుంటాయి. అసత్యమనే భావన ఏ మాత్రమూ మనసుకురాదు. అలా చూస్తున్నంతసేపూ అది సత్యమే. కాని ఉన్నట్టుండి మెళకువ వస్తే చాలు. మరుక్షణమే మటుమాయమై అంతా అసత్యని తేలిపోతుంది. అయితే మెళకువ అనేది రావాలి ఇంతకూ వచ్చేంతవరకూ తాత్కాలికంగానైనా అది సత్యమే. అలాగే ఈ లోక వ్యవహారం కూడా మానవుడి కాత్మ ప్రబోధం కలిగేంత వరకూ సత్యమే. ఆ తరువాతనే ఇది అసత్యం. అప్పుడు కూడా అందరికీ గాదు. ఎవడికి ప్రబోధం కలిగితే వాడికే. మిగతా వాళ్ళకంతా మరలా సత్యమే. ప్రబోధం కలిగిన వాళ్ళెందరుంటారు. నూటికి కోటికొక్కడుంటే ఎక్కువ. కాబట్టి ప్రవాహన్యాయంగా ఎప్పుడూ ఉంటుందీ ప్రపంచం. ఈ రూపంగా లౌకికమైన వ్యవహారాన్ని ఎప్పుడూ సమర్థిస్తూనే పోతారు భగవత్పాదులు.

# శాస్త్రవ్యవహారం

ఆ మాటకు వస్తే ఒక లౌకికమే గాదు. శాస్త్రీయమైన వ్యవహారం కూడా ఈ ప్రాతిపదిక మీదనే సమర్ధిస్తూ వచ్చారాయన. శాస్త్రమంటే ఇక్కడ బ్రహ్మశాస్త్రం Philosophy కాదు. కర్మ శాస్త్రం Religion. దీనికే ధర్మమని మారుపేరు. ధర్మమనే సరికది ద్వైత ప్రపంచానికి సంబంధించి ఉంటుంది. ఒక కర్తా, ఒక క్రియా, దాని అనుష్ఠానమూ, తద్ద్వారా కలిగే ఫలమూ, దాని అనుభవమూ ఈ కలాపమంతా ద్వైతమే గదా. ఇది కూడా మానవుడి అవిద్యను బట్టి ఏర్పడుతున్నదే. కాబట్టి అది ఉన్నంతవరకూ లోకవ్యవహారం మాదిరి సాగుతూ పోవలసిందే. అలా సాగేటంతవరకూ అదికూడా సత్యంకావలసిందేనని సమర్థిస్తారు జగద్గురువులు. కాకపోతే అపౌరుషేయమైన శాస్త్రంలో ఒక భాగం ప్రామాణికమయి మరొకటి కాదని చెప్పవలసి వస్తుంది. అది మన సంప్రదాయానికే ఒక పెద్ద గొడ్డలిపెట్టు. జగద్గురువుల స్థాయిలో ఉన్న వ్యక్తి సామాజికమైన విశ్వాసాన్ని ఎన్నటికీ పడగొట్టే ప్రయత్నం చేయరాదు. అంచేత పారమార్థికంగా కాకపోయినా వ్యావహారికంగా సత్యమని సమర్థించి శాస్త్ర ప్రమేయమైన ధర్మ తత్త్వాన్ని కూడా లోకంలో నిలబెట్ట గలిగారాయన.

అయితే ఈ ధర్మమనే దేమిటి ? వానిని భగవత్పాదులెలా సమన్వయించారని మన మర్థం చేసుకోవలసి ఉంది. మన మీ స్థూల శరీరంతో నిత్యమూ చేసుకొనే కర్మకే ధర్మమని పేరు.యావజ్జీవమూ మనమీ శరీరంతో ఏదో ఒక పని చేస్తూనే ఉంటాము. చేసే ప్రతి పనీ కర్మే అయినా అది శాస్త్ర చోదితమైతేనే దానిని ధర్మమని పేర్కొన్నారు మనపెద్దలు. శాస్త్ర నిషిద్ధమైతే దాని నధర్మమన్నారు. వీటికే పుణ్య పాపాలని లోకంలో వ్యవహారం. ఇవి రెండూ ఎప్పుడూవృథా పోవు. చేసిన తరువాత వాటి ఫలం మనమెప్పటికైనా అనుభవించి తీరవలసిందే. ఎప్పటికప్పుడు గాలికి పోయేది గదా కర్మ దానికి ఫలితమేమిటని తేలికగా మాటాడరాదు. కర్మ అనేది గాలికి పోయినా దానివల్ల కలిగే సంస్కారం Impression మాత్రం మనలను విడిచిపెట్టదు. అంటి పట్టుకొనే ఉంటుంది. దీనికే మీ మాంసకులు అపూర్వమనీ అదృష్టమనీ పేర్లు పెట్టారు. అది రేపీ స్థూలశరీరం పతనమైన తరువాత జీవుణ్ణి

పరలోకాలకు తీసుకొని వెళ్ళుతుంది. శరీరమే పతనమైతే ఇక జీవుడెలా వెళ్ళగలడని ప్రశ్న రావచ్చు. స్థూలం పోయినా సూక్ష్మమనే దొకటి ఉందని మనం మరిచిపోరాదు. ఈ సూక్ష్మంలో కూచొని ప్రయాణం చేస్తాడు జీవుడు. ఇది చాలా సూక్ష్మమూ స్వచ్ఛమూ కాబట్టి తద్వారా జీవుడు నిష్క్రమిస్తున్నా మన కంటికే మాత్రమూ కనిపించదు. జీవుడు నిష్క్రమిస్తుంటే జీవుడితో పాటు అతడు చేసుకొన్న పుణ్యాపుణ్య సంస్కారాలు కూడా అదృష్టరూపంగా అతణ్ని అనుసరించి వెళ్ళుతాయి. అవి ఈ జీవుణ్ని లోకాంతరాలకు చేరుస్తాయి. పుణ్యం చేసి ఉంటే స్వర్గాదులకు పోయి అక్కడ పుణ్యఫలమనుభవిస్తాడు. లేక పాపమే చేసి ఉంటే సరాసరి నరకానికి వెళ్ళి అక్కడ రౌరవాది నరకయాతనలనుభవిస్తాడు. మొత్తంమీద లోకాంతర యానమనేది తప్పదు జీవుడికి. ఇలా కర్మఫల మక్కడ అనుభవించిన తరువాత కర్మ ఫలశేషమనేది ఇంకా ఉంటుంది కాబట్టి మరలా వచ్చి ఈ కర్మ భూమి జన్మిస్తాడు. ఈ జన్మకూడా ఎక్కడ రావాలో ఎలాంటిది రావాలో అంతా ఆ కర్మనుబట్టే నిర్ణయమవుతుంది. ఇంతకూ కర్మనుబట్టి జన్మ, జన్మను బట్టి కర్మ. ఇది ఒక విషవలయం. తీరేది తీరతుంటే మరలా చేసేది చేస్తుంటాడు. కాబట్టి జన్మ పరంపర అనేది తప్పదు మానవుడికి. ఇదీ శాస్త్రం మనకు బోధించే విషయం.

శాస్త్రం చెబుతుందనే గాక ప్రత్యక్షాది ప్రమాణాలకు గూడా ఇది సరిపడే విషయమనే చెబుతారు శంకర భగవత్పాదులు. అది ఎలాగంటే ఈ సృష్టిలో మనకెంతో వైషమ్యము, వైవిధ్యమూ కనిపిస్తున్నది. పుణ్యాత్ములెందరో కష్టాలనుభవిస్తున్నారు. పాపాత్ములెందరో హాయిగా బ్రతికిపోతున్నారు. దీనికేమిటి కారణం. కారణం లేకుండా కార్యమనేది ఎప్పుడూ తటస్థించదు. అలాగే కార్యమనేది మనం చేస్తున్నామంటే దానికేదో ఒక కారణం లేకుండా పోదు. కార్యకారణ సంబంధమనేది అనివార్య మీ సృష్టిలో అలా కాకపోతే అకృతాభ్యాగమమూ, కృత విప్రణాశమూ అనే రెండు దోషాలకు మనం జవాబు చెప్పవలసి వస్తుందంటారు భాష్యకారులు. అకృతా భ్యాగమమంటే మనమెప్పుడూ చేయనిది వచ్చి నెత్తిన పడటం. కృత విప్రణాశమంటే మానవుడెంత ఘోర పాపం చేసినా అది మాఫీ అయిపోవటం. ఇంతకన్నా గొప్ప అన్యాయం లేదు. అలాగే అయితే ఈ సృష్టి అనేది ఒక పిచ్చివాడి చేతి రాయిలాగా ఎలా బడితే అలా నడుస్తుందని చెప్పినట్టవుతుంది. అలా నడిచిన నాడిక ఏ మానవుడు

గానీ ఏ ప్రయత్నమూ చేయనక్కరలేదు. చేయకున్నా ఫలించవచ్చు. చేసినా నశించవచ్చు. దానితో పురుషార్ధ సిద్ధి కాస్కారమ లేదు. లేకుంటే విధి నిషేధాత్మకమైన శాస్త్రమిక దేనికి. ఎవరి కోసం. అది మొదటికే మోసం. కాబట్టి కార్యకారణ సంబంధమనేది ఒప్పుకోక తప్పదు. కాగా ఈ కార్యకారణాలనేవి ప్రతి ఒక్కటీ ఈ జన్మలోనే మనకు దృష్టమైతే ఫరవాలేదు. కాని అన్నీ అలా దృష్టం కావు. కావు గనుకనే పూర్వోత్తర జన్మలున్నాయని తీర్మానించవలసి వస్తుంది. కార్యం మాత్రమే కనిపించి కారణం కనిపించకపోతే పూర్వజన్మ. కారణం కనిపిస్తూ దానికి తగిన కార్యం కనిపించకపోతే ఉత్తరజన్మ. ఇలా ఒక జన్మకు మరొక జన్మ నిమిత్తమవుతూ పోతే అది తప్పకుండా జన్మ పరంపరకు దారి తీస్తుంది. కర్మ ఉన్నప్పుడు జన్మ ఉండక ఏమవుతుంది. కర్మఫలమ గదా జన్మ అంటే. కాబట్టి జన్మాంతర ముందనే విషయం ప్రత్యక్షానుమానాలను బట్టే తెలుసుకోవచ్చు మనం.

జన్మాంతరమున్నదంటే మరణానంతరం జీవుడుకూడా ఉంటాడని ఒప్పినట్టే అవుతుంది. లేకపోతే శరీరం పతనమైన వెంటనే శరీరోపాధి అయిన జీవుడికిక అస్తిత్వం లేదు. జీవుడే లేకపోతే మరలా జన్మ ఎత్తవలసిందెవరు. అందులో ఈ కర్మఫలం అనుభవించవలసిందెవరు. కర్తా, భోక్తా అని గదా జీవుణ్ణి పేర్కొన్నాము. కర్తృత్వమున్నప్పుడు భోక్తృత్వం కూడా ఉండవలసిందే. కర్తృత్వమున్నందువల్ల కర్మ చేస్తాడు జీవుడు. కర్మ అనేది ఒక స్పందం Action. ప్రతి స్పందానికీ ఒక ప్రతి స్పంద Reaction ముండి తీరుతుంది. అది ఎక్కడిది మనకు దృష్టం కాలేదే అని వాదించరాదు. దృష్టం కాదు. గనుకనే దాని నదృష్టమని పేర్కొనటం. ఆకాశగుణమైన శబ్దం మనకెప్పుడంటే అప్పుడభివ్యక్తం Manifest కాదు. అయినా అది ఎప్పుడూ దానిలో అంతర్లీనంగా ఉందనే విశ్వసిస్తున్నాము గదా. అలాగే దీనిని విశ్వసించాలి మనం. అయితే ఎంతవరకంటే ఇది నాది. నేనుచేశాను. అనే అభిమానబుద్ధి Sense of Identity లేనంతవరకూ అది మనలనేమీ చేయలేదు. ఎలా పుడుతుందో అలా తొలగిపోతుంది. అలాకాక "నేను-నాది" అని ఎప్పుడు దానితో మనం తాదాత్మ్యం Identity చెందుతామో అప్పుడది మనపాలబడుతుంది. పడిందో అది మనమికెప్పుడో ఒకప్పుడనుభవించక తప్పదు. మరి అనుభవమనే సరి కనుభవిత Experiencer కూడా ఉండి తీరాలి గదా. ఆ అనుభవితే జీవుడు. కాబట్టి కర్మఫలమైన జన్మాంతరమెలా

ఉందో - తత్ఫలభోక్త అయిన జీవుడు కూడా అలాగే ఉన్నాడు. మహా అయితే స్థూల శరీరంతో మనకు కనిపించడు స్థూలంతో లేకపోయినా సూక్ష్మశరీరంతో అదృష్టరూపంగా సంచరిస్తూనే ఉంటాడు గాని లేకుండా పోడు.

పోతే జీవుడనీ, జన్మాంతరాలనీ, ఎప్పుడొప్పుకొన్నామో, అప్పుడిక లోకాంతరాలను కూడా ఒప్పుకోక తప్పదు. లోకమంటే ఏదో గాదు. జీవుడు తన కర్మఫలాన్ని అనుభవించవలసిన స్థానం. ఈ స్థానమిహమే కాక పరం కూడా కావచ్చు. కర్మఫలమంతా ఇహంలోనే తీరుతుందని చెప్పలేము. కొంత జన్మాంతరమెత్తి ఇహంలో అనుభవిస్తే మరికొంత అలా ఎత్తే ముందు పరలోకాల్లో అనుభవిస్తాము. అయితే ఈ పరమనేది మనకు ప్రత్యక్షం కాదే - ఇది ఉందా - అని లోకులకు సందేహం. అలా సందేహించనక్కర లేదన్నారు శంకర భగవత్పాదులు. **'జగద్వై చిత్ర్యోపలబ్ధేః'** అని ఆయన మాట. ఈ సృష్టి అనేది ఎంతో విచిత్ర Varied మైనది. అనంత Infinite మైనదీ. ఎక్కడ ఏది ఎంత మోతాదులో ఉందో నీకూ నాకూ అంతుపట్టే వ్యవహారం కాదు. అందులో మన గ్రాహితాకు వచ్చింది ఏ లేశమో అయితే రానిది ముప్పాతిక మువ్వీసం. అది మనకు దృగ్గోచరం కాలేదు గదా అని త్రోసి పుచ్చటం సాహస కార్యం.

అలాగైతే మనచుట్టూ ఇప్పుడు స్థావర జంగమాత్మకమైన సృష్టి ఎంతో ఉన్నది. చెట్లూ చేమలూ, పశువులూ, పక్షులూ ఇవన్నీ మనతో పాటు బ్రతుకుతూనే ఉన్నాయి. కాని ప్రక్కనే ఉన్న మన విషయం వాటికేమైనా అవగతమవుతున్నదా. తరులతా గుల్మాదులకైతే మన వృత్తాంతం బొత్తిగా తెలియదు. జంతువులకు కొంత తెలిసినా అది ఒక తెలివి గాదు. అయితే వాటికి మనలను గూర్చిన ప్రజ్ఞ లేదు గదా అని మన మీ ప్రపంచంలో లేకుండా పోయామా. అవి గ్రహించినా గ్రహించకపోయినా మన మనుగడ మనకు సాగుతూనే ఉన్నది గదా. అలాగే మనం గ్రహించకపోయినా మన కతీతమైన సృష్టి కూడా ఎంతగానో ఉండవచ్చు. ఎక్కడ ఏదీ లేదని ఎలా శాసించగలం. ఈ అనంత విశ్వంలో ఎక్కడ ఏమున్నదో ఎవరికి తెలుసు. ఈ లోకమున్నట్లే దీనికతీతమైన ఆ లోకాలూ ఉండవచ్చు. ఈ లోకంలో మనమున్నట్లే ఆయా లోకవాసులూ ఉండవచ్చు. వారినే దేవతలని పేర్కొన్నారేమో మనవారు. వారెక్కడ ఉన్నారని ఆక్షేపించటం పొరబాటు. మనమెక్కడ ఉన్నామని మనప్రక్కనే

ఉన్న చెట్లూ చేమలడిగితే ఏమిటి జవాబు. వీటికన్నా విశిష్టులం మనమైతే మనకన్నా విశిష్టమా దేవజాతి కావచ్చు. జ్ఞానైశ్వర్యాలనే రెండు గుణాలవల్లనే విశిష్టత అనేది సిద్ధిస్తుంది. అవి అంతకంతకు తగ్గుతూ పోతే స్థావరాలకు దగ్గర పడతాము. హెచ్చుతూ పోతే దేవతలకు చేరువవుతాము. తగు మాత్రముంటే మానవుల మనిపించుకొంటాము. ఇందులో పయివారికి క్రిందివారి సంగతులర్థమవుతాయి గాని క్రింది వారికి పయివారి సంగతులే మాత్రమూ అంతుపట్టవు. పట్టక పోయేసరికదంతా అభావమని భావించటం మానవుడికి స్వభావం. కాని మనం భావించనంత మాత్రాన అవి లేకుండా పోవు. అన్నీ ఉండవలసిందే జీవుడు. జన్మాంతరాలున్నాయి లోకాంతరాలున్నాయి. ఆయా భూమికలలో సుఖదుఃఖాద్యను భవాలు ఉన్నాయి. ప్రతి ఒక్కటీ ఉంది. ఏదీ లేకుండా పోదు. ఇదే శాస్త్రంలో పూర్వభాగమైన ధర్మపురుషార్థం మనకు బోధించే విషయం.

ప్రస్తుత మిదంతా వ్యావహారికంగా ఉందని అంగీకరించటం మూలాన లోకవ్యవస్థ మాదిరి శాస్త్రవ్యవస్థకు కూడా ఒక గతి కల్పించారు శంకరులు. అయితే ఇది కేవలం వ్యావహారికమే ననేమాట మరిచిపోవద్దని మనలను హెచ్చరిస్తారాయన. ఎంత మనం వన్నెచిన్నెలు పెట్టి వర్ణించినా ఇటు లోకవ్యవస్థా అటు శాస్త్రవ్యవస్థా రెండూ చివరకు వ్యావహారికమే Relative పారమార్థికం Absolute కానేరదు. శాస్త్రంలో పూర్వభాగమైన ధర్మమే గాదు. ఆ మాటకు వస్తే ఉత్తరభాగమైన జ్ఞానం కూడా అంతేనని చాటారాయన. ఒక గురువనీ, శిష్యుడనీ, ఉపదేశమనీ, సాధన అనీ ఇది కూడా వ్యావహారికమే. సకల ప్రమాణాలూ, సమస్త వ్యవహారాలూ కూడా అవిద్యా క్షేత్రం యొక్క ఎల్లలు దాటిపోలేవని నిర్భయంగా చాటాడాయన లోకానికి. దీనిని బట్టి మనం గుర్తుంచుకోవలసిన రహస్యమేమంటే మానవుడజ్ఞాన మనేది సడలకుండా చూస్తున్నంత వరకే ఈ వ్యవహారమంతా. జ్ఞానోదయ మయిందంటే వీటికస లస్తిత్వమే లేదు. అంతా హుళక్కే. శాస్త్రమూ హుళక్కే లోకమూ హుళక్కే. అంతా ఎగిరిపోతుంది. పోతే మనమింతవరకూ ఏ కరువు పెట్టిన ధర్మాధరాలు లేవు. జన్మాంతరాలు లేవు. లోకాంతరాలు లేవు. ఏదీ లేదు. ఎందువల్ల. జ్ఞానమంటే అంతా బ్రహ్మమనే నిశ్చయం కదా. అంతా బ్రహ్మమయినప్పుడిక అనేకత్వానికి చోటెక్కడిది. అనేకత్వం లేకపోతే దానిమీద ఆధారపడి బ్రతికే జీవజగత్తులు కూడా

లేవు. అప్పుడిక వ్యావహారికమనే ప్రశ్నేముంది. అంతా పారమార్థికమే. ఈ పారమార్థికమనే దెప్పుడూ ఉన్నది. ఎప్పుడూ ఉన్నదే అయినా అది మన కిప్పట్లో అలా కనిపించటం లేదు. మీదు మిక్కిలి జీవజగత్తులనే రెండు భూమికలు ధరించి కనిపిస్తున్నది. కనిపిస్తున్నదంటే అది మన అజ్ఞానంవల్ల. ఈ అజ్ఞానం మనకుండటం మూలాన్నే తాత్కాలికంగా వాటికొక అస్తిత్వాన్ని కల్పించుకొని మనం వాటితో నిత్యమూ వ్యవహరిస్తున్నాము. వ్యవహరిస్తున్నాము గనుకనే ఆ మేరకు వ్యావహారిక సత్యమని ఒక పేరు పెట్టాము. అంత మాత్రమే.

## వైలక్షణ్యం

అసలొక రహస్యమేమంటే వ్యావహారికంలో పారమార్థికముంది గాని పారమార్థికంలో వ్యావహారికం లేదు. పారమార్థికమంటే బ్రహ్మ స్వరూపమే గదా. అది సర్వత్ర సర్వదా ఉండాలి కాబట్టి వ్యావహారిక దశలో కూడా ఉంటుందది. అయితే ఉన్నట్టు మనం గమనించటం లేదంత మాత్రమే. మనం గమనించకపోయినా దానిపాటికది ఎప్పుడూ ఉంది. అలా ఉంటేనే అసలది పారమార్థిక మనిపించుకొనేది. పోతే వ్యావహారికమైన ఈ జగత్తు మాత్రం పారమార్థిక దశలోలేదు. ఉండటానికి సంభవం కూడా కాదు. ఉన్నదంటే అందులో భేదమనేది మనమొప్పుకోవలసి వస్తుంది. దానితో పారమార్థికం కదర్థితం Contaminated కాక తప్పదు. అయితే అప్పుడది పారమార్థికమే కాదు. ఈ సూక్ష్మాన్ని బాగా గమనించకనో – గమనించి కూడా భేదవాసన అనేది వదలకనో పారమార్థికంలో కూడా వ్యావహారికాన్ని తెచ్చిపెడతారు ద్వైతవాదులు. అందుకే వారు మోక్షమనేది ఒక ఫలమనీ, దానినే వైకుంఠానికో కైలాసానికో పోయి మనమందుకోవలసి ఉంటుందనీ అది ఆ పరమాత్మే మనకు ప్రసాదించాలనీ కబుర్లు చెబుతుంటారు. పరమాత్మను కూడా తమ ఆత్మకన్నా విలక్షణమైన ఒక వ్యక్తి విశేషంగానే భావిస్తారు వారు. ఇలాంటి సిద్ధాంతాలు చేస్తున్నారంటే దేశకాల నామరూపాదుల సంపర్కం వీరినింకా వదలలేదనే మన మర్థం చేసుకోవచ్చు. అలా వదలకనే మోక్షదశలో కూడా ఇంకా వాటినే కలవరిస్తున్నారు. వైకుంఠం కైలాసమన్నారంటేనే అది ఒక దేశం. అప్పుడే అనుభవిస్తామంటే అది ఒక కాలం. మరి ఆ పరమాత్మకొక శరీరమనీ అవయవాలనీ

వర్ణించామంటే అవి నామరూపాలే గాని వేరు గావు. ఇవన్నీ ఎప్పుడు భావించామో అప్పుడది వ్యావహారికమే. పారమార్థికమెలా అవుతుంది.

పైగా ఇందులో రెండు పెద్ద పొరబాట్లున్నాయి. మోక్షమనేది ఎప్పుడో మనకబ్బుతుందంటే ఇప్పుడది లేదన్నమాట. అంతకుముందు లేక మధ్యలో హటాత్తుగా ఏర్పడ్డ దానికెప్పుడూ ఒక ఆది ఉంటుంది. ఆది ఉన్నదంటే దానికంతం కూడా ఉండకతప్పదు.ఆద్యంతాలనేవి ఉన్నప్పుడది శాశ్వతికమెలా అవుతుంది. ఇది ఒక ప్రమాదం. పోతే ఇంకొక ప్రమాద మేమంటే వీరు పరమాత్మను తమకు భిన్నమైన తత్త్వంగా భావిస్తున్నారు. భిన్నమైతే దాని నాత్మ అని వ్యవహరించటానికి వీలులేదు. ఎందుకంటే అప్పుడది మన జ్ఞానానికి విషయ **Object** మవుతుంది. జ్ఞానానికి విషయమైనది జ్ఞానమెలా అవుతుంది. జ్ఞానం కాకపోతే అది పరమాత్మే గాదు. పరమాత్మ అంటే అఖండ జ్ఞానస్వరూపమని గదా మనం ప్రతిపాదించాము. అలాంటి జ్ఞానానికే దూరమైతే అది ఆత్మ ఎలా అవుతుంది. పరమాత్మ ఎలా అవుతుంది. అంచేత వ్యవహారలేశం కూడా పరమార్థంలో భావించటంగాని అలా వర్ణించటంగాని, పొరబాటని గ్రహించాలి మనం.

అలాగే పరమార్థమనేది మాత్రం ఎంత వ్యవహార దశలోనైనా సరే అంతర్లీనమయి ఉంటుందనే సత్యాన్ని మనం మరవ రాదంటారు శంకరులు. అయితే ద్వైతవాదులిది కూడా పూర్తిగా విస్మరించారు. విస్మరించటం వల్లనే వారి దృష్టికి భౌతికమైన ప్రపంచంలో ఎక్కడా బ్రహ్మమనేది గోచరించటం లేదు. గోచరించకనే దీనికతీతంగా ఎక్కడో ఉందని భావించి అక్కడికి పోయి దాన్ని పట్టుకోవాలని మనసులో ప్రాకులాడటం. ఇదికూడా ఒక పెద్ద అవివేకమే. ఎంచేతనంటే పరమార్థ మనేది ఎక్కడ పడితే అక్కడ ఉండే పదార్థం. ఎప్పుడు పడితే అప్పుడుండేది కూడా. దాని స్పర్శలేని దేశకాల వస్తువులంటూ ఏవీ లేవు. అలాంటప్పుడీ వ్యవహారమనేది జరుగుతూ ఉన్నప్పుడు మాత్రమది ఎలా లేకపోతుంది. లేదంటే అది సర్వవ్యాపకమైన తత్త్వమే కాదు. అంతేగాక దానినెక్కడోపోయి చూడాలని ఎప్పుడో పోయి అందుకోవాలని భావిస్తే అది దాని గౌరవానికే లోపం. అప్పటికది జీవ చైతన్యంలాగా పరిచ్ఛిన్నమే గాని పరిపూర్ణం కాదని చాటినట్టవుతుంది. పరిపూర్ణం కానిది పరమార్థమని చెప్పి సుఖమేముంది. అప్పుడా మాట కసలర్థమే లేదు. కాబట్టి

వ్యవహారాన్ని పరమార్థంలో భావించటమెలా తప్పో - పరమార్థాన్ని వ్యవహారంలో లేదనుకోవటం కూడా అలాగే తప్పు. కారణమేమంటే మనం చూచినా చూడకపోయినా ఉండేది పరమార్థం. చూస్తున్నప్పుడు మాత్రమే ఉన్నది వ్యవహారం. ఇదీ ఇందులో ఇమిడి ఉన్న వ్యవహారం. ఇదీ ఇందులో ఇమిడి ఉన్న రహస్యం.

# సమన్వయం

అయితే అంతా అయిన తరువాత మనం కడసారిగా గుర్తుంచుకోవలసిన రహస్యమొకటి ఉంది. అది ఆచార్యులవారు విసుగు లేకుండా పదే పదే మనకు హెచ్చరిక చేస్తుంటారు. మనమది గ్రహించకపోతే ఇప్పటివరకూ చెప్పుకొన్న మాటలన్నీ నిరుపయోగమే. అదేమంటే వ్యావహారికం పారమార్థికమని వర్ణించినంత మాత్రాన నిజంగానే రెండు దశలున్నాయని మనమెప్పుడూ భ్రాంతిపడరాదు. నిజంగా ఉన్నదెప్పుడూ ఒక పారమార్థికమే. అఖండమైన బ్రహ్మచైతన్యమది. అదే మన అజ్ఞానం వల్ల ఈ వ్యావహారిక జగత్తుగా భాసిస్తున్నది. అజ్ఞానమనేది ఎప్పుడూ ఒక వస్తువు కాదు. అది మన దృష్టి దోషమని పేర్కొన్నాము. ఇలాంటి దృష్టితో మనమే రూపంగా చూస్తే ఆ రూపంగా కనిపిస్తుంది ప్రపంచం. అది బాహ్యమైన భూతప్రపంచమే Material world గాదు. అంతరమైన భావ ప్రపంచం Mental world కూడా అలా కనిపిస్తున్నదే. కనిపిస్తున్నదంతా అజ్ఞాన విలసితమేనని గదా చెప్పాము. అంతా బ్రహ్మమే అయినా మన దృష్టి దోషంవల్ల ఇలా భాసిస్తున్నది. ఉన్నదొక్క రజ్జువే అయినా మన దృష్టిమాంద్యాన్ని బట్టి అదే సర్పదండధారాది రూపంగా భాసించటం లేదా. అలాగే ఇదీ. అంచేత మానవుడికున్న ఈ దృష్టి నాధారం చేసుకొనే శాస్త్రం వ్యావహారికమనీ పారమార్థికమనీ రెండుగా విభజించి చూపుతున్నది. భగవత్పాదులు కూడా దాని ననుసరించే మనకలా బోధిస్తూ వచ్చారు. అంతేగాని ఇదిశాస్త్ర తాత్పర్యమూ కాదు. ఆయన వివక్షితమంతకన్నా గాదు.

శాస్త్ర తాత్పర్యమిదే ననుకొంటే అందులో ఎంతైనా ప్రమాదముంది. ఎందుకంటే శాస్త్రమనేది ఒక ప్రమాణం. ప్రమాణమనేది ఎప్పుడూ మనకున్న మిథ్యాజ్ఞానాన్ని పారదోలి సమ్యగ్ జ్ఞానాన్ని Right Knowledge ప్రసాదించాలి. అలాగయితేనే అది ప్రమాణమవుతుంది. లేకుంటే అప్రమాణమే. ప్రస్తుత మీ వేదాంతమనేది అన్నిటికన్నా

ప్రబలమైన ప్రమాణమని గదా వర్ణించాము. అలాంటప్పుడది మనకు జ్ఞానాన్ని ప్రసాదించకపోగా మిథ్యా జ్ఞానాన్ని బలపరిస్తే ఎలాగ. వ్యావహారికం కూడా సత్యమని ప్రతిపాదిస్తే అలా బలపరిచినట్టే అవుతుంది. అయితే మరి ఎందుకు వర్ణించినట్టీ వ్యావహారికాన్ని అది దాన్ని ప్రతిపాదించటానికి గాదు. నిజంలో దాన్ని ప్రతిషేధించటానికేనని వ్యాఖ్యానించారు భాష్యకారులు. శాస్త్రం మొదట వ్యావహారిక సత్యమంటూ ఎంతో చిలువలు పలువలు పెట్టి వర్ణిస్తుంది. సందేహం లేదు. కాని అదే సర్వస్వమని చెప్పి చివరదాకా అందులోనే కూచోమని చెప్పటానికి గాదా వర్ణన. అది నీవు సత్యమని చూస్తున్నావు. కాని విచారిస్తే ఇది సత్యం కాదు. సత్యంగా ఉన్నదొక్క బ్రహ్మచైతన్యమే సుమా. అదే నీ దృగ్దోషంవల్ల నీకీ రూపంలో గోచరిస్తున్నది. కాబట్టి నీవీ రూపంగా దీనిని చూడటం మానుకొని ఆ చైతన్య రూపంగానే దర్శించు అదే పరమార్థం అని చాటటానికి.

అంటే అప్పటికీ కలాపాన్నంతటినీ మన మాపరమార్థాన్ని చేరటానికొక ఆలంబనంగా Support ఒక సాధనంగా Means తీసుకోవలసిందే గాని దానికొక ప్రత్యేకమైన అస్తిత్వాన్ని కల్పించుకొని అది కూడా జీవిత పరమార్థమని భావించరాదన్న మాట. ఆలంబనమనేది సత్యమైన పదార్థాన్ని చేర్చేంతవరకే. ఆ తరువాత దానికస్తిత్వం లేదు. ఆ పదార్థంలోనే లీనమై పోతుందది. అలాగే ప్రస్తుత మీ వ్యావహారికమైన సృష్టి అంతా అద్వితీయమైన బ్రహ్మతత్త్వాన్ని ఆకళించుకొనే వరకే. ఆ తరువాత దీనికీ అస్తిత్వం లేదు. సృష్టి అసలు జరగకపోయినా జరిగిందని వర్ణించటమిందు కోసమే. ఇదే వ్యావహారికమనే ఒక విభాగాన్ని ఆచార్యులవారు ప్రదర్శించటంలో కూడా అంతరార్థం.

## ప్రబోధం

ఇది అర్థం గాక ఇటు లోకులు, అటు పండితులూ కూడా నూటికి తొంభయి మంది వేదాంత మార్గంలో ఊరక బోల్తాపడుతున్నారు. గమకాన్నే Means గమ్య end మనీ సంకేతాన్నే symbol సత్యమనీ Truth అపోహపడుతున్నారు వీరంతా. అంచేతనే యావజ్జీవమూ ఏ మంత్రమో తంత్రమో విగ్రహమో విధానమో పట్టుకొని అదే ఉద్ధరిస్తుంది, అంతకన్నా మరేమీ లేదని అక్కడికే నిలిచిపోతున్నారు. మోక్షపదం

చేరేటంతవరకూ సాధకుడు పయనించవలసి ఉంటే మధ్యవచ్చే మజిలీలలోనే నిలిస్తే ఏమి బాగు. కేవల కర్మిష్ఠులూ, ఉపాసకులు, వీరంతా ఇలా మధ్యలో నిలిచిపోయే బాపతువారే. సాధకులే వీరంతా. కాదనలేము. కాని సిద్ధి అనేది కలిగేవరకూ వీరు సాధన చేయటం లేదు. కర్మిష్ఠులకైతే పితృలోక ప్రాప్తే సిద్ధి. ఉపాసకులకైతే ఆయా దేవలోక ప్రాప్తి. వీరందరూ తమ అనుభవం పూర్తికాగానే మరలా ఈ కర్మ భూమికి తిరిగి రావలసిందే. జన్మ ఎత్తవలసిందే తప్పదు. పునరావృత్తి రహితమైన మోక్షసిద్ధి ఈ మార్గంలో పయనించే వారికెవ్వరికీ లేదు. ఏమి కారణం. వ్యావహారికాన్ని కేవలమొక ఆలంబనమని భావించక అదే సర్వస్వమని భ్రాంతి చెందటమే. దానితో మానవుడెంత సాధన చేసినా - ఎంత సన్మార్గంలో పయనించినా అది ఎదుగూ బొదుగూ లేక వామనంగానే సమసిపోతుంది. అంతేగాక "పునరపి జననమ్ - పునరపి మరణ" మన్నట్టు మరలా ఈ సంసార సాగరంలో తలమునకలు గాక తప్పటం లేదు. ఇలా రెండనర్థాలెదురవుతాయి ఈ మార్గంలో. ఇదంతా వ్యావహారికాన్ని వ్యావహారికంగానే చూడక అదే పారమార్థికమని భావించటంవల్ల వచ్చిన పెద్ద మోసం. అలా మోసపోవద్దు. దానినే సోపానంగా చేసుకొని మీరు ముక్తి సౌధాన్ని ఆరోహించమని కర్మ మార్గ పరాయణులందరికీ గట్టిగా హెచ్చరిక చేస్తారు భగవత్పాదులు.

పోతే ఇంతకన్నా పెద్ద హెచ్చరిక వారు వేదాంత విద్యా విశారదుల మనుకొనే పెద్ద మనుషులకు కూడా చేయవెనుదీయలేదు. ఆత్మజ్ఞాన గంధం లేక కర్మిష్ఠులు పాడవుతుంటే ఆ జ్ఞానం తమకు లేకపోయినా ఉందనుకొని వేదాంతులు చెడిపోతున్నారు. అసలైన ఆత్మజ్ఞానమున్నదంటే ఇక భేదదృష్టి అనేది అణుమాత్రమైనా ఉండకూడదు. ఏదీ కోతలు కోయటమే గాని అలాంటి అభేద భావన ఎవరికుంది. సర్వసంగ పరిత్యాగులమని చెప్పుకొనే సన్న్యాసులకే లేదు. అలాంటి సన్న్యాసులు కేవల మాశ్రమ సన్న్యాసులేగాని పరమార్థ సన్న్యాసులు గారని పరివ్రాజక సార్వభౌములైన ఆచార్యులవారే సెలవిస్తారు. **"జటిలో-ముండీ-లుంచిత కేశః"** అని అక్కడక్కడ అవహేళన కూడా చేస్తారు. కాబట్టి బాహిరమైన వేషధారణా, మధుర భాషణా కాదు జ్ఞానమంటే. జ్ఞానమున్నందుకు ముందు నీ దృక్పథం మారాలి. అది నీ ప్రవర్తనలో కనపడాలి. ఇలాంటి మహనీయులు భగవత్పాదుల లాగా నూటికి

కోటి కొక్కరుంటే ఎక్కువ. మిగతా వారంతా పరమానందయ్య శిష్యులే. తమకు లేనిదంతా ఉన్నదని ఆపాదించుకొనేవారే. మహా అయితే వారికి శ్రవణ Learning ముందేమో గాని మననం Reflection లేదు. మననం కూడా ఉంటుందేమో గాని నిదిధ్యాసన Dedication మనేది అసలుండదు. నిదిధ్యాసన లేదంటే అది అనుభవమే గాదు. అనుభవం లేకున్నా ఉన్నట్టు నటించే వారి నాచార్యుల వారు క్షమించరు. **"అస్మదీయాశ్చకేచిత్"** మా వాళ్లు కూడా కొందరీ బాపతు వారున్నారని గట్టిగా చీవాట్లు పెట్టారాయన. ఇలాటి వైపరీత్యాని కంతటికీ కారణమొక్కటే. జ్ఞానమనేది కలగకముందే తొందరపడి కర్మానుష్ఠానమంతా వ్యావహారికమని చెప్పి దానికి తిలాంజలి ఇవ్వటం. అది ఎంత వ్యావహారికమైనా సరియైన అద్వైత జ్ఞానముదయించ నంతవరకూ దానిని మనం మానరాదు. జ్ఞాన ప్రతిబంధకమైన పాపకర్మ ఎంతో ఉంటుంది జీవులకు. సైంధవుడిలాగా అది అడ్డు తగులుతుంది మనకు మోక్షమార్గంలో అది అడ్డమున్నంతవరకూ జ్ఞానానికి ప్రవేశం లేదు. ఈ అడ్డంకి మనం తొలగించు కోవాలంటే మొదట శాస్త్ర చోదితమైన సత్కర్మలనుష్ఠించవలసిందే. అయితే ఫలాభిసంధి Desire for good results లేకుండా అనుసరించాలి వాటిని. అలా ఆచరిస్తే సత్త్వం Mental set up బాగా శుద్ధి అయి అది జ్ఞానానికి దోహదం చేస్తుంది. అంచేత పారమార్థికం ఒంటబట్టే వరకూ వ్యవహారికాన్ని మనం సాగించవలసిందే. వదలుకోరాదు. వదలుకొంటే మన మపేక్షించే మోక్షఫలం మన చేతికి వచ్చే మార్గమే మనకు కరువయి పోతుందని వేదాంతులను కూడా హెచ్చరించారాయన. కాబట్టి పారమార్థికమే చివరకు వాంఛనీయమైనా అది మనకు పట్టుపడే వరకూ వ్యావహారికాన్ని పాటించవలసిందే. అది గమ్యమైతే End ఇది దానికి గమకం Means.

# పిండితార్థం

ఇంతవరకూ సాగిన ఈ చర్చకంతటికీ ఏమిటి పిండితార్థమని ఇప్పుడు ప్రశ్న. నిత్యమూ ఉన్నదొక్క పారమార్థిక సత్యమే అయినా అదే మన అజ్ఞానదృష్టి కనేక రూపాలుగా భాసిస్తున్నది. భాసిస్తున్న నేరానికా మేరకు దానిని మనం వ్యావహారిక సత్యమని పేర్కొనవలసి వచ్చింది. పోతే ఈ వ్యావహారికమనేది దాని పాటికది ఊరక ఉంటే చక్కగా ఉండేది. కాని మనకది ఎక్కడ లేని ఉపద్రవాలు తెచ్చి

పెడుతున్నది. అదే మనకు నిత్యమూ ఎదురయ్యే ఈ సాంసారికమైన తాపత్రయం. అంచేత ఈ పద్మవ్యూహం నుంచి బయట పడటానికి మానవుడవశ్యంగా ప్రయత్నించవలసి ఉంది. అయితే ఎలా చేయాలా ప్రయత్నం. ఈ అనర్థం దేని మూలాన ఏర్పడుతున్నదో ఆ నిమిత్తాన్ని తొలగించాలి. నిమిత్తం పోతే నైమిత్తికం దానిపాటికదే పోతుంది. నిమిత్తమేమిటి. అనాది ప్రవృత్తమైన మన అజ్ఞానం. అజ్ఞానానికి విరుగుడు జ్ఞానమే. జ్ఞానమంటే అంతా బ్రహ్మమేనని దర్శించటం. అది ప్రస్తుతం లేదు మనకు. ప్రస్తుతం మనకున్నది దానికి భిన్నమైన లోకదృష్టి. ఇదే వ్యావహారిక మంటే. దీనినంతకంతకు వదలుకొంటూ దానిని పట్టుకోవాలి మనం. అలా పట్టుకోవాలంటే ఈ వదలుకొనేదే మరలా దాని కాలంబనం. వజ్రమ్ వజ్రేణ భిద్యతే అన్నారు. అంచేత వ్యావహారికాన్ని తోడు చేసుకొనే వ్యావహారికానికి స్వస్తి చెప్పి సాధకుడైన ప్రతివాడూ ఈ సర్వమూ బ్రహ్మమనే పారమార్థిక జ్ఞానాన్ని అనుభవానికి తెచ్చుకోవాలని పిండితార్థం.



# 3. వస్తుతంత్రం - పురుషతంత్రం

వ్యావహారికాన్ని బట్టి మనమెప్పటికైనా పారమార్థికమైన బ్రహ్మతత్త్వాన్ని పట్టుకోవాలని గడచిన అధ్యాయంలో మనవి చేశాము. ప్రస్తుతమలా పట్టుకోవలసిన వాడెవడు - పట్టుకొనే మార్గమేమిటి - అని విచారణ చేయవలసి ఉంది. తత్త్వాన్ని అందుకోవాలనే సరికి మనమింకా అప్పటికి వ్యావహారికంలోనే ఉన్నామని అర్థం. అంటే ఏమన్నమాట. జీవుడూ, జగత్తూ, ఈశ్వరుడూ, అనే ఈ మూడు తత్త్వాల దగ్గరికీ మరలా వచ్చిపడ్డాము. ఈ మూడింటిలో బ్రహ్మతత్త్వాన్ని సాధనచేసి అందుకోవలసింది ఎవరు అని మొదటి ప్రశ్న.

## అధికారి

ఎవరు అని ప్రశ్నే లేదు. సాధన చేయవలసిన వాడు జీవుడేనని సమాధాన మిచ్చారు వేదాంతులు. ఎంచేతనంటే జీవుడు కాక ఇక రంగంలో ఉన్నవి రెండే. ఒకటి జగత్తు - రెండు ఈశ్వరుడు. ఇందులో జగత్తనేది కేవల మచేతనమైన పదార్థం. సాధన చేసే యోగ్యత దానికి లేదు. పోతే పరమేశ్వరుడు. అది పరిపూర్ణమైన చేతన పదార్థం. సాధన చేయవలసిన అగత్యం దానికి లేదు. కాగా అటు జగత్తులాగా కేవల మచేతనుడూగాక ఇటు ఈశ్వరుడిలాగా పరిపూర్ణ చేతనుడూ కాని వాడీ జీవుడే. చైతన్యముంది గాని అది ఈశ్వరుడికి లాగా పరిపూర్ణంగా లేదు. పరిపూర్ణం చేసుకోగలిగితే చాలు. ఈశ్వరుడే అవుతాడు జీవుడు. కనుకనే సాధన చేయవలసిన భారం జీవుడి మీదనే పడింది. వాడికే అది అవసరం.

అంతేకాదు. సాధన అంటే అది ఒక పరిష్కారం Solution లాంటిది. సమస్య ఉంటేనే పరిష్కారం. అది ఎవడికి ఉంటే వాడే చేసుకోవలసి వస్తుంది. ఎవడికుంది ఇప్పుడు సమస్య. జీవుడికే. వానినే ఈ సంసారమనే సమస్య పట్టి బాధిస్తున్నది. **"అనిత్య మసు ఖమ్ లోక"** మన్నది భగవద్గీత. దీనివల్ల లేశమాత్రం కూడా సుఖం లేదు. ఎప్పుడో కొంచెమున్నా అది శాశ్వతం కాదు. కాబట్టి ఇది నిజంగా సమస్యే.

ఈ సమస్య జగత్తుకు లేదు. ఈశ్వరుడికీ లేదు. ఎందుకంటే జగత్తంటేనే సంసారం. సంసారం దాని స్వరూపమే అయినప్పుడు దానికది సమస్య ఎలా అవుతుంది. మీదు మిక్కిలి అదే సమస్య మన పాలిటికి. అలాగే ఈశ్వరుడికి కూడా లేదీ సమస్య. సంసారమే గదా సమస్య అని పేర్కొన్నాము. ఇది ఆ ఈశ్వరుడు సృష్టించిందే. ఆయన మాయాశక్తి విలాసమే ఇది. తన మాయే తన్ను ఎలా బాధించగలదు. గారడీ వాడిని వాడి గారడీ విద్య బాధించనేరదు గదా. కాబట్టి ఈశ్వరుడికీ సమస్య లేదు. పోతే పరిశేష న్యాయంగా మనబోటి జీవకోటిదే ఈ సమస్య అంతా. సంసారమనే సాగరంలో బడి నిరంతరమూ తలమునకలవుతున్న వాళ్ళము మనమే. కాబట్టి మనలాంటి జీవుడే ఎప్పటికైనా దీనికి పరిష్కారమార్గ మాలోచించవలసిన వాడు. మరెవరూ గాదు.

మరి ఒక రహస్యం కూడా ఉంది మనం గమనించవలసింది. సమస్య ఎలా ఉందో - సాధన చేసి దాన్ని పరిష్కరించుకొనే యోగ్యతకూడా ఈ జీవుడికే ఉంది. దీనికే అధికార Comptetence మని పేరు. ఈ అధికారమనేది రెండు విధాలన్నారు శంకరులు. ఒకటి అర్థిత్వమూ Desire రెండు సామర్థ్యమూ Equipment అర్థిత్వమంటే మనకొక సమస్య ఉందని గమనించి దానిని తొలగించుకోవాలని కోరిక. కాని అది వట్టి కోరిక మాత్రమే అయితే ప్రయోజనం లేదు. గొంతెమ్మ కోరికే అవుతుందది. అంచేత దానితోపాటు సామర్థ్యం కూడా ఉండాలి మనకు. సామర్థ్యమంటే ఏమిటి. ఒక సమస్యను నిర్మూలించుకోటానికి కావలసిన సామగ్రి.

ఇవి రెండూ మానవుడికే ఒనగూడాయి సృష్టిలో. మరి దేనికీ కానరాదు. శిలామృత్తికాదులసలు ప్రాణానికే నోచుకోలేదు. వృక్ష లతాగుల్మాదులకు ప్రాణమైతే ఉంది గాని జ్ఞానంలేదు. మరి పశుపక్ష్యాదులకు ప్రాణమూ ఉంది. జ్ఞానమూ ఉంది. కాని ఆ జ్ఞానం కేవలం వాసనా జ్ఞానమే Instinct. వివేక జ్ఞానం Reason కాదు. ఒక్క మానవుడిలోనే ప్రాణమూ, జ్ఞానమూ, వివేకమూ అన్నీ పరిపూర్ణమైన స్థాయినందుకొన్నాయి. కనుకనే పురుషుడని పేర్కొన్నారు మానవుణ్ణి. **"పురుష ఏవా విస్తరామాత్మా సహి ప్రజ్ఞానేన సంపన్న తమః - విజ్ఞాతమ్ వశ్యతి - విజ్ఞాతమ్ వదతి-వేత్తి శ్వస్తనమ్-వేత్తి లోకాలోకౌ - మర్త్యేనా ఉ మృత మీక్షతి"** పురుషుడిలోనే ఆ విశ్వచైతన్యం మరలా అభివ్యక్తమయింది కనుకనే అతడు తెలివిగా చూడగలడు.

మాటాడగలడు. రేపటి విషయ మూహించగలడు. మంచి చెడ్డలను విభజించి చూడగలడు. మర్త్య జగత్తులో పుట్టి అమర్త్యత్వాన్ని పట్టుకోవాలని ఆకాంక్షించగలడు. అని తైత్తిరీయ మెంతగానో మానవుడి పూర్ణత్వాన్ని వర్ణించింది. ఇలాంటి పూర్ణత్వం Perfection పశుపక్ష్యాదులకు లేదని కూడా చాటింది. **"అథేత రేషామ్ పశునామ్ ప్రాయశోஉ శనాయా పిపాసే అభివిజ్ఞానమ్"** ఇక మిగతా జీవరాసుల విషయమో కేవలమూ క్షుత్పిపాసాదులైన శరీర ధర్మాలే వాటికున్న విజ్ఞానం. మొత్తానికి దేహేంద్రియ ప్రాణ మనో బుద్ధ్యాది పరికరాలన్నీ సమగ్రంగా ఉన్నవాడు మానవుడే. ఇలాంటి సామర్థ్యమూ అర్థిత్వమూ - రెండూ ఉన్న అధికారి కావటం మూలాన్నే మానవుడొక్కడే మోక్షసాధన చేయవలసి వస్తున్నది.

# సాధన

అయితే సాధన చేయాలన్నారు-బాగానే ఉంది. అది ఎలా చేయాలా సాధన - అని ఇప్పుడు రెండవ ప్రశ్న. సాధన అనే మాట వినగానే మనకు మొట్టమొదట జ్ఞాపకం వచ్చేది ఒక అనుష్ఠాన రూపమైన Practical క్రియ. లోకంలో మనమే ఒక్కటి సాధించాలన్నా ఏదో ఒక క్రియతోనే సాధించాలి దాన్ని. ఏ పనీ చేయకుండా మనపాటికి మనం మౌనంగా కూచుంటే ఆ కర్మమెలా సిద్ధిస్తుంది. అసలు సాధన అంటే ఏమిటర్థం. అంతకుముందు లేని ఒక వస్తువును క్రొత్తగా తయారు చేసుకోవటమో లేక ముందే తయారయి కూడా మనకు దూరంగా ఉన్న పదార్థాన్ని దగ్గరగా తెచ్చుకోటమో ఇంతే గదా. తయారు చేయటం - తేవటం - పొందటమని ఏది చెప్పినా అది ఒక క్రియే. ఇంతెందుకు. ప్రస్తుతం మనం నివసించటాని కొక కొంప అనేది లేదనుకోండి. చేతిలో తగినంత ద్రవ్యముంటే చాలు. వెంటనే ఒక గృహం కట్టుకొని అందులో ప్రవేశిస్తాము. లేదా అంతకు పూర్వమే మన తండ్రులో తాతలో కట్టిన ఇల్లుంటె సరి. అదే బాగుచేయించుకొని గుట్టుచప్పుడు గాకుండా అందులో చేరిపోతాము. మొదటిది క్రొత్తగా నిర్మాణం కావటమైతే రెండవది నిర్మాణమైన దాన్నే మన సొంతం చేసుకోవటం. ఇందులో ఏదైనా ఒక క్రియే గాని మరేదీ గాదు. కాబట్టి సాధన అని ఎప్పుడు చెప్పినా అది ఒక క్రియ అనే భావించవలసి

వస్తుంది. సాధన అన్నా, క్రియ అన్నా, కర్మ అన్నా, అనుష్ఠానమన్నా, అన్నీ ఒక దానికొకటి పర్యాయాలే Synonyms

అయితే లౌకికమైన సాధనలన్నింటిలోనూ మనం చెప్పుకొనే ఈ సూత్రానికి తిరుగులేదు. కాని ప్రస్తుత మీ అద్వైత సాధనలో మాత్రమిది ఏ మాత్రమూ చెల్లనేరదని సెలవిచ్చారు శంకర భగవత్పాదులు ఎంచేతనంటే అది వస్తుతంత్రమే The thing as it exists గాని పురుషతంత్రం The thing as we think of it కాదని సమాధాన మిస్తారాయన. వస్తు తంత్రమేమిటి – పురుషతంత్ర మేమిటి అని ప్రశ్నించవచ్చు. తంత్రమంటే ఒక దాని కధీనమయి ఉండటం లేదా – దానిమీద ఆధారపడటం అని అర్థం. ఆయా వస్తువుల స్వభావం మీదనే ఆధారపడిందయితే అది వస్తుతంత్రం. అలా కాకా ఒకానొక పురుషుడి మీద ఆధారపడిందయితే పురుష తంత్రం. పురుషుడంటే పురుషుడి బుద్ధి. మానవుడు తన బుద్ధితోనే గదా ఏ విషయమైనా ఆలోచించి గ్రహిస్తాడు. కనుకనే దీనికి పురుష తంత్రమనే కాక బుద్ధి తంత్రమని కూడా పేరు వచ్చింది. ఈ బుద్ధే మానవుడు చేసే సకల వ్యాపారాలకూ కర్తృత్వం వహిస్తుంది. దీని తోడ్పాటు లేకుండా శరీరంలో ఏ ఇంద్రియంగానీ ఏ ఒక్కపనీ సాగించలేదు. అంచేత కర్తృతంత్రమని కూడా దీన్ని వ్యవహరిస్తారు. మొత్తానికి పురుషుడైనవాడు ఏదైనా తన బుద్ధితోనే మొదట ఆలోచిస్తాడు. అదేమాటలతో చెబుతాడు. చేతలతో చేసి చూపుతాడు. కాబట్టి అంతా కలిసి చివరకు పురుష తంత్రమే అవుతుంది.

ఇలాంటి పురుష తంత్రం కాదు అద్వైతులు చెప్పే బ్రహ్మపదార్థం. అది కేవలం వస్తుతంత్రమే. వస్తు స్వరూపాన్ని అనుసరించేది వస్తుతంత్రమని గదా పేర్కొన్నాము. వస్తు స్వరూపమేమిటిక్కడ. జీవజగత్తులనే వాసన కూడా లేని అద్వితీయాఖండ రూపమైన చైతన్యం. అదే గదా బ్రహ్మమంటే. ఇలాంటిదీ ఆ వస్తు స్వరూపం. ఇలాంటి స్వరూపం పురుషతంత్రమెలా అవుతుంది. కర్మ అనే దాని కవకాశముంటే గదా పురుషతంత్రమయ్యేది. రెండవ పదార్థమే లేదన్నప్పుడు కర్మ కవకాశమెక్కడిది. కర్మ అనగానే అది ఒకటి గాదు. కర్మ చేసే వాడొక్కడు – వాడు కర్త. చేయటానికి కావలసిన పరికరాలొకటి అది కారకం. చేయటమనే పని ఒకటి. అది కర్మ. అలా చేయటం మూలంగా మనం సాధించే దొకటి – అది ఫలం. ఈ విధంగా కర్తృకారక

క్రియాఫలాలని నాలుగంశాలు అనివార్యంగా ఉంటాయి ప్రతిపనిలోనూ అవి నాలుగూ ఉంటే ఇక అది ద్వైత ప్రపంచం క్రిందికే వస్తుంది. ద్వైత రూపమైన ఈ సాధన మద్వైత తత్త్వాన్ని అందుకోటానికెలా పనికి వస్తుంది. అద్వైతాన్ని అందుకోటాని కద్వైతమే కావాలి సాధన. ఉత్తర ధ్రువానికి పోవలసినవాడు ఉత్తరంవైపే ప్రయాణం చేయాలి గాని –దానికి విలోమంగా దక్షిణంవైపు చేస్తే ఏమి ప్రయోజనమని ఆక్షేపిస్తారు భాష్యకారులు.

# కర్మనిరాకరణ

కాబట్టి ద్వైతరూపమైన కర్మ అద్వైత సత్యానికి సాధనం కాదు. పైగా మనమెడకు చుట్టుకొన్న సంసారపాశాన్ని పోగొట్టుకొంటే గదా మోక్షం. దాన్ని సంసారానికి విరోధి అయినదే సాధించవలసి ఉంటుంది. కర్మకూ సంసారానికీ అలాంటి విరోధం లేదు. మీదు మిక్కిలి దానికి సజాతీయమైనది కర్మ. ఎలాగంటే సంసారబంధమనేది మానవుడి అజ్ఞానంవల్ల ఏర్పడింది. అజ్ఞానంవల్ల ఏర్పడిందే కర్మకూడా. రెండూ అజ్ఞాన రూపాలే అయినప్పుడవి ఒకదానికొకటి ప్రతికూలమెలా అవుతాయి. ప్రత్యుత అనుకూలమయి మనప్రాణం తీస్తాయి. అందుకే **“నహి తమస్తమసో నివారకమ్ భవతి”** అంటారాచార్యులవారు. చీకటి తొలగిపోవాలంటే వెలుతురు కావాలి గాని – మరలా ఇంత చీకటి తెచ్చి దానికి కలిపితే ఏమి సుఖం. కనులు పొడుచుకొన్నా కానరాని కటిక చీకటి అవుతుందది. అలాగే కర్మ భూమికకు దిగేకొద్దీ సంసారాన్ని అది ఇంకా ద్విగుణీ కృతం చేస్తుంది. దానిలో నుంచి మనమిక ఎప్పటికీ తేరుకోలేము.

అంతేకాదు. కర్మ అనేది ఏదయినా సరే. అది నాలుగే నాలుగు మార్గాలలో నడుస్తుంది. ఒకటి ఉత్పత్తి. రెండు ఆప్తి. మూడు సంస్కృతి. నాలుగు వికృతి. ఉత్పత్తి అంటే ఒక వస్తువు తయారుకావటం. ఆప్తిఅంటే ఆ తయారయిన పదార్థం చేతికి రావటం. సంస్కృతి అంటే చేతికి వచ్చిన దాన్ని శుద్ధి చేయటం. అది రెండు విధాలు. వస్తువులో దోషముంటే దానిని తొలగించటమొకటి. గుణమనేది లేకుంటే దానిని కలిగించట మొకటి. లోకంలో మనం సంస్కృతి – సంస్కరణమని వర్ణించేది ఏదైనా ఇంతే. దోషాపనయనమూ – గుణాధానమూ ఇంతకుమించి మరేమీ లేదు. పోతే ఇక నాలుగవది వికృతి. వికృతి అంటే దానిలోనే ఏదో మార్పు వచ్చి అది

సక్రమంగా క్షీణించి చివరకు నశించిపోవటం. ఇంతకూ ఒక పదార్థం పుట్టి భూమిమీద పడ్డప్పటి నుంచీ మరలా గిట్టి భూమిలోకి పోయేంతవరకూ జరిగే వ్యవహారమిదంతా.

ఇందులో ఉత్పత్తి అనేది మొదటి దశ అయితే – వికృతి అనేది చివరి దశ. మిగతా ఆప్తి–సంస్కృతి అనేవి రెండూ వాటి మధ్య దశ. ఇవి నాలుగూ కలిసి ఒక పదార్థం తాలూకు ఆది మధ్యాంతాలను నిర్ణయిస్తాయి. అది స్థావరమేకాదు. జంగమమే కాదు. ప్రపంచంలో కనిపించే ఏ పదార్థమైనా తీసుకొని చూడు. ఈ వర్ణించిన దశలన్నింటికీ అది గురి Victim కావలసిందే. ఉదాహరణ కొక ఘటమనే పదార్థాన్నే తీసుకొని చూతాము. ఘటమనేది ఒక కుమ్మరివాడు చేస్తే తయారవుతుంది. అది ఉత్పత్తి. కొని ఇంటికి తెస్తే మన పాలబడుతుంది. ఇది ఆప్తి. తుడిచి శుభ్రం చేసి బియ్యమూ–బేడలూ–పోస్తే మనకుపయోగపడుతుంది. ఇది సంస్కృతి. తరువాత కొన్నాళ్ళకు ఓడు మోసి పగిలి చూర్ణమై మట్టిలో కలిసిపోతుంది. ఇది వికృతి. ఇలా ఘటమేమిటి – పటమేమిటి. అణువు మొదలు ఆకాశందాకా – పిపీలిక నుంచి బ్రహ్మదాకా – అన్ని పదార్థాలకూ ఇదే వరుస. ఈ చతుర్ముఖ వ్యూహాన్ని తప్పించుకొని బయటపడేది ఏదీలేదు.

అయితే ఎంత దుర్భేద్యమైనా ఈ కర్మమనే పద్మవ్యూహ మొక్క బ్రహ్మతత్త్వం మీద మాత్రమే పని చేయలేదు. ఎందుకంటే బ్రహ్మమనేది మిగతా ప్రాపంచిక పదార్థాల మాదిరి మనం క్రొత్తగా తయారుచేసే దినుసుగాదు. ఎప్పటినుంచో తయారయి ఉన్న పదార్థమది. నిత్య సిద్ధమని గదా మనం దాన్ని నిరూపించాము. అలాంటప్పుడది ఎలా తయారవుతుందని. పైగా ఈ కనిపించే ప్రపంచానికంతటికీ అది కారణం. ఆ కారణానికిక కారణం లేదు. కారణం లేకుంటే ఏదీ గానీ తయారుకావట మసలు సంభవమే కాదు. కాబట్టి దానికుత్పత్తి లేదు. అలాగే ఆప్తి కూడా లేదు దానికి. ఆప్తి అంటే ఏమిటి. దూరంగా ఉన్నదాన్ని దగ్గరగా తెచ్చుకోవటం గదా. అంతటా ఉన్న పదార్థం బ్రహ్మమంటే. అంతటా ఉన్నదది. అన్నిటిలోనూ ఉన్నది. ఆకాశంలాగా అది సర్వగతం. మన లోపలా వెలపలా కూడా అదే. అసలు మనం కూడా దానికి భిన్నంగా లేము. అలాంటప్పుడు దాన్ని మనం దగ్గరగా తీసుకోవటమేమిటి. అర్థం లేని మాట. కాబట్టి ఆప్తి కూడా లేదు బ్రహ్మానికి.

పోతే ఇక సంస్కృతి. ఇది అసలే సాధ్యం కాదు. దేన్నీ అంటీ ముట్టకుండా అంతటా పన గలిసి ఉన్న పదార్థమది. దానికొక నామం లేదు. రూపం లేదు. నామరూపాలు రెండూ లేకుంటే అది అమూర్తం. దానికే గుణదోషాలు గానీ అంటవు. ఇక గుణాన్ని ఆరోపించటమెలాగ. దోషాన్ని తొలగించటమెలాగ. అంచేత సంస్కృతి గంధం కూడా లేదు బ్రహ్మతత్త్వానికి. సంస్కృతి మాదిరే ఆఖరుదైన వికృతికూడా దాని కనుపపన్నమే Untenable నన్నారు. వికృతి అంటే మారటం కదా. సావయవమైన Divisible పదార్థమైతే అవయవాల Parts హెచ్చుతగ్గుల మూలంగా మారటమనేది సంభవిస్తుంది. నిరవయవమూ - నిరాకారమూ - అయినదా బ్రహ్మతత్త్వమని నిర్దేశించాము. అలాంటి తత్త్వమిక ఎలా మారగలదు. మారకపోతే దానికి వికృతి అనే దోషం కూడా లేదనే గ్రహించవచ్చు. మొత్తంమీద నాలుగు రకాలైన కర్మలూ దానిమీద పని చేయటం లేదు. వాటి స్పర్శకూడా సహించని తత్త్వమది. అంటే కర్మకది ఏమాత్రమూ గోచరం కాదన్నమాట. అలా కాని పక్షంలో మరి కర్మ అనేది దానికి సాధనమెలా కాగలదు. కావటాని కసలు వీలే లేదని ఘంటాపథంగా చాటారు భగవత్పాదులు.

## ఉపాసనా నిరాకరణ

కర్మ కాకపోతే పోనీయండి. ఉపాసన అనేది ఏమైనా పనికి వస్తుందేమో దాన్ని సాధించటానికని చాలామంది కొక అపోహ ఉంది ఉపాసన-భక్తి-ధ్యానం అన్నింటికీ ఒకటే అర్థం. ఉపాసన అన్నా అదీ ఒక కర్మే గదా మరలా ఈ ప్రశ్న ఎందుకు వచ్చిందని అడగవచ్చు. అదీ ఒక కర్మే అయినా బాహిర External మైన తతిమా కర్మలలాంటిది గాదది. అంతరమైన Internal మనోధర్మం. బాహ్యమైనది స్థూలమైతే ఇది మానసికం కాబట్టి చాలా సూక్ష్మమైనది. తైల ధారావత్తుగా ప్రసరించే ఒక విశిష్టమైన మనోవృత్తి ఇది. అంచేత బాహ్యమైన కర్మ ఒకవేళ దానికి సాధనం కాకపోయినా ఇది కేవలమనోవృత్తి రూపమైన కర్మ కాబట్టి కావచ్చుననే అభిప్రాయం కలగవచ్చు.

అదికూడా వట్టి అపోహేనని త్రోసి పుచ్చారు స్వామివారు. వారు దానికి చెప్పే సమాధానమేమంటే నీవెంత సూక్ష్మమని వర్ణించినా ఉపాసన అనేది కూడా

ఒక కర్మే. ఆ శబ్దాని కవయవార్థం చూచినా మనకర్థమవుతుందీ విషయం. ఉప అంటే దగ్గరగా ఆసన అంటే కూర్చోటం. మనం పెట్టుకొన్న ఒక లక్ష్యానికి సమీపంగా వెళ్ళి కూచోటమని అర్థం. వెళ్ళటమూ - కూచోటమనే పాటికే అది ఒక క్రియ. మహా అయితే - మామూలు కర్మ శారీరకం. ఇది మానసికం. అంతమాత్రమే తేడా. మానసికమైన మాత్రాన కర్మ కర్మ కాకుండా పోదు. ఎంత సూక్ష్మమైనా ఇందులో కూడా చాలా తతంగమున్నది. మనసేగాక మిగతా కరణాలు కూడా పనిచేస్తాయి ఇందులో. మనసుతో ఒక మూర్తిని దర్శిస్తూ - వాక్కుతో దానికి సంబంధించిన మంత్రాన్ని ఉచ్చరిస్తూ -చేతులతో దాని కనుగుణమైన అర్చనాది క్రియల నాచరిస్తూ పోతే అది గదా ఉపాసన Worship అంటే. మరి దానిలో బాహ్యమైన వ్యాపారం కూడా చోటు చేసుకొన్నది గదా.

అలా కాదు - కేవలం మనసులో సాగించే ధ్యానమే meditation ఉపాసన అంటావా ? అదీకర్మే. ఎలాగంటే ధ్యానిస్తూ కూచున్నంతసేపు ఒక మూర్తి నీ మనోనేపథ్యం Mental screen మీద గోచరిస్తూనే ఉంటుంది. దాన్ని నీవు అంతర్ముఖమైన దృష్టితో చూస్తూనే ఉంటావు. ఇక కర్మ కాకపోయిందేమిటి. పైకి కనిపించకుండా లోపల జరిగే కర్మ ఇది. ఇందులో కూడా ముందు చెప్పిన ఉత్పత్త్యాదులు నాలుగూ ఉన్నాయి. నీ మనసులో అంతకుముందు లేని ఒక దేవతామూర్తి నీవు తయారుచేసుకొంటున్నావు. కాబట్టి అది ఉత్పత్తే. పోతే ఆ రూపం నీకు దూరమై పోకుండా నీ మనసులోనే నిలుపుకోవాలని చూస్తున్నావు. ఇదే ఆప్తి. ఆ మీదట దానికి కొన్ని హంగులూ రంగులూ చేర్చి సర్వాంగ సుందరంగా మలుచుకొని తిలకిస్తావు. అది సంస్కృతే. చివరకు దాన్ని నిలుపుకోకపోతే నీ మనోమందిరం నుంచి చెప్పకుండా పారిపోతుంది. లేదా అంత పుణ్యం పుట్టి ఆ దేవతా సాయుజ్యమే పొందావంటే అసలే పారిపోతుంది. మరి వికృతే గదా. అంచేత మానసికమైనా ఉపాసన కూడా గొప్ప గాదు. అదీ ఒక కర్మభేదమే.

అంతేకాదు. ఉపాసన-ఉపాసన అని వాపోతున్నారు. ఉపాసన అంటే ఏమిటి మీ అభిప్రాయం. మిగతా ఇంద్ర వరుణాది దేవతా మూర్తులలాగా ఆ బ్రహ్మతత్త్వాన్ని కూడా మనసులో భావించటమనే గదా. అలా ఎన్నటికీ జరగబోదు. ఏమి కారణం. దేవతల కంటే ఏదో ఒక నామమనీ, రూపమనీ ఉంది. అదికూడా నీవు కాదు. నీ

కంటే సర్వవిధాలా భిన్న మా దేవత. నీ వుపాసకుడవైతే అది నీ కుపాస్యం. కనుక భావన అనేది సాధ్యమక్కడ. మరి ఇక్కడ బ్రహ్మవిషయంలోనో అలా కాదు. నామ రూపాదికమైన ఏ గుణమూ లేదు దానికి. పైగా నీకు ప్రమేయం కాదది. నీ స్వరూపమే అయి కూచుంది. అలాంటి దాన్ని నీవెలా ఉపాసిస్తావు. కనుకనే **"త దేవ బ్రహ్మ త్వమ్ విద్ధి-నేదమ్ యదిద ముపాసతే"** అని బ్రహ్మ విషయంలో ఉపాసనాకాండను నిర్మోగమోటంగా ఖండిస్తుందుపనిషత్తు.

కాకపోయినా బ్రహ్మస్వరూపాన్ని నీవు భావన చేయటమేమిటి. అది ఉన్నట్టు నీవు భావించవలెనా - నీవు భావించనట్టది ఉండవలెనా-ఏమిటి నీ ఉద్దేశమని నిలదీసి ప్రశ్నిస్తారు జగద్గురువులు. దీనికి సమాధానమే ఉపాసకుడూ చెప్పలేడు. భయపడతాడు. ఎందుకంటే బ్రహ్మమనేది మిగతా దేవతా మూర్తుల వంటిది గాదు మనమెలా భావిస్తే అలా భాసించటానికి. మన భావనను బట్టి మారేది కాదది. మారితే అది బ్రహ్మమేగాదసలు. స్వతస్సిద్ధమైన తత్త్వం కాబట్టి మొదటి నుంచీ ఎలా ఉండాలో అలాగే ఉంటుందది. పురుష తంత్రం కాదది - వస్తుతంత్రమని పేర్కొన్నాము. ప్రతి వస్తువుకూ లోకంలో స్వభావ Characteristic feature మనేది ఒకటి ఉంటుంది. అగ్నికి ఉష్ణత్వ మనేది స్వభావం. నీటికి శైత్యమనేది స్వభావం. వాటిని భావించేటప్పుడంతా అలాగే భావించాలి మనం. అంతేగాని నిప్పును చల్లగా నీళ్ళను వేడిగా ఉన్నట్టు భావించరాదు. ఒకవేళ నీళ్ళు వేడిగా ఉన్నట్టు కనిపిస్తే అది అగ్ని సంపర్కం వల్ల ఏర్పడ్డ గుణమే గాని దాని సహజ గుణం కాదు. కాబట్టి వస్తు స్వభావమని గ్రహించేటపుడు దాన్ని స్వభావాన్ని బట్టే గ్రహించాలి గాని మన ఇష్టానుసారంగా భావించరాదు. అలా భావిస్తే అది ప్రమ Right apprehension అనిపించుకోదు. భ్రమ Wrong apprehension అనిపించుకొంటుంది. ఒక స్థాణువును piller చూచి పురుషుడని భావిస్తే అది యథార్థమెలా అవుతుంది. వట్టి భ్రాంతేనంటాము దాన్ని మనం.

అలాగే ప్రస్తుత మీ బ్రహ్మమనేది అమూర్తమూ-సర్వవ్యాపకమూ-ఆత్మరూపమూ Subjective అయిన ఒకానొక వస్తువు Substance ఇది దాని స్వభావం. దీన్ని నీవెలా భావిస్తున్నావు. ఒక దేవతా రూపంగా - బాహ్యమైతే ఒక శిలావిగ్రహంలోనో అంతరమైతే ఒక హృదయ కుహరంలోనో ఎక్కడో ఒకచోట

నిలుపుకొని చూస్తానంటావు. ఎన్నో ఆలోచనలు వస్తుంటే వాటన్నిటినీ త్రోసి రాజని ఒకే ఒక చిత్తవృత్తి దానిమీద ధారావాహికంగా ప్రవహింపజేస్తానంటావు. అలా చేస్తే అది బ్రహ్మమున్నట్టుగా నీవు భావించటం కాదు. నీవు భావించినట్టుగా బ్రహ్మముందనుకొని చేసే ప్రయత్నం. మరి ఇలాంటి ప్రయత్నం వస్తు స్వభావాని కవిరోధి ఎలా అవుతుంది. మీదు మిక్కిలి దానికి విరోధి అయి పరిణమిస్తుంది.

పోనీ బ్రహ్మమెలా ఉందో అలాగే దాన్ని భావిస్తానంటావా. అప్పుడది మొదటికే మోసం దెస్తుంది పొమ్మన్నారు భగవత్పాదులు. ఎందుకంటే ఆ పక్షంలో అది ఇక ఉపాసనే గాదు. ఉపాసన కాకపోతే మరేమిటి. మేము చెప్పే జ్ఞానమే అవుతుందది. ఒక పదార్థమున్నదున్నట్టు గ్రహిస్తే అది జ్ఞానం. మన ఇష్టానుసారం ఒక రూపకల్పన చేసి చూస్తే అది ధ్యానం. జ్ఞానానికీ Realisation ధ్యానానికి Reflection చాలా తేడా ఉంది. ఒకటి ప్రమ అయితే మరొకటి కేవలమూ భ్రమ. ప్రస్తుతం బ్రహ్మతత్త్వాన్ని ఉన్నదున్నట్టు భావిస్తానంటావు నీవు. భేషుగా భావించు అలా భావించమనే మేమూ చెప్పటం. అయితే ఇక దాని కుపాసన అని మాత్రం పేరు లేదు. మొత్తాని కెగదీస్తే బ్రహ్మహత్య – దిగదీస్తే గోహత్య. మనం భావించినట్టు పదార్థముండాలనుకున్నామా అది బ్రహ్మమే గాదు. బ్రహ్మమున్నట్టు గానే భావిద్దామా – అప్పుడది ఉపాసనే గాదు. ఉపాసనా అయి బ్రహ్మమూ కావాలంటే అది కలలోని వార్త. కనుకనే "నేదమ్ యదిద ముపాసతే" అని శాస్త్రం ఘోషించటం. మరి ఆశాస్త్రమే సగుణోపాసన ఎలా చెప్పిందని శంకించవచ్చు. అది నీబోటి నాబోటి మధ్యమాధికారులను దృష్టిలో పెట్టుకొని చెప్పిన మాటేకాని శాస్త్ర తాత్పర్యం కాదు. అంచేత బాహ్యమైన కర్మ కలాపమెలా పనికిరాదో అంతరమైన ఉపాసనా అలాగే పనికి రాదు బ్రహ్మదర్శనానికి. బ్రహ్మమనేది తయారయ్యే పదార్థం కాదు కాబట్టి కర్మ పనికిరాదు. అనుకొన్నట్లల్లా మారేది కాదు కాబట్టి ఉపాసనా పనికి రాదు.

భగవత్పాదులివి రెండూ పనికిరావని చాటటంవల్ల సాధకులైన వారికొక గొప్పసలీసు దొరికింది. సాధన మార్గం కూడా ఎంతో తేలిక పడింది. ఎలాగ అని అడగవచ్చు. మోక్షాన్ని సాధించాలంటే మానవుడిక బాహ్యమైన కలాపమేదీ పాటించనక్కరలేదు. తీర్థయాత్రల దగ్గరి నుంచీ – మన ఆచార వ్యవహారాల దగ్గరి నుంచీ మంత్ర తంత్రాలు – పూజా పురస్కారాల దగ్గర నుంచీ అన్ని వ్యాసంగాలకూ

ఒక నమస్కారం చేసి ఊరక కూచోవచ్చు. ఏదీ పాటించకపోయినా మనకేలాటి నష్టమూ లేదు. కొంప మునిగిపోతుందనే భయం లేదు. లేకపోతే ఆ క్షేత్రానికీ – ఈ తీర్థానికీ – పరుగెత్తలేక కనిపించిన రాళ్ళకూ రప్పలకూ సాష్టాంగపడలేక – తెలిసీ తెలియని మంత్రాలన్నీ జపించలేక అర్థంలేని నియమనిష్ఠలెన్నో అనుష్ఠించలేక – దుర్లభమైన ఈ మానవ జీవితమంతా వీటితోనే వెళ్ళబుచ్చే వాళ్ళం. ఇక ఏదీ లేకపోయినా అవే మనలనుద్ధరిస్తాయనీ నేరుగా మోక్ష సామ్రాజ్యానికే మనలను చేరుస్తాయనీ గాఢంగా మూఢంగా నమ్మేవాళ్ళం. ఇలాంటి మూఢమైన నమ్మకాల నెన్నింటినో పారదోలి మనకు కనువిప్పు కలిగించారు భగవత్పాదులు. మోక్షసాధనకు బాహ్యమైన పరికరాలుగాని ప్రయత్నంగాని ఏ ఒక్కటీ అక్కరలేదని చెప్పి ఎంతో బరువు తగ్గించారు మనకు.

## జ్ఞానమే సాధనం

అంతా బాగానే ఉంది. అయితే మరి బ్రహ్మతత్త్వాన్ని అందుకోటానికేదో ఒక సాధనమనేది ఉండాలి గదా – అది ఏమిటని మరలా ప్రశ్న వస్తుంది. సాధనమనేది ఇక్కడ కర్మగాదు–ఉపాసనాగాదు. ఒక్క జ్ఞానం తప్ప మరేదీ లేదని సిద్ధాంతీకరించారు భగవత్పాదులు. దానికి వారు చెప్పే సబబేమంటే జ్ఞానమనేది వస్తుతంత్రం. మిగతా కర్మోపాసనాదులలాగా పురుషతంత్రం కాదది. పురుషబుద్ధిని బట్టి నడిచేది పురుషతంత్రం. అది వాడి స్వబుద్ధే కావచ్చు. శాస్త్రచోదితమే కావచ్చు. మొత్తం మీద వాడి సంకల్పాన్ని బట్టే అది నడుస్తుంది. ఒకపని చేయాలనుకొంటే చేస్తాడు. లేదా మానాలనుకొంటే మానుతాడు. ఒకచోటికి పోవాలనుకొంటే బండి మీద పోవచ్చు. నడచి పోవచ్చు. అసలు పోకనే పోవచ్చు. వికల్పాని Option కవకాశ ముందక్కడ. ఇలాంటి వికల్పమొక్క లౌకిక కర్మలలోనే గాదు. శాస్త్రచోదితమైన కర్మలలో కూడా ఉందని చెప్పాము. **“అతి రాత్రే షోడశినమ్ గృహ్ణాతి. నాతి రాత్రే షోడశినమ్ గృహ్ణాతి.”** అతిరాత్రమని ఒక యాగమున్నది. అందులో పదహారంచులు గల పాత్ర నుపయోగించాలని ఒక నియమం ఈ నియమాన్ని యజమానుడు పాటిస్తే పాటించవచ్చు. పాటించకపోయినా పోవచ్చు నంటున్నది పయివాక్యం. ఇలా ఎక్కడ బడితే అక్కడ వికల్పానికి చోటున్నది కర్మకాండలో ఉపాసనా కాండలో. కనుకనే దానికి పురుష తంత్రమని పేరు పెట్టింది.

మరి జ్ఞానమనే దాని విషయమలా కాదు. ఇందులో వికల్పమనే మాటకే ఆస్కారం లేదు. కాబట్టి పురుషతంత్రం కాదిది వస్తుతంత్రం. వస్తుస్వభావాన్ని బట్టి వర్తించేదేదో అది వస్తు తంత్రం. పురుషుడి ఇష్టానిష్టాలతో నిమిత్తం లేదిక్కడ. పురుషుడు గ్రహించినట్టు వస్తువుండటం కాకుండా వస్తువున్నట్టుగా పురుషుడు గ్రహించాలి. మరి వస్తువనే దెప్పుడూ ఒకే ఒక రూపంలో ఉంటుంది. అది మారేది గాదు. కాబట్టి దాని ననుసరించి ఏర్పడే జ్ఞానం కూడా మారదు. ఇలాంటి జ్ఞానాన్ని పట్టుకొని పోయామంటే సరాసరి మనల నా వస్తువు దగ్గరికే తీసుకెళ్ళుతుంది. సందేహం లేదు. ఇంతెందుకు. ఒక జలమనే పదార్థమే ఉందనుకోండి. చల్లగా తెల్లగా ద్రవంగా ఉండి పల్లానికి ప్రవహిస్తూ ఉండటం దాని స్వభావం. ఆ స్వభావాన్ని బట్టే మనకు దాని జ్ఞానమేర్పడిందనుకోండి. తప్పకుండా అది ఆ జల స్వరూపాన్ని మన మనోనేత్రానికి చూపగలదు. కారణమేమంటే జ్ఞానమనేది ప్రమాణ జన్యం - యథా భూత విషయమని వర్ణించారు జగద్గురువులు. విషయమంటే మనకు గోచరించే పదార్థం. దీనికే ప్రమేయమని కూడా పేరు. అది ఎలా ఉందో అలాగే దాని రూపరేఖలను మనకు పట్టి ఇచ్చేది ప్రమాణం. ఈ రెండు షరతులూ ఉన్నప్పుడిక జ్ఞానమనేది కలగటంలో ఎలాటి ప్రతిబంధకమూ లేదు. ఉదాహరణకు మనమున్న గదిలో ఒకబల్లగాని కుర్చీగాని ఉన్నదనుకోండి. అది మనం తెలుసుకోవలసిన పదార్థం. తెలుసుకోవాలంటే ఆ చెప్పిన పదార్థమక్కడ ఉండి తీరాలి. అలాగే దానిని గ్రహించే నయనేంద్రియం కూడా మనకుండి తీరాలి. ఈ ప్రమేయ ప్రమాణాలు రెండూ సక్రమంగా పని చేస్తున్నప్పుడా వస్తువు తాలూకు జ్ఞానమిక మనకు కలగకపోవట మనేది అసంభవం. పైగా ఆ వస్తువొక విధంగా ఉంటే మరొక విధంగా కలగ దాజ్ఞానం. అదిఎలా ఉందో అలాగే కలుగుతుంది. చక్షురింద్రియం గ్రహించిన ఆ రూపం తద్ద్వారా మనసు కెక్కి మనో యవనిక మీద తదాకారా కారితమైన ఒక ముద్ర Impression of the same form పడుతుంది. ఈ మనోవృత్తికే జ్ఞానమనీ వృత్తి అనీ వృత్తి జ్ఞానమనీ శాస్త్రకారుల వ్యవహారం. ఇది బహ్యామైన వస్తువు ముఖం నుంచి ఊడిపడ్డట్టు తదాకారంగానే ఉదయిస్తుంది. కాబట్టి పురుష తంత్ర మేమాత్రమూ కాదది. నూటికి నూరు పాళ్ళూ వస్తుతంత్రమే.

పోతే ప్రస్తుత మీ బ్రహ్మమనేది కూడా ఒక సిద్ధమైన పదార్ధమే. దానికి కూడా మనమింతకు ముందు పేర్కొన్న జలాది పదార్ధాలలాగా ఒక విశిష్టమైన స్వభావమున్నది. శుద్ధమ్-బుద్ధమ్-ముక్తమ్-సర్వగతమ్-సర్వాత్మకమ్ అని అనేక విధాల వర్ణించింది దాన్ని శాస్త్రం. ఇదే ఇక్కడ కన్నులాగా మనకు ప్రమాణం. ఈ ప్రమాణ వాక్యాన్ని శ్రవణం చేశామంటే శ్రవణేంద్రియం ద్వారా మన మనసులో ఆ బ్రహ్మమనే ప్రమేయం తాలూకు వృత్తి ఒకటి ఆవిర్భవిస్తుంది. దీనికి బ్రహ్మాకార వృత్తి అని పేరు. ఇదే బ్రహ్మజ్ఞానం. ఇప్పుడీ కలిగిన జ్ఞాన మాబ్రహ్మమనే వస్తువుకు సంబంధించిందే కాబట్టి మిగతా బల్లలు, కుర్చీల జ్ఞానం మాదిరే వస్తుతంత్రం. బ్రహ్మమనే వస్తువెలా ఉందో అలాగే ఉంటుందిది. కనుకనే బ్రహ్మతత్త్వాన్ని పట్టుకోటానికి ఈ జ్ఞానమనేదొక్కటే సాధనమవుతున్నది. దీనికి భిన్నంగా మానవుడు తన బుద్ధిబలంతో ఎంత హేతువాదం చేసినా అది ఎన్నటికీ సాధనం కానేరదు. కారణం అది పురుషబుద్ధి జన్యమే గాని వస్తుజన్యమైన జ్ఞానం కాదు.

జ్ఞానమే సాధనమని చెప్పటంలో మరి ఒక సబబు కూడా కనిపిస్తున్నది. అదేమిటంటే సాధనమనేది చాలావరకు దాని సాధ్యాన్ని బట్టి వర్తిస్తుంది. సాధ్యమొక తీరుగా ఉంటే సాధనం మరొక తీరుగా ఉండనేరదు. ఒకదానికొకటి సజాతీయమై ఉండటమే స్వాభావికం. మన అనుభవంలో కూడా చూడండి. ముల్లు తీయటానికి ముల్లే కావాలంటారు. వజ్రాన్ని భేదించేది వజ్రమే నంటారు. అయస్సు నాకర్షించేది అయస్కాంతమేనని తెలుసు మనకు. సజాతీయమే ఎప్పుడైనా సజాతీయానికి సాధనం. ఈ న్యాయాన్ని Law బట్టి చూస్తే జ్ఞానమే బ్రహ్మానికి సాధనం. వేరొకటి గాదు. ఎందుకంటే బ్రహ్మమని నీవేది పేర్కొంటున్నావో అది జ్ఞాన స్వరూపమే. "ప్రజ్ఞానమ్ బ్రహ్మ" అఖండమైన జ్ఞానమే గదా బ్రహ్మమని ఘోషిస్తున్న దుపనిషత్తు. అంచేత సాధ్యమైన బ్రహ్మమెప్పుడు జ్ఞానమయిందో దానిని సాధించే ఉపకరణం Instrument కూడా తత్సజాతీయ Similar మైన జ్ఞానమే కావటంలో ఆశ్చర్యం లేదు.

అంతేకాదు. ఇది బ్రహ్మస్వభావాన్ని బట్టి చెప్పిన మాట. పోతే జీవుడి స్వభావాన్ని బట్టి చూచినా జ్ఞానమే కావాలి సాధనం. మరొకటి కావటానికి లేదు. ఏమి కారణం. జీవుడనేవాడు అనాది సిద్ధమైన అజ్ఞానం నిమిత్తంగా ఏర్పడ్డాడు. అందువల్లనే తన స్వరూపమే అయిన బ్రహ్మతత్త్వాన్ని మరచి దానినే ప్రపంచ రూపంగా దర్శిస్తున్నాడు.

తన జీవభావానికీ కూడాఅజ్ఞానమే మూలకారణం. అదినిర్మూలమైన నాడు సహజమైన తన బ్రహ్మభావాన్ని మరలా తాను అందుకోగలడు. అంచేత మోక్షాన్ని సాధించాలంటే ఇంతకూ అజ్ఞాన నిర్మూలనం కావాలి. అది నిర్మూలం కావాలంటే ఏది సాధనం. దానికేది శత్రువో అది. ఏది దానికి శత్రువు. అజ్ఞానానికి శత్రువేమిటని ప్రశ్నేముంది. జ్ఞానమే దానికి శత్రువు. జ్ఞానం లేకపోవటంవల్లనే గదా అజ్ఞానం రాజ్యమేలుతున్నది. జ్ఞానోదయమయిందంటే చాలు. సూర్యోదయమైతే అంధకారంలాగా ఎక్కడి దక్కడ పటాపంచెలయి పోతుంది. అప్పుడు చిరకాంక్షితమైన మోక్షఫలం తనపాటికి తాను వచ్చి మన ఒళ్ళో పడుతుంది. కాబట్టి జీవుడి దృష్టితో చూచినా జ్ఞానమే మోక్షసాధనమని తేటపడుతున్నది.

## ఆశంకాపరిహారం

అయితే ఇప్పుడొక పెద్ద ఆక్షేపణ వస్తుంది. అదేమంటే జ్ఞానమే సాధన మంటున్నారు మీరు. ఇదిమాత్రం సాధనమెలా అయింది. జ్ఞానమంటే తెలుసుకోవటం గదా. తెలుసు కోటమనేసరికదీ ఒక క్రియే. శారీరకం కాకపోయినా మానసికమైన క్రియ. మానసికమైన ఉపాసన నింతకుముందు తప్పుపట్టారు మీరు. అలాంటప్పుడిది మాత్రం ఎలా ఒప్పుదల అవుతుంది. పైగా తెలుసుకోవలసిందేమిటి మనమిక్కడ. బ్రహ్మస్వరూపమే గదా. బ్రహ్మాన్ని తెలుసుకోవలసి వచ్చిందంటే అది ఏమవుతుంది. మనజ్ఞానానికి విషయమవుతుంది. విషయమెప్పుడయిందో అప్పుడది జ్ఞేయమే గాని ఇక జ్ఞానం కావటానికి వీలులేదు. వీలు కాకుంటే అది బ్రహ్మ స్వభావానికే విరుద్ధం. ఎందుకంటే బ్రహ్మమనేది కేవలం జ్ఞానస్వరూపమేనని ప్రకటించి కూచున్నాము. అలాంటి దాన్ని మరలా జ్ఞేయమని చాటితే అది ఏమి సబబు అని ఆక్షేపణ.

దీన్ని పరిష్కరించటంలో వుంది శంకరుని ప్రతిభ అంతా. ఆయన దీనికొక్కటే సమాధానం చెప్పారు. బ్రహ్మతత్త్వాన్ని సాధించటానికి వాస్తవంలో ఏ సాధనమూ పనికి రాదు. అది కర్మే గాదు. ఉపాసనే గాదు. ఆ మాటకు వస్తే జ్ఞానం కూడా పనికి రాదు. ఎంచేతనంటే సిద్ధమైన పదార్థమది. ఇక దాన్ని మరలా సాధించట మేమిటి. అది స్వవచో వ్యాఘాత Self contradiction మనిపించుకొంటుంది. అయితే కర్మోపాసనలను కాదని చెప్పి జ్ఞానానికెలా పట్టాభిషేకం చేశారని అడగవచ్చు. మేము

జ్ఞానాన్ని సాధకంగా చెప్పటం లేదు - బాధకంగా మాత్రమే నంటారాయన. జ్ఞానం బ్రహ్మాన్ని సాధిస్తున్నదంటే తప్పు. అలా ఎప్పటికీ సాధించబోదది. అయితే మరేమి చేస్తుంది. బ్రహ్మ భిన్నమైన జగత్తును బాధిస్తుంది. అంత మాత్రమే. జగత్తనే ఉపాధి ఒక చీకటిలాగా ఆవరించటంవల్లనే బ్రహ్మమనేది మనకు కనపడకుండా మరుగుపడిపోయింది. చీకటిలాగానే ఈ ఉపాధి అసలెక్కడాలేదు. అది మన అజ్ఞాన కల్పితమే. ఇప్పుడీ అజ్ఞానమనే ఆవరణాన్ని ప్రక్కకు తొలగిస్తే చాలు. గాఢాంధకారం తొలగితే వస్తువు కంటబడినట్టు అజ్ఞానం తొలగితే బ్రహ్మతత్త్వం దానిపాటికదే భాసిస్తుంది. అజ్ఞానమెలా తొలగుతుంది. దానికి బాధకం జ్ఞానమే. జ్ఞానం చేత అజ్ఞానమనేది బాధిత Annihilated మైతే-చివరకేది అబాధకంగా Uncontradicted నిలిచి ఉంటుందో అది ఇక బ్రహ్మమేనని సాధకుడికి చెప్పకుండానే తెలిసిపోతుంది. ఇక దాన్ని క్రొత్తగా సాధించవలసిన పని ఏముంది. సాధించకుండానే దాన్ని సాధించి నట్టయింది. దానికి భిన్నమైన ఉపాధి ప్రపంచాన్ని బాధించటమే దాన్ని మనం సాధించటం ఇలా అనులోమంగా Positive కాక ప్రతిలోమంగా Negative పని చేస్తుంది జ్ఞానమనే సాధనం. అందుకే జ్ఞానాన్ని సాధనమని నిర్దేశించినా మనకు బాధలేదు. మరి ఇలాంటి ప్రతిలోమ మార్గంలోకూడా ఉపయోగపడే యోగ్యత తద్వ్యతిరిక్తమైన కర్మోపాసనలకు రెండింటికీ లేదు. గనుకనే అవి రెండూ అసలే సాధనాలు కాకుండా పోయాయి.

## శాస్త్రతాత్పర్యం

అయితే ఒక ఆశంక. అసలే అవి సాధనాలు కాకపోతే శాస్త్రం వాటినెందుకు ప్రతిపాదించినట్టు. మీ జ్ఞానాన్నికూడా శాస్త్రమే గదా ప్రతిపాదించిందని చెబుతున్నారు. అది జ్ఞానాన్ని ఎలా ప్రతిపాదించిందో కర్మనూ ఉపాసననూ కూడా అలాగే ప్రతిపాదిస్తుంది గదా. రెండింటినీ శాస్త్రమే ప్రతిపాదించినప్పుడు రెండూ మనకు ప్రామాణికమే కావాలి గాని అందులో ఒకటి మాత్రమే మన కుపాదేయం కావట మేమిటి. మిగతా రెండూ కాకపోవటమేమిటి. ఇది ఏమి న్యాయమని ఆక్షేపించవచ్చు.

ఈ ఆక్షేపణనెంతో ముందుగానే పసికట్టారు భగవత్పాదులు. పసికట్టి దానికెంతో అద్భుతమైన సమాధానాన్ని వారు సెలవిచ్చారు. అదేమంటే శాస్త్రం జ్ఞానమే గాక

కర్మోపాసనలను కూడా ప్రతిపాదిస్తున్నదనేది వాస్తవమే. దాని నెవరూ కాదనటం లేదు. అయితే ఆ ప్రతిపాదించటం వాటిని మోక్షసాధనాలుగా ఉద్దేశించి కాదు. మోక్షసాధనమొక్క జ్ఞానమే. దాన్ని ప్రత్యేకంగా ఉపనిషత్తులలో బోధించింది శాస్త్రం. పోతే ఇక విధ్యుపాసనాకాండలలో బోధించిన విషయమంతా మోక్షపురుషార్థం కోసమని గాదు. ధర్మమనే పురుషార్థం కోసం. ధర్మమంటే ఏమిటి. శాస్త్రవిహితమైన కర్మానుష్ఠానం. దానికి ఫలం చివరకు స్వర్గమైనా కావచ్చు. లేక ఆయాదేవతల లోకాలైనా కావచ్చు. కేవల కర్మిష్ఠులకైతే స్వర్గమే ఫలం. మరి ఉపాసకులకైతే ఏయే దేవత నుద్దేశించి ఉపాసిస్తే ఆయా దేవతా సాయుజ్యం ఫలం. ఈ ఉపాసనలు కూడా ఒకటి రెండు గాదు. మూడు తరగతులున్నాయి. కర్మాంగోపాసనా-దేవతోపాసనా సగుణ బ్రహ్మోపాసనా. ఇందులో మొదటి దానికి ఫలం దురితక్షయం రెండవదాని కైశ్వర్యప్రాప్తి - మూడవ దానికి క్రమముక్తి. ఇవి మూడూ ఆయా ఉపాసనలకు ప్రత్యేకమైన ఫలాలు. కాగా ఈ కలాపమంతా ధర్మం క్రిందికే వస్తుంది గాని మోక్షానికిందులో ఏదీ పనికిరాదు. అటు నిత్యనైమిత్తికాది కర్మలూ పనికి రావు ఇటు త్రివిధమైన ఉపాసనలూ పనికి రావు. పితృలోకం నుంచి సత్యలోకం వరకే ఈ రెండింటికీ అవధి. అది దాటిపైకి తీసుకుపోయే స్తోమత వీటి రెంటికీ లేదు. ఆయా లోకాంతర భోగానుభవమిచ్చిన తరువాత అంతగా అయితే మంచి జన్మలను మనకు ప్రసాదిస్తాయి. ఆలోచిస్తే రెండూ బంగారు సంకెళ్లే మన పాలిటికి. ఎందుకని. లోకాంతరాలూ, జన్మాంతరాలు, ఎడతెగకుండా ఏర్పడుతూనే ఉంటాయి కాబట్టి ఈ సంసార బంధం మనకెప్పటికీ తప్పటం లేదు. ఇక వీటివల్ల ముక్తి పొందటమేమిటి మన ముఖం.

అయితే ఇప్పుడు మరలా ఒక ఆక్షేపణ వస్తుంది. అదేమిటంటే శాస్త్రమనేది అత్యంత ప్రామాణికమని మొదటినుంచీ ప్రతిపాదిస్తూ వచ్చారు. అలాంటప్పుడది మానవులకు ఆత్యంతికమైన హితాన్నే బోధించాలి గాని అహితాన్ని ఉపదేశించరాదు. ఉపదేశిస్తే దాని ప్రామాణికత్వమే దెబ్బ తింటుంది. ప్రస్తుతం ధర్మమనేది ఎలాంటిదైనా అది మానవుడికి మోక్షాన్ని ప్రసాదించలేదు సరికదా మీదు మిక్కిలి అతడి నీ సంసార జంబాలంలోనే పడదోస్తుందని వాక్రుచ్చారు. అది మనపాలిటికెంతో అవాంఛనీయమైన పరిస్థితి గదా. మరి ఇలాంటి అనర్థదాయకమైన ధర్మాన్ని ఇంత సవిస్తరంగా ఎందుకు

బోధిస్తున్నది శాస్త్రం. బోధిస్తే అన్ని విధాలా వాంఛనీయమైన మోక్ష పురుషార్థాన్ని మాత్రమే బోధించి ఊరుకోవాలి. అంతేగాని ఒకవైపు సర్వోత్తమమైన తత్త్వాన్ని వర్ణిస్తూ మరొకవైపు తద్విరుద్ధమైన ఆతత్త్వాన్ని మనకందివ్వటమేమిటి. ఇలా రెండు నాలికలతో మాటాడితే దానిపైన మనకు ప్రామాణ్యబుద్ధి ఎలా ఏర్పడుతుంది. ఏర్పడకపోతే అలాంటి శాస్త్రాన్ని నమ్మి ముందుకు ప్రయాణం చేయుట మంధగోలాంగూల న్యాయమే అవుతుంది గదా – అని ప్రశ్న.

## ఏకవాక్యత

దీనికి శంకర భగవత్పాదులు చేసి చూపిన సమన్వయమంతా ఇంతా గాదు. బ్రహ్మాండమైన సమన్వయ Compromise మది. పైకి చూస్తే శాస్త్రంలోని పూర్వోత్తర భాగాలకెంతో వైరుధ్యమున్నట్టు కనిపిస్తుంది. ద్వైత జగత్తులోనే పడదోసి మన ప్రాణం తీసేది ఒకటైతే – దాని కతీతమైన అద్వైత సత్యానుభవాన్ని అందజేసేది మరొకటి. చూడబోతే ఈ కర్మకాండకూ ఆ జ్ఞానకాండకూ – ఏ మాత్రమూ లంగరందటంలేదు. కానీ లోతుకు దిగి చూస్తే ఇందులో ఒక గొప్ప సమన్వయ సూత్రం దాగి ఉందంటారాయన. కర్మోపాసనలు రెండూ మనం వాటి వాటికి నిర్దిష్టమైన స్వర్గాది ఫలాలకే గాదు. కావలసి వస్తే వాటిని మనం మోక్షఫలప్రాప్తికే ఉపయోగపడేలా చేసుకోవచ్చు. ఒక మహానది అనవసరంగా పోయి లవణ సాగరంలో కలుస్తుంటే దాని కానకట్టలు కట్టి ఆ నదీ జలాన్ని మనం పంట భూములవైపు మళ్ళిస్తాము. అలాగే ఈ కర్మాదులను కూడా కేవలం ధర్మపురుషార్థం వైపే పయనించకుండా బ్రహ్మతత్త్వం వైపు త్రిప్పుకోవచ్చు. ఎట్లాగంటే కర్మలనేవి అసలు నాలుగు విధాలు. నిత్యమూ – నైమిత్తికమూ – కామ్యమూ–నిషిద్ధమూ. వీటిలో నిషిద్ధాన్ని ఎలాగూ వర్జిస్తాము. పోతే కామ్యాన్ని కూడా వర్జించాలన్నారు వేదాంతులు. కామ్యమంటే స్వర్గ సుఖదాయులైన జ్యోతిష్టోమాదులు. వీటి రెంటినీ పరిహరిస్తే మనకిక స్వర్గ నరకాల చింతేలేదు. పోతే మిగిలిన సరకు నిత్యనైమిత్తికాలు రెండు. జపహోమాదులు నిత్యకర్మలైతే ఆయా నిమిత్తమున్నప్పుడాచరించే గ్రహణ సంక్రమణాదులు నైమిత్తికాలు. ఇవి రెండూ మాత్ర మనుష్ఠిస్తూ పొమ్మన్నారు. అయితే మామూలుగా కాక ఈశ్వరార్పణ బుద్ధితో నిరహంకారంగా ఫల నిరపేక్షంగా అనుష్ఠించాలనేది షరతు. తన్మూలంగా

ప్రత్యవాయాది దోషాలు తొలగిపోయి సాధకుడి చిత్తం శుద్ధమయితే క్షేత్రమనేది తయారయిందని అర్థం. పోతే ఇక ఉపాసనలనే రెండవ జాతి కర్మలున్నాయి. అవి కూడా సకామంగా కాక నిష్కామంగా చేయమని సలహా ఇచ్చారు. ఉపాసించే దేవతను కూడా ఆ పరమేశ్వరుని ఒకానొక విభూతే నని భావించమన్నారు. దానితో చిత్తానికి శుద్ధియే గాక ఒక విధమైన ఏకాగ్రత కూడా సిద్ధిస్తుంది. ఇందులో ఉన్న మర్మమేమంటే శుద్ధివల్ల ఆవరణ రూపమైన తమోమాలిన్యం క్షాళితమైతే ఏకాగ్రతవల్ల విక్షేపరూపమైన రజఃకాలుష్యాన్ని కడిగివేసి నట్టవుతుంది. రజస్తమో దోషాలు రెండూ నశిస్తే సత్త్వం విశుద్ధమై చిత్తక్షేత్రంలో జ్ఞానబీజాలు వాటిపాటికవే అంకురిస్తాయి. ఆజ్ఞానమిక మోక్షఫలాన్ని మనకు సాక్షాత్తుగానే ప్రసాదిస్తుంది.

ఈ ప్రకారంగా శాస్త్రంలో పూర్వభాగమైన కర్మకాండకూడా మోక్షానికే సాధన మవుతున్నది. జ్ఞానం సాక్షాత్తుగానైతే అది జ్ఞానం ద్వారా పరంపరగా సాధనమవుతుంది. ఏతావతా రెండూ కలిసి చివరకు ఒకే ప్రయోజనాన్ని సాధిస్తున్నాయి గనుక రెంటికీ ఏకవాక్యత సిద్ధిస్తున్నదంటారు ఆచార్యులవారు. **"కామ్యవర్జితమ్ నిత్యమ్ కర్మజాతమ్ సర్వమ్ ఆత్మ జ్ఞానోత్పత్తి ద్వారేణ మోక్ష సాధనత్వమ్ ప్రతి పద్యతే-ఏవమ్ కర్మకాండే నాస్య ఏక వాక్యతావగతిః"** అని వారి వాక్యం. కర్మకాండ అన్నారు గాని ఉపాసన అనలేదు గదా అని శంకించవచ్చు. ఇలాంటి శంక మనకు కలుగుతుందేమోనని ఆయనే శంకించి **"కర్మ-అపర బ్రహ్మ విద్యాంచ"** అని విద్యను కూడా జోడించారు. విద్య అంటే ఉపాసన అని అర్థమిక్కడ. ఎందుకంటే అపరబ్రహ్మ విషయం గనుక. దానికే దిక్కులేనప్పుడిక మిగతా దేవతో పాసనల మాట తడవనే అక్కరలేదు.

ఇంతకూ ఈ దృష్టితో చూస్తే మొత్తం వేదానికంతటికీ కూడా తాత్పర్యం మోక్షమేనని ఆ మోక్షఫలానికి సాధనంగ ఒక్క జ్ఞానాన్నే అది దానిమీద దీనిమీద నెపం పెట్టి బోధిస్తున్నదని మనకు బోధ పడుతుంది. ఈ మాట కూడా ముక్త కంఠంతో స్వామివారు లోకానికి చాటుతున్నారు. **"ఏవ మేతస్మిన్ ఆత్మ విషయే సర్వోవేదో యథా ఉపయుక్తో భవతి - త త్తథా వక్తవ్య మితి - తదర్థేయమ్ కండికా"** అని ఖండింతంగా వేద హృదయాన్ని బయట పెట్టారాయన.

అలాంటప్పుడిక శాస్త్రం ధర్మాన్నీ బ్రహ్మాన్నీ రెండు పరస్పర విరుద్ధమైన భావాలను బోధిస్తున్నదనే ప్రశ్నేలేదు. అసలు దాని ఏకైక లక్ష్యం బ్రహ్మజ్ఞానాన్ని ఈ జీవకోటికి ప్రసాదించి గట్టున పడవేయటమే. తదతిరిక్తంగా ఇక ఏది చెప్పినా మనలను మరలా అమాంతంగా ఈ సంసార సాగరంలో పడద్రోయటమే అవుతుంది. అయినా జ్ఞానకాండకు భిన్నంగా పూర్వభాగమైన కర్మకాండను వర్ణించిందంటే అది ఆ పాత రమణీయమే గాని నిజంలో శాస్త్రవివక్షితం కాదని ఘంటాపథంగా చాటుతారు శంకరులు. పూర్వభాగ ముత్తరభాగమైన జ్ఞానానికి కేవలం మార్గదర్శకమే. దాని కోసమే దీని ప్రస్తావన. దీని నాలంబనం చేసుకొని ఆ బలంతో జ్ఞాన ప్రాసాదాన్ని అధిరోహించమని శాస్త్రం మనకు చేసే హితోపదేశం. అంతకన్నా వేరు ప్రయోజనం లేదు దీనికన్నారు భగవత్పాదులు. ఇంకా కొంత దూరంపోయి ఒక గొప్ప రహస్యాన్ని కూడా బయట పెట్టారాయన. అసలీ కర్మలూ – ఉపాసనలూ చేయమని బోధించటం అవి స్వయం సంపూర్ణమని భావించి అక్కడికే నిలిచి పొమ్మనిగాదు. వాటి మంచి చెడ్డల ననుభవించటంవల్ల మనకు తీవ్రమైన వైరాగ్య భావమేర్పడి ఎప్పటికైనా వాటి నుంచి వైదొలగటానికీ – నిశ్శ్రేయస ప్రదమైన బ్రహ్మజ్ఞానాని కున్ముఖులమై ప్రవర్తించటానికీ – అని వ్యాఖ్యానించారాయన.

న్యాయమైతే శాస్త్రమిలా డొంక తిరుగుడుగా బోధించి ఉండగూడదు. కాని ఇది దాని అపరాధం కాదు. లోకుల అపరాధం. లోకంలో కర్మ జడులు కొందరున్నారు ఏదో ఒక కర్మచేస్తూ తద్ద్వారానే చివరకు మోక్షాన్ని కూడా అందుకోవాలని చూస్తారు వారు. అంతకు తప్ప సకల కర్మ నివృత్తి రూపమైన జ్ఞానమార్గం వారికంతు పట్టదు. మరి కొందరైతే ఆ బ్రహ్మాన్ని కూడా ఏదో ఒక ఆకారంలో ధ్యానించి దాని అనుగ్రహంతో ఐహికా ముష్మిక సుఖాలూ వాటికీ అతీతమైన మోక్షసుఖమూ కూడా బావుకోవాలని ఆశపడతారు. ఇది మానవుల స్వభావంలోనే కరుడుగట్టి ఉన్నట్టి బలహీనత. ఎంత కాదని శాస్త్రం మొరపెట్టినా వదలిపెట్టే వ్యవహారం కాదు. అందుకని శాస్త్రం సర్వులనూ ఏదో ఒక మార్గంలో ఉద్ధరించటానికి బద్ధకంకణ మయినది కాబట్టి మొట్టమొదట అసత్యమయినా అనిత్య సుఖదాయకమయినా కర్మలనూ ఉపాసనలనూ వారి కోరికలకు తగినట్టు ఏ కరువు పెడుతుంది. కొన్నాళ్ళు వాటి వెంటబడి పోయి వాటివల్ల కలిగే కష్టనష్టాలు అనుభవించి ఇంతేనా ఇంతకు

మించిన శాశ్వతపదవి ఏదైనా ఉందా అని వచ్చి ప్రాధేయపడిన జిజ్ఞాసువులకు వారి కోరిక కనుగుణంగా ఔపనిషదమయిన జ్ఞానాన్నే బోధిస్తుంది.

కాబట్టి శాస్త్రం చేసిన పాపమేమీ లేదు. ఒక దీపంలాంటిది శాస్త్రమంటారు శంకరులు. దీపం మనకు వెలుగును ప్రసాదిస్తుంది. ఆ వెలుగులో మంచి పనీ చేయవచ్చు మనం. చెడ్డ పనీ చేయవచ్చు. ఏదీ చేయక మిన్నకుండవచ్చు. అన్నింటికీ అది సాక్షిగా నిలుస్తుంది. అన్ని పనులకూ ఉపకరిస్తుంది. మనం చేసే మంచి చెడ్డలతో దానికి నిమిత్తం లేదు. అలాగే మానవులలో మంద మధ్యమోత్తమ శ్రేణులెప్పుడూ వుంటారు. వారి మనస్తత్వాలు కూడా అలాగే ఉంటాయి. ఆయా స్వభావాలకు తగినట్టుగానే శాస్త్రం వారికే సహాయపడుతుంది. అది శాస్త్ర అపరాధమెలా అవుతుంది. హితానుశాసనం చేసేది గదా శాస్త్రం. అది మంచినే బోధించాలిగాని చెడ్డను ప్రోత్సహించటం తప్పుగదా అంటే దానికి సమాధానం ముందే చెప్పాము. చెడ్డను చెప్పినట్టు కనిపిస్తున్నా అది దాని వివక్షితం కాదు. క్రమంగా దానిమీద వైముఖ్యం కలిగించి విరక్తుడైన మానవుణ్ణి జ్ఞానాని కభిముఖుణ్ణి చేయటమే అందులో ఇమిడి ఉన్న స్వారస్యం.

దీనికి నిదర్శనం శాస్త్రంలో ఉత్తర భాగం పూర్వభాగాన్ని ఖండించటంలోనే మనకు తేటపడుతున్నది. విద్యోపాసనల నెంతగానో ఖండిస్తాయి ఉపనిషత్తులు. రెండూ ఉద్దిష్టమే అయితే ఒకదాన్ని మరొకటి ఆక్షేపించటం దేనికి. మొదటిది చెప్పిన ధర్మం సాపేక్షమే గనుక రెండవదైన జ్ఞానం దగ్గరికి వచ్చే సరికది దీనికి పూర్వపక్షమయి పోయింది. ఆ జ్ఞానం నిరపేక్షమయినది గనుక అదే నిరాక్షేపమయిన సిద్ధాంతంగా నిలిచిపోతున్నది. అందుకే ఆక్షేప సిద్ధాంతాలను పూర్వోత్తర పక్షాలుగా శాస్త్రంలో వ్యవహరించటం. ఇందులో కర్మమీమాంస అంతా పూర్వపక్షమయితే బ్రహ్మ మీమాంస ఒక్కటీ ఉత్తర పక్షమూ లేదా సిద్ధాంతమయింది. ఇదే అసలైన వేదతాత్పర్యం కాబట్టి వేదాంతమని దానికే పేరు వచ్చింది. అంటే వేదపూర్వభాగ ప్రతిపాదితమయిన విద్యోపాసనలు రెండూ దానిలోనే పర్యవసానం చెందితే ఒక్క జ్ఞానమే చివరకు శాస్త్రానికంతటికీ ప్రతిపాద్యమయిన విషయమని తేల్చిపారేశారు శంకర భగవత్పాదులు.

అయితే దీనిమీద మనం మరలా సంజాయిషీ చెప్పుకోవలసిన ప్రశ్న ఒకటున్నది. అదేమంటే జ్ఞానమనేది వస్తుతంత్రమని వర్ణించారు మీరు. వస్తుతంత్రమంటే ఆయా వస్తువుల స్వభావాన్ని బట్టి ఏర్పడేది. మరి వస్తువనేది మనకు బాహ్యంగా కనిపించే పరినిష్ఠితమయిన Established పదార్థం. దాన్ని చూడగానే మన మనసులో దాని తాలూకు వృత్తి ఒకటి జన్మిస్తుంది. దానినే మనం జ్ఞానమంటున్నాము. ప్రస్తుతం మీరు పేర్కొనే బ్రహ్మం కూడా అలాంటి ఒక పరినిష్ఠతమైన పదార్థమే. పైగా మిగతా జాగతిక పదార్థాలలాగా అది ఏదో ఒకచోట ఏదో ఒక కాలంలో ఒకానొక రూపంలో నియంత్రితమై Confined ఉన్నది కూడా కాదు. సార్వత్రికమూ, సార్వకాలికమూ, సార్వవస్తుకమూ అయిన వస్తువని మీరే నిర్దేశిస్తున్నారు. అలాంటిదాన్ని గ్రహించి అర్థం చేసుకొనే బుద్ధి అనే ప్రమాణం కూడా మనవద్ద అనుక్షణమూ ఉండనే ఉంది. ఇలా ప్రమాణ ప్రమేయాలు రెండూ సిద్ధమయి ఉన్నప్పుడిక జ్ఞానమనేది దానిపాటికది ఎట్లాగూ నిష్పన్నమవుతుంది గదా మరి మధ్యలో మనకీ శాస్త్రమనే రాయబారి దేనికి. ఒకవేళ ఉందనుకొన్నా నిర్జీవమైన శాస్త్రం వస్తువునెలా గ్రహించగలదు. ఎప్పటికైనా సజీవమైన మానవుడి బుద్ధికే గదా అది గోచరించవలసింది. ఆ బుద్ధి ఎలాగూ మనదగ్గరే ఉంది. అలాంటప్పుడిక శాస్త్రమనే దాని ప్రసక్తి మనకు దేనికని ప్రశ్న రావటం సహజమే.

## శాస్త్రైక ప్రామాణ్యం

ఇక్కడే శాస్త్రానికుండే ప్రాధాన్యమేమిటో మనకు స్పష్టంగా తెలిసిపోతుందంటారు శంకరులు. ప్రతివాదులే శాస్త్రం మన కక్కరలేదని వాదిస్తున్నారో చివరకాశాస్త్రమే మనకు శరణ్యమవుతున్న దంటారాయన. ఎందుకని. బ్రహ్మమనేది ఒక సిద్ధమైన వస్తువనే మాట వాస్తవమైనా అది మనకు ప్రమేయమయ్యే వస్తువు గాదు. మిగతా లౌకిక వస్తువుల సంగతి వేరు. ఏదో ఒక ప్రమాణానికవి ప్రమేయ మవుతుంటాయి. మన దగ్గర ఉన్న ప్రమాణాలు రెండే. ఒకటి చక్షురాదులైన ఇంద్రియాలు. ఇవి ప్రత్యక్ష ప్రమాణం. రెండు మనస్సనే అంతరింద్రియం. ఇదే అనుమాన ప్రమాణం. ఇంతకు మించి మరొక ప్రమాణం లేదు మన అనుభవంలో. ఏ వస్తువును గ్రహించినా మన మీరెండు ప్రమాణాల సహాయంతోనే గ్రహించాలి. మరో మార్గంలేదు. శబ్ద

స్పర్శ రూప రసగంధాలే గదా మనం గ్రహించవలసిన విషయాలు. అవి మనకు బాహ్యంగా దృష్టమైనంత వరకూ భయంలేదు. చక్షురాదికమయిన ప్రత్యక్ష ప్రమాణంతోనే గ్రహిస్తాము. అయితే అంతా అలా ఎప్పుడూ దృష్టమవుతుందని చెప్పలేము. ఒకప్పుడు కొంత గోచరమయి కొంత అగోచరం కావచ్చు. అప్పుడీ దృష్టమయిన అంశాన్ని ఆధారం చేసుకొని అదృష్టమయిన భాగాన్ని అన్వేషించవలసి వస్తుంది. అలా అన్వేషించి తెలుసుకొనేదే మనోవృత్తి రూపమైన అనుమాన ప్రమాణం. దీనితో ప్రమేయ జగత్తంతా మానవుడి పరిధిలోకి వస్తున్నది.

పోతే ప్రస్తుత మీ బ్రహ్మమనేది ఒక్కటే ఇలా ప్రేమయ కోటిలో చేరని వస్తువయి కూచున్నది. వస్తువైనా ఆత్మరూపం గనుక అప్రమేయమది. నామరూపాదులేవీ లేనిది కాబట్టి చక్షురాది ప్రత్యక్ష ప్రమాణమక్కడ పని చేయదు. ప్రత్యక్షమే పని చేయకపోతే అనుమాన మసలే పనికి రాదు. ప్రత్యక్షాన్ని అనుసరించి కలిగేది గదా అనుమానం. ఏదో ఒక అంశం ప్రత్యక్షమయితే దాన్ని బట్టి మిగతా భాగమనుమేయ Inferred మవుతుంది. ఇలాంటి అంశానికే తార్కికులు లింగమని పేరు పెట్టారు. ధూమమనేది అగ్నికి లింగం Indicator ఇలాంటి లింగ పరామర్శకే మాత్రమూ ఆస్పదం లేదు బ్రహ్మ విషయంలో. కాబట్టి అనుమానప్రమాణం కూడా అక్కడ నిరుపయోగమే. ఇవి రెండే మనకున్న ప్రమాణాలు. రెండూ ఇలా నిర్వీర్యమయిపోతే ఇక మన గతి ఏమిటి. బ్రహ్మతత్త్వాన్ని పట్టుకోటాని కసలు ప్రమాణమే లేకుండా పోతుంది. అప్రమాణమైన దాని కసలస్తిత్వమే లేదని మన సిద్ధాంతం.

అంచేత అవశ్యంగా మరొక ప్రమాణాన్ని మానవుడు శరణు వేడవలసి వస్తున్నది. అదే శాస్త్రమనే మూడవ ప్రమాణం. ప్రత్యక్షానుమానాల కసాధ్యమైన దాన్ని ఇది సాధిస్తుంది. వాటి కతీతమైన జ్ఞానాన్ని మనకందిస్తుంది. వాటి కతీతమైన విషయాలు రెండే. ఒకటి ధర్మం Religious fact మరొకటి బ్రహ్మం. Philosophical fact. ఈ రెండు మానవాతీతమైన రహస్యాలను మనకు బోధించటానికే శాస్త్రమనేది అవతరించింది. ఇందులో కూడా ధర్మమనేది నామరూపాత్మకమైన ద్వైతప్రపంచ పరిధిని దాటిపోలేదు. కాబట్టి అదైనా ప్రమేయమవుతుందేమో గాని అనామ రూపాత్మకమైన బ్రహ్మమనే అద్వైత సత్యమసలే ప్రమేయంకాదు. అసలేకాకపోతే దానికి శాస్త్రం మాత్రమెలా పనికి వస్తుందని ఆశంక చేయవచ్చు. దానికి శంకరులిచ్చే

సమాధానమేమంటే శాస్త్రమనే దాన్ని ఒక దీపంలాగా చూడమంటారాయన. దీపమనేది పదార్థాన్ని క్రొత్తగా తయారుచేయదు. పదార్థమక్కడేఉన్నది. అయితే దాన్ని చీకటి ఆవరించి ఉంది. అందు మూలాన అది మనకంటికి కనపడటం లేదు. ప్రస్తుతమది కనపడాలంటే దాన్ని కప్పి ఉన్న చీకటి తెర తొలగితే చాలు. కనపడుతుంది. ఆ తొలగించటమే దీపం చేసే పని. అంతకుమించి మరేమీ లేదు.

శాస్త్రం కూడా ప్రస్తుతమిలాంటి కార్యమే నిర్వర్తిస్తున్నది. మీరు చెప్పినట్టు బ్రహ్మమనేది సర్వత్రా ఉంది. దాన్ని ఎవరూ క్రొత్తగా సృష్టించనక్కరలేదు. మరి దాన్ని పట్టుకోగల బుద్ధీంద్రియం కూడా మనలనంటి పట్టుకొనే ఉంది. అయినా మన కర్థం కావటం లేదంటే ఏమిటర్థం చీకట్లో వస్తువున్నా చూచే నేత్రమున్నా సరిపోదు. చీకటనే ఆవరణాన్ని తొలగించే దీప ప్రకాశమొకటి తోడు కావాలి కదా. అలాగే ఇక్కడ మనకు దీపస్థానీయమైన శాస్త్ర ప్రమాణమొకటి అవస్యంగా జతపడాలి. దాని సహకారం లేకపోతే బ్రహ్మ పదార్థమెంత సర్వవ్యాపకమయినా బుద్ధి దానికెంత అభిముఖంగా ఉన్నా సుఖం లేదు దాన్ని ఎన్ని జన్మలకూ పట్టుకోలేము మనం.

అయితే సజీవమయిన బుద్ధి పట్టుకోలేనిది – నిర్జీవమయిన శాస్త్రం మాత్రమెలా పట్టుకోగలదని గదా మీ ప్రశ్న. దీనికింతకు ముందే సమాధానమిచ్చి ఉన్నాము. శాస్త్రమంటే కాగితమూ, అక్షరమూ కాదు. అక్షరమయిన మన ప్రాచీన మహర్షుల అనుభవమే శాస్త్రం. అదే గ్రంథ రూపంగా మనకిప్పుడు ప్రత్యక్షమవుతున్నది. ఇది వారి అనుభవ గర్భయిన మాట కాబట్టి సజీవమే. అప్పటికది మరలా పురుష తంత్రమే గదా అని ఆక్షేపించరాదు. సామాన్య బుద్ధి కతీతమయిన సమాధి దశలో దర్శించిన సత్యం కాబట్టి అది అపౌరుషేయమని Supramental ముందే తీర్మానించాము. అంచేత పురుష తంత్రమనే ఆక్షేపణ లేదిక వస్తుతంత్రమే.

## శాస్త్రవైశిష్ట్యం

అయితే వస్తుతంత్రమయినా బ్రహ్మమనేది దేనికీ విషయం కాదని గదా ప్రతిపాదించారు. వస్తుస్వభావమలాంటి దయినప్పుడది శాస్త్ర ప్రమాణానికి మాత్రమెలా ప్రమేయమవుతుందని మరలా ఆక్షేపించవచ్చు. దీనికి కూడా సమాధానం చెప్పే ఉన్నారు శంకర భగవత్పాదులు. శాస్త్రమనేది మిగతా ప్రత్యక్షాది ప్రమాణాల

లాగా సాక్షాత్తుగా పట్టి ఇవ్వదు ప్రమేయాన్ని విధి ముఖంగా కాక నిషేధ ముఖంగా సూచిస్తుంది దాన్ని. దానితో ఆవరణ భంగమై తత్త్వజ్ఞానమనేది మనకు నాంతరీయకంగానే Automatic సిద్ధిస్తుందంటారు దేశికోత్తములు. తత్త్వాన్ని శాస్త్రం సాక్షాత్తుగా పోయి స్పృశించదు గనుక అప్రమేయమనే మాటకు తిరుగులేదు. అయినా దానిజ్ఞానం మన కందుతూనే ఉంది కాబట్టి ఒక విధంగా మనకు ప్రమేయం కూడా అవుతున్నది. దీనివల్ల అప్రమేయం ప్రమేయమెలా అవుతుందనే విప్రతిపత్తికి Contradiction కూడ చోటు లేదు.

అంచేత శాస్త్రమనేది మన చక్షురాదీంద్రియాల మాదిరీ-బుద్ధి అనే అంతరేంద్రియం మాదిరీ మనకు సన్నిహితం కాకపోయినా వాటికన్నా బరోసా పడదగిన ప్రమాణం. చక్షురాదులు కేవలం మన స్వరూపానికి వ్యతిరిక్తమయిన అనాత్మ వస్తువులనే మనకెప్పుడూ ప్రదర్శిస్తుంటాయి. బుద్ధివృత్తులు కూడా తజ్జన్యమైన వాసనా ప్రపంచాన్నే మనకు చూపుతుంటాయి. అంతేగాని తద్విలక్షణమైన ఆత్మజ్ఞానాన్ని మనకవి రెండూ అందివ్వలేవు. మరి ఈ శాస్త్ర ప్రమాణమలా కాదు. అనాత్మ జగత్తునంతా కొట్టివేసి మరుగుపడిన మన ఆత్మస్వరూపాన్నే మనకు ముమ్మూర్తులా చూపుతుంది. అసలాత్మ మనకు ప్రత్యక్షం కావటం లేదంటే హాస్యాస్పదం. ఆత్మ అంటే మన స్వరూపమే. మన స్వరూపమే అయి ఉండి మనకది ఎందుకు ప్రత్యక్షం కాదు. దాని మీద అనవసరంగా వచ్చి పడ్డ అనాత్మ ప్రపంచం వల్లనే అది ప్రత్యక్షం కావటంలేదు. మీదు మిక్కిలి పరోక్షంగా ఎక్కడో ఉన్నట్టు భాసిస్తున్నది. ఇప్పుడా అనాత్మ నిర్మాల్యాన్నంతటినీ నిరాకరిస్తుంది కాబట్టి శాస్త్రమే ఆత్మ ప్రత్యక్షానికి తోడుపడే ప్రమాణమైంది విషయ జగత్తనే ప్రతిబంధ మణుమాత్రం కూడా తొలగించలేని చవటలు కాబట్టి ప్రత్యక్షానుమానాలే నిజానిక ప్రమాణ మవుతున్నాయి.

అసలు రహస్యమేమంటే శాస్త్రమనేది ఒక శబ్దం మాత్రమే utterance అయినా ఆ శబ్దం మన చెవిలో పడి మనసు కెక్కుతుంది. వెంటనే ఆ శబ్దం చెప్పే అర్థమేదుందో దాన్ని భావన చేస్తుంది మనస్సు ఆ భావన కనురూపమయిన ఒక రూపం మన మనః ఫలకం మీద హఠాత్తుగా హత్తుకొంటుంది. ఈ రీతిగా శబ్దమనుమాన స్థాయికి దిగి ఆ అనుమానం ప్రత్యక్ష స్థాయికి దిగివస్తున్నది కాబట్టి శబ్ద ప్రమాణమే చివరకు

ప్రత్యక్ష ప్రమాణమయింది. అంచేత అది ఏదో మనకు దూరమని భావించనక్కరలేదు. దూరంగా కనిపించినా అదే సత్యమైన స్వరూపాన్ని పట్టి ఇచ్చి మనకు సన్నిహిత మవుతున్నది. పోతే సన్నిహితంగా ఉన్నట్టు భ్రమ కొలుపుతూ అసత్యమైన అనాత్మ జగత్తునే నిత్యమూ ఇలా ప్రదర్శించే ఈ ప్రత్యక్షానుమానాలే మనకు దూరమవుతున్నాయి. కాబట్టి శాస్త్రమే సజీవం. నిర్జీవమివే నిజానికి. పురుష సంబంధులు కాబట్టి ఇవి రెండూ పురుషతంత్రమైన జ్ఞానాన్నే మనకిస్తాయి. ఆ జ్ఞానమెప్పుడూ భ్రమ ప్రమాదాలకు లోనైనదే. అది యథా భూత విషయమెలా అవుతుంది. యథాభూత జ్ఞానమే కావాలంటే అది వస్తుతంత్రమే కావాలి. అలాంటి వాస్తవికమైన జ్ఞానం మనకి ఆగమరూపమైన శాస్త్ర ప్రమాణమే ప్రసాదించాలి గాని మరేదీ గాదు. అది ఒకవేళ విధ్యుపాసనా రూపమైన కర్మకలాపాన్ని బోధించినా పురుషుల బుద్ధిబేధాన్ని అనుసరించి బోధించటమే గాని తాత్పర్య దృష్టితో గాదు. తాత్పర్యం దానికి వస్తుతంత్రమైన ఈ అద్వైత జ్ఞానాన్ని మనకందించటమే. జ్ఞానప్రాప్తి కుపాయ భూతంగానే Means ఆ కర్మోపాసనలను కూడా మనకది ఏ కరువు పెట్టటం.

# జ్ఞానమే అనుష్ఠానం

అయితే అన్నీ అయిన తరువాత ఇప్పుడాఖరు సారిగా మనం జవాబు చెప్పుకోవలసిన ఆక్షేపణ ఒకటుంది. బ్రహ్మమనేది వస్తుసిద్ధం. దానిని సాధించటానికి వస్తుతంత్రమైన జ్ఞానం తప్ప పురుషతంత్రమైన కర్మాదికమేదీ పనికి రాదని తీర్మానించారు. బాగానే ఉంది.కాని జ్ఞానానికి ముందు గాకపోయినా జ్ఞానోదయమైన తరువాత మరలా మనకు కర్మ కావలసిందే గదా. ఎందుకంటే మనకు కలిగిన ఆ జ్ఞానం కేవలం మానసికమే. అది ఆ బ్రహ్మ తత్త్వానికి చెందిన ఒకానొక ప్రత్యయం Idea. ప్రత్యేయమే పదార్ధమెలా అవుతుంది. ప్రత్యయం వేరు. పదార్థం వేరు పదార్థమనేది మనకు బాహ్యంగా ఎక్కడో ఉంటే దాని తాలూకు బొమ్మ Image ఒకటి మనసులో కనిపిస్తుంది మనకు. ఈ కనిపించే చిత్రాన్నే జ్ఞానమని పేర్కొంటున్నాము మనం. ఇది ఆ జ్ఞేయమైన వస్తువు చిరునామా మాత్రమే. ఈ

చిరునామా పట్టుకొని పోయి వెతికితేగాని ఆ పదార్థం మనకు దొరకదు. కేవల జ్ఞానమే తత్ప్రాప్తి కానేరదు. ఒక ఇల్లు కట్టే జ్ఞానమున్న మాత్రాన అది ఆ ఇంట్లో చేరటం కాదు గదా. పాకజ్ఞాన మున్నంత మాత్రాన పక్వమైన భక్ష్యాలను రుచి చూడటం కాదు గదా. అలాగే బ్రహ్మజ్ఞానమే బ్రహ్మానుభవం కాబోదు. అనుభవమే కావాలంటే ఈ జ్ఞానమే బ్రహ్మతత్త్వానికి చెందిందో ఆ తత్త్వాన్ని వెదకి పట్టుకొనే ప్రయత్నం చేసి తీరాలి. ప్రయత్నమే చేయవలసి వస్తే అది ఒక కర్మే గదా. అలాంటప్పుడు జ్ఞానం వస్తుతంత్రమని మురిసిపోయి సుఖమేముంది. దానికి మరలా పురుషతంత్రమైన కర్మ తోడు కావలసిందే గదా - అని ఆక్షేపణ.

దీనికి శంకరులిచ్చిన సమాధానమే సమాధానం. ఎంతో సూక్ష్మేక్షిక Keen Insight తో పరిశీలిస్తే గాని అందులోని ధర్మసూక్ష్మం మన ఆకళింతకు రాదు. అదేమిటంటే పూర్వపక్షులు చేసే ఆక్షేపణ ఈ ద్వైత జగత్తులో అయితే సరిపోతుంది గాని అద్వైత విషయంలో అది ఏ మాత్రమూ వర్తించదంటారాయన. ద్వైతమంటే ఇటు లోక వ్యవహారమైనా కావచ్చు. అటు శాస్త్ర వ్యవహారమైనా కావచ్చు. ఎందులోనైనా జ్ఞానం వేరు. అనుభవం వేరు. ఒక పాక జ్ఞానమే పాకం కాదు. గృహజ్ఞానమే గృహం కాదు. మనకు బాహ్యంగా లోకంలో ఉన్నాయవి. పోయి ప్రవేశించవచ్చు. వండి రుచి చూడవచ్చు. అలాగే ఒక జ్యోతిష్టోమ యాగం చేయాలని శాస్త్రం బోధించిందంటే ఆ బోధే యాగంకాదు. కిమ్-కేన-కథ-మ్మనే మూడు భావాలకు జవాబు చెబుతూ దానికి కావలసిన ఋత్విక్కులూ-అగ్నిహోత్రమూ-సమిధలూ- ఇలాంటి సామగ్రి నంతా పోగు చేసుకొని బాహ్యంగా ఒక కర్మ నాచరిస్తేనే అది యాగమవుతుంది. ఇలా జ్ఞానం కంటే భిన్నంగా క్రియ అనేది ఒకటుంది. వీటిలో జ్ఞానం క్రియగా మారినప్పుడే అది అనుభవంగా చలామణి అవుతుంది. అంతేగాని జ్ఞానమే అనుభవం కాదు. ఇది ద్వైత వ్యవహారం వరకూ సత్యమే. కనుకనే దానికి పురుష తంత్రమని ముద్ర వేసింది మనం. పురుషుడి చెప్పుచేతలలో ఉందీ వ్యవహారమంతా.

పోతే ప్రస్తుత మీ అద్వైత వ్యవహార మలాంటిది గాదు. ఇది వస్తుతంత్రమని చెప్పాము. వస్తువనేది అద్వితీయమైన బ్రహ్మత్వం. జీవజగత్తులనే వాసన కూడా

మిగల్చని పరిపూర్ణ చైతన్యమది. దానికి బాహ్యంగా జ్ఞేయమైన బ్రహ్మమంటూ మరొకటి ఏదీ లేదు. **"ప్రజ్ఞానమ్ బ్రహ్మ - విజ్ఞానమానందమ్ బ్రహ్మ"** అన్నప్పుడు బ్రహ్మమనేది జ్ఞాన స్వరూపమే. అది జ్ఞేయమెలా అవుతుంది. జ్ఞేయమయ్యేది ప్రపంచమే. ఆ ప్రపంచం కూడా ఏదో గాదు బ్రహ్మమేనని నిరూపించాము. ప్రపంచమంతా లయమైన తత్త్వమే బ్రహ్మమని తేల్చుకొన్నప్పుడిక మరలా దాన్ని ఈ ప్రపంచంలో ఎక్కడ ఉందా అని వెతకటమేమిటి. పట్టుకోటమేమిటి. వెతకటానికీ - పట్టుకోటానికీ బాహ్యంగా జ్ఞేయ ప్రపంచమొకటి ఉంటే గదా. జ్ఞానమైనా అదే. జ్ఞేయమైనా అదే. లేకపోతే పరిపూర్ణమనే మాటకర్థమే లేదు. పరిపూర్ణమన్నప్పుడంతా బ్రహ్మమే. బ్రహ్మేతర పదార్ధమే ఉండరాదు.

కాబట్టి జ్ఞానమే అనుష్ఠానమిక్కడ. అంతకన్నా అనుష్ఠానమంటూ క్రొత్తగా ఏదీ లేదు. అనుష్ఠాన-మనుష్ఠేయ-మనుష్ఠాత అనే త్రిపుటికెంత మాత్రమూ అవకాశమీయని పదార్ధమది. పురుషతంత్రమైనదైతే ఉంటుందిగాని వస్తుతంత్రమైనది గనుక అలాంటి అవకాశమే లేదిక్కడ. ముందూ లేదు. వెనకా లేదు. మహా అయితే ఆ జ్ఞానముత్పన్నమైన తరువాత ఇంకా మన ప్రారబ్ధం కొద్దీ ఈప్రపంచం భాసిస్తుంటే ఎప్పటికప్పుడు దాన్ని బ్రహ్మ చైతన్యంగా మార్చుకొని చూడటమే మనం చేయగలిగిన అనుష్ఠానం. దీనినే **"విజ్ఞాయ ప్రజ్ఞామ్ కుర్వీత"** అని తెలియజేసిందుపనిషత్తు. ఇందులో విజ్ఞానం దాని జ్ఞానాన్ని మనం సంపాదించటమయితే ప్రజ్ఞాన మా సంపాదించిన జ్ఞానధనాన్ని జారిపోకుండా నిలుపుకోవటం. జ్ఞాన సంతానకరణమని దీనికే పేరు పెట్టారు దేశికేంద్రులు. సంతానకరణమంటే పొడిగించటం. తదేక దృష్టితో దైనందిన జీవితాన్ని సాగిస్తూ పోవటమని భావం. అది కూడా ఒక కర్మ అనుకొంటే ఇక మేము చెప్పలేము. అది వాడి కర్మ అని ఊరుకోవటమే మేమివ్వగలిగిన జవాబన్నారు స్వామివారు. ఇంతకూ బ్రహ్మమనేది దాన్ని జ్ఞానానికి వ్యతిరిక్తంగా ఎక్కడో వెదకి చూడవలసిన పదార్థమని భ్రాంతి పడరాదు. జ్ఞానజ్ఞేయాలు రెండూ అదే కాబట్టి దాని తాలుకు జ్ఞానమే దానిని పొందటం, అనుభవించటం. అనుభవానికి తెచ్చుకొనే ప్రయత్నం జ్ఞానానికదనంగా మరేదీ అక్కర లేదిక్కడ.

# శాస్త్రసమ్మతి

అందుకే ఉపనిషత్తెప్పుడూ బ్రహ్మస్వరూపాన్ని మాత్రమే వర్ణిస్తూ పోతుంది గాని దానినెలా పొందాలో ఆ మార్గాన్ని వర్ణించి చెప్పదు. అలా చెప్పక పోయేసరికది ఏదో ఉంది రహస్యం. దాని నెలాగైనా అన్వేషించి పట్టుకోవాలని భ్రాంతి పడతారు సాధకులు. అలాంటి అపోహతోనే మంత్రమనీ -తంత్రమనీ - యోగమనీ - ఉపాసన అనీ ఎన్నో అనవసరమయినవన్నీ తెచ్చిపెట్టారు. ఇదంతా కేవలం మన అవివేకం. సత్యమ్-జ్ఞాన-మనంతమ్-శుద్ధమ్-బుద్ధమ్మని-సూటిగానూ-నిష్కలమ్ నిష్క్రియమ్-అస్థూల-మనణ్వహ్రస్వమని చాటుగానూ దాన్ని అనేక కోణాల నుంచి బహుముఖంగా వర్ణిస్తూ పోతుంది శాస్త్రం. ఇంతే శాస్త్రం చేసే పని. వస్తువునిలా వర్ణించటం మూలంగా తదాకారమయిన జ్ఞానమొకటి సాధకుడి మనసు కేర్పడుతుంది. అఖండాకారమైన ఆ జ్ఞానమే చాలు. అదే బ్రహ్మానుభవం. ఇక క్రొత్తగా దాన్ని పొందే మార్గం చెప్పవలసిన ఆవశ్యకత ఏముందని అడుగుతారు భగవత్పాదులు.

ఆయన చెప్పేదేమంటే ఒక గ్రామానికి మనం ప్రయాణం చేయవలసి ఉంటే కేవలమూ ఆ గ్రామాన్ని వర్ణించటంవల్ల ప్రయోజనం లేదు. దానితో పాటు దాన్ని చేరే మార్గం కూడా మనకు తెలుపవలసి ఉంటుంది. గ్రామమే మార్గం కాదు గదా. గ్రామం చేరవలసిన గమ్యమైతే మార్గం దాన్ని చేర్చే సాధనం. కాబట్టి దాన్ని ప్రత్యేకంగా వర్ణించి తీరాలి. పోతే ప్రస్తుత మీ బ్రహ్మ విషయమలాంటిది గాదు. ఇది ఒక గ్రామంలాగా ఎక్కడో ఉన్నది గాదు. అంతటా ఉన్నది. మనకు భిన్నంగా ఉన్నది కాదు. మన స్వరూపమే జ్ఞేయం కాదు. జ్ఞానమే ఫలానా అని దాని స్వరూపాన్ని గుర్తించగలిగితే చాలు. సాధన మార్గం కూడా అందులోనే గతార్థ Implied మవుతుంది. గతార్థం కాకపోవటానికి మార్గమనేది దానికి బాహ్యంగా ఒకటి ఉంటే గదా. మార్గమైనా అదే. గమ్యమైనా అదే. కాబట్టి గ్రామాన్ని పొందినట్టు దాన్ని పొందాలని అపోహ పడరాదు. ఒకగ్రామాన్ని ఎక్కడికోపోయి పొందుతాము మనం. అది దేశంలో చేసే ప్రయాణం. అలాగే బాల్యం దాటి యౌవనదశ పొందుతాము. యౌవనం దాటి వార్ధక్యమందుకొంటాము. ఇది కాలంలో చేస్తున్న ప్రయాణం. బ్రహ్మ స్వరూపాన్ని పొందటమిలాంటి దేశకాలాల్లో చేయవలసిన ప్రయాణం కాదు. అది ఒక ఆరోగ్యాన్ని పొందటం లాంటి దంటారు ఆచార్యులవారు. ఆరోగ్యమంతకు

ముందు కూడా ఉంది మనకు. అది మనకు స్వాభావికం. అయితే మధ్యలో కొన్ని రోగ లక్షణాలు సంక్రమించాయి శరీరంలో. తన్మూలంగా అక్కడే ఉన్నా తాత్కాలికంగా మరుగుపడిందది. మరలా తగిన ఔషధ సేవచేసి వాటిని నిర్మూలించుకోగలిగితే చాలు. మరుగుపడిన ఆరోగ్యదశ మరలా అభివ్యక్తమై Manifest మరలా దాన్ని పొందినట్టు భావిస్తాము మనం.

అలాగే ఈ బ్రహ్మతత్త్వం కూడా మనకు సహజంగా ఉన్న భావమే. సిద్ధమేగాని సాధ్యం కాదని గదా మొదటి నుంచీ మన ప్రతిపాదన. అలాంటప్పుడొక దాన్ని క్రొత్తగా పొందే దేముంది. అయితే దానికీ అనాత్మ భావాలనే అనారోగ్య చిహ్నాలు కొన్ని వచ్చి నెత్తిన పడ్డాయి. ఈ పడటం మూలంగా అది మనకు సహజమైన తత్త్వమైనా ఎంతో దూరమైనట్టు భాసిస్తున్నది. ఇది మనకు దాని సంగతి గుర్తించలేని మరుపేగాని మరేదీ గాదు. అక్కడ మరుగయితే ఇక్కడ మరుపు. శాస్త్ర ప్రమాణ జన్యమైన జ్ఞానంవల్ల ఈ మరుపనే చీకటి పొర విరసిపోతే చాలు. మరలా మన స్వరూపమే అయిన ఆ బ్రహ్మ స్వభావం మనకు దక్కుతుంది. కాబట్టి జ్ఞానమొకటి గడిస్తే చాలు. అదే అనుభవమిక్కడ. జ్ఞానార్జనానంతరం మరలా అనుభవం కోసం ప్రాకులాడనక్కరలేదు. దాని కోసమేవేవో పరికరాలు సమకూర్చుకోవాలనే ప్రయత్న మంతకన్నా అక్కరలేదు. అంటే కర్మోపాసనాది కార్యకలాపం వెంటబడనక్కరలేదని అర్థం. దీపం లాంటిది శాస్త్రమని చెప్పాము. దీపం వెలిగించగానే ఆ వెలుగు చీకటి పొరలు చీల్చివేయటమూ అక్కడ ఉన్న వస్తువాహనాదులను మనం దర్శించటమూ రెండూ ఒకేసారి జరుగుతాయి. పృథక్ప్రయత్న Different Effort మనేది అక్కరలేదు. అలాగే శాస్త్రమనే దీపం కూడా బ్రహ్మజ్ఞానమనే వెలుగును ప్రసాదించిందంటే అది మన అజ్ఞాన తిమిరాన్ని తొలగించటమూ మనకా బ్రహ్మాత్మానుభవాన్ని కలిగించటమూ కూడా ఏకకాలంలో Simultanious జరిగిపోతాయి. ఇక్కడ వేరే యత్నమక్కరలేదంటారు భగవత్పాదులు. కారణమది నూటికి నూరుపాళ్ళూ వస్తుతంత్రమే గాని పురుషతంత్రమే మాత్రమూ గాదు. అంచేత పారమార్ధకమైన బ్రహ్మతత్త్వాన్ని మానవుడందుకోవాలంటే తద్విషయమైన జ్ఞాన మొక్కటే ఎప్పటికైనాతగిన సాధనం దానిని మనకు బోధించటమే శాస్త్రానికంతటికీ తాత్పర్యమని సిద్ధాంతీకరించారు శంకర భగవత్పాదులు.

# నిశ్చితార్థం

ఏతావతా ఈ చర్చకంతటికీ కలిపి మనం నిశ్చయించుకోవలసిన అర్థమేమంటే పరమార్థ సాధనకు కర్మలుగానీ, ఉపాసనలుగానీ అష్టాంగ యోగాదులు గానీ మంత్ర తంత్రాది విద్యలుగానీ ఏవీ మనకు కొఱగావు. ఎందుకంటే ఆ బ్రహ్మమనేది పరినిష్పన్నమైన Accomplished ఒక పదార్థం. అలాంటి పదార్థాన్ని సాధించాలంటే ఆ సాధనం వస్తుతంత్రమైనదే కావాలి గాని పురుషతంత్రమైన పరికరమేదీ పనికి రాదు. మిగతా కర్మాదికలాపమంతా పురుషతంత్రమైతే జ్ఞానమనేది ఒక్కటే వస్తుతంత్రమైనది. పోతే ఈ జ్ఞానం కూడా దానిపాటికదే ఉత్పన్నమయ్యేది కాదు. ఏదో ఒక ప్రమాణం చేతనే మనకది ఏర్పడవలసి ఉంది. ఆ ప్రమాణాలు మన అనుభవంలో వున్నవి ప్రత్యక్షానుమానాలు రెండే. ఇవి రెండూ మామూలు విషయ జగత్తుకు చెందినవే గాని అవిషయమైన ఆత్మ విషయంలో ఎంత మాత్రమూ పని చేయవు. అందులో పని చేయగలిగింది ఒక్క శాస్త్ర ప్రమాణమే. అది కూడా విధి ముఖంగా కాదు. కేవలం నిషేధముఖంగానే పట్టి ఇస్తుందా తత్త్వాన్ని మనకు. కనుక బ్రహ్మతత్త్వం దానికి విషయమవుతుందనే ప్రమాదం కూడా లేదు. కాగా బ్రహ్మసంబంధి అయిన ఈ జ్ఞానముదయిస్తే చాలు. మనకిక ఉన్నదంతా బ్రహ్మమయంగానే అనుభవానికి వస్తుంది. కాబట్టి శాస్త్రదత్తమైన జ్ఞానానికి భిన్నంగా అనుష్ఠానమనే ప్రసక్తి కూడా లేదక్కడ. ఒకవేళ దాన్ని నిలుపుకొనేందు కభ్యాసమొకటి ఆవశ్యకమైనా అదీ జ్ఞానావృత్తి Continuation రూపమేగాని తద్వ్యతిరిక్తమైన క్రియ కాదు. ఇదీ ఇంతవరకూ మనం చర్చించిన దాని కంతటికీ నిశ్చితార్థం.



# 4. అధ్యారోపం - అపవాదం

జరిగిపోయిన అధ్యాయంలో మనం బ్రహ్మతత్త్వాన్ని అందుకోటానికి వస్తు తంత్రమయిన జ్ఞానమొక్కటే సాధనమని ఆ జ్ఞానం కూడా శాస్త్ర ప్రమాణైక జన్యమనీ నిరూపించాము. ప్రస్తుత మీ శాస్త్రమనేది ఆ జ్ఞానాన్ని మనెకెలా ప్రసాదిస్తుంది అది మనకా బ్రహ్మతత్త్వాన్ని ఎలా అందిస్తుంది ఆ ప్రక్రియ Technique ఏమిటి. అని లోతుకు దిగి విచారించవలసి ఉంది.

## తత్త్వమసి

శాస్త్రమంటే అఖండ బ్రహ్మతత్త్వాన్ని మనకు వర్ణించి చెప్పే వాక్యం. దీనికే మహావాక్యమని పేరు. ఇలాంటి మహావాక్యాలు నాలుగు వేదాలకూ నాలుగున్నాయి. వాటినే ఆయా ఉపనిషత్తుల ద్వారా అవి లోకానికి చాటుతూ వచ్చాయి. అందులో **"తత్త్వమసి"** అనేది ఒకటీ **"అహమ్ బ్రహ్మాస్మి"** అనేది ఒకటీ - ఇవి రెండూ చాలా ప్రధానంగా భావిస్తారు వేదాంతులు. ఎంచేతనంటే తత్త్వమసి అనేది ఉపదేశవాక్య Instruction మైతే అహమ్ బ్రహ్మాస్మి అనేది అనుభవ వాక్యం Experience. ఆచార్యు డొకానొక రహస్యాన్ని ఉపదేశిస్తే శిష్యుడది ఫలానా అని అనుభవానికి తెచ్చుకోటమే కదా కావలసింది. అనుభవం కలిగే సరికి సాధన అనేది ఎలాగు సమాప్తమవుతుంది. కాబట్టి ఇవి రెండే వేదాంత శాస్త్రానికంతటికీ ప్రతినిధి రూపమైన వాక్యాలు.

అందులోనూ అనుభవమనేది ఒక ఫలం Result అది మన సాధనమీద ఆధారపడి ఉంటుంది. సాధన లేకపోతే సిద్ధిలేదు. అంచేత సాధన మార్గాన్ని బోధించే తత్త్వమసి వాక్యమే రెండింటిలోనూ ప్రప్రథమంగా మనం విచారణ చేయవలసిన మహావాక్యమని ఆచార్యులవారి అభిప్రాయం. కనుకనే నేమో సమయం వచ్చినప్పుడల్లా తత్త్వమసి వాక్యార్థాన్నే తరుచుగా వారు తమ భాష్యంలో సాధకులకు వివరిస్తూ వచ్చారు.

తత్త్వమసి అనే వాక్యం మూడింటి సంపుటీకరణం. అందులో తత్-త్వమ్-అసి అని మూడే మూడు మాటలున్నాయి. తత్తంటే అది - త్వమ్ అంటే నీవు - అసి

అంటే అవుతున్నావని అర్థం. అంటే ఏమన్నమాట. ఈ జీవుడా ఈశ్వరుడేగాని అంతకన్నా ఏ మాత్రమూ భిన్నంకాడని బోధిస్తున్నదీ వాక్యం. అయితే భిన్నమనే అభిప్రాయమే మనకు లేకుంటే కాదని బోధించటం దేనికి. ఒక విషయం ప్రాప్తిస్తూ ఉన్నప్పుడే దాన్ని మనం కాదని ప్రతిషేధించవలసింది. అలా కాకపోతే అనవసరంగా మన ములిక్కిపడి నట్టవుతుంది. దీనిని బట్టి జీవేశ్వరులకు భేదముందనే ఆశంక అంతకుముందు మనకందరికీ మనసులో పాదుకొని ఉండాలి. అలా ఉండటం మూలాన్నే దానిని కాదని కొట్టివేస్తూ అభేదాన్ని ప్రతిపాదిస్తున్నది శాస్త్రం.

## అపవాదం

ఈ కొట్టివేయటానికే అపవాద Refutation or Elimination మని నామకరణం చేశారు వేదాంతులు. అపవాదమన్నా-నిషేధమన్నా-బాధఅన్నా- అంతా ఒక్కటే. జీవుణ్ణి ఈశ్వరుడేనని ప్రతిపాదించటంవల్ల జీవుడిలో ప్రస్తుతం కనిపించే జీవ భావాన్ని అపవదించి నట్టవుతున్నది. జీవుడంటే అసలఖండమైన చైతన్యమే గదా. ఆ చైతన్యమవికృతంగానే Unaltered శరీరంలో ప్రవేశించి జీవుడనే పేరుతో వ్యవహరించబడుతుందని ఇంతకు ముందే పేర్కొన్నాము. కాబట్టి చైతన్య స్వరూపుడే జీవుడంటే. ఎటు వచ్చీ శరీరాదికమైన ఉపాధి ప్రపంచమొకటి చుట్టూ వచ్చి చేరటం మూలంగా ఆ చైతన్యం పరిచ్ఛిన్నమై దానికి జీవుడని పేరు వచ్చింది. ప్రపంచమనే ఉపాధి తొలగితే చాలు. వెంటనే అది అపరిచ్ఛిన్నమైన బ్రహ్మచైతన్యంగానే అనుభవానికి వస్తుంది. కాబట్టి జీవత్వానికి హేతుభూతమైన ఈ సమస్త ప్రపంచాన్ని అపవదించటమే మనం చేయవలసిన సాధన. అదే ఈ వాక్యం మనందరికీ బోధించే రహస్యం.

అయితే ప్రపంచాన్ని అపవదించటమంటున్నారు. అండ పిండాత్మకంగా ఈ ప్రపంచమెంతో దూరం విస్తరించి ఉన్నది. దీనిని శాస్త్రం లేదని అపవదించిన మాత్రాన అది లేకపోతుందా. ఒకవేళ పోతే మాత్రమెక్కడికి పోతుందది. మనదగ్గర లేదనేగాని మరొకచోటనైనా ఉండక తప్పదు గదా. ఉంటే ఆ మేరకు మరలా బ్రహ్మతత్త్వం సఖండమే అవుతుంది. అది మన కఖండంగా అద్వితీయంగా అనుభవానికెలా రాగలదని ప్రశ్న వస్తుంది.

ఈ ప్రశ్నకింతకు ముందే మనం సమధానం చెప్పుకొన్నాము. నామరూపాత్మక మైన ఈ ప్రపంచమంతా అసలవిద్యాకల్పితం. ఇది ప్రాతీతికమే Notional గాని వాస్తవికంగా Actual లేదు. అయితే చిత్రమేమంటే లేకుండానే కనిపిస్తున్నది మన కంటికి. మనకు కనిపించే ఏ పదార్థమైనా రెండు విధాలుగానే కనిపిస్తుంటుందని చెప్పాము. ఉండి కనిపించటమొకటైతే లేకుండానే కనిపించట మింకొకటి. ఒక ఏటిలో నీళ్ళు కనిపిస్తున్నాయంటే అవి అక్కడ ఉండే మనకు కనిపిస్తున్నాయి. అదే ఎండమావులలో అయితే లేకుండానే ఉన్నట్టు కనిపిస్తుంటాయి. కాటుకలో నలుపనేది ఉండి కనిపిస్తుంది. ఆకాశంలో అయితే లేకుండానే కనిపిస్తుంది. ఇలాగే ఏదైనా లోకంలో.

ఇందులో ఉండి కనిపించే దాన్ని మనమెంత ప్రయత్నించినా తొలగించుకోలేము కారణమేమంటే అది వస్తుధర్మం. మనం పొమ్మంటే పోదు. రమ్మంటే రాదు. అనపాయోపజనమన్నారు దాన్ని. పోతే లేకుండా కనిపించేదున్నదే అది వస్తుధర్మం కాదు. మానవుడి దృష్టి దోషం Misapprehension వల్ల ఏర్పడింది. కనుకనే లేదని అపవదిస్తే చాలు. తప్పకుండా తొలగిపోతుంది. ఇంతెందుకు ఒక త్రాచుపామే ఉందనుకోండి. అది వాస్తవంగానే వచ్చి త్రాటిమీద చేరిందయితే మనం పొమ్మన్నా పోదు. మీదు మిక్కిలి మనమీద బడి కరిచే ప్రమాదం కూడా ఉన్నది. కాని వాస్తవంగా లేక అక్కడ పడివున్న ఒక త్రాడే అలా పాములాగా దూరానికి కనిపిస్తున్నదనుకోండి. అప్పుడు మనకు భయంలేదు. చూచినంత సేపూ అలాగే తోచినా తేరిచూచి ఎప్పుడు కాదని భావిస్తే అప్పుడే మాయమవుతుంది. కారణమది వాస్తవంగా అక్కడ లేకపోవటమే.

అలాగే ప్రస్తుతమింతగా మనం చూచే ఈ ప్రపంచం కూడా అసలు వస్తుతః ఎక్కడా లేదు. ఉన్నదెప్పుడూ ఒక బ్రహ్మమేనని గదా నిరూపించాము. ఆ బ్రహ్మమే అనాది సిద్ధమైన మన అవిద్యా దృష్టి మూలంగా పిండరూపమయిన ఈ శరీరంగాను, అండరూపమైన ఈ విశ్వ శరీరంగానూ రూపాంతరం ధరించి మనకిలా దర్శన మిస్తున్నది. ఇది యథార్థ సర్పం కాదు మనం భయపడటానికి. రజ్జుసర్పం కనుకనే రజ్జు సర్పాన్ని ఎలా కాదనుకొంటే పోతుందో ఇదీ అలాగే మన మపవదిస్తే చాలు. పోవటానికి సిద్ధంగా ఉంది. ఆ పోవటంలో కూడా నిశ్శేషంగానే తొలగిపోతుంది

కాని ఇక శేషమంటూ ఉండబోదు. అలా ఉండటానికది వస్తుసిద్ధమయితే గదా. కేవలం మన భ్రాంతి జన్యమే. భ్రాంతి ఎప్పుడు పోతుందో తన్నిమిత్తమయిన ప్రపంచంకూడా ఇక నిశ్శేషంగా పోయి తీరవలసిందే. కాబట్టి అపవాదం చేస్తే ప్రపంచం తొలగదేమోననే భయం లేదు. తొలగిపోయే స్వభావమున్నప్పుడెందుకుగాను తొలగదు. తప్పకుండా తొలగుతుంది.

## అధ్యారోపం

అయితే ఈ అపవాదమనేది మనమలాగే చేయటానికి లేదు. దానికొక షరతున్నది. మొదట అధ్యారోపమనేది Imposition చేసి ఆ తరువాతనే దాని నపవాదం Deposition చేయాలి మనం. అధ్యారోపమంటే ఒక వస్తువు మీద మరొక దాన్ని తెచ్చి పడవేయటం లేదా ఆరోపించటం. అయితే ఆరోపించామంటే ఆ ఆరోపిస్తున్నదొక వస్తువుగా Actually ఎక్కడో ఉన్నదని కాదు మరలా. ఎక్కడా లేని దాన్నే ఉన్నట్టుగా కల్పిస్తాము. ఇలాటి ఒక కల్పనకే అధ్యారోపమని పేరు. ఈ అధ్యారోపణ ప్రస్తుతం మన మీ ప్రపంచాన్ని ఆ బ్రహ్మ స్వరూపం మీద చేయవలసి ఉన్నది. బ్రహ్మమనేది సిద్ధమైన పదార్థం. దానికి విలక్షణంగా కనిపించే ప్రపంచమంతా కల్పితమే. కల్పితమైనది గనుకనే ఈ చరాచర జగత్తునంతా దానిమీద ఆరోపించటం. అయితే కల్పితమని చెబుతూ మరలా దీన్ని అదేపనిగా దానిమీద ఆరోపించటం దేనికని ప్రశ్న. అది శాస్త్ర మారోపించటం కాదు. ఆ మాటకు వస్తే లోకమే ఆరోపిస్తున్నది. లోకమారోపిస్తుంటే లోకబుద్ధి ననుసరించి శాస్త్రం కూడా అలాగే ఆరోపణ చేయవలసి వస్తున్నది. అంత మాత్రమే.

అయితే లోక మీ ఆరోపణ ఎలా చేస్తున్నదని అడగవచ్చు. అసలఖండంగా వ్యాపించి ఉన్నదొక్క బ్రహ్మచైతన్యమే. దాన్ని మనమలాగే దర్శిస్తే సరిపోయేది. కాని చైతన్యంగా కాక దాన్ని మన మీ స్థావర జంగమాత్మకమైన ప్రపంచంగా భావించి చూస్తున్నాము. ఇది మనలో ఇప్పుడా బాల గోపాలమూ అనుభవ సిద్ధమే. కాబట్టి ఇలా భావిస్తున్నామంటే అది ప్రపంచాన్ని బ్రహ్మంమీద ఆరోపించటమే గదా. ఈ ఆరోపణ మనమనాది సిద్ధమైన మన అవిద్యాదోషం వల్ల జన్మ జన్మలనుంచీ సాధిస్తూ వచ్చాము. అంచేత అది సహజమై Inherent పోయింది మనకు. ఈ సహజారోపానికే ఆచార్యుల వారధ్యాసమని పేరు పెట్టారు.

ఈ అధ్యాస అనేది మరలా రెండు తరగతులు. ఒకటి చేతనం అచేతనం మీద వచ్చి పడటం. వేరొకటి అచేతనం చేతనం మీద వచ్చి పడటం. మన ప్రాణం దగ్గరి నుంచీ త్వగింద్రియం దాకా ఈ పిండ శరీరమంతా అచేతనమే. దీనిమీద ఆ ఈశ్వరచైతన్యం వచ్చి పడింది. దానితో అచేతనమైన శరీరానికి చేతన భావమేర్పడి ఈ శరీరమే నేననే తాదాత్మ్య బుద్ధి Sense of Identity కది దారి తీసింది. దీనికే దేహాత్మ భావమని పేరు. అహంకార Ego మన్నా ఇదే. దీని మూలంగా జీవుడనే వాడు రంగంలోకి వచ్చాడు. పోతే జీవుడెప్పుడు వచ్చాడో ఈ జీవుడు మరలా తనచుట్టూ ఉన్న ప్రపంచమంతా నాది అని దానితో సాంగత్యం చెందాడు. ఇది చేతనం మీద అచేతనాన్ని అధ్యసించటం. దీని మూలంగా జగదాత్మ బుద్ధి ఏర్పడింది మనకు. ముందు చెప్పింది ఆత్మభావమైతే ఇది ఆత్మీయ భావం The mine. దీనికే మమకారమని పేరు.

ఈ అహంకార మమకారాలు మనలో ఇప్పుడు ప్రతి ఒక్క ప్రాణికి ఉంటూనే ఉన్నాయి. ఇది నేను, ఇది నాది అని అభిమానం పెట్టుకొని నిత్యమూ వ్యవహరించటం లోనే మనకిది తార్కాణమవుతున్నది. ఇలా ద్విపాత్రాభినయం చేసే ఈ అధ్యాసంవల్లనే మనకన్ని విధాలైన సంసార బాధలు. అంచేత ఈ అనర్థాన్ని సమూలంగా మనం పెరికి వేయాలంటే మరలా ఒక అధ్యారోపణ అనేది చేయక తప్పదు.

అయితే ఇది చాలా విడ్డూరంగా ఉన్నదీమాట. ఎందుకంటే అధ్యారోపంవల్లనే మనకిన్న అనర్థాలూ సంప్రాప్తమైనాయని వక్కాణించారు మీరు. అలాంటప్పుడు మనకు హితైషియైన శాస్త్రం దానికి నివారణోపాయం సూచించాలి గాని తాను మరలా ఒక అధ్యారోపణ చేయటమేమిటి. అలా తానే చేస్తున్నప్పుడిక లోకం చేస్తున్నదని ఆక్షేపించటం దేనికి. చూడబోతే ఇది అమ్మను తిడతావేమిరా అన్న సామెత జ్ఞాపకం చేస్తున్నదని సందేహించవచ్చు.

దీనికి సమాధానమింతకుముందే బయట పెట్టాము. శాస్త్రమేది బోధించినా, ఎప్పుడు బోధించినా అది మనబోటి లోకులకే ననే విషయం మనమెప్పటికీ మరచి పోరాదు. అలాంటప్పుడు లోకుందరూ శాస్త్రమేది చెప్పదలిస్తే అది యథాతథంగా As it is ఆకళించుకోగలిగి ఉండాలి. అలా ఆకళించుకోలేకపోతే దాని ప్రయత్నమే అసలు విఫలమయిపోతుంది. ప్రస్తుత మీ వేదాంతశాస్త్రం మనకు బోధించ

వలసిందేమిటింతకూ. ఈ జీవుడు లేదు-జగత్తు లేదు ఉన్నదొక్క ఈశ్వర చైతన్యమేననే అద్వైత భావం. ఈ భావాన్ని అలాగే అర్థం చేసుకోగల సామర్థ్యముంటే మంచిదే. కాని అంతటి మహాభాగ్యానికి నోచుకోలేదు మనం. కారణమేమంటే మన బుద్ధులన్నీ నిరంతరమూ జీవజగద్రూపమైన ద్వైత వాసనలతోనే నిండి ఉన్నాయి. సర్వదా ద్వైతవాసనా వాసితమైన ఈ బుద్ధి కొక్కసారిగా తద్విలక్షణమైన అద్వైత భావాన్ని బోధిస్తే ఏమవుతుంది. గ్రుడ్డివాడి కద్దం చూపినట్లు నిష్ఫలమవుతుంది. అర్థం చేసుకోకపోవటమలా ఉంచి తమ అనుభవానికి ప్రతికూలమని చెప్పి దాన్ని నిరాకరించే ప్రమాదం కూడా ఉంది.అలాగైతే అది మొదటికే మోసం.

అంచేత చెప్పవలసింది అద్వైతమైనా-లోకుల బుద్ధులన్నీ ప్రస్తుతం ద్వైత దృష్టి పరివేష్టితాలు కాబట్టి ఆ బుద్ధుల కనుగుణంగా ముందు ద్వైత రూపమైన అధ్యారోపాన్ని చేస్తుంది శాస్త్రం. ఆ తరువాత మరలా తాను చేసిన అధ్యారోపాన్ని అపవాదం చేసి చూపుతుంది. దీనివల్ల చివరకు తానుద్దేశించిన అద్వైత భావాన్నే శాస్త్రం మనకు ఉపదేశించి నట్టవుతున్నది.

## సహజం

సరే బాగానే ఉన్నది. ముల్లు తీసి కొఱ్ఱు దించుకొన్నాడట ఎవడో. ఎట్లాగూ అపవాదం చేయదలచినప్పుడది మొదటనే చేయవచ్చు గదా. ఒక ఆధ్యారోపాన్ని కాదని చెప్పి మరలా ఇంకొక అధ్యారోపాన్ని క్రొత్తగా చేయవలసిన అగత్యమేమి వచ్చింది - అని మరలా ఆక్షేపణ వస్తుంది. దీని కాచార్యుల వారిచ్చే సమాధాన మేమంటే లోకులు చేసే అధ్యారోపం వేరు. శాస్త్రం చేసేది వేరు. అధ్యారోపమనే మాట ఒకటే అయినా రెంటికీ బ్రహ్మాండమైన తేడా ఉన్నది. లోకులు చేసే అధ్యారోపం సహజమైన అధ్యారోపం. అధ్యారోపమనేది ఒకటి చేస్తున్నామనే దృష్టి లేకుండానే చేస్తున్నదది. దృష్టి లేకపోవటం మూలాన్నే మరలా దాన్ని అపవాదం చేయటమెలాగో పాపం వారికి తెలియదు. తెలియకనే ఎన్ని జన్మలు గడచినా, ఎంత యత్నం చేసినా, ఈ సంసార చక్ర భ్రమణం నుంచి బయటపడలేకపోతున్నారు. అసలు రహస్యమేమంటే అధిష్ఠాన జ్ఞానం లేనంతవరకూ అపవాదమనేది సంభవం కాదు. అధిష్ఠానమేమిటని ప్రశ్న. దేనిమీద ఒకటి అధ్యారోపణ చేస్తామో దాని కధిష్ఠాన

Basis మని శాస్త్ర పరిభాష. రజ్జువుమీద సర్పాన్ని ఆరోపించామంటే రజ్జువనేది అధిష్ఠానం. అలాగే బ్రహ్మం మీద ప్రస్తుత మీ జగత్తునంతా ఆరోపితం చేశాము. కాబట్టి బ్రహ్మమే అన్నిటికీ అధిష్ఠానం.

అయితే వచ్చిందేమంటే ఫలానా బ్రహ్మమే దీనికంటికీ అధిష్ఠానమనే జ్ఞానం లేదు మనకు. కేవలం కార్యరూపమైన జగత్తునే చూస్తున్నాము గాని తత్కారణమైన అధిష్ఠానం మనకు కనపడటంలేదు. కనపడకపోయే సరికది బ్రహ్మమో, మరొకటోననే వికల్ప దృష్టి ఏర్పడుతున్నది. అధిష్ఠానం దీనికి ఫలానా అని నిష్కర్షగా గుర్తించేవరకూ ఇలాంటి వికల్పం తప్పదు. ఇది రజ్జువని గుర్తించినప్పుడే గదా సర్పధారా దండాదులైన వికల్పాలన్నీ నివర్తించేది. అలాగే ప్రపంచానికంతా అధిష్ఠాన రూపంగా ఆ బ్రహ్మ చైతన్యాన్ని గుర్తించాలి లోకులు. అలా గుర్తించాలంటే అధిష్ఠానం మరేదోగాదు - అదేనని హేతు దృష్టాంత పురస్సరంగా నిరూపణ చేయాలి శాస్త్రం. నిరూపిస్తే అధిష్ఠాన రూపమైన బ్రహ్మతత్త్వాన్ని పట్టుకొని దాని బలంతో ఈ సమస్త ప్రపంచాన్నీ మన మపవాదం చేయగలం.

## శాస్త్రీయం

శాస్త్రమిలాంటి నిరూపణ చేసి అధిష్ఠానమయిన బ్రహ్మతత్త్వాన్ని మనకు బయట పెట్టటానికే మొదట ఆధ్యారోపమనేది చేస్తున్నది. అది ఎలాగని అడగవచ్చు. మనం ప్రతిక్షణమూ మనచుట్టూ పరిచినట్టు చూస్తున్న ఈ ప్రపంచమంతా ఒక కార్యం Product కార్యమనే సరికిది దానిపాటికదే ఆవిర్భవించిందని చెప్పటానికి లేదు. ఒక కారణ Producer మనేది ఉండాలి దానికి. ఆ కారణం కూడా ఏ పరమాణువులో Atoms కాదు. ఏ ప్రధానమో Primordial matter కాదు. లేక అభావమో Total absence కాదు. అది కేవల మఖండమైన బ్రహ్మచైతన్యమే. ఆ చైతన్యమే కారణం కాబట్టి అందులో నుంచే ఇది ఆవిర్భవిస్తున్న దందులోనే ప్రస్తుత ముంటున్న - దందులోనే చివర కస్తమిస్తున్నది. ఇలా ఆది మధ్యాంతాలలో ఆ చైతన్యాన్ని విడవకుండా ఇది అంటి పట్టుకొని ఉందని వర్ణించటం మూలాన మనదృష్టి ఈ కార్యం మీద నుంచి ఆ కారణం మీదకి పరుగెడుతుంది. అంతేగాక దీని లక్షణాలకు భిన్నంగా దాని లక్షణాలను వర్ణించటం మూలానా కార్యజగత్తుకు విలక్షణంగా దాన్ని

మనం మనసుకు తెచ్చుకోగలం. అంటే అనాత్మ రూపమైన ఈ ప్రపంచానికి వ్యతిరిక్తంగా ఆత్మరూపమైన ఒక పరిశుద్ధ చైతన్యమే మనసుకు వస్తుందని భావం. ఇలా కార్య జగత్తునుంచి మన దృష్టిని క్రమంగా దాని కధిష్ఠానమైన ఆత్మతత్త్వంవైపు మళ్ళించటానికే శాస్త్ర మీ ప్రపంచ సృష్టి స్థితిలయాలనే కరువు పెడుతుంది. నిజంలో ఈ సృష్టిలయాదులేవీ లేవు. లేకపోయినా ఏదో జరిగినట్టు చేసినట్టు ఆరోపిస్తుంది శాస్త్రం. అది ఈ కార్యజగత్తు నుంచి ఆ కారణాన్ని వేరుచేసి చూపటానికే. అలా కాకపోతే కార్యజగత్తు మీదనే పరిభ్రమిస్తూ మన దృష్టి అక్కడే ఉన్న మూలతత్త్వాన్ని గమనించలేదు. ఈ ఆరోపణవల్ల ఓహో దీని సృష్ట్యాదుల కన్నింటికీ మూలం ఫలానా గదా అని ఆ మూల పదార్థాన్ని ఆకళించుకోగలదు.

ఈ విధంగా అధ్యారోపణ చేసి బ్రహ్మమనే అధిష్ఠానం తాలూకు జ్ఞానాన్ని మనకందించిన తరువాత శాస్త్రం మరలా దానినే మన కపవాదం చేసి చూపుతుంది. అది ఎలాగంటే బ్రహ్మమే ప్రపంచాని కుపాదానమూ, నిమిత్తమూ కూడా అవుతున్నది. కాబట్టి ఈ ప్రపంచమనే కార్యమా బ్రహ్మచైతన్యం కంటే ఇక మనం వేరుగా భావించటానికి లేదు. ఒక మట్టి కుండకు కారణమని చెప్పామంటే ఆ మట్టికంటే తత్కార్యమైన ఘటం వేరుగా కనపడదు గదా. అలాగే సర్వాధిష్ఠానమైన ఆ చైతన్యం కంటే ఇదికూడా వేరు కావటానికి వీలులేదు. దీనితో స్థావర జంగమాత్మకంగా కనిపించే ఈ సృష్టి అంతా ఇసుమంత కూడా అసలు లేనేలేదని అపవదించి నట్టయింది. ఇందులో దాగి ఉన్న సూక్ష్మమేమంటే ప్రపంచం తాలూకు సృష్ట్యాదికాన్ని అధ్యారోపం చేయటంవల్ల బ్రహ్మమనే అధిష్ఠాన జ్ఞానమేర్పడుతుంది మొదట. మరలా ఆ అధిష్ఠాన చైతన్యం కన్నా ఈ ప్రపంచం భిన్నంకాదని త్రోసిపుచ్చటంవల్ల నిష్ప్రపంచమైన కేవల బ్రహ్మచైతన్యమొక్కటే ఉందనే పరిశుద్ధమైన Purified అద్వైత భావమే మన మనసులో నిలిచిపోతుంది.

మృద్ఘటాది దృష్టాంతాలవల్లనే మన మీ రహస్యాన్ని బాగా అర్థం చేసుకోవచ్చు. ఒక ఘటాన్నే చూస్తూ నిలబడితే మనకాఘటం తాలూకు పృథు బుధ్నోదరా ద్యాకారమే దృష్టికి తగులుతూ పోతుంది. అంతేగాని అది ఏ మూల పదార్థంతో తయారయిందో ఆ మృత్తిక రూపం మనసుకు రాదు. అక్కడే ఉన్నా దాని స్వరూపం దీని ఆకారంలో మగ్నమై Merged అది మనకు దూరమై పోతుంది. ఇప్పుడు మరలా దాన్ని మనం

గుర్తించాలంటే ఈ ఘటాకారాన్ని మరచి మృదాకారమేమనసుకు తెచ్చుకోవాలి. అలా తెచ్చుకోవాలంటే పృథు బుధ్నో దరాది విశేషాలకు భిన్నంగా నీలత్వ కఠినత్వాది సామాన్య స్వరూపాన్ని మనం విభజించి చూడాలి. అప్పుడా ఘటాకారం మగ్నమై దానికి మూలభూతమైన మృదాకారమే మనకు దర్శనమిస్తుంది. అలా దర్శించిన తరువాత మరలా ఈ దూరం చేసిన ఘటం మరేదో గాదు. ఆ మృత్తునుంచి వచ్చినదే. ప్రత్యణువూ దానితో నిండినదే. పగిలితే మరలా తద్రూపంగా మారేదే. కాబట్టి త్రికాలాలలోనూ దానికి వేరుగా లేదని నిరాకరించవలసి ఉంటుంది. దానితో ఇక ఘటమనే రూపమే అసలస్తిత్వాన్ని కోలుపోయి ఉన్నదంతా మృత్తికేనని అధ్యవసాయ Conviction మేర్పడుతుంది. అలాగే ప్రస్తుత మీ ప్రపంచం నుంచి వేరు చేసి మొదట బ్రహ్మతత్త్వాన్ని గ్రహించినా మరలా ఈ ప్రపంచ సృష్టి స్థితి లయాలన్నీ తన్మూలంగానే జరుగుతున్నవి కాబట్టి ప్రపంచమనే కార్యమే లేదు. అది కూడా బ్రహ్మమేనని మన మనుభవానికి తెచ్చుకోగలం.

## వైలక్షణ్యం

ఇలా ద్వైతంతో ఆరంభమైనా చివరికద్వైత భావంలోనే పర్యవసానం కావటం మూలాన శాస్త్రమనేది అధ్యారోపం చేసినా అది మనకు వాంఛనీయం. లోకం చేసే అధ్యారోపానికీ దానికీ సాజాత్యం లేదు. లోకుల అధ్యారోపం అజ్ఞాన మూలకం. అందులో అధిష్ఠానం తాలుకు జ్ఞానం లేదు. అధిష్ఠానమంటే బ్రహ్మతత్త్వం. దాని జ్ఞానం లేదు గనుకనే ప్రపంచం మనకక్కడ అపవాదం కావటం లేదు. పోతే ఈ శాస్త్రీయమైన అధ్యారోపమలాంటిది కాదు. ఇది శాస్త్రజ్ఞులు బుద్ధిపూర్వకంగా చేస్తున్న అధ్యారోపం. దీనివల్ల అధిష్ఠానం ఫలానా గదా అనే జ్ఞానముదయిస్తుంది మనకు. జ్ఞానముదయించిందంటే అజ్ఞానం నశించి తీరుతుంది. తన్మూలంగా ఇక ఈ చరాచర ప్రపంచమూ అపోదితం కాక తప్పదు. ఎందుకంటే బ్రహ్మమనేది తెలియకపోవటం వల్లనే ఆ బ్రహ్మం మనకీ జగద్రూపంగా భాసిస్తున్నది. అది ఏదో తెలిసిందంటే ఇది బలా దూరయి మరలా ఆ బ్రహ్మంగానే సాక్షాత్కరిస్తుంది. ఇది ఎలాంటిదంటే రజ్జువును గుర్తించనంత వరకూ అదే మనకు సర్పరూపంగా కనిపించి ఫలానా అని గుర్తించే సరికి మరలా ఈ సర్పమూ రజ్జువుగానే గోచరించటం లాంటిది.

ఈ విధంగా అపవాదంతో కూడిన అధ్యారోప మీ శాస్త్రకృతమైన అధ్యారోపం. కనుకనే లౌకికమైన సహజారోపణ వంటిది కాదిది. మీదు మిక్కిలి దానిని కొట్టివేసే అధ్యారోపమిది. ఎంచేతనంటే సహజం గనుక జన్మ జన్మలనుంచీ అది ఈ ప్రపంచాన్ని తెచ్చి మనమీద పడవేసింది. పైగా జ్ఞానాన్ని ప్రసాదించకపోవటం మూలాన ఆ నెత్తిన బడ్డ ప్రపంచభారాన్ని క్రిందికి దించుకొనే అవకాశమే లేకుండా చేసింది మనకు. కాబట్టి అది మన కాజన్మ శత్రువులాంటిదా అధ్యారోపం. మరి ఈ శాస్త్రీయమైన దలాంటిది కాదు. ఇది ఆ శత్రువును నిర్మూలించి మనకు మేలు చేసే పరమ మిత్రుడు. ముల్లు తీయటానికి మరలా ఒక ముల్లు నుపయోగిస్తాము మనం. ఆ ముల్లు తీసిన తరువాత దానినీ దీనినీ రెంటినీ కలిపి అవతల పారవేస్తాము. దానితో వేదన తొలగిపోయి పాదం దానిపాటికది హాయిగా ఉండిపోతుంది. అలాగే బంధహేతువైన అధ్యారోపాన్ని కొట్టి వేయటానికి వేరొక అధ్యారోపాన్ని తెచ్చిపెట్టాము. అది సృష్టి లయాదులను వర్ణించే నెపంతో ప్రపంచాన్నిచైతన్యంతో ముడిపెట్టి చివర కాచైతన్యంలోనే దాన్ని ప్రవిలయం Dissolve చేసి తానూ ఆ చైతన్యంలోనే లయమవుతుంది. తత్ఫలితంగా చివరకొక ఆత్మచైతన్యమే మనకు దక్కుతున్నది. అంచేత ఈ అధ్యారోపమే మనకు నిజమైన కార్యకారి Useful అధ్యారోపాపవాద రూపమైన ఈ ప్రక్రియ వల్లనే Process or Technique అద్వితీయ బ్రహ్మానుభవానికి మనం నోచుకోగలుగుతాము. అంటే అప్పటికి **"తత్త్వమసి"** వాక్యం **"అహమ్ బ్రహ్మాస్మి"** అనే అనుభవ వాక్యానికి దారి తీస్తుందని భావం. దానితో సాధకుడు నేనే ఆ బ్రహ్మమననే బ్రహ్మాత్మభావాన్ని చెప్పకుండా స్వానుభవానికి తెచ్చుకోగలడు.

## బ్రహ్మానుభవం

అయితే ఇప్పుడొక ప్రశ్న. ఈ ప్రక్రియ ననుసరించినంత మాత్రాన మనకు బ్రహ్మానుభవం కలగటమేమిటి. అనుభవమనేది వ్యక్తిగత personal మైన విషయం కదా. అది వాక్య శ్రవణమాత్రం చేత ఎలా కలుగుతుంది. అని సందేహం. ఇలాంటి సందేహం పెట్టుకోపని లేదన్నారు శంకరులవారు. ఎందుకంటే వాక్యమనేది ఒక ప్రమాణమని ఇంతకుముందే పేర్కొన్నాము మనం. ప్రమాణమని ఎప్పుడన్నామో అప్పుడది మనకు ప్రమను కలిగించి తీరాలి. ప్రమ అంటే జ్ఞానం. బ్రహ్మ స్వరూపానికి

చెందిన జ్ఞానమని అర్థం. అది వాక్యం వల్లనే కలుగుతుంది. కలిగేది జీవుడికే అయినా కలిగించేది వాక్యం. **"వాక్యార్థ విచారణా ధ్యవ సాన నిర్వృత్తాహి బ్రహ్మా వగతిః"** అని ఆచార్యులవారి భాష్యపంక్తి. వాక్యార్థాన్ని మనం విచారణ చేస్తే తన్మూలంగా ఒక అధ్యవసాయ మేర్పడితే ఆ అధ్యవసాయం మూలంగా మనకు కలిగే అనుభవమేదో అదే బ్రహ్మానుభవమట. వాక్యమంటే తత్త్వమసి. అది ఈ జీవుడా ఈశ్వరుడే అంతకన్నా వేరుకాదని బోధిస్తున్నది. ఇదీ దాని అర్థం. ఇప్పుడీ అర్థాన్ని శ్రవణం చేశాము మనం. అది మన శ్రవణేంద్రియం ద్వారా మనసులో ప్రవేశించి తదనురూపమైన బొమ్మ ఒకటి మన మనః ఫలకం మీద చిత్రిస్తుంది. దాని పేరు బ్రహ్మాత్మభావం.

అయితే బ్రహ్మమే నేననే ఈ అభేదభావం నిజమా కాదా అని మనకు సందేహం. అనాత్మరూపమైన ఈప్రపంచమెదురుగా కనిపిస్తున్నంత వరకూ మన మీ సంసార సాగరంలో మునిగి తేలుతున్న జీవులమే గదా ఈశ్వర స్వరూపులమెలా అవుతామనే సందేహం పట్టి పీడిస్తూనే ఉంటుంది మనలను. అందుకోసం మరలా వాక్యార్థాన్ని విచారణ చేయాలి మనం. అది నీకీ జీవత్వ మౌపాధికమే Accidental వాస్తవంలో నీవా ఈశ్వరుడవే సుమా అని అభేదబుద్ధిని దృఢం చేస్తుంది.

పోతే ఇక దీని తరువాత మూడవది అధ్యవసానం. అధ్యవసానమంటే నిశ్చయం. గట్టిగా ఒక భావాన్ని పట్టుకోవటమని అర్థం. జీవుడీశ్వరుడేనని గ్రహించినా సంసారమనే భూతమంత సులభంగా వదలదీ జీవుణ్ణి. మానసికంగా అభేదాన్ని భావన చేస్తున్నా బాహ్యంగా ఈ భేద ప్రపంచం దాన్ని దెబ్బ తీస్తుంటుంది. దీనికే విపర్యయ Reverse మని పేరు. ఇది నివారణ కావాలంటే గట్టిగా ఈ ప్రపంచాన్ని లేదని చూడగలగాలి. అది ఎలాగంటే నీవు జీవుడవు కావు. బ్రహ్మమేనని చెబుతున్నది వాక్యం. బ్రహ్మమంటే అద్వితీయమైన చైతన్యం. చైతన్యం వరకూ నీకూ ఉన్నదే. ఎటు వచ్చీ నీ చైతన్యం దానిలాగా అద్వితీయం కాదు. సద్వితీయమిది. ఈ కనిపించే ప్రపంచమే ఆ ద్వితీయ పదార్థం. ఇప్పుడా ఈశ్వరుడే నీవని చాటటం వల్ల నేనూ అద్వితీయ చైతన్య రూపుడనే అని నీవు భావిస్తావు. అంటే ఏమన్న మాట. నామరూపాత్మకంగా పరచుకొని నీ చుట్టూ కనిపిస్తున్న ప్రపంచాన్ని నీవిక ప్రపంచంగా చూడటానికి లేదు. దాన్ని నీవు సచ్చిద్రూపమైన ఆత్మతత్త్వంగానే చూడటం

నేర్చుకొంటావు. అది బాగా అభ్యాసమై గట్టిపడితే అదే అధ్యవసానంగా Conviction పరిణమిస్తుంది. దానితో ప్రపంచమంతా బ్రహ్మాకారంగా భాసించి అసలీ ప్రపంచమే మనకు కనపడకుండా మాసిపోతుంది.

ప్రపంచమే గదా చైతన్యాని కుపాధి. ఈ ఉపాధి ఎప్పుడు మాసిపోయిందో అప్పుడిక ఈశ్వరుడూ జీవుడని తేడా లేదు. జీవుడు కూడా అసలు చేతనుడేనని చెప్పాము. ప్రపంచోపాధి వల్లనే అది పరిచ్ఛిన్నమై ఈశ్వర చైతన్యానికి వేరుగా భాసిస్తున్నది. ఘటమనే ఉపాధి మూలాన్నే గదా ఘటాకాశం మహాకాశానికి వేరుగా భాసించటం. అలాగే ఇదీ. పోతే ఎప్పుడీ ఉపాధిని మనం చూడటం మానేశామో అప్పుడిక మన చైతన్యమూ ఈశ్వర చైతన్యమే. ఇదే బ్రహ్మావగతి అనే మాటకర్థం. అవగతి అంటే అనుభవమే. బ్రహ్మావగతి అంటే బ్రహ్మమే నేననే అనుభవం. అది అధ్యవసాన నిర్వృత్తమన్నారు స్వామివారు. అంటేముందు చెప్పిన నిశ్చయ జ్ఞానంవల్లనే కలగవలసిన అభేద భావం.

## వృత్తిజ్ఞానం

ఈ భావానికే జ్ఞానమనీ, విద్య అనీ, వివేకమనీ, వృత్తి అనీ అనేక నామధేయాలద్వైత పరిభాషలో. వాక్యం బోధించిన ఒక విషయం చెవినబడగానే ఆ విషయానికి సంబంధించిన ఆకారమొకటి మానవుడి మనోనేపథ్యం మీద ప్రతిఫలిస్తుందని చెప్పాము. ఈ ప్రతిఫలించిన ఆకారానికే వృత్తి అని పేరు. దీనికి తత్త్వమసి వాక్యమే కానక్కరలేదు. ఆ మాటకు వస్తే లౌకికమైన ఏ వాక్యమైనా కావచ్చు. ఇంతెందుకు ఫలానా చోట ఒక పెద్ద పర్వతముందని ఎవడైనా మిత్రుడొకడు మనకొక వార్త చెప్పాడనుకోండి. ఇప్పుడా వాక్యం వినగానే మన మనసులో ఆ పర్వతం తాలూకు రూపరేఖ లవశ్యంగా ఏర్పడతాయి. దీనికి పర్వతాకార వృత్తి అని పేరు. అలాగే ఒక పట్టణాన్ని గూర్చి వింటే పట్టణాకార వృత్తి. ఇలా ప్రతిక్షణమూ ఏదో ఒక వృత్తి ఏర్పడుతూనే ఉంటుంది మనసులో. అది ఒక పదార్థాన్ని మనకండ్లతో చూచినప్పుడూ కలుగుతుంది. చెవులతో విన్నప్పుడూ కలుగుతుంది. మొత్తం మీద తత్తదాకారమైన వృత్తి ఒకటి కలుగుతూ పోవటం మానవుడి మనసుకు స్వాభావికం. మనసుకిలాంటి స్వభావముండటం మూలాన్నే తత్త్వమసి లాంటి వాక్యం మనకు

తత్పదార్థమైన ఆ బ్రహ్మ స్వరూపాన్ని వర్ణించి చెప్పగానే తదాకారమైన వృత్తి అనీ, అఖండాకార వృత్తి అనీ, ఆత్మాకారవృత్తి అనీ, అనేక సంజ్ఞలతో వ్యవహరిస్తారు. ఇంతకూ ఒకపర్వతాన్ని వర్ణించినప్పుడు మనకు పర్వతాకార వృత్తి ఎలా ఏర్పడుతుందో అలాగే బ్రహ్మాన్ని వర్ణించినప్పుడు కూడా బ్రహ్మాకారవృత్తి ఏర్పడి తీరుతుంది.

అయితే మనకున్న ఆక్షేపణ అల్లా ఒక్కటే. పర్వత పట్టణాదులంటే అవి మన చుట్టూ ఉన్న లోకంలోని పదార్థాలు. వాటికొక విశిష్టమైన ఆకృతి ఉన్నది. కాబట్టి వాటి నెవరైనా వర్ణించి చెబితే ఆయా రూపాలు మనసు మీద పడటంలో ప్రతిబంధం లేదు. కాని ప్రస్తుత మీ బ్రహ్మ పదార్థాని కలాంటి ప్రాతిస్వికి Particular మైన రూపమేదీ కానరాదు. అలాంటప్పుడు తదాకారమైన చిత్తవృత్తి Mental Picture or Image మనకెలా ఏర్పడగలదు.

వాస్తవమే. బ్రహ్మమనే దానికొక ఆకారమంటూ లేదు. ఆకారముంటే అసలది బ్రహ్మమే కానేరదు. ఎందుకంటే శుద్ధమైన చైతన్యమే అది. ఆకాశంలాగా దానికొక ఆకారమనేది లేదు. ఆకారముండే పదార్థాలన్నీ అనాత్మ పదార్థాలు. అవన్నీ దానికి గోచరించవలసిందే గాని అది దేనికీ గోచరం కాదు. గోచరించే పదార్థాల నన్నింటిని "నేతి–నేతి" అని త్రోసివేసిన తరువాత చివరకేది శేషిస్తుందో అదే అది. అది ఇక అనాత్మ కావటానికి లేదు. అనాత్మ కాదంటే ఏమిటర్థం. ఆత్మే. బ్రహ్మమాత్మ స్వరూపమేనని గదా నిరూపించాము. అలాంటప్పుడనాత్మకు లాగా దాని కాకారమనేది ఎలా ఉండగలదు.

ఉండకపోతే తన్నిమిత్తమైన వృత్తి ఎలా ఏర్పడుతుందని గదా ప్రశ్న. ఆత్మ స్వరూపమే అయినప్పుడెందు కేర్పడదని ఎదురు ప్రశ్న వేశారు శంకరులు. ఆత్మ అంటే ఏమిటసలర్థం. అది మన జ్ఞానమే–మన స్వరూపమే – మనమే. ప్రతి ఒక్కరికీ మనలో నేను అనే స్ఫురణ ఉన్నది. అది ఇప్పుడీ అనాత్మ రూపాలలో కలిసిపోయి వివిక్తంగా Distinctly మనకు కనపడటంలేదు. ఆ రూపాలన్నీ ఎప్పుడు కాదనుకొని నిరాకరించామో అప్పుడది కనపడటానికేమి టాటంకం. అడ్డంకులేవీ లేవు కాబట్టి ఇంకా ధారాళంగా భాసించవలసి ఉంటుంది. కాని అది ఒక చెట్టూ పుట్టా మాదిరి ఒకానొక రూపంలో కనపడదు గదా. ఎలా భావన చేసి పట్టుకోవాలని నీ తాపత్రయం. అది నీస్వరూపమయి కూడా నీకు స్ఫురించలేదంటే సిగ్గు చేటన్నారు భగవత్పాదులు.

దీనికాయన ఒక చక్కని ఆఖ్యాయిక Anecdote కూడా సెలవిచ్చారు మనకు. ఒక జమీందారు దగ్గర ఒక నౌకరు చేరాడట. వాడొక శుద్ధ పల్లెటూరి మొద్దు. ఒకనాడేదో అవకతవక చేస్తే అధికారికి కోపం వచ్చి - ఛీ వెధవా - నీవు మనిషివే కాదు పొమ్మని తిట్టి పంపాడట. వాడు నిజంగానే తాను మనిషికానేమో అనుకొని అక్కడా ఇక్కడా తిరుగుతున్నాడట. దారిలో ఎవడో మనలాంటి వాడు తారసిల్లి ఎవడయ్యా నీవు - ఎక్కడికి వెళ్ళుతున్నావని అడిగాడట. అయ్యా ! నన్ను మనిషివి కావని తిట్టి పంపాడండీ మా యజమాని. నేను మరలా మనిషినయ్యే మార్గముంటే చూడమని బ్రతిమలాడాడట వాడు. వీడు బ్రహ్మాండమైన మూర్ఖుడని గ్రహించి వాడు - ఒరే నీవు చెట్టువుకావు - చేనువుకావు - పశువువు కావు - పక్షివి కావు. ఇవి ఏవీ కాకపోతే మరి నీవు మనిషివి గాక మరేమవుతావని నచ్చజెప్పాడట. మనిషి వెందుకు గావని తెలియజెప్పినపుడు కూడా నేను మనిషినే ననివాడు తెలుసుకోలేకపోతే నీవు మనిషివేనని సూటిగా చెబితే మాత్రం వాడు గ్రహించగలడా.

అలాగే ప్రస్తుతమిది కాదిది కాదని దేశ కాలాదులతో సహా అన్ని భావాలనూ ప్రత్యాఖ్యానం Refuted చేసిన తరువాత పరిశిష్ట Remained మైన దేదో అదే నీ స్వరూపమని శాస్త్రం బోధిస్తుంటే - ఇది గదా నేనని వెంటనే మనం గ్రహించగలిగి ఉండాలి. ఆ మాటకు వస్తే ఆ నేననే భావన నా కిప్పుడుండనే ఉన్నది. క్రొత్తగా వెదకి పట్టుకోవలసింది కూడా కాదు. పట్టుకోక పూర్వమే పట్టుబడి ఉందది. మన శరీరాని కిప్పుడొక ఒడ్డూ పొడుగూ-ఉరువూ-బరువూ ఇవన్నీ ఉన్నాయంటే అవి నిత్యమూ మనంకొలత వేసి, తూకం వేసి చూచుకొంటున్నామా. అలా చూడకుండానే నేనింత ఉన్నానని మన మనసుకది సంవేద్యమానం Being felt కావటం లేదా. అలాంటప్పుడంతకన్నా సన్నిహితమైన మన స్వరూపమే Very self అయిన ఆత్మను మనం ఫలానా అని గుర్తించలేక పోవటమేమిటి. ఆగంతుకమైన పదార్థమైతే ఒకవేళ భావించకపోవచ్చు. స్వరూపమే అయిన దాన్ని ఎలా భావించలేము. ఏ రూపమూ లేకపోయినా దాన్ని భావించగలం.

ఆ మాటకు వస్తే పంచభూతాలలోనే రెండు భూతాల కసలు రూపమే లేదు. పృథివ్యప్తేజస్సుల వరకే రూపమనేది. వాయ్వాకాశాలు రెండింటికీ రూపమే లేదు. లేకున్నా ఇది వాయువనీ, ఇది ఆకాశమనీ, మనసుకు రావటం లేదా. అంతేకాదు.

ఇంతకుముందే చెప్పామొక విషయం. సుఖమూ, దుఃఖమూ, ఉత్సాహమూ, ధైర్యమూ, భయమూ, భక్తీ ఇలాంటి భావాలు శతసహస్రమున్నాయి. వీటన్నిటికీ వస్తువులకు లాగా ఒకనిర్దిష్టమయిన రూపం లేదు. ఏ రూపమూ లేకున్నా అవి మనసుకు రావటం లేదా మనకు సంవేదన Experience కావటం లేదా. రూప సహితమయిన వస్తువుల నెలా గ్రహిస్తున్నామో రూప రహితమయిన భావాలను కూడా అలాగే గ్రహించగలుగుతున్నాము. కాబట్టి ఆత్మకొక ఆకారమంటూ లేనందువల్ల దానిని మనం భావించలేమనేది ఒక ఆక్షేపణ కాదు. సుఖాదిభావాల మాదిరే అది సుఖంగా భావించవచ్చునంటారు భగవత్పాదులు.

# మనోవైశిష్ట్యం

అసలు మానవుడి మనస్సుకే ఒక అద్భుతమయిన శక్తి ఉంది. అది రెండంచులా పదునైన కత్తి. సవికల్పంగా Analytic భావించగలదు. నిర్వకల్పంగానూ Synthetic భావించగలదు. సవికల్పమయిన దృష్టికేది చూచినా విశేష రూపంగా కనిపిస్తుంది. అదే నిర్వికల్పమయిన దృష్టితో చూస్తే అంతకంతకది సూక్ష్మమయి సామాన్యరూపంగా భాసిస్తుంది. మనమొక వృక్షాన్నే చూస్తున్నామనుకోండి. అది కొమ్మలూ రెమ్మలూ – పూలు కాయాలూనని ప్రత్యవయవమూ పరకాయించి చూస్తే అది సవికల్ప దృష్టి. అలా కాక దాని నా పాదమస్తకమూ ఒక్కసారి అలవోకగా చూచామంటే అలికినట్టు ఒకే ఒక అఖండ పదార్థంగా భాసిస్తుంది. అది నిర్వకల్ప దృష్టి. నిర్వికల్ప మెక్కువయ్యే కొద్దీ విశేషాలంతకంతకు సురిగిపోయి సామాన్యమైన General తత్త్వం బయటపడుతుంది. కేవలమొక వృక్షమని చూచినప్పుడు దాని కొమ్మలూ రెమ్మలూ అనే విశేషాలు అలాగే గదా కనపడకుండా పోతాయి. అలాగే ఆ వృక్షాన్ని కూడా ఒక పెద్ద వనంగా దర్శించినప్పుడది కూడా ఒక విశేషమయి Particular దానిలో లీనమవుతుంది.

ఈ సూత్రాన్నే Principle ఇక కొంత పొడిగిస్తే ఆ వనం కూడా ఇలాంటి వననదీ పర్వతాదులన్నింటికీ ఆశ్రయమైన పృథివీ సామాన్యంలో చేరిపోతుంది. పోతే ఈ పృథివి జరాయుజాది చతుర్విధ భూతరాసులకూ నిలయం. భూత భౌతికాలన్నీ విశేషాలైతే particulars ఇది వాటన్నిటికీ కలిపి సామాన్యం general శబ్ద స్పర్శరూప

రస గంధాలనే అయిదు గుణాలూ ఉన్నాయి దానికి. అంచేత అది స్థూలంగా కనపడుతున్నది అలాంటి ఈ పృథివి నుంచి జలతత్త్వం దగ్గరికి పోయేసరికి గంధమనే ఒక గుణం తగ్గి రసాదులైన మిగతా నాలుగే మిగులుతున్నాయి. దానిలో కొంత స్థూలత్వం పోయి సూక్ష్మమయిందది. దానిని కూడా దాటి తేజస్సును సమీపించామంటే రసమనే మరొక గుణం కూడా పోయి మూడే మిగులుతాయి. అంచేత అది ఇంకా సూక్ష్మం. ఈ రీతిగా మనమాకాశం దాకా ప్రయాణం చేశామంటే ఒక్కొక్క గుణం తగ్గుతూ చివరకొక్క శబ్దగుణమే దక్కుతుంది. అలా తగ్గే కొద్దీ అది సూక్ష్మమవుతూ పోతుంది. సూక్ష్మమయ్యే కొద్దీ రూపాన్ని కోలుపోతుంది. రూపం పోయిందంటే విశాలమై సర్వత్రా వ్యాపిస్తుంది. అప్పుడీ పృథివ్యాది సామాన్యాలన్నీ ఆకాశమనే మహాసామాన్యంలో విశేషాలయి కూచుంటాయి.

ఈ ఆకాశం కన్నా పెద్దది మనమిప్పుడు చెప్పుకొనే ఆత్మ పదార్థం. **"జ్యాయాన్ పృథివ్యాః - జ్యాయానంత రిక్షాత్"** అని శాస్త్రవచనం. ఎంచేతనంటే దానికి శబ్దమనే ఒక గుణమైనా ఉన్నది. దీనికదీ లేదు. ఇది నిర్గుణం A substance without property నిర్గుణం గనుకనే ఇది నిరతిశయ సూక్ష్మమైన The subtlest పదార్థం. అంత సూక్ష్మమెప్పుడయిందో అప్పుడతి స్వచ్ఛమూ-అతివిశాలమూ-సర్వవ్యాపకమూ కూడా కాక తప్పదు. అంచేత అదే అన్నింటికన్నా మహత్తరమైన సామాన్యం Sui generis ఇలాంటి సామాన్యాన్ని భావించామంటే ఇక ఆకాశాదులైన సర్వసామాన్య విశేషాలు అందులోనే అంతర్భవిస్తాయి. అంతర్భవించటమంటే మరలా అక్కడ స్వరూపంతో ఉంటాయని కాదు. అలా ఉండటమనేది అనాత్మ జగత్తులోనే. ఆత్మ చైతన్యంలో ప్రవేశించేసరికలా పృథగ్భూతంగా Separate ఉండటమనేది పొసగదు. చైతన్యానికి బాహ్యంగా స్వతంత్రమైన సత్తా ఏదీ లేదని గదా ప్రతిపాదించాము. ఆ మాటకు వస్తే చైతన్యమే మన అవిద్యా దోషంవల్ల ఆయా అనాత్మ రూపాలుగా భాసిస్తున్నదాయె. అంచేత చైతన్యానికి భిన్నంకావని ఎప్పుడపవదించామో అప్పుడవన్నీ మరలా మనకు ఆత్మ రూపంగానే దర్శనమిస్తాయి. ఇస్తే ఒకే ఒక ఆత్మతత్త్వమఖండంగానూ Indivisible అపరోక్షంగానూ Immediate అనుభవానికి రాక తప్పదు.

మొత్తంమీద అన్నిటికన్నా విశేష Lowest particular మీ శరీరాది సంఘాతమైతే అన్నిటికన్నా సామాన్య Highest general మయినది ఆత్మచైతన్యం సృష్టిలో. దీనిని

దానిని రెంటినీ భావన చేయగలిగింది మానవుడి మనస్సు. మనసు భావన చేయాలంటే ఏదో ఒక గుణముండాలి పదార్థానికి. ప్రస్తుత మీ ఆత్మ అనే దానికే గుణమూ లేదు. ఎలా భావించగలదు మనస్సు అదే చిత్రం. ఆత్మకే గుణమూ లేదని చెప్పినా దాన్ని మన మతిసూక్ష్మమూ, అతివిశాలమూ, అతిస్వచ్ఛమూ అని వర్ణిస్తున్నాము. కాబట్టి ఇవే గుణాలని భావించవచ్చు దానికి. గుణాలు కాని గుణాలివి. ఇవి కూడా నిర్విశేషమే కాబట్టి ఇవే గుణాలని భావించవచ్చు దానికి. గుణాలుకాని గుణాలివి. ఇవి కూడా నిర్విశేషమే కాబట్టి సత్తనే Existance ఒకే ఒక సామాన్య గుణంలోనే చేరిపోతాయి. పోతే అది సర్వవ్యాపకమయిన గుణం. కాబట్టి తద్వారా ఆత్మనొక్క ఆకాశంలాగా భావన చేయవచ్చు. భావన అనేసరికి చిద్రూపమైన Conscient మనసు సద్రూపమైన Existant ఆకాశంతో చేతులు కలుపుతుంది. శుద్ధమైన సచ్చిత్తులే గదా బ్రహ్మమంటే. కాబట్టి మనసుకు బ్రహ్మాకారవృత్తి ఏర్పడటంలో అభ్యంతరం లేదు. కనుకనే అంతరమైన ఈ మనస్సూ బాహ్యమైన ఆకాశమూ ఇవి రెండే బ్రహ్మతత్త్వాన్ని పట్టుకోటానికి చక్కని ప్రతీక Aidsలని చెబుతారు భగవత్పాదులు.

ఇంతకూ మనస్సు భౌతికమైన నామరూపాలనెలా భావన చేయగలదో అలాగే అభౌతికమైన సచ్చిత్తులను కూడా భావించగలదు. ఆకాశరూపంగా భావించటమే సచ్చిత్తులను భావించటం. సచ్చిత్తులే బ్రహ్మతత్త్వం. కాబట్టి వాటిని భావించిందంటే మనస్సు - బ్రహ్మతత్త్వాన్ని భావించినట్టే. బ్రహ్మ గుణాలను భావిస్తూ పోతే మనసు బ్రహ్మమే అవుతుంది. **"బ్రహ్మవేద - బ్రహ్మైవ భవతి."** ఏది భావిస్తే ఆ రూపంగా పరిణమించటమే గదా మనసుకుండే స్వభావం. వననదీ పర్వతాదులను భావించినప్పుడాయా రూపాలుగా ఎలా భాసిస్తుందో అలాగే సచ్చిదాత్మకమయిన తత్త్వాన్ని భావించేటప్పుడు కూడా భాసించి తీరాలి. అందులో లౌకిక పదార్థాలను భావించినప్పుడది సవికల్పమయితే బ్రహ్మతత్త్వాన్ని భావించేటపుడు కేవలం నిర్వికల్పమవుతుంది. రెండు విధాలుగా మారిపోయే యోగ్యత దానికెంతైనా ఉంది.

ఇలాంటి ద్వైవిధ్యం Duplicity దాని స్వభావంలోనే ఉండటం మూలాన బ్రహ్మజ్ఞానాన్ని ఆర్జించటానికి మనసనేది ఏ మాత్రమూ పనికి రాదని ఒక మాటా మనసు తప్ప వేరొక సాధనమే లేదని మరొక మాటా-రెండు మాటలూ చెలామణిలోకి వచ్చాయి. **"యన్మనసాన మనుతే"** అనీ **"మనసై వేద మాప్తవ్య"** మనీ రెండు

భావాలనూ శాస్త్రమే మనకు బోధిస్తున్నది. పైకి చూస్తే ఇవి రెండూ చాలా విరుద్ధమయిన భావాలుగా తోచవచ్చు. కాని దానికి సహజంగా ఉన్న ఈద్వైవిధ్యాన్ని గమనిస్తే అందులో ఎలాటి వైరుధ్యమూ కానరాదు. చాలా చక్కగా సమన్వితమవుతాయి. ఎలాగని అడగవచ్చు. మనసు సవికల్పమయిన దృష్టి వదలనంత వరకూ అది ప్రాకృతం Physical. కేవలమూ నామరూపాత్మకమయిన విశేష రూపాలను చూడవలసిందేగాని వాటిని సామాన్య రూపంగా అనుసంధించుకో లేదు. మామూలు సామాన్యాలనే అలా భావన చేయలేకపోతే అది మహా సామాన్యమైన బ్రహ్మచైతన్యాన్ని ఎలా భావించగలదు. అది ఏనాటికీ దాని అవగాహనకు రానేరాదు. ఇలాంటి ప్రాకృతమయిన మనస్సును దృష్టిలో పెట్టుకొనే బ్రహ్మస్వరూప సాధనకది పనికి రాదని చాటింది శాస్త్రం. పోతే ఈ మనసునే శాస్త్రాచార్యోపదేశ సాహాయ్యంతో అంతకంతకు పదను పెట్టగలిగితే అది నామరూపాల పరిధిని దాటి నిర్వికల్ప మవుతుంది. అప్పుడది ప్రాకృతం కాదు. సంస్కృతం Refined. అలాంటి మనస్సు తప్పకుండా అఖండమయిన ఆ బ్రహ్మచైతన్యాన్ని పట్టుకోగలదు. ఎందుకంటే మనసుకు సంస్కారమేర్పడే కొద్దీ సూక్ష్మమైన తత్త్వాన్ని నిరీక్షంచగలదు. నిరతశయ సూక్ష్మమైనది ఆత్మతత్త్వం. దాన్ని బాగా పరిశుద్ధమయిన మనసు అందుకోవటంలో ఆశ్చర్యం లేదు. ఇదుగో ఇలాంటి సంస్కృతమయిన మనస్సును మనసులో పెట్టుకొనే శాస్త్రం మనసనేది ఒక్కటే సాధనమని మరలా లోకానికి చాటి చెప్పింది. ఇంతకూ సవికల్పమయిన మనసుకు కాకపోయినా అంతకంతకు నిర్వికల్పమయిన దృష్టి నలవరుచుకొంటే మాత్రమెప్పటికైనా బ్రహ్మం మన గుప్పిటిలోకి రాకపోదని ఫలితార్థం.

## భావనానిరాసం

ఆ మాటకు వస్తే అసలు మనసుచేత బ్రహ్మతత్త్వాన్ని భావించనే వద్దని నిషేధించారు భగవత్పాదులు ఎందుకంటే ఉత్తమాధికారి కయితేనే అది లాభసాటి. అందులోని మెళకువ నర్థం చేసుకొని అతడు ముందుకు సాగిపోగలడు. మరి మంద మధ్యమాధికారులైతే అలా అర్థం చేసుకోలేరు. చేసుకోలేకపోగా అపారమైన నష్టానికి పాలవుతారు. ఎందుకంటే బ్రహ్మమనేది ఆత్మ స్వరూపం. అనాత్మ పదార్థాల

మాదిరి దానికొక నామమూ,రూపము, క్రియా అనే లక్షణాలేవీ లేవు. ఏది ఉన్నా అది బ్రహ్మమే గాదు. అలాంటప్పుడు సత్తన్నా - చిత్తన్నా - ఆకాశమన్నా మనస్సన్నా ఏమన్నా దాని స్వభావానికి ప్రతికూలమయిన మాటే. కాబట్టి తద్వారా దాన్ని యధాతథంగా ఎప్పుడూ పట్టుకోలేము. యథారూపంగానే పట్టుకోవాలంటే దాన్ని విధి ముఖంగా భావించనే కూడదు. అలా భావించే కొద్దీ ఏదో ఒక రూపంలోనే దాన్ని భావించవలసి వస్తుంది. ఎంత సూక్ష్మమైన రూపమైనా అది రూపమే. ఆ మేర కావస్తువు పరిచ్ఛిన్నం కాక తప్పదు. శాస్త్రమొకవేళ ఆకాశాది రూపంగా భావించమని చెప్పినా అది ఆలంబనంగా Aid చెప్పిన మాటే. ఆలంబనమనేది అసలు తత్త్వాన్ని పట్టుకొనేందుకుపాయమే గాని ఉపేయమైన ఆ తత్త్వాన్ని దీనిమేరకే దించి చూచేందుకు గాదు. అలాదించి చూడటానికే ప్రయత్నిస్తారు మంద మధ్యములంతా. ఉపేయాన్ని End విడిచిపెట్టివారు ఉపాయాన్నే Means పట్టుకొని కూచుంటారు. అలా కూచోటంవల్ల బ్రహ్మతత్త్వాన్ని అంతకంతకు నిరాకారంగా భావించే బదులు మరలా సాకారంగా దర్శించే ప్రమాదముంది. అంచేత విధి ముఖముగా దాన్ని భావించనే రాదని కఠినంగా శాసిస్తారు భగవత్పాదులు.

అయితే విధి ముఖం కాకుంటే మరి ఎలా భావించాలని ప్రశ్న వస్తుంది. నిషేధ ముఖంగా Negative or Indirect భావన చేయాలని సలహా ఇస్తారాయన. నిషేధమనేది అపవాదానికి పర్యాయమే Synonym నని ఇంతకుముందే పేర్కొన్నాము. ఇది కాదిది కాదని త్రోసిపుచ్చటమే నిషేధమంటే. నేతినేతి - అని ఉపనిషత్తులలో బోధించిన మార్గమిదే అసలు. శాస్త్రం నేతి నేతి - అని రెండు మార్లు దేనికి బోధించటమని ప్రశ్న వచ్చింది. దీనికి బహుభంగుల వ్యాఖ్యానం చేసి చెప్పారు భాష్యకారులు. ఈ రెండింటిలో మొదటి నకారం మూర్తమయిన జగత్తును నిషేధిస్తే రెండవ నకార మమూర్తమయిన అవ్యక్తాన్ని నిషేధిస్తుందని ఒక అర్థం. పోతే మొదటిది భూతరాశిని కాదని త్రోసిపుచ్చితే - రెండవది వాసనా రాశిని నిరాకరిస్తుందని మరి ఒక అర్థం. ఇవీ కాకపోతే ఇంకొక చక్కని అర్థం కూడా చెప్పుకోవచ్చునంటారాయన. అదే వీప్సార్థం. వీప్స అంటే ఏదేది మనముందని భావిస్తుంటామో అదంతా లేదని త్రోసివేయటం. అలా కాక ఎక్కడి కక్కడ గోచరించినవి మాత్రమే చూచి ఇవి లేవని చెప్పామనుకోండి. ఇవి కాకపోతే మరొకటేదైనా బ్రహ్మమేమో అదెలా ఉంటుందో

చూడాలనే అన్వేషణ బయలుదేరుతుంది. అన్వేషణ పూర్తిగా తొలగాలంటే అప్పటికి పరిగణితమయిన Enumerated ప్రతిషేధం చేయగూడదు. వీస్సారూపమయిన Exhaustive ప్రతిషేధమే చేయాలి. దీనిలో విశేషమేమంటే ఏదేది మనసుకు వస్తుందో రావటానికి వీలుందో అదీ ఇదీ అనే ప్రశ్నేలేదు. ప్రతి ఒక్కటీ సృష్టిలో ఎక్కడ ఎప్పుడు తారసిల్లినా అదంతాలేదు లేదని త్రోసిరాజంటూ పోవటమే. మనసుకు వచ్చినదంతా త్రోసి రాజంటే ఇక ఏదీ లేదు సృష్టిలో నాకు నేనే ఉన్నానని ఆత్మలోనే మనసు విశ్రాంతమయి అన్య జిజ్ఞాస తొలగిపోతుంది. అప్పుడిక తప్పనిసరిగా మనస్వరూపం మన కనుభవానికి రావలసిందే.

అసలాత్మ అనేది మన స్వరూపమైనా మనకు దాని సంవేదన Experience కలగటం లేదంటే ఏమి కారణం. దానికీ నామరూపాలనే తిరస్కరిణులడ్డు తగలటం తప్ప మరేదీ గాదు. కనుక ఈ అంతర్ధిని తొలగించటానికే మనం చేయవలసిన కృషి అంతా. అంటే ఏమన్నమాట. అనాత్మ భావాన్ని పోగొట్టుకోటానికే గాని ఆత్మను రాబట్టుకోటానికి గాదు. ఆత్మ అనేది మనకెక్కడో దూరంగా లేదు. ఆత్మ అంటే స్వరూపం ఆకాశంలాగా అది మనలోపలా వెలపలా నిండి నిబిడీకృతమయి ఉంది. అది మనకు హేయమూ గాదు. ఉపాదేయమూ గాదు. హేయమంటే త్రోసివేయటం. మనస్వరూపమే అయిన దాన్ని మనమెలా త్రోసివేయగలం. పోతే ఇక ఉపాదేయమంటే దగ్గరగా తీసుకోవటం. అంతటా అదే పరచుకొని ఉన్నప్పుడు దాన్ని మనం దగ్గరగా తీసుకోవటమేమిటి. తీసుకోకముందే ఉందది మన దగ్గర. కాబట్టి ఆత్మవిషయంలో లేదెలాటి ప్రయత్నమూ, అనాత్మ నపవదించటంలోనే చేయాలి ప్రయత్నమంతా.

## ప్రవిలాపనం

అయితే అపవదించటమన్నారు బాగానే ఉంది. అపవదించటమంటే త్రోసి పుచ్చటమని గదా అర్థం. త్రోసిపుచ్చవలసింది దేనిని మనం. అనాత్మ భూతమైన ఈ ప్రపంచాన్నే గదా ఈ ప్రపంచాన్ని ఎలా త్రోసి పుచ్చాలి మనం. త్రోసి పుచ్చితే మాత్రమెక్కడికి పోతుందది. ఎక్కడో ఒకచోట ఉండవలసిందే గదా. అలా ఉంటే మన బ్రహ్మం సద్వితీయమే కావాలిగాని అద్వితీయమెలా అవుతుందని ఒక పెద్ద ఆశంక వస్తుంది.

ఇక్కడ అపవాదమనే మాటను బాగా అర్థం చేసుకోవాలి మనం. అద్వైతంలో అపవాదమనే మాట పారిభాషికం. అంటే మిగతా దర్శనాలలోనూ మనదైనిక జీవితంలోనూ అనూచానంగా చెప్పుకొనే అర్థమిక్కడ పనికిరాదు. మిగతా చోట్ల అపవాదమంటే ఒక వస్తువును దూరంగా త్రోసివేయటం. అలా త్రోసివేస్తే అది మనదగ్గర లేదనే గాని మరెక్కడైనా ఉండవచ్చు. ఎక్కడా లేకుండా మాయమైపోదది. ప్రస్తుత మీ అద్వైతులు చెప్పే అపవాదమలాంటిది కాదు. ఇక్కడ ప్రపంచాన్ని మన మపవాదం చేశామంటే అది ఇక ఎక్కడా లేకుండా పోతుంది. దానికిక అస్తిత్వమే ఉండబోదు. దీనికే భగవత్పాదులు ప్రవిలాపన Total Dissolution మని పేరు పెట్టారు. ప్రవిలాపనమంటే బాగా కరగదీయటమని అర్థం. బ్రహ్మమనేది శుద్ధ చైతన్యాత్మకం. అది నామరూపాత్మకమైన ప్రపంచంగా పేరుకొని పోయింది. ఈ పేరుకొన్న ఘనపదార్థాన్ని మరలా మనం కరగదీసుకొంటూ పోవాలి. కరగిస్తే అది మరలా మన దృష్టికి శుద్ధచైతన్య రూపంగానే భాసిస్తుంది.

అయితే కరగించటమనే సరికి కేవలమొక ఘనాన్ని ద్రవంగా మార్చుకోవటమని మరలా అపోహపడరాదు. ఊరక దృష్టాంతం కోసం చెప్పిందే గాని ఈ మాట నిజంగానే ఈ ప్రపంచమొక పేరుకు పోయిన పదార్థమనీ దానిని మనం నిజంగానే కరగదీయాలేమోనని భ్రాంతి పడరాదు. కరగదీయటమనేది ఇక్కడ ఒక పేరిన నేతిని కరగదీసినట్టు ఒక మంచు గడ్డను కరగదీసినట్టు కాదు. అవి భౌతికంగానే పేరుకుపోయిన పదార్థాలు కాబట్టి వాటిని భౌతికంగానే కరగించవచ్చు మనం. పోతే ఇది వాటిమాదిరి భౌతికం కాదు. భౌతికమే అయితే మొట్టమొదటి సారిగా ముక్తి బొందిన ఏ వ్యాస వసిష్ఠాదులో దీని నెప్పుడో కరగించి ఉండేవారు. వారే కరగిస్తే మనకిప్పుడు మరలా దాన్ని ప్రవిలాపనం చేయవలసిన అవసరం లేకపోయేది. అయినా ఇప్పుడు మనకీ ప్రపంచమిలా భాసిస్తున్నదంటే ఏమని అర్థం. అప్పటికి భౌతికంగా కాదన్నమాట దీని ప్రవిలాపనం. భౌతికం కాకపోతే మరేమిటి. జ్ఞానంతో మాత్రమే కరగదీయాలి దీన్ని. ఎందుకంటే మనకిది బ్రహ్మమనే జ్ఞానం లేకపోవటం వల్లనే దీన్ని నామరూపాత్మకమైన జగత్తుగా చూస్తున్నాము. ఈ చూడట మీ జన్మతో ఆరంభమైనది కాదు. ఇది ప్రారంభమయి ఎన్నో లక్షల కోట్ల జన్మలు గడచిపోయాయి. అలా చెప్పటం కూడా సబబు కాదట. అనాది అని గదా చెప్పాము మన అజ్ఞానం.

కనుక ఈ మన అజ్ఞాన దృష్టికారంభమే లేదు వాస్తవంలో. ఇది బాగా వేళ్ళు పాతుకొని పోవటంవల్ల మనమిలా చూచి చూచి ఈ ప్రపంచ దృశ్యం మనకు బాగా గట్టిపడిపోయింది. అయితే ఎంత గట్టిపడినా ఇది మన అజ్ఞానంవల్ల పడిన గట్టితనమే కాబట్టి జ్ఞానోదయమైతే చాలు. సూర్యోదయమయితే చీకటి పొరలలాగా ఎక్కడదక్కడ విరిసిపోగలదు. కాబట్టి జ్ఞానం చేతనే ఈ ప్రపంచం ప్రవిలయమయి పోవాలి గాని భౌతికంగా పోయేది కాదు.

అయితే జ్ఞానం మాత్రం దీన్ని ఎలా కరగదీస్తుందని ప్రశ్న రావచ్చు. ఎందుకంటే జ్ఞానమనేది మానసికంగా కలిగే ఒకానొక వృత్తి Mental process ప్రపంచమనేది బాహ్యంగా మన చుట్టూ పరచుకొని ఉన్న ఒక భౌతికమైన పదార్థం. Physical object మన మనసులో లేదని భావించినంత మాత్రాన ఇది భౌతికంగా మాయమైపోతుందా అని సందేహం. తప్పకుండా పోతుందనే హామీ ఇస్తారు భగవత్పాదులు. కారణమేమంటే మనం ముందు నుంచీ ఏకరువు పెడుతూనే ఉన్నాము. ప్రపంచమనేది నీకెంత బ్రహ్మాండంగా కనిపిస్తున్నా ఇది దానిపాటికది స్వతస్సిద్ధంగా ఉన్న పదార్థం కాదు. కేవలమొక ఆభాస. ఆభాస అనేది వస్తువు కాదు. వస్తువు తాలూకు నీడ. వస్తువే ఆ రూపంలో మనకు భాసిస్తున్నది. అంతమాత్రమే. రజ్జువు సర్పంలాగా భాసించటం లేదా. అలాగే ప్రస్తుతం బ్రహ్మమే మనకు ప్రపంచంగా భాసిస్తున్నది.

అలా భాసిస్తున్నదంటే ఆ బ్రహ్మం తనపాటికి తాను కావాలని భాసించటంకూడా కాదు ఒక నిమిత్తంవల్ల ఏర్పడిందే ఆభాస. కనుక నిమిత్తమున్నంత వరకే దానికి స్థితి. నిమిత్తం పోయిందంటే ఇక అది ఉండటానికి వీలు లేదు. దానితో పాటు ఇదీ పోవలసిందే ఆ నిమిత్తమేమిటిక్కడ. అనాది సిద్ధమైన మానవుడి అజ్ఞానమేనని చెప్పాము. అది జ్ఞానంతో ఎప్పుడు రూపుమాసిందో అప్పుడీ అజ్ఞాన జన్యమైన ప్రపంచం కూడా మాసిపోక తప్పదు. ఇంత గట్టిగా కనబడుతున్న పదార్థం కదా. ఎలా మాసిపోతుందని సందేహించనక్కరలేదు. అలాంటి సందేహమెప్పుడు కలిగినా మన స్వప్నాన్ని జ్ఞాపకం చేసుకోమన్నారు స్వామివారు. ప్రతిరోజూ నిద్రలో మనకేదో ఒక స్వప్నం వస్తుంటుంది. అందులో ఎన్నో పట్టణాలూ, పర్వతాలూ, మేడలూ,

మిద్దెలూ, మనుషులూ, మృగాలూ, ఒకటేమిటి. చిత్ర విచిత్రమైన దృశ్యాలెన్నో చూస్తుంటాము. చూచినంతసేపూ అవి కంటికి కనిపిస్తూ ఒంటికి సోకుతూ ఎంతో గట్టిగానే తోస్తుంటాయి. కాని ఉన్నట్టుండి మెళకువ రాగానే అందులో ఏ ఒక్కటీ ఇక ఆచూకీ ఉండదు. అంతగట్టిగా చూచిందీ - హఠాత్తుగా కరిగిపోయి మనకు మనమే మిగులుతాము. ఏమి కారణం. అదంతా మన అజ్ఞానంవల్ల భాసించిందే. కనుకనే మరలా జ్ఞానోదయమయ్యేసరికి సురిగిపోతుంది.

అలాగే ఇక్కడా మన అజ్ఞానంవల్లనే ఈ జాగ్రత్ప్రపంచం కూడా ఇలా నిత్యమూ భాసిస్తున్నది. ఎంత భాసించినా ఇది మనమిలా చూస్తూ చేస్తున్నంతవరకే. ఎప్పుడు మనకు బ్రహ్మజ్ఞానముదయిస్తుందో అప్పుడిది కూడా ఒక స్వప్న జగత్తు మాదిరే మటుమాయమై పోతుంది. అయితే అది తాత్కాలికమైతే ఇది దీర్ఘకాలికం. దానికెప్పటి కప్పుడు ప్రబోధమనేది ఏర్పడుతుంటుంది. కనుకనే ఇది కేవలం స్వప్నమేగాని యధార్థం కాదని భావించగలుగుతున్నాము మనం. అలాంటి వ్యవహారం కాదిక్కడ. ఇది యావజ్జీవమూ ఉండేది కాబట్టి ఇంకా స్వప్న జగత్తులోనే ఉన్నాము మనమంతా స్వప్నం నుంచి తేరుకొన్న అనుభవమెలాంటిదో ఇంకా తెలియదు మనకు. కనుకనే అలాంటి దొకటుందా - అది కలిగితే ఇది పోతుందా - అని నమ్మలేకపోతున్నాము.

ఆ మాటకు వస్తే జాగ్రత్తులో మనం చూచేది కూడా ఒక స్వప్నమే వాస్తవానికి. పది పదిహేనేండ్ల క్రితం మనం చూచిన పదార్థాలు గానీ మనషులు గానీ పరిస్థితులు గానీ ఇప్పుడు లేవు. బాల్యంలో చూచినవెన్నో ఇప్పుడు కానరావు. అవన్నీ మనస్మృతి పథంలో మాత్రమే నిలిచిపోయాయి. పోతే ఇప్పుడెంతో యధార్థంగా అనుభవానికి వచ్చే సన్నివేశాలు కూడా ఇరవై ముప్పై ఏండ్లు గడిచేసరికి వెనకకు తిరిగి చూస్తే ఎక్కడా కనపడవు. కాల ప్రవాహంలో కలిసిపోయి అంతా ఒక కలలాగా కరిగిపోతుంది. అందుకే ఉపనిషత్తు మన జాగ్రత్స్వప్న సుషుప్తులను మూడింటినీ స్వప్నమనే వర్ణించింది. **"త్రయః స్వప్నాస్త్రయ ఆవసథాః"** అని ఉపనిషత్తు చాటిన సత్యం. కాబట్టి కాలమే అపవదిస్తున్న దసలీ ప్రపంచాన్ని. మనవరకూ కూడా అక్కరలేదు.

# అధ్యారోపావశ్యకత

అయితే ఒక మాట. అలా అపోదితమవుతున్నా - చరాచర పదార్థాలు మనచుట్టూ ఏదో ఒక రూపంలో ఏదో ఒక మోతాదులో ఎప్పటికప్పుడు కనిపిస్తూనే ఉంటాయి గాని సర్వాత్మనా నశించి అంతా శూన్యం మాత్రమయి పోదు. ఆయా విశేషాలు పోయినా సామాన్య రూపంగా ప్రపంచముండనే ఉంటుంది. దీనికి నియామకమైన దేశకాలాలూ అలాగే భాసిస్తుంటాయి. దేశకాల వస్తువులనే ఈ మూడు పరిచ్ఛేదాలూ Three dimensions చిత్ర విచిత్రంగా ఎప్పటికప్పుడు గోచరిస్తూనే ఉన్నప్పుడిక వీటినెలా ప్రవిలాపనం చేయగలం. చేసినా అవి ప్రవిలయమయ్యే మార్గం కనపడటం లేదే అని ఒక పెద్ద భీతాహముంటుంది సాధకులకు.

వాస్తవమే. ఇలాటి భీతాహ మేర్పడటంలో ఆశ్చర్యం లేదు. దీనికి కారణం అపవాదమనేది అలాగే చేయాలని ప్రయత్నించటం. అధిష్ఠాన దృష్టితో అపవాదం చేయాలిగాని దానినలాగే చేయరాదు. చేసినా ప్రయోజనం లేదు. వట్టి ప్రయాసే గాని అది ఎక్కడికి పోదు. రజ్జు దృష్టితో చూస్తే సర్పం తొలగిపోతుంది గాని ఊరక సర్పమా తొలగి పొమ్మంటే పోతుందా. అలాగే బ్రహ్మదృష్టి పెట్టుకొని ఆ దృష్టితో ఈ నామరూపాత్మకమైన ప్రపంచాన్ని చూడాలి. **"దృష్టిమ్ జ్ఞానమయీమ్ కృత్వా పశ్యే ద్బ్రహ్మమయమ్ జగత్తని"** అభియుక్తుల మాట. కనుక అపవాదం చేయాలంటే ముందుగా అధిష్ఠాన జ్ఞానముండి తీరాలి. మరి అధిష్ఠానం ఫలానా అని గుర్తించాలంటే దాని నధ్యారోపణ మూలంగానే గుర్తించాలి తప్ప మరొక మార్గం లేదు.

దీనిలో మర్మమేమంటే అధిష్ఠానమైన బ్రహ్మచైతన్యం సువర్ణ మాభరణాలలో మాదిరి నామరూపాత్మకమైన సకల పదార్థాలలోనూ ఓతప్రోతంగా కలిసిపోయి మనకిప్పుడు దాని స్వరూపం విడిగా గ్రహితాకు రావటంలేదు. దాన్ని పట్టుకొందామని చూడబోతే కమ్మలూ కాసుల దండలలాగా వన నదీ సర్వతాదులే కంటికి సోకుతుంటాయి గాని అది మనకు పట్టుచిక్కదు. మీదు మిక్కిలి అది కూడా వీటి రూపంలోనే మనకు దర్శనమిస్తుంటుంది. అలాంటప్పుడేమి చేయాలి మనం. వీటిని

కాదని వీటన్నిటికీ విలక్షణంగా దాన్ని మనసుకు తెచ్చుకోవాలి మొదట. అది ఎలాగా. ఈ చూచే ప్రపంచం దానివల్ల సృష్టి అయిందని చెబుతుంది శాస్త్రం. తన్మూలంగా ఈ సృష్టి అయిన ప్రపంచ లక్షణాలకంటే విలక్షణంగా భావించగలం దాన్ని. ప్రపంచం నామరూపాత్మకమైతే అది నామ రూప రహితం. ఇది పరిచ్ఛిన్నమైతే అది పరిపూర్ణం. ఇలా ప్రపంచ సృష్టిని దానిమీద ఆరోపించటంవల్ల ప్రపంచ లక్షణాలకు భిన్నంగా దాని లక్షణాలు భావించటాని కవకాశందొరికింది. ఏమిటా లక్షణాలు. ఒక్క మాటలో చెబితే నామరూపాదులేవీ లేని అఖండంగా వ్యాపించిన జ్ఞేయం కాని కేవల జ్ఞానస్వరూపం. ఇదే దాని లక్షణం.

ఇది మన స్వరూపమే కాబట్టి వెంటనే ఆకాశంలాంటి ఒక అఖండ భావన మనలోపలా వెలపలా నిండి ఉన్నట్టు అనుభవానికి వస్తుంది. దీనికే బ్రహ్మాకారవృత్తి అని ఇంతకు ముందు వర్ణించే ఉన్నాము. ఈ వృత్తికే అధిష్ఠాన జ్ఞానమని పేరు. అది అధ్యారోపంవల్లనే కలుగుతుంది. ఇప్పుడీ జ్ఞానంతో మన మా బ్రహ్మంమీద ఆరోపితమయిన ప్రపంచాన్ని మరలా చూస్తాము. చూస్తే ప్రపంచమిక ప్రపంచంగా కనిపించదు. వననదీ పర్వతాదికమయిన ప్రతి ఒక్క పదార్థమూ తదాకారంగానే మరలా మనకు సాక్షాత్కరిస్తుంది. అంటే సదాకారంగా చిదాకారంగా భాసిస్తుంది. ప్రపంచమనేది అప్పుడిక చెప్పకుండానే అపవాదమై పోతుంది.

కనుకనే అపవాదానికెప్పుడూ అధ్యారోపమనేది పూర్వరంగం. అది ఉత్తరార్ధమైతే ఇది పూర్వార్ధం. ఇది లేకుండా అది ఫలించదు. అధ్యారోపం బ్రహ్మజ్ఞానమైతే అపవాదం ఆ జ్ఞానంతో బ్రహ్మేతరమైన జగత్తునంతా ప్రవిలయం చేయటం. దీనితో సాధన పూర్తి అయి సిద్ధినందుకొంటాడు మానవుడు. కనుక అపవాదమే చివరకు ముఖ్యమైనా అధ్యారోపమనేది దాని కంగభూతం. అయితే బ్రహ్మతత్త్వాన్ని సాక్షాత్తుగా భావించటం పనికిరాదని గదా చెప్పారు. మరి బ్రహ్మాకారవృత్తి మాత్రమెలా ఏర్పడుతుందని ఒక చిన్న ఆశంక రావచ్చు. అది వాస్తవమే. కాని ఈ వృత్తిని కూడా మనమెంతో కాలం నిలుపుకోవటం లేదు. అది తాత్కాలికమే. అపవాదం చేయటం కోసమే ఆ వృత్తి. ప్రపంచ మపోదిత మయిందంటే దానితోపాటు ఈ వృత్తికూడా ప్రవిలయమై పోతుంది. ఒక ముల్లు తీయటానికింకొక ముల్లు నుపయోగించి తరువాత ఆ రెండు ముళ్ళూ ఎలా పారవేస్తామో–అలాగే వృత్తిజ్ఞానమెంత కాల్పనికమైనా అది

ప్రపంచ ప్రవిలయాని కుపయోగపడుతుంది. ఆ తరువాత రెండూ ప్రవిలయమై అవి మన ఆత్మ స్వరూపంగానే పరిణమిస్తాయి. అప్పటి నుంచి ఆత్మైవాత్మా.

## అంగాంగిభావం

ఇదుగో ఇలాంటి ఆత్మైకత్వ ఫలసిద్ధి కోసమే ఈ అధ్యారోపాప వాదరూపమైన సాధన ప్రక్రియ. మొదట నుంచీ సాంప్రదాయికంగా Traditional గురుశిష్య పరంపరలో వస్తూ ఉన్న ప్రక్రియ ఇదే అసలు. **"అధ్యారోపా పవాదా భ్యామ్ నిష్ప్రపంచమ్ ప్రపంచ్యతే"** అని భగవత్పాదులు కూడా దానినే ప్రమాణంగా తీసుకొని ఉదాహరిస్తారు. వేదాంత జ్ఞాన ప్రచారానికంతటికీ ప్రణాళిక Medium ఇది తప్ప మరొకటి ఏదీ లేదని చాటుతూ వచ్చారాయన. దీని ననుసరించే ఆయన తన ప్రస్థానత్రయ భాష్య మహాసౌధాన్నంతటినీ నిర్మించారు. ఇందులో అధ్యారోపమనేది అవాంతర వాక్యమైతే అపవాదాన్ని మహా వాక్యమని వ్యవహరించారు శాస్త్రజ్ఞులు. జగత్ప్రవిలయం ద్వారా జీవ బ్రహ్మైక్యాన్ని ప్రతిపాదించేది మహావాక్యం. తత్త్వమసి ఇత్యాదులిలాంటి మహావాక్యాలే. పోతే ఈ బ్రహ్మాత్మావగతికి దోహదం చేసే ప్రపంచ సృష్ట్యాది వర్ణనలన్నీ అవాంతర వాక్యాలు.

అవాంతర వాక్యం మనకు పదార్థ జ్ఞానమిస్తుంది. అంటే బ్రహ్మమనే పదార్థమిప్పుడు నామరూపాదికమైన అనాత్మ జగత్తుతో పనగలిసి ఉంటే అన్వయ వ్యతిరేకాలతో Permutation and combination వివేచన Differentiate చేసి చూపుతుంది. దానితో బ్రహ్మమంటే ఫలానా గదా అనే జ్ఞానమేర్పడుతుంది మనకు. పోతే ఈ పదార్థ జ్ఞానం వెంటనే వాక్యార్థ జ్ఞానానికి దారి తీస్తుంది. వాక్యార్థమంటే ఆ బ్రహ్మతత్త్వాన్ని దేని నుంచి వివేచన చేశామో అది కూడా దానికంటే వేరుగా లేదని అభేద భావం. అంటే జీవజగదభిన్నమైన బ్రహ్మమొకటి ఉందని గ్రహించటం. ఇలాంటి జ్ఞానాన్ని మనకు మహావాక్యమందిస్తుంది. **"పదార్థ జ్ఞానపూర్వకత్వా ద్వాక్యార్థ జ్ఞానస్య"** అంటారు స్వామివారు. వాక్యార్థ జ్ఞానానికి Synthetic knowledge పదార్థ జ్ఞాన Analytic knowledge మనేది అంగం Prerequisite. శాస్త్ర ప్రతిపాద్యమైన ప్రధాన విషయం వాక్యార్థజ్ఞానమే అయినాదానికోసం కల్పించుకొన్న ఒక సాధన మీ పదార్థ జ్ఞానం. దానినందిస్తుంది అవాంతర వాక్యం. అవాంతరమంతా అప్పటికి కాల్పనికమే. అభేద రూపమైన తత్త్వాన్ని భేద రూపంగా వర్ణిస్తే అది కాల్పనికం

కాక వాస్తవమెలా అవుతుంది. అయితే మరెందుకు వర్ణించినట్టు అని అడుగుతావేమో దాన్ని అందుకోటానికొక ఉపాయం మాత్రమేనని గ్రహించాలి సాధకుడు.

దీనికి తార్కాణంగా సంప్రదాయజ్ఞులు చెప్పే ఒక చక్కని ఆఖ్యాయిక మనకందించారు భగవత్పాదులు. యుద్ధంలో ఒక వృద్ధరాజు మరణిస్తే - రాజకుమారుడు శత్రువులబారిని బడట మిష్టంలేక అమాత్యు లాబాలుణ్ణి రహస్యంగా కొనిపోయి ఒక బోయపల్లె చేరుస్తారు. అతడా పల్లెలో పెరిగి పద్దవాడయి కూడా తానొక రాజపుత్రుడనే కథే మరచి కాలం గడుపుతుండేవాడు. ఇలా ఉండగా కొంత కాలానికాబోయ వృద్ధు కాలం దీరి మరణిస్తూ ఆ కుఱ్ఱవాణ్ణి దగ్గరికి పిలిచి నాయనా నీవు మా బోయ కులంలో పుట్టినవాడవు కావు. ఇంతకు పూర్వమీదేశ మేలిన రాజుగారి కుమారుడవు. మంత్రులు నిన్ను చిన్నవయసులోనే రాజకులం నుంచి తెచ్చి నా కొప్పగించారు. ఇప్పటికైనా నీవు తగిన బలగంతో పోయి నీ శత్రువులను జయించి నీ రాజ్యం నీవు మరలా దక్కించుకోమని బోధించి ప్రాణాలు విడిచాడట. ఆ మాట వినగానే అతడు శబర కులాభిమానాన్ని విడిచిపెట్టి వెనుకటి తన రాజకులాభిమానాన్ని మరలా మనసుకు తెచ్చుకొన్నాడట.

ఇప్పుడా రాజు పుత్రుడిలాంటివాడే ఈ జీవుడు. వాడు కర్మం చాలక ఆ శబర కులంలో పోయి పడ్డట్టు వీడూ వచ్చి పడ్డాడీ శరీరాది సంఘాతంలో. మంత్రులలాగానే ఒప్పజెప్పాయి వీణ్ణి ధర్మాధర్మాదులైన ద్వంద్వాలు. వాడికి చివర ఆ శబర వృద్ధుడుపదేశించినట్టే వీడికీ ఏ ఆచార్య పురుషుడో ఉపదేశిస్తాడు బ్రహ్మత్వభావాన్ని. ఆ రాజపుత్రుడి కెలాగైతే నీవా రాజకులం నుంచి వచ్చావనే వాక్యం నేను కిరాతుణ్ణి కాను - రాజు వంశ్యుడనే అనే అభేద భావనకు దారి తీసిందో అలాగే ఈ జీవ జగత్తులు రెండూ ఆ బ్రహ్మం నుంచే సృష్టి అయినాయని చెప్పే శాస్త్రవాక్యం కూడా ఇవి ఆ బ్రహ్మమేననే ఏకత్వానుసంధానానికే దోహదం చేస్తుంది. ఈ నిప్పురవ్వ ఎక్కడిదో గాదు ఆ గాడిపాయిలోదే అని ఎవడైనా అన్నాడంటే ఆ మాటకేమని అర్థం. ఇది వేరు - అది వేరూననా కాదు. రెండూ ఒకటేనని తాత్పర్యం. కాబట్టి ఇంతకూ శాస్త్రం ప్రపంచ సృష్టిస్థితిలయాలూ జీవుడి ప్రవేశాదులూ ఇలాంటి భేద రూపమైన వర్ణన అంతా తద్ద్వారా అభేద దృష్టిని మన మలవరుచుకోటానికి అవలంబించిన ఒక ఉపాయమే. **“ఉపాయ స్సోవ తారాయ - నాస్తిభేదః కథంచన”**

అని భగవత్పాదుల పరమగురువైన గౌడపాదులెప్పుడో చాటి చెప్పారీ రహస్యం. దానినే వారి ప్రశిష్యులైన ఆచార్య సార్వభౌములుకూడా ఇలా వర్ణించారు. అక్షరాలూ అంకెలూ-వీటి స్వరూపం మనకు బోధపడాలంటే-ఒక కాగితమనీ-కలమనీ సిరా అనీ-ఇలాంటి పరికరాలన్నీ పోగుచేసుకొంటాము. ఈ పరికరాలే ఆ అక్షరాలా. కాదు. ఇవి అక్షరాలంటే ఏమిటో వాటి తత్త్వం Nature మనకు బోధచేసే సాధనాలు Aids మాత్రమే. ఆ జ్ఞానం మన కేర్పడిందంటే ఇక ఆ సామగ్రితో పని లేదు మనకు.

అలాగే ఆ ఏకైకమైన తత్త్వాన్ని గ్రహించేటందుకొక అలంబనమే ఈ సృష్టి ప్రవేశాది వర్ణనమంతా. అంతేగాని ఇది-ఏదో జరిగింది చేసిందని గాదు. దీని ద్వారా ఆ తత్త్వాన్ని అందుకొన్న తరువాత ఇది కూడా మనకిక అక్కరలేదు. నిరాకరించవచ్చు. నిరాకరిస్తే కాగతం కలంలాగా ఎక్కడో ఉండేది కూడా కాదిది. అంతా అవిద్యా కల్పితమే కాబట్టి విద్యలోనే ఈ సమస్తమూ ప్రవిలయమవుతుంది. అప్పుడేకైకమైన బ్రహ్మతత్త్వమే సాధకుడి స్వరూపంగా Subjective సాక్షాత్కరిస్తుంది.

అంచేత శాస్త్రంలో భేదరూపంగా వర్ణించిన అవాంతర వాక్యాలన్నీ అసత్యాలే. స్వతహాగా అసత్యాలైనా అవి సద్రూపమైన మహావాక్యార్థాన్ని చేరేందుకొక ఆలంబనంగా మాత్రమే పనిచేస్తాయి. అయితే వాటినలాగే భావించాలి మనం. సంకేతాన్నే సత్యమని భ్రాంతిపడరాదు. కాకపోయినా భేదం సత్యమెలా అవుతుంది. అభేదమే గదా భేదమయిందని నిరూపించాము. మరలా అది చివరకు అభేదమే కావలసి ఉంది. మొదటా చివరా అభేదమయి మధ్యలో మాత్రమే అది భేదమెలా కాగలదు. **"ఆదావంతే చ యన్నాస్తివర్త మానేపి తత్తథా"** అని గదా అభియుక్తోక్తి. కాబట్టి మధ్యలో భేదాన్ని శాస్త్రం వర్ణించిందంటే ఎప్పుడూ ఉన్న అభేద తత్త్వాన్ని మనం మరలా జ్ఞప్తికి తెచ్చుకొనేందుకే. అదే మరొక భాషలో చెబితే అధ్యారోపమనేది అపవాదానికే. ఇదుగో ఈ ప్రక్రియనే ఉపనిషత్తులన్నీ తూచా తప్పకుండా అనుసరిస్తూ వచ్చాయి. అధ్యారోపం చేసి అపవాదం చేయటమే ఏ ఉపనిషత్తైనా చేస్తూ వచ్చిన పని. అద్వితీయ బ్రహ్మానుభవాన్ని జీవులకందజేయటానికి ఉపనిషత్తులన్నీ అవలంబించిన ఏకైక మార్గ The only method మిదే సుమా అని మాటి మాటికీ హెచ్చరిస్తారు శంకర భగవత్పాదులు. అయితే ఒక్కొక్క ఉపనిషత్తు ఒక్కొక్క భంగిమలో దాన్ని బయట పెడుతూ వచ్చింది. అంత మాత్రమే. అది ఎలాగో చూతాము.

# శాస్త్ర సమన్వయం

ఐతరేయ ఛాందోగ్యాలు ప్రపంచ సృష్టి స్థితి లయాల నారోపణ చేసి మరలా అవి ఏవీ లేవని అపవదిస్తాయి. ప్రశ్నోపనిషత్తు ప్రాణాదులైన పదహారు కళల ఆవిర్భావాన్ని వర్ణించి మరలా ఈ కళలన్నిటినీ నిష్కలమైన పురుష తత్త్వంలోకే ప్రవిలయం చేసి చూపుతుంది. మరి తైత్తిరీయమైతే అన్నమయాది పంచకోశాత్మకంగా చైతన్య పరిణామాన్ని పేర్కొని తరువాత ఈ కోశ పంచకాన్ని తదతీతమైన తత్త్వంగానే భావన చేయమని చెబుతూ వాటి అభావాన్నే నిరూపిస్తుంది. పోతే బృహదారణ్యకం విశేషాత్మకంగా ముందీ సృష్టినంతా ప్రస్తావించి మరలా దానినే సామాన్యాత్మకంగా దర్శించమని చెబుతు ప్రతి ఒక్కదాన్నీ ప్రవిలయం చేస్తుంది. ఇక కఠోపనిషత్తయితే దేహం మొదలుకొని ఈ ఉపాధి ప్రపంచాన్నంతటినీ స్థూల సూక్ష్మ క్రమంగా విభజించి స్థూలం నుంచి మన దృష్టినంతకంతకు సూక్ష్మంవైపు మళ్ళిస్తూ పోతుంది. తుదకు మాండూక్యమైతే అవస్థాత్రయ రూపంగా ఆరోపణ చేసి చివర దానినే అవస్థా రహితమైన తురీయ చైతన్యంలో పర్యవసానం చేసి ప్రదర్శిస్తుంది. మొత్తం మీద ఏ ఉపనిషత్తు చూచినా మొదట పారమార్థికమైన అభేదాన్ని ప్రతిజ్ఞారూపంగా Proposition బోధిస్తుంది. అది ఎలా సంభవమని సాధకులడిగినట్టుగానే ఆశంక చేసుకొని దానికుపపాదకంగా మధ్యలో లేని భేదాన్ని తెచ్చి దానిమీద ఆరోపిస్తుంది. తరువాత చివరకాతెచ్చి పెట్టిన భేదాన్ని తానే అపవదించి ఆదిలో ఏది ప్రతిజ్ఞాతమైన సత్యముందో దానికే అంతంలో నిగమనం Conclude చేసి ప్రదర్శిస్తుంది.

అంతెందుకు. ఒక ఛాందోగ్యాన్నే తీసుకొని చూతాము. **"సదేవ సోమ్యేద మగ్ర-అసీత్-ఏకమే వాద్వితీయమ్"** అని ఆరంభంలో అద్వితీయమైన బ్రహ్మతత్త్వాన్ని ప్రస్తావన చేసిందుపనిషత్తు. తరువాత **"తదైక్షత బహుస్యామ్ ప్రజాయే యేతి-తత్తేజ అసృజత" - "అనేన జీవేనాత్మనా అనుప్రవిశ్య"** అని ఈ విధంగా మధ్యలో జీవ జగత్సృష్టినంత ఏ కరువు పెట్టింది. ఇదంతా నిజమని మనం భ్రాంతి పడకుండా మరలా **"అన్నేన సోమ్య శుంగేన ఆపో మూల మన్విచ్ఛ - అద్భిస్సోమ్య శుంగేన తేజో మూల మన్విచ్ఛ - తేజసా సోమ్య శుంగేన సన్మూల మన్విచ్ఛ-సన్మూలాః ఇమాః ప్రజాస్సదా యతనా స్సత్ప్ర తిష్ఠాః స య ఏషోణిమా - ఐతదాత్మ్య మిదమ్**

**సర్వమ్-తత్సత్యమ్"** అని అంతా చివర ఆ అద్వితీయ బ్రహ్మస్వరూపమే - అదే సత్యం - మిగతా ఈ సృష్టి కథ అంతా అసత్యమేనని తేల్చిపారేస్తుంది. ఇది ఉపనిషత్తు లొక్కటే గాదు. దానిమీద విచారణ సాగించిన బ్రహ్మసూత్రాలూ - ఆ రెండింటి సారాంశమైన భగవద్గీతా అన్నీ కూడా ఇదే ధోరణి ననుసరిస్తూ వచ్చాయి. బ్రహ్మసూత్రాలలో రెండవ సూత్రమైన **"జన్మాద్యస్య యతః"** అనేది ఈ ప్రపంచ సృష్ట్యాదికమంతా శుద్ధమైన బ్రహ్మచైతన్యం మీద మొదట ఆరోపిస్తుంది. తరువాత **"తద నన్యత్వ మారంభణ శబ్దాదిభ్యః"** అనే సూత్రంతో ఆ వ్యవహారాన్నంతటినీ కొట్టివేసి తత్త్వాన్ని పరిశుద్ధంగా చూపుతుంది. అలాగే భగవద్గీత కూడా. **"మత్థ్సాని సర్వభూతాని - నచ మత్థ్సాని భూతాని" సర్వేంద్రియ గుణాభాసమ్ - సర్వేంద్రియ వివర్జితమ్"** ఇలాంటి ఘట్టాలన్నీ జాగ్రత్తగా పరిశీలిస్తే ఈ మార్గమే అడుగడుగునా మనకు తార్కాణమవుతుంది. మొత్తానికి ఉపనిషత్తులేమిటి - గీతలేమిటి - అధ్యాత్మ శాస్త్రమంతా మొదటి నుంచీ అనుసరిస్తూ వచ్చిన మార్గమిదే అసలు.

దీనిని బట్టి మనం గ్రహించవలసిన పరమరహస్యమేమంటే జీవ జగదభిన్నమైన చైతన్యమొక్కటే పరమార్థం Supreme Reality. అది అభేద రూపమైనా దాన్ని మన అజ్ఞానవశాత్తూ అలాగే పట్టుకోలేక బాధపడుతున్నాము. అంచేత మన కాపట్టు చిక్కించటానికి శాస్త్రం మొదట భేదమనే పెద్ద నిచ్చెన వేసి దాని ఆధారంతో మన మా అభేదాన్ని అందుకొన్న తరువాత ఆ నిచ్చెన తీసివేస్తున్నది. దానితో అభేదమే మన మనసులో నిలిచిపోతుంది. ఇందులో భేదవర్ణన అధ్యారోపం ద్వారా ఆత్మవస్తువును గుర్తించటానికైతే అభేదంతో ముగించట మీ ఆరోపితాన్నంతటినీ క్రమంగా అపవదించి ఆత్మచైతన్యంలో లయం చేయటానికని సిద్ధాంతం. భేద ప్రస్తావన లేకుండా ఊరక అభేదాన్ని ప్రతిపాదిస్తే భేదవాసనా వాసితమైన మానవుడి బుద్ధికది పట్టటం అసాధ్యం.

ఇది మనకు బాగా బోధపడటానికి పరమానందయ్య శిష్యుల కథ చెబుతారు భగవత్పాదులు. శిష్యులంతా కలిసి గ్రామాంతరం బయలుదేరి వెళుతున్నారు. మార్గమధ్యంలో ఒక ఏరు అడ్డం వచ్చింది. నెమ్మదిగా అది దాటి అవలి ఒడ్డు చేరారు. పదిమందీ ఉన్నారో లేదో అని అనుమానం తగిలింది వారికి. ఎవడికివాడు తన్ను మాత్రం మానేసి మిగతా వాళ్ళనందరినీ లెక్కపెడుతూ వచ్చాడు. తొమ్మిదిమందే

వస్తున్నారు లెక్కకు. అయ్యో ఇంకేముంది. పదోవాడుకాస్తా పరమపదించాడే అని ఏడవసాగారు. సమయానికెవడో పుణ్యాత్ముడటు వైపు వస్తూ ఏమయింది నాయనలారా! ఏడుస్తున్నారని అడిగాడు. అయ్యా ! పది మందిమి బయలుదేరాము గ్రామంతరానికి. దారిలో ఏరు దాటవలసి వచ్చింది. దాటేటప్పుడు మాలో ఒకడా ఏటిలో కొట్టుకుపోయాడని మొరపెట్టారు. వాడొక్కసారి అలా నిగా పెట్టి చూడగానే పదిమందీ ఉన్నట్టర్థమయింది. అయ్యో ! మీ పిచ్చి దొంగలు దోలా. ఎవరికి వారు మినహాయించుకొని లెక్కిస్తే ఎలా ఉంటారోయి పది మందీ. ఇదుగో నేను లెక్కిస్తాను చూడమని ఆ లెక్కించిన వాడితో సహా పదిమందినీ లెక్కపెట్టి చూపాడట. ఇప్పుడా పదవ వాడెక్కడ ఉన్నాడని. కొత్తగా ఎక్కడి నుంచీ రాలేదు వాడు. అంతకు ముందా తొమ్మిది మందిలో కలిసిపోయి వేరుగా కనపడలేదు.తొమ్మిది మందినీ లెక్కపెట్టి ప్రక్కకు నెట్టి ఇక మిగిలిన వాడెవడా అని చూస్తే అక్కడే ఉన్నాడు. కనిపించాడు.

అలాగే ఈ నామరూపాదులైన అనాత్మ భావాలలో పనగలిసి పోయినంత వరకూ అక్కడే ఉన్న ఆత్మతత్త్వం మనకు ఫలానా అని గ్రాహితాకు రాదు. గ్రాహితాకే రావాలంటే వీటిని ప్రక్కకు తోసి దానిని మాత్రమే మొదట పైకి తెచ్చుకొని చూడాలి. అందుకే అధ్యారోపం.అది అంతకుముందు లేని వస్తువును క్రొత్తగా సృష్టించదు. **"జ్ఞాపకమ్హి శాస్త్రమ్-నకారక"**మని హెచ్చరిస్తారు భాష్యకారులు. శాస్త్రం మరచిపోయిన ఆత్మ స్వరూపాన్ని జ్ఞప్తికి తేవలసిందే గాని క్రొత్తగా ఒక ఆత్మను తయారుచేయబోదు. అలా జ్ఞప్తికి వచ్చిందంటే ఇక అనాత్మ ప్రపంచం దానిపాటికదే లయమవుతుంది. ఎందుకని. దీనికి వ్యతిరిక్తంగా అది లేదు కనుక. కనుకనే ఊరక లేదు లేదని అపవదిస్తే కాదు - ఈ జ్ఞానంతో చేయాలని చెప్పటం. జ్ఞానంతో చేస్తేనే అది అపోదితమవుతుంది. ఎందుకంటే జ్ఞానంకంటే జ్ఞేయపదార్థమెప్పుడూ భిన్నంగా ఉండలేదు అందుకే నేతి నేతి వాక్యం కూడా కేవల మపవాదం చేసి ఊరుకోలేదు. దానికి సబబు చూపుతూ చేస్తుంది అపవాదం. **"నహ్యే తస్మా దితి నేతి"** అని వాక్యశేషం. దానికి వేరుగా ఉండటానికి లేదు కాబట్టి ఇది లేదు అని దీని అర్థం. అంటే ఆత్మ చైతన్యముంటేనే అనాత్మ జగత్తు భాసిస్తుంటుంది. అది లేదో ఇది ఏ మాత్రమూ భాసించదు. అంచేత ఇది ఆచైతన్యమే కావాలి గాని తద్విలక్షణం కావటానికి లేదని తేలుతున్నది.

## శంకానిరాసం

దీనిని బట్టి అధ్యారోపమనేది ఎంత ఆవశ్యకమో తేట పడుతున్నది. అధ్యారోప మధిష్ఠాన జ్ఞానమందిస్తే మనకాజ్ఞాన మప్రయత్నంగా అనాత్మ జగత్ప్రవిలాపనానికి దారి తీస్తుంది. అంటే అప్పటికి తత్త్వమసి అనే ఉపదేశవాక్యం అహమ్ బ్రహ్మాస్మి అనే అనుభవ వాక్యంగా మారుతుందని అర్థం. నేనే బ్రహ్మమని ఈ జీవుడికి దేహాత్మభావం పోయి సహజమైన బ్రహ్మాత్మభావం కలగటమే అహం బ్రహ్మాస్మి. ఇది మన గొంతెమ్మ కోరికే గాని ఇంతటి మహాభాగ్యం మనబోటి జీవకోటి కబ్బుతుందా అని సందేహించనక్కరలేదు. ఎందుకంటే మనస్సుకు కలిగే సుఖదుఃఖాదుల దగ్గరి నుంచీ అన్ని భావాలూ మన చైతన్యానికి బాహ్యమే. చైతన్య క్షేత్రంలో అడుగుపెట్టే అధికారం దేనికీ లేదు. పెడితే అది చైతన్యరూపమే అవుతుంది. ఇక దానికి గోచరించటమేముంది. గోచరం కాకపోతే అది అనుభవమెలా అయింది. కాబట్టి **"సకల దుఃఖ వినిర్ముక్తైక చైతన్యాత్మ కోహ మిత్యేష ఆత్మానుభవః"** అని తేల్చిపారేశారు స్వామివారు. ఏ దుఃఖమూ ఏ సుఖమూ లేని కేవల చైతన్య రూపుడనే నేననే అనుభవమే ఆత్మానుభవమట. ఏ భావమూ లేదంటే అనాత్మ అంతా అపోదిత మయింది. ఏకమనటంలో జీవభావం తొలగిపోయింది. చైతన్యమనటంలో స్వరూపాన్ని చెప్పినట్టయింది. అహమనటంలో అది ఎక్కడో నాకు పరోక్షంగా లేదు నేనే అని అనుభవానికి తెచ్చినట్టయింది. ఇంతకన్నా వక్తవ్యమైన విషయమిక ఏముంది.

అయినా కడసారిగా కలిగే ఆశంక ఒకటుంది. ఎంత కాదన్నా ఈ శరీరాది సంఘాతమొకటీ - దీనిచుట్టూ ఉన్న ఈ ప్రపంచమొకటీ - నోళ్ళు తెరచుకొని నిత్యమూ మన చైతన్యాన్ని కబళించినట్టు కనిపిస్తున్నాయి గదా. ఇవి ప్రవిలయం చేసుకొని మనం చైతన్య మాత్రశేషులమై ఉన్నామనుకోటం కేవలమూ మనఅపోహ Solipsism ఏమో. అది యధార్థమని ఎందుకనుకోవాలని ప్రశ్న. ఇది కూడా అర్థం లేని అపోహ అని మందలిస్తారు మనలను జగద్గురువులు. ఎందుకంటే మానసికమైన భ్రమ కావటానికిది సాపేక్షమైనది కాదు. నిరపేక్షమయిన జ్ఞానం. మిగతా జ్ఞానాలన్నీ

నేతి నేతి అని అపోదితమైనతరువాత చిట్టచివరగా ఉదయించే జ్ఞానమిది. చివరకు కలిగే జ్ఞానం గనుకనే దీనినిక కాదని త్రోసిపుచ్చే బాధక జ్ఞానం Contrary మరొకటి లేదు. బాధకం లేదంటే అది ఇక అబాధితంగా నిలిచిపోవలసిందే. అలాంటప్పుడు మానసికమైన భ్రమ ఎలా అవుతుందది. యథార్థజ్ఞానమే కావలసి వస్తుంది.

యథార్థమైతే కావచ్చు. దానివలన మనకు కలిగే ప్రయోజనమేమిటని కొందరు వాదిస్తారు. అలాంటి వారిని కూడా నోరు మూయించారు భగవత్పాదులు. ప్రయోజనమే లేకుంటే ఇంత శాస్త్రమూ - ఉపదేశమూ ఈ కలాపమంతా దేనికని ప్రశ్నిస్తారాయన. అలాంటి ఉపదేశం చేయటంకన్నా ఊరుకోటం ఎంతో మేలు. **"ప్రక్షాళనాద్ధి పంకస్య దూరా దస్పర్శనమ్ వర"** మన్నారు పెద్దలు. అడుసు త్రొక్కటం దేనికి. కాలు కడగటం దేనికి. అలాగే నిరుపయోగమైన బోధ చేయటం దేనికి. **"ప్రయోజన మనుద్దిశ్య న మందోపి ప్రవర్తతే"** ఏదో ఒక ప్రయోజనం లేకుండా ఎంత మూఢుడు కూడా ఒక పని చేయబోడు. అలాంటిది ప్రమాణ భూతమైన శాస్త్రం చేస్తున్నదంటే అది ఏ మాత్రమూ శ్రద్ధేయమైన మాట కాదు. కాబట్టి శాస్త్రమొక విషయం మనకు బోధించిందంటే దానికేదో ఒక విశిష్టమైన ప్రయోజనముండి తీరాలి. అదేమిటని అడుగుతారేమో. ఏమిటో గాదు. సకల దుఃఖ నివృత్తీ సర్వసుఖ ప్రాప్తీ. ఇంతకన్నా కావలసిందేముంది జీవితానికి. అంతేకాదు. అది బ్రహ్మవేత్త లందరి దైనందిన జీవితంలోనే మనకు దాఖలా అవుతుందని అలాంటి వారీ రోజులలో కూడా జీవించి ఉన్నారని మనకెక్కడ లేని హామీ ఇస్తారాయన ఆస్తామేతత్.

ఇంతకూ ఇంతటి మహోన్నతమైన ఫలం మనకు సిద్ధించాలంటే అదంతా ఈ అధ్యారోపాపవాద మార్గంలోనే తప్ప మరొక విధంగా సిద్ధించబోదు. అధ్యారోపాప వాదరూపంగా వాక్యం మనకు తత్త్వాన్ని బోధ చేస్తే దానివల్లఅఖండ బ్రహ్మాత్మజ్ఞానం మనకావిర్భవిస్తుంది. వాక్యజన్యమైన ఈ జ్ఞానమే చివర కనుభవంగా మారుతున్నది. అందులో **"తత్త్వమసి"** వాక్యం వల్ల జ్ఞానమైతే- **"అహమ్ బ్రహ్మాస్మి"** వాక్యంవల్ల దాని అనుభవం సిద్ధిస్తుంది. ఈ రెండింటి మూలంగా చివరకు మానవ జీవితానికి ప్రయోజనమేదో అది పరిసమాప్తమవుతున్నది. ఇదీ విషయం.

# నిర్గళితార్థం

ఇంతవరకూ నిర్ద్వంద్వంగా సాగిన ఈ విచారణకంతటికీ నిర్గళితమైన Filtered అర్థమేమిటని అడగవచ్చు. జీవిత పరమార్థమయిన బ్రహ్మాత్మభావాన్ని మానవుడు సాధించాలంటే తన్నిబంధనమైన జ్ఞానమే దాని ఏకైక సాధనం. ఆ జ్ఞానం మనకు వాక్యప్రమాణం వల్లనే ఉదయిస్తుంది. వాక్యమంటే తత్త్వమస్యాదికమైన ఉపదేశం. అది మనకు అధ్యారోపాపవాద న్యాయాన్ని అనుసరించి తత్త్వాన్ని బోధిస్తుంది. అద్వితీయమయిన తత్త్వాన్ని ఒక్కసారిగా అందుకోలేము కాబట్టి అధ్యారోపం మొదట దానిలో భేదాన్ని ఆరోపిస్తుంది. తరువాత అపవాదమనేది హేతు దృష్టాంత బలంతో క్రమంగా ఆ భేదాన్ని నిరాకరిస్తుంది. తన్మూలంగా అఖండ బ్రహ్మతత్త్వానికి చెందిన ఒకానొక వృత్తి మనసులో ఆవిర్భవిస్తుంది. అఖండమైన ఈ వృత్తికి భిన్నంగా బ్రహ్మమనేది ఎక్కడా లేదు కాబట్టి ఈ జ్ఞానమే చివర కనుభవంగా మారుతుంది. అప్పుడు సాధకుడు నేనే ఆ బ్రహ్మమనే అనుభవాన్ని పొందుతాడు. కాబట్టి తత్త్వమసే చివరకు అహం బ్రహ్మాస్మి అవుతుంది. కాగా ఇలాంటి అనుభవం మానవుడికి కలిగే అంతిమమైన Final అనుభవం కాబట్టి అది సకల దుఃఖ సముచ్ఛేదకం కాబట్టి – దానికిక భ్రమ ప్రమాదానర్థకాది దోష స్పర్శకూడా లేదు. ఇది మనకు సాహజికమే గాని ఆగంతుకం కాదు మరలా. కనుక వాక్యోపదేశమీ విషయంలో మనకు జ్ఞాపకం Reminder మాత్రమేననే సూత్రం కూడా మనం మరవరాదు. ఇదీ దీని నిర్గళితార్థం.



# 5. కర్మ-జ్ఞానం

క్రిందటి రెండధ్యాయాలలో సాధన మార్గాన్ని గూర్చి సవిస్తరంగా చర్చించాము. అందులో మొదటిది జ్ఞానమే మోక్షసాధనమని నిరూపిస్తే – రెండవది ఆ జ్ఞానం మోక్షానికెలా సాధనమో – ఆ విధానాన్ని కూడా ప్రతిపాదించింది. ఈ రెంటివల్లా మనకు జ్ఞానమనేది కలిగితే చాలు – ఆ జ్ఞానమే అనుభవమని కూడా గ్రహించాము మనం. అలాంటప్పుడీ బోధన విన్న ప్రతి ఒక్కడికీ బ్రహ్మజ్ఞానమనేది కలగవలసిందే గదా. ఏదీ లోకంలో ఎవడికీ అలా కలుగుతున్నట్టు దాఖలాలేదే. నూటికి కోటికొక్కడికి కలిగితే ఎక్కువ వాడయినా ఉన్నాడో లేడో మనకు సందేహం. పోతే మిగతా మనబోటి వాళ్ళమంతా ఎక్కడ వేసిన గొంగడి అక్కడనే అన్నట్టున్నాము. జ్ఞానమనే వాసన కూడా లేదు మనకు. మహా అయితే మనకు లోకజ్ఞానముంది. ఉచ్చావచమైన శాస్త్రజ్ఞానముంది. అంతేగాని మీరు చెప్పే బ్రహ్మజ్ఞానం కానరాదు. అదే ఉన్ననాడు మనకిక మరలా ఈ సంసారమనేది ఉండరాదు. అయినా మనలనిది నిత్యమూ వెంటాడుతున్నదంటే అప్పటికా జ్ఞానమింకా మన కంకురించలేదనే గదా అర్థం. మరి బ్రహ్మమనేది సర్వత్రా ఉంది – దాన్ని ఆకళించుకొనే మనస్సనే సాధనముంది – తద్జ్ఞానాన్ని మనకందించే వాక్యప్రమాణం కూడా సిద్ధంగా ఉన్నప్పుడది మనకెలా అబ్బటం లేదని ఒక పెద్ద ఆక్షేపణ వస్తుంది.

దీనికి పరిహారం మనమందరమూ చేసుకొన్న కర్మ తప్ప మరొకటేదీ గాదని చాటుతారు భగవత్పాదులు. ఎంచేతనంటే జ్ఞానోదయానికి కావలసిన సామగ్రి అంతా ఉండి కూడా జ్ఞానమనే ఫలితం కలగలేదంటున్నావు నీవు. అలా ఎప్పుడుగానీ జరగటానికి వీలులేదు. ఒకవేళ జరిగిందంటే ఆ సామగ్రిలోనైనా దోషముండాలి. లేదా అది పని చేయకుండా అడ్డు తగిలే బలమైన ప్రతిబంధకమయినా ఒకటుండాలి. సామాగ్రిలో లోపముందని చెప్పటానికి వీలులేదు. అది ఇంతకుముందే మనమెంత గానో ప్రతిపాదించి ఉన్నాము. పోతే ఇక పరిశేష న్యాయంగా దానికడ్డు తగిలే ప్రతిబంధకమే ఏదో ఒకటి ఉండాలి. ఏమిటది. ఏమిటని ప్రశ్నేముంది. మానవుడు చేసుకొన్న కర్మే మరేదీ కాదని ఘంటాపథంగా చెబుతారాయన.

# కర్మ

అయితే ఈ కర్మ ఏమిటి – అది మన జ్ఞానాని కద్దు తగలటమేమిటని ఇప్పుడు ప్రశ్న. అది కూడా ఇంతకు పూర్వమే కొంత ప్రస్తావన చేసి ఉన్నాము. కర్మ అంటే మనం చేసే పనులే. మనోవాక్కాయాలనే త్రికరణాలతో Instruments మనమెప్పుడూ ఏదో ఒక పని చేస్తూనే ఉంటాము. ఏ పనీ చేయకుండా ఒక్క క్షణకాలం కూడా ఊరక కూచోలేము. ఆఖరుకు ఉచ్ఛ్వాస నిశ్శ్వాసాలైనా ఆడుతుండవలసిందే. ఇలా చేస్తూ పోయే కర్మలన్నీ కేవలం చలనాత్మకాలే కాబట్టి వాటిని మనం పట్టించుకోకపోతే ఏమీ చేయవు. ఎప్పటికప్పుడు సమసిపోతాయి. కాని మనమలా పట్టించుకోకుండా ఉండలేము. ఉండక ఏమి చేస్తున్నాము. ఈ పని నేను చేస్తున్నానని ఒక కర్తృత్వ బుద్ధి – దీనివల్ల ఈ ఫలితం పొందాలని ఒక భోక్తృత్వ బుద్ధీ పెట్టుకొంటాము. అది వెంటనే మన మనసులో ఒక వాసనా రూపంగా Impression పరిణమిస్తుంది. ప్రతి క్రియకూ Action ఒక ప్రతిక్రియ Reaction ఉండి తీరుతుందనే గదా ప్రతిపాదించాము. ఆ ప్రతిక్రియే వాసన అంటే. ఈ వాసనలే లేవు పొమ్మంటే సృష్టి వైషమ్యానికీ – వైచిత్ర్యానికీ జవాబు చెప్పుకోలేము. కాబట్టి వాసన లేర్పడటమనేది తథ్యం. ఈ వాసనా ముద్ర ఎప్పుడేర్పడిందో అప్పుడిక అది మనలను శాశ్వతంగా అంటి పట్టుకొంటుంది. శరీర పాతమయినా తొలగిపోదు. శరీరం పోయినప్పటికీ జీవులమైన మనముంటాము గదా. మనముంటే మనతోపాటు మన కర్మవాసనలూ ఉండనే ఉంటాయి. ఏదీ కనపడలేదే అని వాదించరాదు. ప్రతి ఒక్కటీ మనకు కనపడదు. మన ప్రాణమూ మనస్సూ కనపడుతున్నాయా మనకు. అదృష్ట రూపంగా ఉన్నాయవి. అలాగే ఈ కర్మవాసనలు కూడా అదృష్ట రూపంగానే ఉంటాయి. ఎన్ని జన్మలకైనా అప్పు తీర్చినట్టు వాటి ఫలితం మన మనుభవించి తీరవలసిందే. తప్పదు. **"యుగ సహస్ర కోట్యం తరితాపిజంతో ర్యాపురా భావితా వాసనా – సాన వినశ్యతి"** అంటారు భగవత్పాదులు. కొన్ని కోట్ల జన్మలెత్తినా సరే. అనాది నుంచీ భావితమయిన వాసనలు నశించే ప్రశ్నేలేదట. ఇంగువ కట్టిన వస్త్రమది. ఇంగువంతా ఖర్చయినా అదృశ్యంగా దాని వాసన ఎక్కడో దాన్ని ఆశ్రయించే ఉంటుంది. అలాగే మనల నాశ్రయించిన ఈ వాసన కూడా. అందుకే దీనికసలు వాసన అనే పేరు వచ్చింది. సంస్కారమని కూడా దీనికే పేరు.

# ప్రారబ్ధం

ఈ వాసనలనండి. లేదా సంస్కారాలనండి. ఆచార్యులవారు చెప్పినట్టు ఇవి అనాది నుంచీ మనసులో బాగా పేరుకొని Instinct పోయి ఉన్నాయి. కాబట్టి వీటికి సంచిత Accrued మని పేరు పెట్టారు. సంచితమంటే బాగా పోగయిన పదార్థమని భావం. ఇది అపరిమేయంగా Immeasurable ఉంది మనకు. ఈ సంచితం నుంచి కొంత కర్మ జారీ అయితే దానికి ప్రారబ్ధమని పేరు. ప్రారంభమైనదేదో అది ప్రారబ్ధం. దీనివల్లనే ప్రస్తుతం మనకీ జన్మ ఏర్పడింది. ఈ వచ్చిన జన్మ మనకెంత కాలముండాలో ఇందులో మన మేయే ఘనకార్యాలు చేయాలో – ఎలాంటి కష్టసుఖాలనుభవించాలో మన ఊహలెలాటివో–మాట లెలాటివో ప్రతి ఒక్క కదలికా ఈ ప్రారబ్ధమే నిర్ణయిస్తుంది. మరి కర్మ ఫలాన్ని అనుభవించటానికేకాదీ జన్మ. ప్రారబ్ధఫలాన్ని ఒక ప్రక్క అనుభవిస్తూనే మరో ప్రక్క మరలా కర్మ ఆచరిస్తూనే ఉంటాము. అది మరలా మన సంచిత కర్మకు చేరుతూ పోతుంది. దీని కాగామి అని పేరు. ఆగామి సంచితానికీ సంచితం ప్రారబ్ధానికీ – ప్రారబ్ధం మరలా సంచితానికీ – దారి తీస్తూ పోతుంది. దీనితో మానవుడికీ కర్మ అనేది ఒక ఇసుక పాతరలాగా ఎప్పటికీ తరగకుండా అలాగే నిలిచి ఉంటుంది.

ఇలాంటి విషవలయంలో చిక్కుకొని కాలం గడుపుతూ మన మీ జన్మలో ఒక్కసారిగా బ్రహ్మజ్ఞానమనేది ఆర్జించటానికి నడుము కట్టాము. ఈ జన్మలో ఎక్కడ పట్టినా ప్రారబ్ధమే రాజ్యం చేస్తున్నదాయె. పైగా అది మన మీ జ్ఞానానికి ప్రయత్నం చేయకముందే రంగంలోకి వచ్చి ఉంది. పోతే ఈ ప్రయత్నమది వచ్చి ఉన్న తరువాత ఎప్పుడో ఆరంభమవుతున్నది. కర్మ వృత్తి మొదటిది. జ్ఞానవృత్తి తరువాతిది. కాబట్టి మొదటి నుంచీ పాతుకొని ఉన్న కర్మవృత్తికే Operation of acton బలం జాస్తి. దాని తరువాత ఎప్పుడో రంగంలోకి వచ్చింది కాబట్టి ఇప్పుడు క్రొత్తగా కలిగే ఈ జ్ఞానవృత్తి Operation of knowledge కంత బలం చాలదు. బలం చాలకపోయే సరికది దీన్ని తల ఎత్తకుండా ఎక్కడికక్కడ అణగద్రొక్కటానికే ప్రయత్నిస్తుంది. ఇందులో ఆ ప్రయత్న ఫలమే మనకెంత సామగ్రి ఉన్నా బ్రహ్మజ్ఞానమనేది వెంటనే కలగకపోవటం. ప్రారబ్ధమొకటి పని చేస్తున్నంత వరకూ మానవుడి మనసు బాహ్య

ప్రపంచం మీదకే పోతుందిగాని బ్రహ్మతత్త్వం మీదికి ప్రసరించదు. ప్రసరించకపోతే తద్విషయమైన జ్ఞానం మనకెలా ఉదయిస్తుంది. కాబట్టి జీవితంలో బ్రహ్మానుభవం కలగలేదంటే దానికీ జీవులు చేసుకొన్న కర్మే తప్ప మరేదీ కాదని తీర్మానించారు వేదాంతులు.

అయితే ఇది ఇంతేనా-దీనికిక పరిష్కారమే లేదా-అని మరలా ప్రశ్న వస్తుంది. పరిష్కారం లేకపోలేదు. లేకుంటే అసలీ శాస్త్రాలూ-ఆచార్యులూ-వారి ఉపదేశమూ - అంతా అర్థం లేని ప్రసంగమే అవుతుందన్నారు భాష్యకారులు. ఎంచేతనంటే ప్రారబ్ధకర్మ లేనివాడెవ్వడూ లేడు ప్రపంచంలో. ప్రారబ్ధంవల్లనే గదా ఈ జన్మమనేది సంప్రాప్తమయింది మనకు. కాబట్టి ప్రతి ఒక్కరికీ ప్రారబ్ధమున్నది. అది ఉన్నదంటే ఇక జ్ఞానాని కవకాశమే లేదు గదా. అలాంటప్పుడీ వేదాంత శాస్త్ర మెవరికని. ఎవరికీ గాకపోతే ఎవడూ ప్రయత్నించేదిలేదు. మోక్షమనేది సిద్ధించేది లేదు. చావుకబురు చల్లగా చెప్పినట్టు ఈ మాట చెప్పడానికే అయితే ఇంత పెద్ద కంఠశోష దేనికి. అంచేత దీనికేదో ఒక పరిష్కారముండి తీరాలి. ప్రతిబంధకముందంటే దాన్ని తొలగించుకొనేది ఉపాయం కూడా ఉండకపోదు. అదుగో ఆ ఉపాయం మనకు తెలియజెప్పటానికే శాస్త్రమనేది అవతరించిందసలు.

## శ్రవణాదిసాధన

మరి శాస్త్రం మనకు బోధించే ఆ ఉపాయమేమిటని అడిగితే అది ఏదోగాదు. శ్రవణ మనన నిదిధ్యాసలే ఆ ఉపాయమన్నారు భగవత్పాదులు. బృహదారణ్యకంలో, యాజ్ఞవల్క్య మహర్షి తన భార్య మైత్రేయికి బోధించిన ఉపాయమదే. యాజ్ఞవల్క్యుడికిద్దరు భార్యలు. ఒకతి కాత్యాయని. మరొకతె మైత్రేయి. వారిలో కాత్యాయని స్త్రీ ప్రజ్ఞా మాత్ర పర్యవసిత అయితే - మైత్రేయి బ్రహ్మవాదిని. ఒకనాడా మహర్షి సన్న్యాసం పుచ్చుకొని అరణ్యానికి వెళ్ళబోతూ చిన్న భార్య అయిన మైత్రేయిని పిలిచి నేను సన్న్యసించి వెళ్ళుతున్నాను- మీ ఇద్దరికి నా ఆస్తిసమానంగ పంచి ఇస్తాను - అది పెట్టుకొని సుఖంగా బ్రతకండని చెప్పాడట. దాని కావిద ఏమండీ! మీరు పంచిపోయే ఈ ఆస్తివల్ల నా కమృతత్త్వమనేది సిద్ధిస్తుందా అని అడిగిందట. అతడామాటకు నవ్వి ఓసి పిచ్చిదానా ! ఆస్తులవల్ల అమృతత్త్వం సిద్ధించటమేమిటి

– అది ఒక్క ఆత్మదర్శనం వల్ల మాత్రమే మనకు దక్కుతుందని చెప్పాడట. అయితే నాకీ పనికిమాలిన ఆస్తిదేనికి ఆత్మదర్శనానికి సాధనమేదో దానినే బోధించి పొమ్మని ప్రాధేయపడిందావిడ. అప్పుడాయన చెప్పిన మాటలే **"శ్రోతవ్యో-మంతవ్యో-నిదిధ్యాసితవ్యః"** అనే మూడు మాటలూ. ఈ మూడింటికే శ్రవణ మనన నిదిధ్యాసనలని వ్యవహారం. **"ఆత్మావాఽ రే ద్రష్టవ్యః"** అమృతత్వాన్ని పొందాలంటే ఆత్మదర్శనం చేసుకోవాలి మానవుడు. అదే జీవిత పరమార్థం. అయితే అది ఎలా ప్రాప్తిస్తుంది మనకు. శ్రోతవ్యః – మొదట శ్రవణం చేయాలి. మంతవ్యః – తరువాత మననం చేయాలి. నిదిధ్యాసితవ్యః – ఆ పిమ్మట తదేక దృష్టితో ధ్యానంచేయాలి. శ్రవణాదులైన ఈ మూడు ఆచరిస్తే మనసులో పేరు కొనిపోయినకర్మమాలిన్యాన్నంతా అది కడిగి వేస్తుంది. దానితో మనోదర్పణం పరిశుద్ధమయి చక్కగా ప్రకాశిస్తుంది. అప్పుడా మనసుకు తత్త్వమస్యాది వాక్యముపదేశిస్తే చాలు. కర్మ ప్రతిబంధమేదీ లేదు కాబట్టి వెంటనే దాని జ్ఞానాన్ని అది తప్పక ప్రసాదిస్తుంది. అంచేత కర్మ ప్రాబల్యమంత ఉన్నా శ్రవణాదుల నభ్యసిస్తూ పోతే దాన్ని నిర్మూలించి మనకు ఆత్మజ్ఞానాన్ని కూడా నిర్విఘ్నంగా ప్రసాదించగలదు.

అయితే ఈ శ్రవణాదికమే సాధనమన్నప్పుడు వాటి స్వరూపమేమిటి. తన్మూలంగా కర్మబంధం తొలగి మనకు బ్రహ్మజ్ఞానమెలా భాసిస్తుందని ప్రశ్న. శ్రవణమనన నిది ధ్యాసనలనే మూడింటిలో శ్రవణమనేది మొట్టమొదటిది. శ్రవణమంటే వినడమని శబ్దార్థం. ఉపనిషత్తులు బోధించే తత్త్వమస్యాది వాక్యాలను తొలుతగా మనం వినవలసి ఉంది. అవి బోధించే వాక్యాలన్నీ బ్రహ్మ స్వరూపాన్ని వర్ణించేవే. ఆ వాక్యాలు మన చెవినబడనంత వరకూ మనకు బ్రహ్మమనే పదార్థమొకటి ఉన్నదని తెలియదు. మనకు తెలిసినదల్లా మనచుట్టూ ఉన్న ఈ ప్రపంచమే. ఇది ఆబాల గోపాలమూ మన కనుభవ సిద్ధమే కాబట్టి కలదో లేదో అనే సందేహమక్కర లేదు. పోతే సందేహమంతా దీనికతీతంగా ఉందని వర్ణించే ఆ బ్రహ్మతత్త్వంలోనే మనకు. అది ఈ ప్రపంచంలాగా ప్రత్యక్ష గోచరం కాదు కాబట్టి సహజంగా అనుమానిస్తాము. ఇలాంటి అనుమానం మొదట మనకు లేకుండా చేయాలి వాక్యం.

అందుకే **"సత్యమ్-జ్ఞాన-మనంతమ్-బ్రహ్మ"** అని బ్రహ్మతత్త్వాన్ని వర్ణిస్తుందుపనిషత్తు. ఇందులో సత్యమనే మాట వినగానే బ్రహ్మమనే పదార్థమొకటి

ఉందని మొదట మనకర్థమవుతుంది. కనిపించటం లేదు గదా - ఉందని ఎలా చెప్పగలవని శంకించవచ్చు. కనిపించకపోయినా ఈ కనిపించే ప్రపంచానికంతటికీ అది మూలం. దానిమీద ఆరోపితమైనదే ఈ జగత్తంతా. ఆరోపితమైన జగత్తే మనముందని చూస్తున్నప్పుడు దీని కాధారమైన మూలతత్త్వమెలా లేకపోతుంది. అదే లేని నాడీ జగత్తు దేనిమీద ఆరోపితమయినట్టు. ఆరోపణ అన్నప్పుడు దానికొక అధిష్ఠానమనేది ఉండాలి గదా. అధిష్ఠానమే లేదంటే దానిపైన ఆరోపితమైన పదార్థం కూడా లేనిదే కావాలి. కాని లేదని చూడటం లేదు మనమీ ప్రపంచాన్ని. ప్రతి ఒక్క పదార్థాన్నీ లోకంలో ఉన్నది - ఉన్నదనే చూస్తున్నాము. ప్రపంచమున్నదంటే అప్పటికీ తదాధారమైన బ్రహ్మం కూడా ఉండవలసిందే గదా. అంచేత బ్రహ్మమనేది సత్యం.

దీనితో మనకీ కనిపించే ప్రపంచమే గాక దీని కతీతంగా మరి ఒక పదార్థం కూడా ఉందని బోధపడింది. అయతే ఆ పదార్థమెక్కడా కనపడటం లేదే. ఎక్కడ ఉన్నట్టది - అనిమరలా ప్రశ్న వస్తుంది. దీనికి సమాధానమే. జ్ఞానమనే రెండవ మాట. జ్ఞానమనే సరికది ఇక మనకు జ్ఞేయం కాదని తేలిపోయింది. జ్ఞేయం కాదు గనుకనే మిగతా పదార్థాల మాదిరి మనకది ఎక్కడ వెదకినా కనిపించదు. కనిపించవలసింది ఏదైనా జ్ఞానానికేగదా. అలాంటి జ్ఞానమే అదయినప్పుడిక కనిపించే ప్రశ్నేముంది కాబట్టి మన జ్ఞానానికి కనిపించేది కాదది - మన జ్ఞానమే.

జ్ఞానమే ననే సరికది మరలా పరిచ్ఛిన్నమైన తత్త్వమేమోనని ఒక అపోహ కలగవచ్చు. అలాంటి అపోహను నివారించటానికే అనంతమనే మరొక విశేషణం ప్రయోగించవలసి వచ్చింది. మన జ్ఞానం జ్ఞానమే అయినా అది సాంతమేగాని అనంతం గాదు. అనంతమంటే అంతం లేనిదని అర్థం. ఇంకొక పదార్థమున్నప్పుడే అంతమనేది ఏర్పడుతుంది. అలా కాక ఒకే పదార్థమున్నదంటే ఇక దానికంతం లేదు. ప్రస్తుతం మనకున్న జ్ఞానమొకే ఒక పదార్థం కాదు. దానికి నిత్యమూ జ్ఞేయభూతమైన ఈ ప్రపంచం కూడా ఒకటి కనిపిస్తున్నది. ప్రపంచమనే వేరొక పదార్థమెప్పు డేర్పడిందో - అప్పుడా మేరకిది పరిచ్ఛిన్నం కాక తప్పదు. కాబట్టి అస్మదాదులది సాంతమైన జ్ఞానం. ఇలా సాంతమైన జ్ఞానం కాదది. అనంతమనిగదా పేర్కొన్నాము. అనంతం గనుకనే జ్ఞేయ ప్రపంచ వాసన కూడా లేని అఖండంగా వ్యాపించిన కేవల జ్ఞాన స్వరూపమే ఆ బ్రహ్మమని తేలుతున్నది.

ఇలాంటి స్వరూపాన్ని వాక్యమెప్పుడు వర్ణించిందో అప్పుడా పదార్థం తాలూకు వృత్తి ఒకటి చిత్తంలో నిష్పన్నమవుతుంది. దీనినే బ్రహ్మాకారవృత్తి అని ఇంతకుముందు మనం పేర్కొన్నాము. ఇది వాక్యార్థాన్ని యథావిధిగా శ్రవణం చేయటంవల్ల మనకేర్పడే వృత్తి. వృత్తి అన్నా జ్ఞానమన్నా విద్య అన్నా వివేకమన్నా కూడా ఇదేనని చెప్పాము. దీని మూలంగా మొదటి నుంచీ మన చిత్తంలో పేరుకొని పోయిన అజ్ఞానమనే చెత్తదూరంగా తొలగిపోతుంది. అజ్ఞానమంటే ఈ ప్రపంచమే తప్ప దీనికి మూలభూతమైన తత్త్వమొకటి ఉందని తెలియకపోవటం. ప్రస్తుతమలాంటి పదార్థమొకటి ఉంది – ఫలానా విధంగా ఉందని శ్రవణం చేయగానే తదాకారమైన జ్ఞానముదయించి అది అజ్ఞాన తిమిరాన్ని పారదోలింది. తత్ఫలితంగా అద్వితీయమైన జ్ఞానమే బ్రహ్మమనే ఒక అఖండాత్మ భావం మనసులో చోటు చేసుకొంటుంది.

కాని ఈ జ్ఞానంవల్ల బ్రహ్మవిషయమైన అజ్ఞానమనేది తొలగిపోయినా సంశయమనే మరొక భూతం మనల నావేశిస్తుంది. సంశయం దేనికని అడగవచ్చు. బ్రహ్మమంటే జ్ఞానస్వరూపమనితెలుసుకొన్నాము. అంతవరకు బాగానే ఉన్నది. కాని అది అద్వితీయమని చాటారే – అది ఎలా చెల్లుతుందని సందేహం. ఎందుకంటే అద్వితీయ మన్నప్పుడిక దానికి భిన్నమైన భావమే గోచరం కాగూడదు. అయినా ఈ ప్రపంచం మనకెప్పుడూ గోచరిస్తూనే ఉన్నది. అలాంటప్పుడది అఖండమనే మాట కర్థమేముంది.

ఇదుగో ఈ సంశయాన్ని నివారించటానికే శ్రవణం తరువాత మననమనే రెండవ భూమిక. మననమంటే విచారణ Reflection అని అర్థం. హేతు దృష్టాంత Argument & Illustration రూపంగా సాగుతుందది. ఆగమార్థాన్ని శ్రవణం Learning చేసిన తరువాత దాని నీహేతు దృష్టాంతాలతో సమర్థించవలసి ఉంటుంది మనం. లేకుంటే ఆ చెప్పింది ఎలా చెల్లుతుందా అనే సందేహమెప్పటికీ తీరదు మనకు. ప్రస్తుతం మనకు పట్టుకున్న సందేహమేమిటి. జగత్తనేది ఒకటి కనిపిస్తున్నది గదా – ఇది ఉండగానే ఆ బ్రహ్మ మద్వితీయమెలా అయిందని. ప్రపంచమనేది కనిపిస్తున్నా అది వస్తువు Fact గాదు – కేవలమొక వస్తువు తాలూకు ఆభాస Reflection అనిముందు తెలుసుకోవాలి మనం. ఆ వస్తువు ప్రజ్ఞాన రూపమైన బ్రహ్మమే. అదే జ్ఞేయరూపమయిన ప్రపంచంలాగా భాసిస్తున్నది. ఒక రజ్జువు సర్పం మాదిరి

భాసించటంలేదా. అలాంటిదే ఇదీ. ఇలా ఆభాస అని ఎప్పుడు తేల్చుకొన్నామో అప్పుడది ఆ వస్తువుకన్నా భిన్నంగాదని ఆకళింపుకు తెచ్చుకోవాలి. రజ్జువు కంటే వేరుగా సర్పమెక్కడ ఉంది. అలాగే ఆ బ్రహ్మచైతన్యం కన్నా ఈ జ్ఞేయ ప్రపంచం కూడా వేరుగా లేదెక్కడా. ఎంచేత. ఆది మధ్యావసానాలలో దాన్నే ఇది అంటి పట్టుకొని ఉన్నది. అలా ఉన్నదంటే ఇది దానికి విభక్తం కాదు. విభక్తం కాదంటే అదేనని భావం. ఇలా సహేతుకంగా విచారణ సాగిస్తే చాలు. ఈ ప్రపంచమెంత సవిశేషంగా కనిపిస్తున్నా - ప్రతి ఒక్కటీ చైతన్యాన్ని విడిచి ఉండలేదు కాబట్టి - చైతన్యం చేతనే భాసించాలి కాబట్టి - మన చైతన్యమే పరచినట్టు సర్వత్రా మనకు ప్రత్యక్షమవుతుంది. అప్పుడిక ప్రపంచమనే వార్తలేదు. అంతా కలిసి ఒకే ఒక బ్రహ్మచైతన్యమనే భావం మనసుకు వస్తుంది. దానితో సంశయ పిశాచం కూడా ఉచ్చాటనమయి పోతుంది.

అయితే సంశయం పోవచ్చు. కేవలం బ్రహ్మమే ఉందనే నిశ్చయజ్ఞానమూ Conviction కలగవచ్చు. కానీ అది ఎంత జ్ఞానమైనా మానసికమే. మరి మానసికంగా ఎంత నిశ్చయం చేసుకొన్నా-బాహ్యంగా మరలా ఈ ప్రపంచంలో వ్యవహరిస్తుంటాము గదా. ప్రపంచమనేది లేకపోతే దానితో ఎలా వ్యవహరించగలం. కాబట్టి బ్రహ్మాకార మయిన జ్ఞానముదయించినా ఇంకా భౌతికమైన ప్రపంచమున్నది. ఇలా ఉంటే ఆ జ్ఞానమఖండమెలా అయిందని మరలా ఒక ఆశంక. దీనికే విపర్యయమని పేరు. విపర్యయమంటే వస్తువనేది ఏకమని నిర్ధారణ చేసుకొన్నా - అది మళ్ళీ అనేకంగా భాసించటం. వాస్తవానికి బ్రహ్మానికి భిన్నంగా లేదు ప్రపంచం అయినా భిన్నంగా కనిపిస్తున్నది. అలా కనిపిస్తున్నదంటే మనం మానసికమైన అభేద వృత్తిని సాధించామే గాని-దానినే అనుక్షణమూ పట్టుకొని కూచోటంలేదు. ఎప్పుడెప్పుడు పట్టుజారుతుందో అప్పుడంతా మరలా ఈ ప్రపంచ దృష్టి వచ్చి మధ్యలో చోటు చేసుకొంటుంది. అది విజాతీయ భావం Hetero geneous Element విజాతీయమైన భావమేర్పడిందంటే సజాతీయమైన Home geneous బ్రహ్మభావం తాత్కాలికంగా దూరమయిందనే గదా. కనుక విజాతీయం చేత ఏ మాత్రమూ తిరస్కృతం Veiled కాని కేవల సజాతీయ దృష్టినే ప్రవాహరూపంగా సాగిస్తూ పోవాలి సాధకుడైన వాడు. అది కేవల జ్ఞానం కాదప్పుడు. జ్ఞాననిష్ఠ Stability అవుతుంది. ఇదుగో ఈ నిష్ఠకే నిది

ధ్యాసన Realisation మని పేరు. దీనివల్ల విపర్యయమనే మూడవ దోషం కూడా పోతుంది. అప్పుడిక లోపలా వెలపలా - సమాధీవ్యుత్థానమనే తేడా లేకుండా నిరంతరమూ బ్రహ్మదృష్టిలోనే ఉంటాడు సాధకుడు. అలా ఉంటే లోకవ్యవహారమంతా ఇక వాడికి బ్రహ్మాకారంగానే మారి కనిపిస్తుంది. దీనినే వర్ణిస్తూ భగవత్పాదులిలా వ్రాస్తారు. **"యత్పశ్యతి-యచ్ఛృణోతి-స్పృశతివా తత్సర్వమ్ వాసుదేవ ఏవేతి గ్రహావిష్ట బుద్ధిః"** ఏదేది లోకంలో చూస్తామో వింటామో-స్పృశిస్తామో-అంతెందుకు. మన సకలేంద్రియాలతో ఏదేది గ్రహిస్తామో-అదంతా ఆయారూపాలలో గాక ప్రతి ఒక్కటీ బ్రహ్మమేననే ఏకాత్మ భావంతో దర్శించాలి-అది ఎప్పుడూ ఒక గ్రహంలాగా మన బుద్ధి నావేశించి ఉండాలంటా రాయన.

మొత్తంమీద శ్రవణాదులైన ఈ మూడుపాయాలే చాలు. అవి అభ్యస్తమయ్యే కొద్దీ కర్మ ప్రతిబంధాన్ని క్రమంగా రూపుమాపి సాధకుడి మనోదర్పణాన్ని నిర్మలం చేస్తాయి. **"తద్బుద్ధయ స్తదాత్మాన - స్తన్నిష్ఠాస్త త్పరాయణాః గచ్ఛం త్యపునరావృత్తిమ్ జ్ఞాననిర్ధూత కల్మషాః"** అని భగవత్ప్రబోధం. ఇందులో తద్బుద్ధి అంటే శ్రవణం. తదాత్మత్వమంటే అది తప్ప మరేదీ లేదనే భావన మననం. పోతే తన్నిష్ఠ అనేది నిది ధ్యాసనమే. ఈ మూడింటి జ్ఞానంవల్లా కర్మ నిర్మూలనం జరిగితే అది జ్ఞాన నిర్ధూత కల్మషత్వం. తద్ద్వారా తదేక పరాయణత్వంతో అపునరావృత్తి రూపమైన మోక్షఫలాన్ని హస్తగతం చేసుకోగలడు సాధకుడని దీని తాత్పర్యం.

మూడింటి జ్ఞానమూ నన్నప్పుడివి మూడూ దేనిపాటికది వేరుపాటు వాదులని మరలా భావించరాదు. మూడు కలిసి కలిసికట్టుగా సాధించే పని ఒక్కటే. అది సర్వమూ ఆత్మ స్వరూపమే ననే ఏకాత్మ భావం The subjective unity of all. కేవలమూ ఆ భావాన్ని దృఢీకృతం చేయటంలోనే తేడా. కనుక ఇవి మూడూ మూడు మార్గాలు కావు. ఒకే ఒక మార్గంలో మూడు భూమిక Stages లంటారు భగవత్పాదులు. ఎందుకంటే మూడూ కలిసి చివరకు మనకిచ్చే అనుభవం ఒక్కటే. శ్రవణమిచ్చినా అదే. మననమిచ్చినా అదే. నిదిధ్యాసనమైనా అదే. వడ్లదంపకం లాంటిదీ వ్యవహారమంతా. వడ్లు బియ్యం కావాలంటే దంచటమే దాని కుపాయం. అయితే ఎన్నిసార్లు దంచాలని ప్రశ్న. ఇన్నిసార్లనే నియమం లేదు. బియ్యం కావటమే మాకు కావలసింది. అది ఎన్ని సార్లకయితే అన్నిసార్లని జవాబిస్తారు శంకరులు.

అందులో పదిసార్లు దంచింది శ్రవణమైతే వందసార్లు మననమైతే – వెయ్యిసార్లు నిది ధ్యాసనం. మూడూ కలిసి ఇచ్చే ఫలితం చివరకు బియ్యమే. కొంచెమో గొప్పో అది ప్రతి ఒక్కటీ వాటిలో సాధిస్తూనే ఉన్నది. తండుల నిష్పత్తి పూర్తి అయ్యేసరి కందులోనే మూడూ సమాప్తమవుతాయి. అలాగే ఈ శ్రవణాదులు మూడూ కూడా కొంతకు కొంత సాధిస్తూ చివర కాబ్రహ్మ జ్ఞాన నిష్పాదనంలోనే చరితార్థమవుతాయని పరమ హంసలమాట. అయితే అలా చరితార్థం Culminate కావాలంటే కర్మ అనే ప్రతిబంధమున్నంత వరకూ లాభం లేదు. కాబట్టి ఒక ప్రక్క దాన్ని నిర్మూలిస్తూనే మరొక ప్రక్క ఇవి బ్రహ్మజ్ఞానానికి తోడ్పడుతాయని అర్థం చేసుకోవాలి మనం.

అయితే శ్రవణాదులు బ్రహ్మజ్ఞానాని కుపాయమని చెబుతున్నారు. బాగానే ఉంది కాని కర్మ అనేది నిర్మూలనమైతే గదా అవి మన జ్ఞానానికి తోడు పడేది. జీవితమంతా ప్రారబ్ధానికే అధీనమై ఉన్నప్పుడీ శ్రవణాదులకు మాత్రమవకాశ మెక్కడిది. ఒక ఒరలో రెండు కత్తులిముడలేవు గదా. ఇందులో మొదట ప్రవేశించిన కత్తి కర్మవృత్తి అయి కూచుంది. మరి జ్ఞానమనే మరోకత్తి దానిలో ఎలా ప్రవేశించగలదు. అది ఉంటే ఇది లేదు. ఇది ఉంటే అది లేదు. ఇందులో అది ఉందనే విషయం మన కనుభవ సిద్ధమే. కర్మఫలమే గదా జీవితాంతమూ మనమనుభవిస్తున్నాము. పోతే జ్ఞానమనేదే మనకు అందని మ్రానిపండయింది. అలా అయిందంటే అప్పటికీ ప్రారబ్ధం దాన్ని తల ఎత్తనివ్వటం లేదనే గదా అర్థం. అలాంటప్పుడిక జ్ఞానం కోసమే ప్రయత్నం గానీ ఎలా చేయగలడు మానవుడని ఆక్షేపణ వస్తుంది.

## కర్మపరిధి

దీనికొక అద్భుతమయిన ఆచరణ యోగ్యమయిన పరిష్కారాన్ని సెలవిస్తారు శంకర భగవానులు. కర్మ అనే దానికెంత ప్రభావముందని చెప్పినా అది అనంతమయిందని మనం భ్రాంతి పడరాదు. దానికొక పరిమితి Limit అనే దున్నది. ఒక పరిధి Range లోనే అది పని చేస్తూంటుంది. జీవితంలో కష్టమో సుఖమో – ఒకానొక దశ మన అనుభవానికి తెచ్చేవరకే దానిప్రభావం. అందులో మనం చేయగలిగిందిక ఏమీ లేదు. అంతా ముందుగానే నిర్ణయమై ఉంటుంది. ఎందుకంటే

గడచిపోయిన విషయమది. అనేక జన్మల నుంచీ చేసుకొంటూ వచ్చిన కర్మ ఫలమే ఇప్పుడనుభవిస్తున్నాము. అది చేయి జారిన విషయం కాబట్టి ఆ కర్మఫలంగా ఏర్పడిన ఈ జన్మలో ఎప్పుడేది ప్రాప్తించినా అది నోరు మూసుకొని అనుభవించవలసిందే. తప్పదు. ఇదుగో ఈ ఫలానుభవం వరకూ దాని ప్రభావమే. అందులో మన ప్రయత్నమేమీ పనిచేయదు.

అయితే అది అక్కడికే పరిమితం. అంతకు మించి ప్రవర్తించే అధికారం దానికి లేదు. అంతకు మించి ఏముందని అడగవచ్చు. మానవుడికి భోక్తృత్వమేగాక కర్తృత్వం కూడా ఉందనే సంగతి మనం మరచిపోరాదు. జీవుడు కర్తా-భోక్తా కూడా నని గదా ఇంతకు ముందు మనం ప్రతిపాదించాము. అందులో భోక్తృత్వ లక్షణముండటం వల్లనే కర్మఫలమనుభవిస్తుంటాడు. అక్కడ అతని ప్రయత్నమేదీ పని చేయని మాట వాస్తవమే. కానీ దానితో పాటు కర్తృత్వమనే రెండవ లక్షణం కూడా ఉంది గదా. కాబట్టి ఒకవైపు కర్మఫల మనుభవిస్తూనే ఇంకొక వైపు మరలా కర్మ చేస్తుంటాడు. ఈ చేసే కర్మలో మాత్రమతనికి కావలసినంత అవకాశముంది. అందులో ఆ ప్రారబ్ధ కర్మ కెంత మాత్రమూ ప్రవేశం లేదు.

ఇందులో ఉన్న రహస్యమేమంటే కర్మ అనేది బహుజన్మల నుంచీ సంస్కార రూపంగా Instinct మన స్వభావంలో జీర్ణించిపోయింది. ఆ సంస్కారాలతోనే మనమిప్పుడు జన్మించాము. అది జారీ కావటంవల్లనే జన్మ ఎత్తాము కాబట్టి ప్రయోగించిన బాణం లాంటిదది. దశరథుడి లాగా ఇక ఎంత తాపత్రయపడ్డా దాన్ని వెనుకకు తీసుకోలేము. మంచో చెడ్డో దాని ఫలితమది ఇవ్వవలసిందే తప్పదు. పోతే ఇప్పుడు మనం మరలా చేసుకొనే కర్మ అలాంటిది గాదు. ఇది ఎక్కుపెట్టిన బాణమంటారు భగవత్పాదులు. దీన్ని మనం విడిచినా విడవవచ్చు. ముడిచినా ముడవవచ్చు. మనచేతిలో ఉందది. అయితే కర్మకే వదిలేస్తే అది విడవమనే చెబుతుంది. ఎందుకంటే మనసులో తిష్ఠ వేసుకొని కూచున్నాయి ప్రాక్తన కర్మవాసనలు. అవి సమయం చూచి రాగద్వేషాలను రెచ్చగొడుతాయి. రాగద్వేషాదులు తమ కనుకూలంగా మన బుద్ధులను త్రిప్పటానికి ప్రయత్నిస్తాయి. అదుగో అప్పుడే మనం జాగ్రత్త పడాలి. మంచి చెడ్డలు బాగా విమర్శించి చూచి అది ఉపాదేయ Preferable మయితే ఆచరించాలి. హేయ Deferable మని తోస్తే త్రోసి వేయాలి. ఈ హానోపాదానాలు మాత్రం మన చేతిలోనే ఉన్నాయి.

# పురుషకారం

ఇదుగో ఈ విధమయిన విమర్శకే Introspection పురుషకారమని Human effort పేరు. మరి దీనికి భిన్నమయిన కర్మ ఫలానుభవానికి దైవమని Destiny or Fate పేరు. వీటినే మనమిప్పుడు కర్మ సిద్ధాంతమనీ Fixed Fate పురుష ప్రయత్నమనీ Free will మామూలుగా లోకంలో వ్యవహరిస్తుంటాము. కొందరంతా కర్మాధీనమే నంటే – మరికొందరు మానవుడి ప్రయత్న లోపమేనని వాదిస్తుంటారు. రెండూ అతివాదాలే నంటారు భగవత్పాదులు. కర్మ కెంత ప్రభావమున్నా అది ఫలానుభవం వరకే. మహా అయితే రాగద్వేషాది ద్వంద్వాలను రెచ్చగొడుతుందది. అంతకు మించి మానవుడి వివేచన మీద కూడా అది చేయి చేసుకోలేదు. అందులో మానవుడికి వలసినంత వెసులు బాటున్నది. ఫలానుభవం ప్రయోగించిన బాణమైతే ఇది ఎక్కుపెట్టిన బాణం. కావలసివస్తే ప్రయోగించవచ్చు మనం. ఈ వివేచనలోనే ఉంది మన ప్రయత్నమంతా. ఇది ఇప్పుడు క్రొత్తగా చేస్తున్న కర్మ కాబట్టి దీనికి ప్రారబ్ధమడ్డు తగలదు. ప్రారబ్ధమంతకు ముందు చేసిన కర్మ. దానికీ దీనికీ సంబంధం లేదు.

అలా కాకపోతే మనమిక జీవితంలో ఏ కర్మగానీ చేయటానికి లేదు. ప్రతి ఒక్కటీ ప్రారబ్ధ తంత్రమనే గదా చెబుతున్నారు మీరు. అంతా ప్రారబ్ధాధీనమే నన్నప్పుడొక ప్రశ్న వస్తుంది. అసలీ ప్రారబ్ధమనేది ఎలా ఏర్పడిందని ఇంతకు ముందు జన్మలో మనం కర్మ అనేది చేసి ఉంటేనా గదా అది ఏర్పడింది. అంతకు ముందు చేస్తేనే గదా. కాబట్టి కర్మ చేసుకొనే స్వాతంత్ర్యం మానవుడి కెప్పుడూ ఉందనే అర్థం. ఒకప్పుడు చేస్తేనే అది ఇప్పుడు ప్రారబ్ధమయింది మన పాలిటికి. అలాంటప్పుడీ జన్మలో ఉన్నట్టుండి ఒక్కసారిగా ఆ కర్మచారణ శక్తి ఎలా అంతరించి పోతుంది. తప్పకుండా ఉండవలసిందే. అలా ఉండటం చేతనే దాని నుపయోగించుకొని మరలా ప్రయత్నం చేయవచ్చు మానవుడు. దానినే మనం పురుష ప్రయత్నమని పేర్కొంటున్నాము. ప్రారబ్ధం మనలనుకట్టి పడేస్తుంటే ఇది దాని కట్లు విప్పుకొనే ప్రయత్నం. అది సమస్య అయితే ఇది పరిష్కారం. సమస్యలోనే దాగి ఉంటుంది దాని పరిష్కారం కూడా. దొంగను పట్టటానికి దొంగే కావాలన్నట్టు కర్మను నిర్మూలించేది మరలా కర్మే. మొదటి కర్మ ప్రారబ్దం. రెండవ కర్మ ప్రయత్నం.

అదిప్రపంచం వైపు మనలను తీసుకెళ్తుంటే ఇది ఆ దారి మళ్ళించి మనలను మరలా మన ఆత్మ స్వరూపమైన బ్రహ్మతత్త్వం వైపు మోసుకొని పోతుంది. అదే ఇంతకు ముందు చెప్పిన శ్రవణమనన నిది ధ్యాసనారూపమైన అభ్యాసం.

## శమాదిసాధన

అయితే ఈ శ్రవణాదులు మాత్రం ఫలితమిస్తాయని ఏమిటి నమ్మకం. ఎంత కాలం శ్రవణం చేసినా అసలు విషయమంతా పట్టని వారెందరు లేరు. వారి విషయంలో మరి ఈ మానవ ప్రయత్నమేమయినట్టని ఒక ఆశంక వస్తుంది. దీనికికూడా పరిహారం చెప్పారు భాష్యకారులు. ఎంత అభ్యాసం చేసినా ఫలించకపోతే అప్పుడు మనం చేసుకొన్న కర్మవాసనలు మరీ ప్రబలంగా ఉన్నాయని అర్థం చేసుకోవాలి. అలా ఉండటం మూలాన్నే శ్రవణాదులు చేయటానికి కూడా అసలు మొగ్గుచూప రనేకులు. "**శ్రవణా యాపి బహుభిర్యో నలభ్యః**" శ్రవణం చేయడానికే ఎంతో మంది నోచుకోలేదని చాటుతున్న దుపనిషత్తు. అంతేకాదు. "**శ్రుత్వాప్యేనమ్ బహవో యేన విద్యుః**" ఒకవేళ అలా చేయగలిగినా సుఖం లేదు. తరువాత దానిమీద మననం చేసి విషయాన్ని గ్రహించే తాహతుండదు వారికి అంచేత "**ఆశ్చర్యోస్య వక్తా కుశలోస్య లబ్ధాఽఽ శ్చర్యోజ్ఞాతా కుశలాను శిష్టః**" దాని ననుభవానికి తెచ్చుకొని బోధించేవాడూ అపురూపమే బోధిస్తే ఉన్నదున్నట్టు దాన్ని ఆకళించుకొనే వాడూ అపురూపమే నని కుండ బ్రద్దలు కొట్టినట్టు లోకానికి చాటి చెబుతున్నది శ్వేతాశ్వతరోపనిషత్తు. దీనిని బట్టి మనకు తేలిన రహస్యమేమంటే – కర్మ ప్రతిబంధం కొంత తక్కువగా ఉంటే శ్రవణ మననాదుల కుత్సహించగలడనీ ఎక్కువ మోతాదులో ఉంటే మానవుడదీచేయలేడనీ అర్థమవుతుంది.

అయితే ఇది మనలను భయపెట్టి నిరుత్సాహ పరచటానికని మరలా అభిప్రాయ పడరాదు. భయపెట్టినట్టు కనిపిస్తున్నదే గాని ఇది శాస్త్ర తాత్పర్యం కాదు. శాస్త్రమిలా మాటాడటం మనం చేసే ప్రయత్నమెంత మందకొడిగా సాగుతున్నదో తెలపటానికే. అంతేగాదు. ఇతోధికమైన దీక్షతో మన ఉద్యమం కొనసాగించమని మనలను హెచ్చరించటానికి కూడా. ఒకవేళ దానికి కూడా తగినంత స్తోమత లేకపోతే శ్రవణాదుల కప్పుడే మనం పరిపక్వం కాలేదని అర్థం. అలాంటప్పుడంత కన్నా

ముందుగా మనం చేయవలసిన ప్రయత్నమొకటి ఉన్నది. అదే శమాది షట్క సంపాదన. ఆత్మజ్ఞానానికి శ్రవణాదులంతరంగ Internal సాధనమైతే ఈ శమాదులు బహిరంగ సాధన External మంటారు భగవత్పాదులు. జ్ఞానానికి సాక్షాత్తుగా తోడ్పడుతాయి శ్రవణాదులు. అవి బ్రహ్మ విచారమైనవి. కాబట్టి అంతరంగం దానికి. పోతే ఈ శమాదులలాంటివి కావు. ఇవి ఇంద్రియ సంస్కార Purifying రూపమైనవి. అంచేత దానికి బాహిరమిది. ఇంద్రియాలకే కరణమని మరి ఒక సంజ్ఞ. మనం కర్తల Agents మైతే - ఇవి మనకు కరణాలు Instruments వీటివల్లనే మనమే కర్మ అయినా చేయగలుగుతున్నాము. అయితే ఇవి బాగా పరిశుద్ధమై ఉండాలి. కాకపోతే శ్రవణాది క్రియలకివి అడ్డు తగులుతుంటాయి. అలా తగలటం వల్లనే మన మాశ్రవణాది సాధనకు నోచుకోలేకపోతున్నది. కాబట్టి మోక్ష సాధన మార్గంలో ఇవి చాలా ప్రధానమైనవి.

వీటిలో అంతఃకరణాలు కొన్ని. బహిఃకరణాలు కొన్ని. అంతః కరణాలు మనస్సూ-ప్రాణమూ. బహిః కరణాలు మనసుకు సంబంధించి త్వగాదులైన అయిదు జ్ఞానేంద్రియాలు. ప్రాణానికి సంబంధించి వాగాదులైన అయిదు కర్మేంద్రియాలు. ఇందులో జ్ఞానేంద్రియాలు వెలపలి వార్తలను లోపలి కందిస్తే - కర్మేంద్రియాలు లోపలి ఉత్తర్వులను వెలపలికి జారీ చేస్తుంటాయి. ఒకటి తెలుసుకోవటం. మరొకటి దాని కనుగుణంగా నడుచుకోవటం. మొదటి దాని కధ్యక్షపీఠం మనస్సయితే - రెండవ దానికి ప్రాణం. ఇవి రెండూ కేవల మంతఃకరణాలు. ఇవి రెండూ శుద్ధి కావాలి ముందు. ఇవి శుద్ధి అయితే ఆ తరువాత వాటి పరివారమే కాబట్టి చక్షురాదులు కూడా అవుతాయి. ఇందులో అంతరంగ శుద్ధికే శమమనిపేరు. చిత్తశుద్ధీ కావచ్చు ఇది. ప్రాణశుద్ధీ కావచ్చు. ఒకటయిందంటే మరొక దానికది దోహదం చేస్తుంది. పోతే ఇక బహిరింద్రియాలను వశీకరించే ప్రయత్నానికి దమమని పేరు. శమదమాలు రెండూ సాధించామంటే అంతరింద్రియ బహిరింద్రియ వర్గమంతా మనకు వశవర్తి అయిందన్నమాటే. ప్రతి ఒక్క ఇంద్రియ వ్యాపారమూ మన చెప్పుచేతలలో ఉంటుందప్పుడు. దీనితోప్రపంచ వ్యవహారాల నుంచి సాధకుడు తన మనస్సును సులభంగా మరలించుకో గలడు. ఈ మరలించుకోటానికే ఉపరతి With drawal అని పేరు. అయితే అలా మళ్ళించినా అప్పుడపుడు శీతోష్ణాదులైన

ద్వంద్వాలు మనమీద దాడి చేస్తుంటాయి. వాటి ధాటికి తట్టుకొని నిలబడాలి సాధకుడు. ఇలాంటి సహనశక్తికే తితిక్ష Endurance అని పేరు. ఇది శమాదిషట్కంలో నాలుగవది. దీని తరువాత శ్రద్ధ అని ఒక భూమిక ఉన్నది. శ్రద్ధ అంటే అలా అనాత్మ బాధలను సహించటమే గాక ఆత్మభావాన్ని అనుసరిస్తూ పోవటం. ఈ క్రియతో ఆత్మను పట్టుకొని దానిలోనే నిలిచిపోవటం ఆరవదైన సమాధి Absorption or Trance. ఇది సాధన మార్గంలో కట్టకడపటి స్థాయి. దీనితో ఇంద్రియ శోధనమనేది సమాప్తమవుతుంది.

మొత్తం మీద శ్రవణాది విచార మార్గానికి దిగే ముందు దానికీ శుద్ధి రూపమైన పూర్వరంగం Preparatory ground సిద్ధం చేసుకొని ఉండాలి. అలా సిద్ధం చేసుకోమనే సాధకులకు బోధిస్తున్నది మహాభారతం. **"కషాయసక్తిః కర్మాణి-జ్ఞానంతు పరమాగతిః - కషాయే కర్మభిః పక్వే-తతో జ్ఞానమ్ ప్రవర్తతే"** అన్నారు వ్యాస భట్టారకులు. కషాయమని ఒక దోషముంది మనకందరికీ. కషాయమంటే కర్మ జన్మమైన కాలుష్యం Contamination. అది బాగా పక్వం కావాలట. అంటే దాని వన్నె పూర్తిగా మారిపోవాలి. అలా మారాలంటే మొదటనే విచార మార్గానికి పూనుకొని ప్రయోజనం లేదు. అది పరమాగతిః - తరువాత కలగబోయే విషయం. పోతే దానికి ముందు చేయవలసిందేమిటని ప్రశ్న వచ్చింది. "కర్మాణి" అన్నారు. ఇంద్రియ పరిశోధనాత్మకమైన కర్మాచరణమే కర్తవ్యమని జవాబు. ఈ కర్మలచేత కషాయం పాకానికి వస్తే - "తతోజ్ఞానమ్ ప్రవర్తతే" పిమ్మట జ్ఞానా పర పర్యాయమైన శ్రవణాది విచారణ చక్కగా ముందుకు సాగుతుంది. ఇదీ మహాభారతంలో మోక్షధర్మ పర్వం మనకు బోధించే పరమ రహస్యం.

ఈ రహస్యాన్నే కఠోపనిషత్తులో నచికేతుడికి అధ్యాత్మ విద్య నుపదేశించే ఘట్టంలో యమధర్మరాజు కూడా ఆవిష్కరిస్తాడు. **"నా విరతో దుశ్చరితాత్-నాశాంతో నా సమాహితః - నా శాంత మానసోవాపి - ప్రజ్ఞానేనైన మాప్నుయాత్"** శాస్త్ర నిషిద్ధమైన దుష్కర్మ లాచరిస్తూ పోతే దానికి దుశ్చరిత Misdeed or Inequity మనిపేరు. అలాంటి దుశ్చరిత పంకం పేరుకొని ఉన్నంతవరకూ - ఎంత మనం ప్రజ్ఞాబలంతో పట్టబోయినా ఆ తత్త్వాన్ని పట్టుకోలేము. అలాగే "నా శాంతః" అశాంతి అంటే ఇంద్రియ లౌల్య Indulgence మన్నారు భగవత్పాదులు. అందులో నుంచి

వైదొలగక పోయినా ఫాయిదా లేదు. అలాగే "నాసమాహితః" అసమా హితుడంటే మనస్సుకు ఏకాగ్రత లేక ఎప్పుడూ చిత్త విక్షేపానికి Distraction లోనైన వాడు. వాడికీ లభించే సొత్తుగా దది. అలాగే "నా శాంత మానసః" మనసులో అంతరాంతరాలలో ఎన్నో తీరని కోరికలుంటాయి మానవులకు.

ఏతావతా శ్రవణాది విచార మార్గంలో అడుగుపెట్టే యోగ్యత మనకేర్పడాలంటే దానికి పూర్వరంగం లాంటి కాయేంద్రియ శుద్ధి మన కనివార్యంగా ఉండి తీరాలని తేట పడుతున్నది. ఇందుకోసమే ఉపనిషత్తులలో ఆయా కర్మలను గూర్చి ఉపాసనలను గూర్చీ-చర్చించవలసి వచ్చింది. లేకపోతే జ్ఞానైక పరాయణమైన ఉపనిషద్వాఙ్మయంలో ప్రవేశించే అధికారం వాటి కెక్కడిది. అవి రెండూ అనుష్ఠాన కోటిని దాటిపోయేవి కావు కదా. అనుష్ఠానమనే సరికొక కర్తా - కారకమూ- క్రియా - ఫలమూ - ఈ కలాపమంతా వచ్చి కూచుంటుంది. అది ఒక భేద దృష్టిని పెంపొందించేదే గాని అభేదరూపమైన ఆత్మానుభవానికెలా ఉపకరిస్తుంది. ఒకటి పూర్వ సముద్రమైతే - మరొకటి పశ్చిమ సముద్రమన్నారు స్వామివారు. పూర్వ సముద్రానికి పోవలసినవాడు పశ్చిమానికి పయనిస్తే ఏమి సుఖం. దానివల్ల రెండు నష్టాలు మనకు. చేరవలసిన గమ్యాన్ని చేరకపోవటం. దానికి ప్రతికూలమైన గమ్యాన్ని చేరటం. అలాగే ఇక్కడ కూడా కర్మోపాసనలను పట్టుకొని పోతే జీవిత గమ్యమైన ఆత్మకు దూరమై అగమ్యమైన అనాత్మ ప్రపంచంతోనే తల పట్లు పట్టవలసి వస్తుంది.

## సంస్కారార్థమేకర్మ

అంచేత కర్మోపాసనలనేవి ఉపనిషత్తులు మనకు సిఫారసు చేశాయంటే అవి మన ఆత్మజ్ఞానాని కంగభూతంగా ఉపకరించాలనే అభిసంధితోనే Intention చేసి ఉండాలంటా రాచార్య సార్వభౌములు. అది ఇంతకు ముందే మేము వివరించి ఉన్నాము. మోక్షగామి అయిన మానవుడు నిషిద్ధాలతోపాటు కామ్యకర్మలను కూడా వదిలేయాలి. ఇహాముత్ర భోగాల మీద మనసున్నంత వరకూముందు చెప్పినట్లు శాంత మానసులం కాము మనం. కాకపోతే అది ఆత్మజ్ఞానానికి ప్రతిబంధకమే గదా. కాబట్టి కామ్యరాశిని కూడా విసర్జించవలసిందే. ఇలా కామ్య నిషిద్ధాలు రెండూ కాదనుకుంటే ఇక ఆచరణ యోగ్యమైనవి నిత్య నైమిత్తికాలురెండే అవుతాయి. ఇవి

కూడా మామూలు కర్మిష్ఠులు చేసే తీరు వేరు. మోక్ష సాధకుడు చేసేతీరువేరు. కర్మిష్ఠులిది మాకు శాస్త్ర విహితమైన కర్మ - మేము మాత్రమే చేయవలసిందిది - చేస్తే అది ప్రత్యవాయ దోషాన్ని పరిహరించి మాకు శ్రేయోదాయకమవుతుందని అహంకార మమకారాలు వదలకుండా చేస్తారు. దానివల్ల కర్మ కాలుష్యమింకాఎక్కువ అవుతుందేగాని సలీసు చిక్కదు. మరి జ్ఞాన సాధకులూ చేస్తారు కర్మ. కానీ వారలా చేసేటప్పుడు నేను నాది అనే భావాలకు తావీయకుండా చేస్తారు. కాబట్టి ఎలాటి కాలుష్యం గానీ ఏర్పడదు వారికి. మీదు మిక్కిలి అవి వారికి సంస్కారహేతువులే అవుతాయి. సంస్కారమంటే ఇక్కడ పరిశుద్ధి అని అర్థం.

నిత్యాది కర్మలు సంస్కార హేతువులెలా అవుతాయని అడగనక్కరలేదు. **"సహ వా ఆత్మయాజీ యోవేద - ఇదమ్మే అనేనాంగమ్ సంస్క్రియతే-ఇదమ్ మే అనే నాంగమ్ ఉపధీయతే"** అని శ్రుతి వాక్యం ఇదుగో ఈ కర్మ చేస్తున్నాను. దీనివల్ల నా శరీరమూ - ఇంద్రియాలూ పరిశుద్ధమవుతాయి. అనే సంకల్పంతోనే చేస్తాడట ఆత్మయాజ్ఞి. ఆత్మను యజించేవా డాత్మయాజి. యజనమంటే కర్మాచరణమే. ఏ కర్మ నాచరిస్తున్నా అది ఆత్మ కోసమేనని ఆత్మార్పణ దృష్టితో ఆచరిస్తాడు. కాబట్టి జ్ఞాన సాధకుడెప్పుడూ ఆత్మయాజే గాని సోమయాజికాడు. ఇలా ఆత్మశుద్ధి కోసమే చేయాలి కర్మలని శ్రుతి చెప్పటమేగాదు. తదనుయాయులైన స్మృతులు కూడా అలాగే చెబుతున్నాయంటారు భాష్యకారులు. **"సర్వేషుచ స్మృతి శాస్త్రేషు కర్మాణి సంస్కారార్థాన్యేవ ఆచక్షతే-అష్టా చత్వారింశత్సంస్కారా"** ఇత్యాదిషు. చివరకు భగవద్గీత కూడా ఈ మాటే చాటుతున్నది. **"యజ్ఞోదానమ్ తపశ్చైవ-పావనాని మనీషిణామ్."** యజ్ఞమూ-దానమూ-తపస్సూ ఇవన్నీ పావనమైన కర్మలు. పావనమంటే శుద్ధిని ప్రసాదించే వనేగదా అర్థం. వీటి మూలంగా సత్త్వం విశుద్ధమైతే **"జ్ఞానోత్పత్తి ర ప్రతి బంధేన భవిష్యతి"** జ్ఞానమనేది అప్రతిహతంగా ఉదయిస్తుందని హామీ ఇస్తారాయన.

మొత్తం మీద కర్మలు సత్వశుద్ధ కోసమే నని చేయాలి గాని స్వర్గాది ఫలాల కోసమని చేయరాదు. అలాగైతే ఉపనిషత్తులు వాటిని పని గట్టుకొని చెప్పనక్కరలేదు. ఉపనిషత్తులు కర్మోపాసనలు రెండూ ఆత్మజ్ఞానాని కుపస్కారక Contributory మనే దృష్టితోనే వర్ణిస్తాయి. అందులో నిత్యనైమిత్తిక కర్మలు చిత్తశుద్ధిని ప్రసాదిస్తే

సగుణోపాసనాదులు చిత్తైకాగ్ర్యాన్ని సమకూర్చాలని ఉపనిషత్తుల అభిప్రాయం. వీటి అడుగుజాడలలోనే పయనిస్తూ భగవద్గీత కూడా ఇదే రహస్యం మనకు బయట పెడుతున్నది. "స్వేస్వే కర్మణ్యభిరత - స్సంసిద్ధిమ్ లభతే నరః" ప్రతిమానవుడూ తనకు విహితమైన కర్మ లాచరిస్తూ సిద్ధి పొందుతాడట. కిమ్ స్వకర్మానుష్ఠానత ఏవ సాక్షాత్సం సిద్ధిః - స్వకర్మాచరణ మాత్రం చేతనేసిద్ధి కలుగుతుందా అని దీనిమీద ఆశంక చేసి భగవత్పాదులు - దానికి సమాధానంగా ఉత్తర శ్లోకాన్ని వ్యాఖ్యానిస్తారు. "యతః ప్రవృత్తి ర్భూతానామ్ యేన సర్వమిదమ్ తతమ్ స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిమ్ విందతి మానవః" దేనివల్ల ఈ సమస్త సృష్టీ ఏర్పడిందో - దేనిచేత మరలా వ్యాప్తమయి ఉన్నదో - ఆ పరమాత్మ నారాధించటమే ఈ అనుష్ఠానమని భావిస్తూ చేయాలి కర్మ. అప్పుడే అది జ్ఞాననిష్ఠా యోగ్యతా లక్షణమయిన సిద్ధిని ప్రసాదిస్తుందని వివరిస్తారాయన.

ఆ మాటకు వస్తే గీత ఉపనిషన్మాత కంటే మరి రెండాకులెక్కువ చదివినట్టు తోస్తుంది. ఉపనిషత్తు శాస్త్ర చోదతమయిన కర్మలనే ఈ దృష్టితో చేయమంటే గీత ఒక శాస్త్రీయ కర్మలేగాదు. శారీరక లౌకిక కర్మలు యావత్తూ ఈశ్వరార్పణ దృష్టితోనే చేయటం మంచిదని సలహా ఇస్తున్నది. **"కర్మణ్య కర్మయః పశ్యేత్"** ఏ కర్మ చేస్తున్నా దానిలో అకర్మ రూపమయిన ఈశ్వర చైతన్యాన్నే చూడాలట. ఏ కర్మ అంటే ఏమిటా కర్మ. **"పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్ - అశ్నన్ గచ్ఛన్ స్వపన్ శ్వసన్"** కనటం వినటం దగ్గరి నుంచీ గాలి పీల్చటం దాకా - ఒకటేమిటి. మూత్రపురీ షోత్సర్గాదులతో సహా సమస్త కర్మలూ శుద్ధ చైతన్య భావనతోనే ఆచరిస్తూ పోవాలట జీవితంలో. ఇంతకన్నా సర్వాత్మ భావన మరేమున్నది. ఇలాంటి భావనతో Awareness చేసినప్పుడే శాస్త్రీయంగానీ లౌకికంగానీ కర్మానుష్ఠానమనేది నిజంగా మనకు శ్రేయోదాయక మవుతుంది. లేకుంటే కేవలం ప్రేయోదాయకమే.

దీనికే కర్మయోగమని పేరు పెట్టింది గీత. మనకు కర్మయోగం కావాలిగాని కేవల కర్మానుష్ఠానం కాదు. కేవలానుష్ఠానంలో ఈశ్వర భావన లేదు. ఆ భావన ఉంటే గాని సాధకుడి కహంతా మమతలు దూరంగావు. అవి దూరమైతే గాని సత్త్వం శుద్ధి గాదు. అందుకు తోడ్పడేది కర్మయోగమే సాధకుడికి. కర్మయోగం సత్త్వాన్ని శుద్ధి చేస్తే - సత్త్వ శుద్ధివల్ల జ్ఞానముదయిస్తే - తద్ద్వారా సమస్త కర్మలనూ

జ్ఞాన దృష్టితో చూచి సన్న్యసిస్తే - అది చివరకు జ్ఞాన నిష్ఠగా పరిణమించి మనకు బ్రహ్మానుభవాన్ని ప్రసాదిస్తుందని దీనిలో దాగి ఉన్న ఒక చక్కని క్రమాన్ని ఉగ్గడిస్తారు జగద్గురువులు. అంచేత సత్కర్మాచరణ వల్ల దురితక్షయమైతే ఈశ్వర భావనతో ఉపాసించటం మూలంగా విక్షేప దోషం తొలగిపోతే - రెండు విధాలా సంస్కారాన్ని పోగుచేసుకొన్న సాధకుడి మనోదర్పణం శ్రవణాది విచారానికి తప్పకుండా ఉన్ముఖమవుతుంది. అంటే ఏమన్న మాట. శమ దమాది రూపమైన కర్మయోగాన్ని అభ్యసించటంవల్ల కర్మ ప్రాబల్యం తలవంచితే శ్రవణం చేయటాని కవకాశం దొరుకుతుందని అర్థం.

అయితే చాలామంది అస్తిక మహాశయుల కిది అర్థం కాక కేవలం కర్మజడులై పోతున్నారు. దానికి కారణమిందులోని మెలకువ వారి కర్థం కాకనో - అయికూడా హఠబుద్ధి వదలకనో చెప్పలేము. యావజ్జీవమూ శ్రుతివిహితమైన అనుష్ఠాన మొకటి పాటిస్తే చాలు. అదే అన్నిటికీ జవాబు చెబుతుందని తాము భావించటమే కాదు. ఇతరులను కూడా అలాగే భావించమని బోధిస్తుంటారు. పైగా ఎవరైనా ఆ మార్గంలో లేకపోతే వారిని కర్మ భ్రష్టులనీ - వారి కిహపరాలు రెండూ లేవనీ శాపనార్థాలు పెడుతుంటారు. ఇంతకన్నా అవివేకముండబోదు. ఇలాంటి వారంతా కర్మిష్ఠులే గాని కర్మయోగులు కారు. కర్మిష్ఠత కేవల మాచారం Ritualism క్రిందికే వస్తుంది. మతం Religion క్రిందికి రాదు. మతమనేది యోగం. యోగమంటే కలయిక. జీవుణ్ణి ఈశ్వరుడితో కలిపినప్పుడే కర్మ అనేది యోగమవుతుంది. అదే నిజమైన మతం. మత పర్యాయమైన Religion అనే ఆంగ్ల శబ్దానికి కూడా ఇదే అక్షరార్థం. Religo అనే ధాతువుకు కలపటమని అర్థం. భగవానుడే చెప్పాడసలు ఇలాంటి కర్మయోగమే నా మతమని. **"యేమే మత మిదమ్ నిత్య-మనుతిష్ఠంతి మానవాః"** నా మతాన్ని అనుసరించి నడచుకొనే వారంతా కర్మబంధం నుంచి బయటపడతారు. **"యేత్వేత దభ్యసూయంతో - నాను తిష్ఠంతి మేమతమ్ - విద్ధి నష్టాన చేతసః"** అలా కాక ఎవరు నా మతాన్ని నిర్లక్ష్యం చేసి అనుసరించరో వారంతా నష్టజాతకులే పొమ్మంటాడు.

ఏమిటా భాగవతమైన మతమింతకు. ఈ కర్మయోగమే అదే అంతకు ముందు శ్లోకంలో మనకు తార్కాణ అవుతుంది. **"మయి సర్వాణి కర్మాణి సన్న్య స్యాధ్యాత్మ**

**చేతసా-నిరాశీ న్నిర్మమోభూత్వా"** అన్నాడు భగవానుడు. ఇందులో సర్వకర్మలూ అనటంవల్ల శాస్త్రీయ లౌకికాదులన్నీ కలిసి వస్తాయి. వాటన్నింటినీ అధ్యాత్మ చేతసా అంటే వివేక బుద్ధితో నిరాశీర్నిర్మమః అంటే అహమ్మ మాభిమాన వర్జితంగా - **"మయి సన్న్యస్య"** పరమాత్మ మీదనే పడవైచి అని అర్థం చెప్పారు భగవత్పాదులు. ఇది కర్మయోగం గాక కర్మానుష్ఠానమెలా అవుతుంది. కాబట్టి కేవల కర్మానుష్ఠాన మప్పటికి భగవానుడి మతం కాదన్న మాట. పైగా **"వేద వాదరతా నిత్యమ్-నాన్య దస్తీతి వాదినః"** అని అలాంటి కర్మ జడుల నందరినీ ఈసడించుకొంటాడు. అయితే మనం చేసే కర్మలన్నీ పనికిరానివేనా అంటే మోక్షసాధన మార్గంలో మాత్రమే పనికి రావని చెబుతారు భగవత్పాదులు. యోగదృష్టి లేకుండా కేవలానుష్ఠానం వల్లనే ముక్తి ఫలం కూడా చవిచూడాలని భావిస్తే మాత్రమది కేవలం శుష్క మనోరథమని ఘంటా పథంగా చాటుతారాయన.

# యోగసార్థక్యం

బాగానే ఉంది. కాని పరమార్థ సాధన కసలు జ్ఞానం తప్ప ఎలాటి కర్మ కూడా పనికి రాదని గదా మీరు ప్రతిపాదించారు. అలాంటప్పుడు కర్మయోగమని చెప్పినా అదీ ఒక కర్మేగదా. మరి వాటిని మీరు సాధనాలుగా ఇప్పుడెలా స్వీకరించారు. స్వీకరిస్తే అది మీ సిద్ధాంతానికే విరుద్ధం కదా అని మరలా ఒక పెద్ద ఆక్షేపణ వస్తుంది. దీనికి కూడా చక్కని సమాధానమిచ్చారు భగవత్పాదులు. బహిరంగమైన శమ దమాది కర్మయోగం గాని - అంతరంగమైన శ్రవణాది జ్ఞానయోగం గాని - సాక్షాత్తుగా ఆత్మతత్త్వాన్ని సాధిస్తాయని చెప్పటం లేదు. అవి ఆత్మ దర్శనానికి అడ్డు తగిలే పాపకర్మనూ - అజ్ఞాన సంశయాదులనూ నిర్మూలించటానికి మాత్రమే ఉపకరిస్తాయి. అందులో కూడా ఒక క్రమముంది. ప్రప్రథమంగా మనం చేసుకొన్న దుష్కర్మ ప్రబలంగా ఉంటే దాన్ని సత్కర్మాచరణతో తొలగించుకోవాలి. తరువాత శమదమాది రూపమైన కర్మ యోగంతో సద సత్కర్మలను రెంటినీ నిర్లిప్తంగా భావించాలి. తన్మూలంగా మనోముకురం మసృణీ భూతమైతే శ్రవణ మననాదులు సాగించాలి. ఆ తరువాత వీటన్నిటి ఫలితంగా బ్రహ్మజ్ఞానం దాని పాటికదే ఏర్పడుతుంది. సిద్ధమైన తత్త్వం కాబట్టి దాన్ని సాక్షాత్తుగా ఏదీ సాధించనక్కరలేదు.

ఇవన్నీ పరంపరా సాధనాలే దానికి. శమాదులు కొంత దూరమైతే - శ్రవణాదులు మరికొంత సన్నిహితం. అంత మాత్రమే.

ఇందులో శమాదికమైన కర్మయోగం మతం Religion క్రిందికి వస్తే శ్రవణాదికమైన జ్ఞానయోగం విద్య Philosophy క్రిందికి వస్తుంది. ఇవి రెండూ మనం యథాశక్తిగా ప్రయత్నం చేస్తే అంచెల వారగా మన ప్రారబ్ధకర్మకు జవాబు చెబుతాయి. అప్పుడొక ప్రక్క కర్మ ఫలమనుభవానికి వస్తున్నా మరొక ప్రక్క బ్రహ్మవిద్యను సాధించవచ్చు. దానికెంతైనా అవకాశముంది ప్రకృతిలో. అది గుర్తించి మానవుడు తన ఉద్యమం సాగించాలి గాని అంతా దైవాధీనమని చేతులు ముడుచుకొని కూచోరాదు. అది సోమరితనం క్రిందికి వస్తుంది. కర్మ సిద్ధాంతం మానవుణ్ణి సోమరిని చేయటానికి గాదు. అది ఉంటే ఉంది. జరిగిన దానికి మనమేమి చేయలేము - ఇక జరగబోయేది నీచేతిలో ఉంది - చేతనైతే దానికి విరుగుడుగా సన్మార్గంలో కృషి చేసి తరించమని ధైర్యం చెప్పటానికే. **"ఉత్తిష్ఠత-జాగ్రత-ప్రాప్యవరాన్ని బోధత" "ఇహచే దవేదీ దథ సత్యమస్తి-నచే దిహావేదీ న్మహతీ వినష్టి"** ఇలాంటి హెచ్చరికలన్నీ ఇందుకోసమే.

అయితే శాస్త్రమిలాంటి ప్రబోధాలెన్ని చేసినా - ఆచార్య పురుషులెంత ఘోషించినా - ఇంకా సందేహమే మానవులకు. ఇదంతా నిజమేనా నిరంతరమూ ఈ సంసార సాగరంలో మునిగి తేలుతున్న మనబోటి అల్పప్రాణులమెంతని ప్రయత్నించ గలం. ప్రయత్నిస్తే మాత్రమంతటి మహాఫలం మనకబ్బుతుందా. చూడబోతే ఇది మనకే మాత్రమూ సాధ్యపడేది గాదని వై మనస్యం చెందుతంటారు. ఇది ఏ మాత్రమూ సహించదు శాస్త్రం. శాస్త్ర ప్రవర్తకుడైన భగవానుడేమన్నాడో వినండి. **"సంశయాత్మా వినశ్యతి"** సంశయం పెట్టుకొంటే పాడయిపోతాడు మానవుడు. **"ప్రత్యక్షావ గమమ్ ధర్మ్యమ్ సుసుఖమ్ కర్తు మవ్యయమ్"** ప్రత్యక్షంగా మన ఎదుట ఉన్న వస్తువును చూచినట్టు చూడవచ్చు తత్త్వాన్ని. దానిని చూచి అనుభవానికి తెచ్చుకొనే సాధన కూడా చాలా సులువైనదని హామీ ఇస్తాడు.

అయినా మనకెందుకీ సందేహ పిశాచం వదలదని అడిగితే భగవత్పాదులిలా సమాధానమిస్తారు. **"సత్యమేవమ్ గురు సంప్రదాయ రహితానామ్ - అశ్రుత**

**వేదాంతానామ్-అత్యంత బహిర్విష యాసక్తి బుద్ధీనాం - సమ్యక్ప్రమాణేషు అకృత శ్రమాణాం"** గురు సంప్రదాయం కరువయి వేదాంత శాస్త్రం మొగమైనా చూడక నిత్యమూ బహిర్విషయాలలో మునిగి తేలుతూ - సరియైన జ్ఞాన సాధనాలలో పరిశ్రమ చేయకపోతే సందేహమనేది ఎలా వదులుతుంది. ఇలాంటి దుష్ట గుణ చతుష్టయ మున్నంతవరకూ అది అత్యంత ప్రసిద్ధమూ-ఆసన్నతరమూ- ఆత్మభూతము సువిజ్ఞేయమూ అయినా అతిదూరంగానూ అవిజ్ఞేయంగానూ అనాత్మ భూతంగానూ భాసించటంలో ఆశ్చర్యంలేదు. అలా కాక లబ్ధ గుర్వాత్మ ప్రసాదులై బాహ్యాకార నివృత్త బుద్ధులైన మహాత్ములకైతే - నాతః పరమ్ సుఖం-సుప్రసిద్ధం - సువిజ్ఞేయ మస్తి - అని ముక్త కంఠంతో సాధక లోకానికి చాటుతారాయన.

అంచేత మనబోటి అల్పజీవులకూ మందభాగ్యులకూ ఈ కలికాలంలో అంత పెద్ద నిక్షేప మబ్బుతుందా లేదా అని సంకోచించనే అక్కరలేదు. నిక్షేపంగా అబ్బుతుంది. ఆత్మచైతన్య మొకరిలో ఎక్కువా ఒకరిలో తక్కువా అనే తేడా లేదు. పిపీలిక నుంచి బ్రహ్మదాకా ప్రాణులందరిలో సమానంగా పరచుకొని ఉందది. అయితే అది అలా ఉన్నట్టు గుర్తించి అంతకంతకు సాధనచేసి అందులో సిద్ధులయి కూచున్నారు - ఇంద్రాది దేవతలూ-వామదేవాది మహర్షులూ అందుకే వృత్రవధాదులైన అకార్యాలెన్ని చేసినా "తస్యమే తత్రలోమచ నమీయతే" నా వెంట్రుక కూడా పోలేదని ధీమాగా చెప్పగలిగాడు దేవేంద్రుడు. అలాగే **"తద్దైత త్పశ్య న్నృషి ర్వామ దేవః ప్రతి పేదే హం మను రభవం సూర్యశ్చ"** వామదేవుడనే ఋషి తల్లి గర్భంలో పిండరూపంగా ఉండగానే నేను మనువునయ్యాను - సూర్యుడనయ్యా - నీ సమస్తమూ నేనే అయి కూచున్నానని కేక పెడతాడు. **"అహమేవ పరం బ్రహ్మ"** అనే అద్వైత మూల మహామంత్రార్థం ఒంటబట్టకపోతే అలా అనే ధైర్యం వారికెలా వస్తుందని ప్రశ్నిస్తారు భాష్యకారులు. **"వర్తమానాశ్చ బ్రహ్మవిదః"** ఇప్పుడీ రోజుల్లో కూడా ఉన్నారలాంటి బ్రహ్మవేత్త లెందరో నని మనకు పూచికత్తిస్తారు. కాబట్టి పదార్థమున్నప్పుడు అది మనదే అయినప్పుడు మన అనుభవానికి రాక పోదు. ఎటు వచ్చీ దాన్ని మరలా మన సొంతం చేసుకోటానికి కృషి చేయటమొక్కటే మన బాధ్యత. **"అనేక జన్మ సంసిద్ధ-స్తతోయాతి పరామ్ గతిమ్"** చేస్తూ పోతే ఒక్కొక్క జన్మకు కొంచెం కొంచెం జ్ఞానధనాన్ని పోగు చేసుకొని అది పరిపూర్ణమయ్యే సరికి **"బహూనామ్ జన్మనా**

**మంతే"** కడపటి జన్మలో సర్వమూ మన స్వరూపమే ననే అద్వైతాత్మానుభవం తప్పకుండా సాధించగలం. ఇంతకూ **"కృషితో నాస్తి దుర్భిక్ష"**మనే మాట ఖాయం.

## అధికారతారతమ్యం

అయితే ఇక్కడ ఒక రహస్యం మాత్రం మనం గుర్తుంచుకోవలసి ఉంది. కృషి చేయమన్నారు గదా అని ప్రతి ఒక్కరూ జీవితంలో ముందు చెప్పిన కర్మయోగమూ – సమాధి యోగమూ –శ్రవణాదులూ అన్ని సాధనలు చేస్తూ పోవాలని భావించరాదు. అందరూ అన్నీ ఆచరించి తీరాలనే నిర్బంధం లేదు. అధికారభేదమనేది ఎప్పుడూ ఉంటుంది. పైగా ఈ జన్మతోనే ఆరంభం కాలేదు మన యాత్ర. ఇంతకు పూర్వమెన్ని ఎత్తామో ఇక మీదట ఎన్ని ఎత్తబోతామో. కొందరి కిది మధ్యమైతే – మరికొందరు మహనీయుల కిది అంత్యమైనా కావచ్చు. అంచేత వారి వారి యోగ్యతకు తగినట్టు వారు తమ సాధన సాగించవలసి ఉంటుంది. మరీ మందకొడికైతే కర్మానుష్ఠానమే. కొంత ఆలోచనా పరుడికి కర్మయోగం. బాగా జిజ్ఞాస ఉంటే శ్రవణం. ఇంకా ఉంటే మననం. అదీ దాటి పరిణతి చెందినవాడికైతే నిదిధ్యాసనమే. దానిని మించి ఇక చేయవలసిన అభ్యాసమే లేదు జీవితంలో. ఈ విషయాన్నే భంగ్యంతరంగా బయటపెడతా రొకచోట శంకరులు. **"యే యథామామ్ ప్రపద్యంతే"** అనే శ్లోకాన్ని వ్యాఖ్యానిస్తూ ఫలాపేక్ష లేని ముముక్షువులైతే వారికి భగవానుడు జ్ఞానం ప్రసాదిస్తాడనీ, జ్ఞానులైన వారికి మోక్షమే ప్రసాదిస్తాడనీ, మరి కేవల మార్తులై సేవించే వారి కార్తిహరణం మాత్రమే చేస్తాడనీ ఇలా మన యోగత్యను బట్టి ప్రయత్నమూ – ప్రయత్నాన్ని బట్టి ఫలితమూ ఉంటుందని చాటుతారు.

## హితోపదేశం

కాబట్టి పిడుగుకూ బియ్యానికీ ఒకటే మంత్రమని కూచోరాదు. ప్రతి ఒక్కసాధకుడూ వేదోక్తమయిన కర్మనే నిత్యమూ ఆచరించాలని లేకుంటే భ్రష్టుడేనని తిట్టిపోయరాదు. ఏమో మామూలు కర్మానుష్ఠానం కాకుండా కర్మయోగం చేస్తున్నాడేమో వాడు మనకేమి తెలుసు. అలాగే కొందరు శమాదుల కోసమే యత్నిస్తూ ఉండవచ్చు. మరికొందరివి ఏవీగాక శ్రవణాదులతోనే కాలం గడుపుతుండవచ్చు.

అలాంటి వాణ్ణి చూచి - చూడు - చూడు -వాడు జపహోమాదులూ సంధ్యావందన దేవతార్చనాదులూ - అన్నీ మానివేసి కర్మ బాహ్యుడై పోయాడని ఆక్షేపించరాదు. అంతకన్నా పై భూమికలో ఉన్నాడని ఇంకా సంతోషించాలి మనం.

బాగా జ్ఞానం ముదిరి సన్న్యసించిన తరువాతనే కర్మలు మానేయాలి గాని అంతకుముందు గానే మానుకోటం మహాపాపమంటారు కొందరు. అది కూడా అర్థం లేనిమాటే. కర్మానుష్ఠానం చేస్తేనే గొప్ప అనుకోరాదు. కర్మయోగమంతకన్నా గొప్పది. మరి అంతకన్నా గొప్ప శ్రవణాదులు. వేదాంత శ్రవణం చేస్తున్నాడంటే అంతకన్నా పవిత్రమయిన కర్మానుష్ఠానమేముంది. అసలనుష్ఠానమూ అననుష్ఠానమూ గాదు. దేనికైనా చిత్తశుద్ధీ - పారమార్థిక బుద్ధీ ఉండాలి. అవి రెండే ముఖ్యం. అవి ఉన్నవాడు బాహ్యంగా కర్మ చేయనంత మాత్రాన ప్రమాదమేముంది. లేనివాడు లాంఛనార్థంగా చేసి మాత్రం ప్రయోజనమేముంది. అలాంటివాడిని విమూఢాత్మా - మిథ్యాచారః అని గీతాచార్యుడే చీవాట్లు పెట్టాడు. దానికి భిన్నంగా **"యస్త్వింద్రియాణి మనసా నియమ్యారభతేర్జున"** అని కర్మయోగిని ప్రశంసించాడు. అంతకన్నా పరిణతి చెందితే **"యస్త్వాత్మ రతి రేవస్యాత్-తస్య కార్యం న విద్యతే"** అని జ్ఞాని కేకర్మా అక్కరలేదని అభయమిచ్చాడు. జ్ఞానికే కాదు. జ్ఞానం కోసం ప్రయత్నించే జిజ్ఞాసువుకు కూడా అలాంటి నిర్బంధం లేదంటాడు. 'ధ్యానయోగపరో నిత్యం" అని ఒక వాక్యం. ధ్యానమంటే ఆత్మ స్వరూపచింతనం. యోగమంటే దానిలో ఏకాగ్రత. ఇవి రెండేనటకర్తవ్యం నిజమైన జిజ్ఞాసువుకు. మధ్యే మధ్యే పానీయమన్నట్టు మిగతా కర్మలు కూడా చేయవచ్చునేమోనని శంకించకుండా నిత్యమనే మాట ప్రయోగించబడిందంటారు భాష్యకారులు. **"నిత్య గ్రహణం మంత్ర జపాద్యన్య కర్తవ్యాభావ ప్రదర్శనార్థం"** నిత్యమనటం వల్ల మంత్ర జపాద్యనుష్ఠానాదులిక ఏవీ చేయనక్కరలేదని చెప్పటానికట.

చూడండి. శాస్త్రార్థమింత స్పష్టంగా ఉన్నా ఇంకా మనం పిచ్చిలో పడుతున్నామంటే దానికి నిష్కృతి లేదు. కర్మ భ్రష్టులని వారిని వీరు నిందించనక్కర లేదు. కర్మభ్రష్టు లెవరంటే అటు బ్రహ్మ జిజ్ఞాసా లేక-ఇటు విహిత కర్మలూ మాని కేవలమూ ప్రాపంచికంగా బ్రతుకు సాగించే వ్యక్తులు. అలాంటి వారి నుద్దేశించి

భాగవానుడే అన్నాడు **"న కర్మణా మనారంభా న్నైష్కర్మ్యం పురుషో శ్నుతే-నచ సన్న్యసనా దేవ సిద్ధిం సమధిగచ్ఛతి"** అని వారితో వీరిని పోలిస్తే ఎలాగ. ఆ మాటకు వస్తే అసలైన కర్మభ్రష్టులీ కర్మానుష్ఠాతలే. ఎందుకంటే వేదాంత మార్గంలో ఉన్నామని చెబుతూ వీరు కర్మలాచరిస్తున్నారు. కర్మాచరణకూ వేదాంత విచారానికీ సంబంధమే లేదు. అది దీని కుపాయమే గాదు. దాని కుపాయమొక శ్రవణాదులే. ఇంకా కావలసి వస్తే కర్మయోగ మభ్యసించవచ్చు. అంతేగాని కర్మానుష్ఠానమేమిటి. అలా చేస్తే అనగూడదు గాని ఆత్మవంచన క్రిందికి వస్తుంది. ఎందుకంటే మేమూ వేదాంతులమే ననిపించుకోవాలని ఒక ఆశ వీరికి. కానీ దానికి తగిన సంసిద్ధతా చిత్త పరిపాకమూ లేదు వాస్తవంలో. మీదు మిక్కిలి దానికి ప్రతికూలమైన కర్మాచరణతోనే కాలం గడుపుతున్నారు. ఇంతకన్నా వేరే ఆత్మవంచన ఏమున్నది. అంతేగాక నిజాయితీగా ఆత్మవిచారణ చేస్తున్న వారిని అసూయాగ్రస్తులై దూషిస్తున్నారు. అసలు పైనవడ్డీ అన్నట్టు ఇది ఆ ఆత్మ ప్రతారణకు చేరే మహాపాపం.

అలాగే కేవల కర్మ పరాయణులను తప్పు పట్టటం కూడా ఒక మహాపరాధమే. గ్రుడ్డికన్నా మెల్ల మేలన్నారు. జ్ఞానం కోసమని కాకపోయినా స్వధర్మమనే దృష్టితోనైనా చేస్తున్నారు కర్మ. పాపకర్మలు చేయటం కన్నా బేహోదాగా బ్రతకటం కన్నా - సత్కర్మాచరణ మనేది మంచిదే గదా. దానివల్ల ఒక తృప్తీ - ఒక ఆస్తిక్య బుద్ధీ - ఇలాంటి మంచి గుణాలలవడుతాయి. క్రమంగా అదే కొంత కాలానికి కర్మయోగంగా మారి ఆ తరువాత శ్రవణాదులకు ప్రోత్సహిస్తాయి మానవుణ్ణి. పైగా ఆడంబరంగా మాటలు చెప్పి ఏ విచారణ చేయకుండా చేసినట్టు నటించే దానికంటే ఏదో పెద్దలు చెప్పారు. మన పూర్వులంతా ఈ మార్గంలో నడిచారు - మనమూ ఆ దారిలో నడవటమే మంచిదనే గౌరవ బుద్ధితో సదాచారాన్ని పాటించటంలో పొరబాటు లేదు. కనీసం పశుప్రాయంగా బ్రతికే అర్బుద న్యర్బుదాలైన పామర జనులకంటే మానవ ధర్మంతోనైనా జీవయాత్ర సాగిస్తున్నా మనిపించుకోగలరు. సన్మార్గంలో ప్రవేశముంటే చాలు. ఎప్పటికైనా అది పరమార్థాన్ని చేరటాని కేదోవిధంగా సహకరిస్తుంది. అసలు శాస్త్రహృదయం కూడా అదేనంటారు స్వామివారు. **"సన్మార్గస్థా స్తావద్భవంతు - శనైర్బోధయిష్యామి"** అని ఆలోచిస్తుంటుందట శాస్త్రం.

# పరస్పరావగాహన

కాబట్టి ఇంతకూ చెప్పవచ్చిందేమంటే – ఎవరికెన్ని జన్మలు గడిచాయో మనం చొచ్చి చూచింది గాదు. ఈ జన్మలోనే మనం నలుగురినీ చూస్తున్నాము. వారి వారి నడవడిని బట్టే వారి అంతర్గతమైన సంస్కారాన్ని మన మూహించుకోవలసి ఉంటుంది. అందులో ఉత్తమాధికారులుండవచ్చు. మధ్యములుండవచ్చు. మందులూ అతిమందులూ కూడా ఉండవచ్చు. వారి దృక్పథాలూ – బాహ్యప్రవృత్తులూ వారి అంతస్తులకు తగినట్టుగానే వ్యవస్థితమై ఉంటాయి. ఎవడైనా తీర్థాట నాదులు – పూజా పురస్కారాదులూ – చేయటానికంత సుముఖత చూపకపోతే వాడా అంతస్తు దాటిన కర్మయోగి అయి ఉండచ్చు. అది కూడా మాని ఎప్పుడూ వేదాంత గ్రంథపఠనమూ, చింతనమూ, పదిమందితో గోష్ఠి జరుపుతూ ఉంటే అంతకన్నా పయిమెట్టు వాడయి ఉండవచ్చు. అలాంటి వ్యాసంగం కూడా పట్టుకోటమిష్టం లేక నిరంతర విచారణ శీలుడయి చాలా మితభాషిగా మితచారిగా ఎవడైనా కనిపిస్తే వాడింకా ముదిరి పాకాన బడ్డ సాధకుడనుకోవాలి. అసలీ ప్రపంచాన్నే సన్న్యసించి పోయినవాడైతే ఇక చెప్పలేము. అయితే ఇక్కడ ఒక తిరకాసున్నది. సన్న్యసించిన వాళ్ళంతా మహాత్ములనుకోరాదు. కొందరు వివిదిషులైతే కొందరు విద్వాంసులు. ఇందులో మొదటివారి దాశ్రమ సన్న్యాసం. **"సన్న్యస్య శ్రవణం కుర్యా"**త్తనే న్యాయాన్ని బట్టి వీరు శ్రవణాదుల నభ్యసించటానికి వీలుగా ఉంటుందని గార్హస్థ్యాన్ని విడిచి వెళ్ళినవారు. వీరే వివిదిషా సన్న్యాసులు. మరి విద్వత్సన్న్యాసులు శ్రవణ మననాలు రెండూ సమాప్తమైన తరువాత జ్ఞానులై ఆ జ్ఞానంలోనే సదా నిలిచి ఉండే సన్న్యాసులు. పరమహంసలన్నా వీరే. నిరంతర జ్ఞాననిష్ఠ తప్ప వీరికిక ఏ కార్యమూ లేదు. కాషాయ దండకమండలాది బాహ్యచిహ్నాలు కూడా వీరి కక్కరలేదన్నారు పరమహంస పరివ్రాజక సార్వభౌములు భగవత్పాదులు.

ఇన్ని అంతస్తులున్నాయి కాబట్టి ఈ మార్గంలో – ఎవరిందులో ఏ స్థాయిలో ఉన్నారో గుర్తించకుండా పయివాడు కర్మభ్రష్టుడని క్రింది వాడూ క్రిందివాడు వట్టి కర్మ జడుడని పయివాడు–ఒకరినొకరు తప్పు పట్టరాదు. ఒక విషయం తెలుసుకొంటే ఎవరెవరినీ తూలనాడే ప్రసక్తి ఉండదు. అదేమిటంటే మనకున్న శక్తి సామర్థ్యాలను

బట్టి ఒకవేళ మన మీ కర్మానుష్ఠానంతో కాలం గడుపుతున్నా ఇది కేవలమొక మజిలీయేగాని గమ్యంగాదనే దృష్టి ఉండాలి కర్మిష్ఠులకు. అప్పుడు వాడు పయివాణ్ణి తప్పు పట్టడు. మీదు మిక్కిలి తానూ కృషిచే పైస్థాయి కెదగాలని ఆసిస్తాడు. అలాగేతాను బ్రహ్మ విచారణ చేస్తూ కర్మానుష్ఠానం వైపు మొగ్గు చూపకపోతే పోవచ్చు గాని అది కేవలం మూఢాచారమనీ దానిని మానుకోవటమే గొప్ప గుణమనీ భావించరాదు జ్ఞానసాధకుడు. తన కక్కరలేకపోయినా దాని అక్కర ఉన్న వాళ్ళెందరో ఉంటారు లోకంలో. కాదని కొట్టివేయటం దేనికి. ఇలా సానుభూతిగా అర్థం చేసుకోగలిగితే అహంకార విక్షేపాది దోషాలు నశించి జ్ఞానీ నిర్మలుడవుతాడు.

వీరి సంబంధమొక విధంగా విద్యార్థులకూ ఉపాధ్యాయులకూ ఉన్న సంబంధం లాంటిది. ఎప్పుడూ – విద్యార్థి విద్యార్థిగానే ఉండిపోరాదు. ఉపాధ్యాయుడి కోవనందు కోవాలని కోరుకోవాలి. దానికి తగిన కృషి చేయాలి. అంతేగాని ఉపాధ్యాయుడే క్రిందికి దిగి తనస్థానానికి రావాలని కోరరాదు. అలాగే ఉపాధ్యాయుడుకూడా తానుపై కెదిగాను గదా అని విద్యార్థి దశను ఈసడించరాదు. తానూ ఒకప్పుడు విద్యార్థినే గదా అనే విషయం మరచిపోరాదు. ఒకవేళ తాను మరలా వారితో కలిసి కూచోకపోయినా వారి లోటుపాటులను సహిస్తూ ఎప్పటికైనా తన స్థాయికి వారిని లాగుకొనే ప్రయత్నం చేయాలి. అప్పుడే పరస్పరమూ ఉపకార్యోప కారకరూపమైన సంబంధం పెరుగుతూ పోతుంది. ఇలాంటి సత్సంబంధమే కర్మిష్ఠులూ జ్ఞానులకూ ఇరువురికీ అపేక్షణీయం. అప్పుడిద్దరూ రెండుదారులు గాక కొంచెమిటూ అటూగా ఒకే మార్గంలో ఉన్నవాళ్ళవుతారు.

మొత్తంమీద సన్మార్గంలో అడుగుపెట్టి నప్పటి నుంచీ తదేక నిష్ఠతో జీవితం గడిపేదాకా అంతా సాధనే. సాధన మార్గంలో ఏ మానవుడేస్థాయిలో ఎంతెంత ప్రయత్నిస్తే అంతంత ప్రారబ్ధకర్మ ప్రక్క వంచుతుంది. అది సడలే కొద్దీ అభ్యాసం పెరుగుతూ పోతుంది. ఇలా కిందా మీదా పడుతూ పోతే క్రమంగా కర్మ పిశాచాన్ని ప్రయత్న కరవాలంతో తునాతునకలు చేసి మానవుడు సాహస విక్రమార్కుడి లాగా ముందుకు సాగిపోనూ గలడు. ఎప్పటికో ఒకప్పటికి తన అభీష్టఫలాన్ని అందుకోనూ గలడు. భయం లేదు.

# గుర్వపేక్ష

అయితే ఒక ప్రశ్న. ఈ సాధన మార్గంలో మనకు గురువనే వాడి అవసరముందా లేదా అని. ఆచార్యుల వారి మతంలో అవసరమేనని తోస్తుంది. శాస్త్రమూ ఆచార్యుడూ–ఇరువురూ అవసరమేనని ఎన్నో చోట్ల హెచ్చరిక చేస్తాడాయన. **"శాస్త్రాచార్యోప దేశ శమదమాది సంస్కృతమ్ మనః ఆత్మ దర్శనే కరణమ్"** ఆత్మను దర్శించాలంటే వీటన్నింటి సహకారమూ ఉండాలట మానవుడి మనసుకు. **"గురూప దిష్ట కలా ప్రలయ మార్గః"** ప్రాణాదికళల నన్నింటినీ ప్రవిలయం చేసి నిష్కలమైన స్థితినందుకోవాలంటే ఆ మార్గాన్ని గురూపదేశం వల్లనే తెలుసుకోవాలంటాడాయన ప్రశ్నోపనిషద్భాష్యంలో. ఎంత శాస్త్ర జ్ఞానమున్నా గురుముఖంగా అభ్యసిస్తేనే అది అనుభవానికి వచ్చేదని ముండక భాష్యంలో స్పష్టంగా చాటుతారు. **"ఆచార్యవాన్ పురుషోవేద"** అని అసలు వేదమే ఘోషిస్తున్నది గురువనే వాడుండి తీరాలని. అందులో సబబేమంటే మనమిప్పుడు కూడా చూడవచ్చు. వైద్యశాస్త్రమొకటి ఉన్నా వైద్యుడనే వాడి సహాయం లేకపోతే మనకది పని చేయదు. న్యాయశాస్త్రమున్నా దాని విషయం తెలిసిన న్యాయవాది ఉంటేనే మనం నెగ్గుతాము. ప్రతి విద్యలో కొన్ని సూక్ష్మాలుంటాయి. అవి ఎవరి పాటికి వారు గ్రహించేవి కావు. **"ఉభయోరపి దృష్టోంత స్త్వనయోస్తత్త్వ దర్శిభిః"** అన్నట్లు దాని అంతు చూచిన తత్త్వదర్శి తోడ్పాటు కావలసి ఉంటుంది. మామూలు విద్యలలోనే ఇలాంటి పరిస్థితి అయినప్పుడిక బ్రహ్మవిద్య సంగతి చెప్పేదేముంది. ఎంతైనా అవసరమక్కడ గురుసహాయం.

అయితే గురువనగానే కరచరణాద్యవయవాలతో ఉన్న ఒకానొక పురుషుడే కానక్కరలేదు. వాడు జ్ఞాన విజ్ఞాన సంపన్నుడైతే సరిపోయేగాని లేకపోతే ఎవడో ఒక గురువుండాలి గదా అని బుట్టబొమ్మలాంటి వాడి నొకడినిపెట్టుకొంటే సుఖమేముంది. అలాంటి గురువులంతా మన పాలిటికి బరువులు. **"స్వయమ్ మూఢః పరాంశ్చవ్యామోహయతి"** అని భగవత్పాదులు చెప్పినట్టు తాము మూఢులై ఇతరులను కూడా మూఢులను చేస్తారు. పరీక్షిత్తుకు శుకుడిలాగా – జనకుడికి యాజ్ఞవల్క్యుడిలాగా యాదృచ్ఛికంగా ఎవడైనా మహనీయుడు దొరికితే మంచిదే. లేకుంటే కొంచెం తెలివితేటలు కలవాడు శాస్త్రాన్నే నమ్ముకోవటం మేలు. అది కూడా సమ్యక్ప్రమాణం కావాలన్నారు భగవత్పాదులు. ఆ మాటకు వస్తే ఒక వ్యక్తే

కాదు – గ్రంథమే కాదు. వారి వారి సంస్కారాన్ని బట్టి పాత్రతను బట్టి గురుస్థానంలో ఏది ఉన్నా ఉండవచ్చు. ఏదేది ఆత్మ ప్రబోధమందిస్తే అదంతా మన పాలిటికి గురువే. బృహదారణ్యకంలో ఒక కథ ఉన్నది. సృష్ట్యాదిలో బ్రహ్మదేవుడు జన్మించి అటూ ఇటూ చూచాడట. చూస్తే తాను దప్ప కంటికి మరెవరూ కనిపించలేదు. కనిపించకపోయే సరికి కొంచెం భయపడి మరలా తేరుకొని **"యన్మ దన్యన్నాస్తి కస్మాన్ను బిభేమి"** నాకన్నా ఇతరమైన వస్తువు లేదు గదా నేనెందుకు భయపడాలను కొన్నాడట. **"తత ఏవాస్య భయమ్ వీయాయ"** – ఆ ఏకత్వ దర్శనంతోనే అతని భయం పోయిందట. దీనిమీద వ్యాఖ్యానిస్తూ భగవత్పాదులు ప్రజాపతికా ఏకత్వ దర్శనమెలా అబ్బింది ఎవడు బోధించాడు – ఏ గురువూ లేదు గదా అప్పుడు – గురువు లేకుండానే విద్య అలవడేట్టయితే మనకు మాత్రమెందు కలవడదని ప్రశ్నల వర్షం కురిపిస్తారు. దీనికి మరలా కావలసి వస్తే – మరొకరి కక్కరలేకుండానే బోధ కలుగుతుందని సమర్థిస్తారు. అయితే శ్రద్ధాది సామగ్రీ శ్రవణాది సామాగ్రి ఇవి రెండూ ఎవరికైనా సరే జ్ఞానమందివ్వటంలో ఐకాంతిక సాధనా Invariably Effective means లంటారాయన. అవి పూర్వ జన్మలలోనే చాలావరకూ ఒనగూడి ఉంటే ప్రకృత జన్మలో గుర్వపేక్ష లేకుండానే సాగుతుంది విచారణ. లేని పక్షంలో తప్పకుండా కావలసి వస్తుంది. ఇదీ వినిగమక Deciding factor మిందులో

కాబట్టి గురువుండాలి గదా అని బలవంతంగా ఒక బాధ గురువు పాలబడకుండా సమ్యక్ప్రమాణాలను శ్రవణం చేస్తూ – దానికి స్తోమత లేకపోతే శమదమాదుల నవలంబిస్తూ–అది కాకుంటే ఈశ్వరార్పణ బుద్ధితో కర్మలాచరిస్తూ తద్ద్వారా కాయేంద్రియాది శుద్ధి కలిగితే – దాని మూలంగా వివేచనా శక్తి పెరుగుతూ పోతే–దాని బలంతో ప్రారబ్ధకర్మ ప్రభావం తరుగుతూ వస్తే అంతకంతకు శ్రవణమనన నిది ధ్యాసనలలో ఉత్తీర్ణుడయి సాధకుడు నిరంతర బ్రహ్మచింతనలో ఉండగలడు. తచ్చింతనమే తదనుభవం కాబట్టి అనుభవం కలగలేదే అనే ప్రశ్నే ఉండదప్పుడు ఒకవేళ మేము జ్ఞానమే అనుభవమని చెప్పినా అది కేవల శబ్దార్థజ్ఞానం కాదు. తదర్థస్మృతి ఏర్పడాలి మనస్సుకు. ఈ స్మృతి బలంతో నిత్యమూ ఈ అనాత్మ జగత్తును తదాకారంగా దర్శిస్తూ రావాలి. ఇది పైకి కనిపించినంత సులభం కాదు. దానిని పట్టుకోటానికెంతో మెళకువ కావాలి. ఇదే మనం చేయవలసిన ప్రయత్నమంతా అంతకు మించి మరేమీలేదు. అలా చేస్తూ పోతే ప్రారబ్ధం పాటికి

ప్రారబ్ధమున్నా దీనిపాటికిది ఫలితమిస్తుంది. అది ఈ జీవితంలోనే ఫలిస్తుందా మరి ఒక జన్మ పడుతుందా అనేది మన సాధన వీర్య విశేషాన్నీ ప్రారబ్ధకర్మ భారాన్నీ బట్టి ఉంటుందంటారు భగవత్పాదులు. అయితే ఇలాగని మరలా నీరుగారిపోకుండా అభ్యాస వైరాగ్యాలతో మనగమ్యాన్ని మనం చేరే ప్రయత్నంలో మనముంటే ఆ తరువాత అదే మార్గంలో అన్ని విఘ్నాలనూ పారదోలి నిర్విఘ్నంగా తోడుకొనిపోయి ఎప్పటికైనా తప్పకుండా మన జీవిత గమ్యమైన బ్రహ్మాత్మానుభావాన్ని మనకు ప్రసాదిస్తుందని ఆయన మనందరికీ ఇచ్చిన అభయ హస్తం.

## ముఖ్యాంశం

ఇంతవరకూ సాగిన విచారణద్వారా మనం తేల్చుకొన్న ముఖ్య విషయమేమిటని అడగవచ్చు. బ్రహ్మభావమైన మోక్షం మానవులందరికీ స్వభావ సిద్ధమే. స్వాభావికమైన దాన్ని మన అవిద్యాదోషం వల్ల విస్మరించాము. విస్మరించి కూడా ఎన్నో జన్మలయింది. మరలా దాన్ని మనమిప్పుడనుభవానికి తెచ్చుకోవాలంటే శాస్త్రం మనకు విద్యోపదేశం చేస్తున్నది. దానివల్ల బ్రహ్మాకారవృత్తి ఉదయిస్తే అది అవిద్యను నిర్మూలించి వెంటనే మనకు బ్రహ్మానుభవం ప్రసాదించాలి. కాని ప్రాక్తనమైన కర్మవాసనలు ప్రారబ్ధ రూపంగా దానికడ్డు తగులుతుంటాయి. అలాంటి ప్రతిబంధమున్నంత దనుకా అది మనకు వెంటనే పని చేయదు. కనుక దాన్ని నివారించుకొనే ప్రయత్నం చయాలి మానవుడు. అదివారి అధికారభేదాన్ని బట్టి ఒకరికి శమాదులైతే వేరొకరికి శ్రవణాదులు. అందులో మొదటిది రెండవదానికి దారి తీస్తే అవి అంతకంతకు వృద్ధి పొంది కర్మ ప్రాబల్యాన్ని తగ్గిస్తూ పోతే పురుష ప్రయత్నం ఫలించి సాధకుడికి క్రమంగా బ్రహ్మజ్ఞానమూ-అనుభవమూ అవశ్యంగా సిద్ధిస్తాయి. ఆ మార్గంలో గుర్వపేక్ష అందరికీ ఉండి తీరాలనే ప్రమేయం కూడా లేదు. ఏదేది ఆ అనుభవానికి తోడ్పడితే అదే గురువు సాధకుడికి. మరి ఆ అనుభవ మీ జన్మలోనే లభించినా లభించవచ్చు. లేదా మరికొన్ని జన్మలైనా పట్టవచ్చు. దాన్ని గురించి చింత పెట్టుకొని ప్రయత్న లోపం చేయరాదు. అనన్యాశ్చింతయంతోమా మన్నట్టు తదేక దృష్టితో ప్రయాణం సాగిస్తే చేరేనాటికి గమ్యం చేరుతాము. చేరుతామో లేదో నని సందేహిస్తుంటే ఎక్కడి వాళ్ళమక్కడే ఉండిపోతాము. అంచేత దీక్షతో ముందుకు సాగిపోవటమే ముఖ్యమైన విషయం.

# 6. జీవన్ముక్తి-విదేహముక్తి

అయిదవ అధ్యాయంలో శమదమాదులవల్ల శ్రవణాదులలో ప్రవృత్తి కలుగుతుందనీ అవి పరిపాకానికి వచ్చేసరికి ఆత్మానుభవము- లేక బ్రహ్మానుభవ మనేది తప్పకుండా సిద్ధిస్తుందనీ-సవిస్తరంగా ప్రతిపాదించాము. దీనితో వేదాంతంలో సాధన అనేది సమాప్తమయిందనే భావించవచ్చు. పోతే ఈ సాధన అంతా సక్రమంగా చేసి బ్రహ్మతత్త్వాన్ని అనుభవానికి తెచ్చుకొన్న తరువాత మానవుడికి కలిగే ప్రయోజనమేమిటని ఇప్పుడు ప్రశ్న. ఎందుకంటే ఇంతకుముందే ప్రస్తావన చేసి ఉన్నామొకచోట **"ప్రయోజన మనుద్దిశ్య-నమందోపి ప్రవర్తతే"** ఏదో ఒక ఫలితం మీద దృష్టి లేకుండా లోకంలో ఎలాంటి మూఢుడు కూడా ఒక పనికి పూనుకోడు. అలాంటప్పుడింత పెద్ద సాధన చేయటానికి మనం పూనుకొన్నామంటే దీనికంతటికీ ఎంతో గొప్ప ఫలితం మనకు కలిగి తీరాలి. కాబట్టి ఏమిటా మహాఫలమని ప్రశ్న రావటం సబబే.

## ముక్తి

మహాఫలమని మీరు చెబుతున్నారు. మరేముంటుంది అంతటి మహాఫలం. అది ముక్తి లేదా మోక్షమేనన్నారు శంకర భగవత్పాదులు. మానవుడు దేనికోసమసలు సాధన కుపక్రమిస్తాడో-అదే ప్రయోజనమనే మాటకర్థం. మరి దేనికోస మీ సాధన అంతా. ఎల్లప్పుడూ మనకు కలిగే ఈ సంసార బాధల నుంచి తప్పించుకొని బయటపడటానికే గదా. ఆ బయట పడటానికే ముక్తి అని పేరు. ముక్తి అన్నా, మోక్షమన్నా ఒక్కటే. విడుదల Emancipation అని అక్షరార్థం. విడుదల దేనినుంచి అనాత్మ రూపమైన ఈ సంసారం నుంచే గదా. కాబట్టి సంసారతాపత్రయం పూర్తిగా తొలగిపోతే చాలు. అదే ముక్తి. అందుకోసమే మనమింతవరకూ చేస్తూ వచ్చిన సాధన అంతా. అంచేత అదే చివరకు మానవుడు సాధించవలసిన ఏకైక ప్రయోజనం.

అయితే ఒక ప్రశ్న. సంసార బాధలనుంచి తొలగటమే ముక్తి అని పేర్కొన్నారు. అలా తొలగటం మాత్రమే ముక్తి ఎలా అవుతుంది. ప్రయోజనం లేదా ఫలమనేది

ఒక భావరూపమైన పదార్థం Positive Entity. సాధన చేసి మనం దాన్ని అందుకోగలిగినప్పుడే అది ముక్తి అవుతుంది. అంతేగాని ఊరక ఒక అనర్థం నుంచి తప్పించుకోటం మాత్రమేగాదు. అలా తప్పించుకోటం దుఃఖమనేది లేకపోవటం. దుఃఖం లేకపోవటమే సుఖమెలా అవుతుంది. దుర్వాసన లేకపోవటమే సువాసన అంటామా ? ఏవైనా పరిమళ ద్రవ్యాలు తెచ్చి వెలిగించినప్పుడే గదా దాన్ని సువాసన అంటాము. అలాగే సుఖమనేది కూడా ఒక ప్రత్యేకమైన భావం. కాబట్టి ముక్తి కూడా భావరూపమే కావాలని ఆశంక వస్తుంది.

దీనికి సమాధానమిస్తూ శంకరులేమన్నారంటే-ముక్తి అనేది కేవలం తప్పించు కోవటమే గాదు. మీరు చెప్పినట్టది ఒక స్వతంత్రమైన పదార్థం కూడా. సందేహం లేదు. కాని అది ఏదో ఒక పండులాగా మనం చేతులు సాచి అందుకొనేది మాత్రం కాదు. అంతేగాక ఎక్కడికో పోయి బావుకోవలసింది కూడా కాదు. ఎవరో మనకు ప్రసాదించవలసింది అంతకన్నా గాదు. ఇలాంటి అపోహలే వున్నాయి లోకంలో చాలామందికి. ఒక లౌకికులకే గాదు. ఆ మాటకు వస్తే శాస్త్రజ్ఞులమనుకొనే వారే నూటికి తొంబది తొమ్మిదిమంది అలా భ్రాంతి పడుతుంటారు. ముక్తికోస మిహంలో మనం తగినంత ప్రయత్నం చేస్తే తరువాత మరణానంతరమెక్కడికో ఒక లోకానికి పోతామనీ ఆ లోకానికి అధిదేవత ఎవరో ఆ ముక్తి ఫలాన్ని మనకు ప్రసాదిస్తుందనీ వీరంతా సిద్ధాంతాలు చేసి కూచున్నారు.

## ముక్తిలక్షణం

ఇవన్నీ దేశ కాలాది ద్వైత బుద్ధి ఇంకా వదలకుండా చేసే అపసిద్ధాంతాలంటారు శంకరులు. ముక్తి అనేది ఎక్కడికో పోయి అందుకోటానికది ఒకానొక దేశంలో ఉన్న పదార్థం కాదు. అలాగే మనం బయలుదేరి పోవటానికది ఒక కాలంలో చేసే ప్రయాణమూ గాదు. ఇంతకూ మనం మనం చుట్టూ ఉన్న ప్రపంచంలో నిత్యమూ చూచే ఇండ్లూ వాకిండ్లూ-పట్టణాలూ-పర్వతాల లాంటి ఒక మూర్తమైన పదార్థం కాదది పోయి పట్టుకోటానికి. దేశకాల వస్తువులకు దేనికీ సంబంధం లేని భావమది. ఒక ప్రదేశంలో ఉన్నదంటే ఇక్కడ లేదా అని ప్రశ్న వస్తుంది. ఒక కాలంలో పోయి అందుకోవాలంటే ఇప్పుడీ వర్తమానంలో లేదా అని అనుమానం వస్తుంది. అసలది

ఒక నామరూపాత్మకమైన వస్తువు కాదు మనమెక్కడో ఎప్పుడోనని భావించటానికి. వాస్తవంలో ముక్తి అనేది బ్రహ్మభావమే The state of being Brahman-the supreme reality మరి ఈ బ్రహ్మ భావమనేది జీవుడెక్కడి నుంచో క్రొత్తగా కొని తెచ్చుకొనేదికాదు. అతని స్వరూపమే అది. అవిద్యాదోషం మూలంగా అది బహుజన్మల నుంచీ మరుగుపడి పోయింది. అది ప్పుడు బ్రహ్మవిద్యాబలంతో మరలా బయటపడి మన అనుభవానికి వస్తున్నది. ఇంతకుముందొక మాట చెప్పాము. మనకు సహజంగా ఉన్న ఆరోగ్య దశ మధ్యలో కొన్ని రోగలక్షణాలు సంక్రమించటం మూలంగా దెబ్బతిని మరలా తగిన ఔషధసేవ చేయగానే అభివ్యక్తమవుతుందని. అలాంటి పరిస్థితే ఇదీనని భావించాలి మనం.

మరి అలాంటప్పుడిక లోకాంతరాలేమిటి-అక్కడికి మనం చేసే ప్రయాణమేమిటి అక్కడ మనకొకరు ముక్తిని ప్రసాదించటమేమిటి. అదంతా నిజమని ఒప్పుకొంటే మోక్షానికొక ఆది అనేది ఉందని ఒప్పుకొన్న వాళ్ళమవుతాము. అది ఒప్పుకొంటే దాని కంతం కూడా ఒప్పుకొని తీరవలసిందే. అప్పుడా మోక్షం మనకెలా కలిగిందో అలాగే తొలగిపోయే ప్రమాదముంది. ఇక మనకది కలిగి సుఖమేముంది. అది మొదలు చెడ్డ బేరమని హెచ్చరిస్తారు భగవత్పాదులు. కాబట్టి ఏదో చేయబోతే ఏదో అయినట్టు మోక్షమనే భావాన్ని ఎక్కడో పోయి పట్టుకొందామనుకోటం మరలా మనమద్వైత జగత్తునుంచి ద్వైతజగత్తుకు దిగిరావటమే. అప్పుడది మోక్షమెలా అవుతుంది. నూటికి నూరు పాళ్ళూ సంసారమే.

కాబట్టి మొట్టమొదట మనం ముక్తి మోక్షమనే మాట కర్థమేమిటో సహేతుకంగా విచారణచేసి చూడాలి. కేవలం కట్టుకథల మీద ఆధారపడి మాటాడరాదు. విచారించి చూస్తే ముక్తి అనేది ఒక అనుభవం. అయితే లోకంలో మనకు కలిగే తతిమా అనుభవాల లాంటిది గాదది. లౌకికమైన అనుభవాలేవైనా సరే అనుభవించే వ్యక్తి ఒకడూ-అనుభవానికి వచ్చే పదార్థ మొకటీ వేర్వేరుగా ఉంటాయి. పోతే ఇక్కడ అనుభవించే ఆత్మకు భిన్నంగా అసలు వేరొక పదార్థమనే ప్రశంసే లేదు. ఉన్నదంతా ఆత్మ స్వరూపమే. అంటే తనపాటికి తానే ఉన్నాననే భావం. అయితే ఇది అగ్ని తన్ను తాను కాల్చుకొంటుందని చెప్పినట్టు ఆత్మాశ్రయమనే దోషానికి గురి అవుతుంది గదా అని అడగవచ్చు. అగ్ని అచేతనమైన పదార్థం కాబట్టి కాల్చుకోటమనేది

అసంభవం. ఇది పరిపూర్ణ చైతన్యమైనపదార్థం. అసంభవమనే ప్రశ్నేలేదు. జ్ఞానమే దాని స్వరూప మన్నప్పుడనుభవం కూడా ఉండకతప్పదు. జ్ఞానమే గదా అనుభవమని పేర్కొన్నాము. అది జ్ఞేయమైన ప్రపంచాన్ని ఎలా తెలుసుకోగలదో ఆ ప్రపంచం లయమయినప్పుడు తన స్వరూపాన్ని కూడా అలాగే తెలుసుకోగలదు. అలా తెలుసుకోలేదంటే అది ప్రపంచం మీద ఆధారపడుతుందని చెప్పవలసి వస్తుంది. స్వతస్సిద్ధమైన తత్త్వమని గదా మొదటి నుంచీ ప్రతిపాదిస్తూ వచ్చాము. అలాంటప్పుడీ ప్రపంచం దానికుంటే నేమిటి లేకపోతే నేమి. దానిపాటికది ఉండి తీరుతుంది. ఉంటే అలా ఉన్నాననే అనుభవంకూడా దానికుండక తప్పదు.

ఇదుగో ఈ దృశమైన అనుభవానికే ముక్తి అని పేరు. ఇందులో ప్రపంచమనే అనర్థానికి చోటు లేదు కాబట్టి దుఃఖలేశం కూడా లేదు. సర్వమూ నేనేననే అనుభవం కాబట్టి అది ఎప్పుడూ సుఖమే. ఇలాంటి దుఃఖ నివృత్తీ-సుఖప్రాప్తీ సహజంగానే సిద్ధించే దశ అది. శరీరాద్యుపాధుల తోడి సంపర్కమనేది ఉండబోదు కాబట్టి అది నిరావరణం Revealed మన జ్ఞానానికి బాహ్యంగా ఎక్కడా లేదు కాబట్టి ఆత్మరూపం Subjective ఆత్మ రూపమే కాబట్టి నిత్య సిద్ధం Ever present. ఇంతకూ మనకున్న బ్రహ్మాత్మ భావమే The state of Identity with the Absolute ముక్తి అనే మాటకర్థం. "బ్రహ్మ భావశ్చ మోక్షః" అంటారు భాష్యకారులు. బ్రహ్మమూ-బ్రహ్మ జ్ఞానమూ-మోక్షమూ అనేవి వేర్వేరు మాటలు గావు. బ్రహ్మమే జ్ఞానం. జ్ఞానమే మోక్షం. ఇదీ మోక్షమంటే భగవత్పాదుల అభిప్రాయం.

## ముక్తిద్వైవిధ్యం

ఈ మోక్షమూ-లేదా-ముక్తి అనేది ఆచార్యులవారి దృష్టిలో మరలా రెండు విధాలు. ఒకటి జీవన్ముక్తి. మరొకటి విదేహముక్తి. ఇందులో జీవన్ముక్తి అనేది మానవుడీ శరీరంతో బ్రతికి ఉండగానే లభించేది. మరి విదేహమనేది ఈ శరీరం పోయిన తరువాత సంభవించేది. మిగతా మతాచార్యులెవరే గానీ విదేహముక్తి ఒక్కడే ఉందని భావిస్తారు. జీవన్ముక్తి నెవ్వరూ అంగీకరించరు. జీవన్ముక్తి కూడా ఉందని ప్రతిపాదించిన వారు శంకరుని లాంటి అద్వైతులొక్కరే. అద్వైత దర్శనంలో తప్ప మరెక్కడా లేదీ భావం. అయితే అద్వైతులు అంతా మనస్వరూపంగానే

అనుభవానికి వస్తుందని గదా నిరూపించారు. అలాంటప్పుడాఖరు సారిగా కలిగే మోక్షానుభవం కూడా ఏకరూపంగానే unique ఉండాలి గాని మరలా అందులో ఇన్ని భేదాలేమిటటి అని ప్రశ్న వస్తుంది.

వాస్తవమే. అద్వైత మన్నప్పుడిక రెండు మూడనే భేద ప్రసక్తి ఉండటానికి లేదు. కాని ఈ భేదం మేము ముక్తి స్వరూపాన్ని బట్టి చెప్పటం లేదు. అది సంభవించే కాలాన్ని బట్టి చెప్పిన మాట. సాధారణంగా చచ్చిన తరువాతనే మోక్షమని లోకంలో నలుగురూ అనుకొనే వ్యవహారం. అలాకాదు. అది మానవుడు బ్రతికి ఉన్నప్పుడు కూడా కలగవచ్చు సుమా. అందులో ఏ మాత్రమూ అభ్యంతరం లేదని చెబుతారు భగవత్పాదులు. ముక్తి లభించటానికి కావలసిన సామగ్రి మనకు సమకూరవలెనే గాని అది ఎప్పుడు ఫలించినా ఫలించవచ్చు. చచ్చిన తరువాతనే ఫలించాలనే నియమమేమున్నది. సామగ్రి అనేది ఉంటే చచ్చిన తరువాతా కావచ్చు. బ్రతికి ఉన్న సమయంలోనూ కావచ్చు. ఎప్పుడైన గూడినా అది ముక్తే. అందులో బ్రతికినప్పుడే అయితే అది జీవన్ముక్తి అన్నారు. చచ్చిన తరువాత అయితే విదేహముక్తి అన్నారు. కాబట్టి జీవన్ముక్తిని ఒప్పుకోటంలో తప్పులేదు.

## జీవన్ముక్తి

అయితే ముక్తి అంటే శరీరాది సంబంధమేమి లేనిదని గదా చెప్పారు. మరి జీవించినంత కాలమూ శరీర సంబంధం మనకు తప్పదు గదా. అలాంటప్పుడది ముక్తి ఎలా అయిందని ఆక్షేపణ వస్తుంది. దీనికి శంకర భగవత్పాదులిచ్చిన సమాధానమిది. శరీర సంబంధమంటే శరీర మనేది ఒకటి మనకు కనిపిస్తూ ఉండటమని గాదు. కనిపించే ఈ శరీరాన్ని నాది అని-నేనని-అభిమానించటం Identity. ఆ మాటకు వస్తే వాస్తవంలో శరీరమనేది లేదసలు. మన అభిమానం వల్లనే ఏర్పడిందది. మిథ్యాభూతమేగాని అది గౌణం కాదంటారు స్వామివారు. మీమాంసకులు శరీరం గౌణమని వాదిస్తారు. రెండు వస్తువులు వేరుగా కనిపిస్తూ గుణసామ్యాన్ని పురస్కరించుకొని ఒకదాని మీద మరొక దాని నారోపిస్తే అది గౌణం Metaphorical. అలా కాక రెండవ పదార్థమసలు లేకపోయినా ఒక పదార్థాన్ని చూచి మరొక పదార్థమని భ్రమపడితే అది మిథ్య Mythical. ఈ కుర్రవాడు

సింహమేనని ఎవడైనా అంటే సింహమనేది వేరుగా ఉంది. కుర్రవాడూ వేరుగానే ఉన్నాడని మనకు తెలుసు. అయినా సింహానికున్న గాంభీర్య పరాక్రమాది గుణాలు కొన్ని మనసులో పెట్టుకొని వీడు సింహమని సింహత్వాన్ని వాడిమీద ఆరోపించాము. ఆరోపిస్తున్నామని మనకు తెలుసుకూడా. కాని "స్తంభశ్చోరః" చీకట్లో ఒక స్తంభాన్ని చూచి అదుగో దొంగ అని అరిచామంటే స్తంభమనే జ్ఞానం లేదక్కడ. లేకనే దొంగ అనే పదార్థమక్కడ స్తంభానికి భిన్నంగా లేకపోయినా అనవసరంగా ఆరోపించుకొని భయపడతాము. ఇదీ మిథ్య అంటే.

ఇలాంటి మిథ్యా రూపమే ప్రస్తుత మీ శరీరమనేది. చైతన్యమే అసలు సర్వత్రా ఉన్న పదార్థం. శరీరమనేది దానికి వేరుగా మరొక పదార్థమెక్కడా లేదు. లేకపోయినా స్తంభం మన దృష్టికి చోరుడిలాగా కనిపించినట్టు అదే మన అజ్ఞానదృష్టికి శరీరంగా భాసిస్తున్నది. కనుక ఇది కర్మ మీమాంసకులపోహ పడ్డట్టు గౌణం కాదు. కేవల మాభిమానికమేనని చాటుతారు స్వామివారు. ఆభిమానిక మెప్పుడయిందో అభిమానం తొలగితే చాలు. శరీర సంబంధం కూడా తొలగిపోతుంది. ఇది స్తంభమే గాని దొంగ కాదనుకొని చూచేవాడికి దొంగ ఎక్కడున్నాడు. అలాగే ఇది చైతన్యమే గాని శరీరం కాదనుకొని చూస్తే శరీరమూ లేదు. కనిపిస్తున్నది గదా అంటే అది నీకూ నాకే. మనకు శరీరంగా కనిపించేదాన్ని వాడు చైతన్యరూపంగా దర్శిస్తుంటాడు. కాబట్టి శరీరమనేది ఒకటి ఉండటమూ లేకపోవటంలో లేదు. మనకీ శరీరం మీద అభిమానముండటమే బంధం. అలాంటి అభిమానం లేకపోవటమే మోక్షం. అలా కాకపోతే శరీరమున్న సిద్ధపురుషులందరినీ బద్ధులనీ-మృతి చెందిన పామర జనులనందరినీ ముక్తులనీ చాటవలసి వస్తుంది. అది చాలా అన్యాయం. అంచేత శరీరమనేది ఉన్నా మోక్షం మనకు సిద్ధించటంలో ఆక్షేపణ లేదు.

## సద్యః ఫలం

కాకపోయినా మోక్షమనేది దృష్టఫలమని ప్రతిపాదిస్తారు వేదాంతులు. ఇది మీమాంసకుల కర్మఫలం కాదు. కర్మఫలమంతా అదృష్టం మనకు. ఇహంలో మనం జ్యోతి ష్టోమాదులైన యాగాదులెన్నైనా చేసి ఉండవచ్చు. ఎన్ని చేసినా చెందినా వాటి ఫలమప్పుడే మన అనుభవానికీ రాదు. శరీరపాతమయ్యేదాకా దాని అడా

పొదా కూడా కనిపించదు మనకు. మనల నది అదృష్టరూపంగా మాత్రమే అంటిపట్టుకొని ఉంటుంది. అలా ఉంటూ చివరకు దేహపాతమైన తరువాత లోకాంతరాలకు మనలను తీసుకుపోయి అక్కడ దర్శనమిస్తుంది మనకు. అంటే అది ఇచ్చే ఫలితం మనకక్కడ మాత్రమే అనుభవానికి వస్తుందని అర్థం. పోతే వేదాంతులు చెప్పే ముక్తి ఫలమిలాంటిది గాదు. అది దృష్టం. అంటే బ్రహ్మజ్ఞాన ముదయించిన వెంటనే కనిపించి తీరాలది మనకు. ఎందుకంటే జ్ఞానమనేది కర్మమాదిరి అనుష్ఠాన రూప Active మైనది కాదు. విచారాత్మక Reflective మైనది. పైగా తత్ఫల రూపమైన ముక్తి కూడ మనమెక్కడికో దేశాంతరం పోయి అందుకొనేది కాదు. బ్రహ్మ స్వరూపానికనతి రిక్తమది. మరి ఆ బ్రహ్మమనే దెక్కడ బడితే అక్కడే ఉన్నది. ఎప్పుడు పడితే అప్పుడే ఉన్నది. అంతా అదే. అలాంటప్పుడిక వెంటనే అనుభవానికి రావటంలో అభ్యంతర మేమున్నది అంచేత నూటికి నూరుపాళ్ళూ దృష్ట ఫలమే కావాలది. దృష్టం గనుకనే శరీర పాతమే కానక్కరలేదు. శరీరమున్నప్పుడు కూడా కలగవచ్చు పొమ్మన్నారు జగద్గురువులు.

అంతేకాదు. మరొక సంగతి. మోక్షం మనకు శరీరమున్నప్పుడే కలగకపోతే బ్రతికున్న వాడెవడూ ముక్తుడు కాడని ప్రకటించవలసి వస్తుంది. ఎవడూ కాకపోతే లోకంలో ఇక అనుభవజ్ఞులైన ఆచార్యులే మనకు కరువయిపోతారు. మరి **"ఆచార్యవాన్ పురుషోవేద"** అనే ఉపనిషద్వాక్యాని కర్థమేమిటప్పుడు ఆచార్యుడి సహాయం వల్లనే బ్రహ్మజ్ఞాన మార్జించాలని గదా ఉపనిష దుపదేశం. ఆచార్యుడంటే ఎవడు. **"బ్రహ్మవి బ్రహ్మణిస్థితః"** బ్రహ్మతత్త్వాన్ని ఉన్నదున్నట్టు గ్రహించి దానిలోనే నిత్యమూ నిలిచి ఉన్నవాడు. **"బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి"** అన్నట్టు అలాంటివాడు కేవలం బ్రహ్మభూతుడే. అంటే సర్వాత్మనా ముక్తపురుషుడు. అలాంటివాణ్ణి శరీరమున్న నేరానికి ముక్తుడు కాడంటే వాడికపుస్తక జ్ఞాని మాత్రమేగాని అనుభవజ్ఞుడు కాడని చాటవలసి వస్తుంది. అలాంటప్పుడనుభవజ్ఞుడు కానివాడు చెప్పిన మాటలకు విలువేముంది. **"స్వయమ్‌తీర్ణః - పరాంస్తారయతి"** అన్నారు పెద్దలు. వాడు తరించి గదా ఇతరులను తరింపజేయవలసింది. వాడికే అసలాస్కారం లేకపోతే మనకు

మాత్రమే ముంటుంది. అందరూ అలాగే అయిన నాడిక ముక్తి అనేది ఒకటి ఉందని మాత్రమేమి నమ్మకం. జీవితంలో మనకది ఎక్కడా దృష్టం కావటం లేదుగదా. జీవితంలోనే కాకపోతే రేపి శరీర పాతమైన తరువాతనైనా కలుగుతుందో లేదో. చెప్పలేము. **"దృష్టాచ్చ అదృష్ట సిద్ధిః"** అంటారు భాష్యకారులు. ఎప్పుడైనా దృష్టమైన విషయాన్ని ఆధారంచేసుకొనే అదృష్టమైన అర్థాన్ని మనం గ్రహించవలసి ఉంటుంది. ప్రస్తుత మీ ముక్తి అనేది జీవితంలోనే దృష్టం కాదంటున్నారు. అలాంటప్పుడిక దాని విషయంలో మనకు ప్రామాణ్యబుద్ధి ఎలా ఏర్పడుతుంది. ప్రామాణ్యబుద్ధి లేకుంటే గురుశిష్య సంప్రదాయం దెబ్బ తింటుంది. సంప్రదాయ Tradition మంటే కేవల విద్యా దానమే గాదు. అనుభవ ప్రధానం కూడా. అనుభవమే దుర్లభ మయినప్పుడెవరి కెవరు దానం చేయాలది.

అసలు ముక్తి అంటే ఏమిటి. అది పూర్వసిద్ధమేగాని ఇప్పుడు సరిక్రొత్తగా నిష్పన్నమయ్యేది కాదు స్వరూపమే గదా మనకది. స్వరూప మన్నప్పుడిక క్రొత్తగా దాన్ని పొందేదేముంది. ఆవరణం Veil తొలగితే చాలు. దాని పాటికదే బయట పడుతుంది. దానికున్న ఆవరణ మజ్ఞానమే. అది బ్రహ్మజ్ఞానం చేత కకా వికలమయి పోయింది. పోతే అది ఇక వెంటనే మన అనుభవానికి రావాలి గదా. అలా కాక దేహపాతమయ్యే వరకూ కనిపెట్టుకొని ఉండవలసి వస్తే ఇక మనకు జ్ఞానమనేది కలిగి ప్రయోజనమేముంది. జ్ఞానోదయమైనా ముక్తి లభించలేదని చెప్పినట్టువుతుంది. జ్ఞానోదయానంతరమేదో ఒక క్రియ చేసి తన్మూలంగా దాని నార్జించవలసి వస్తే అది యధార్థమే. కాని జ్ఞానానంతరం వేరే ఒక క్రియ కూడా కావలసి ఉందని చెప్పటం లేదు అద్వైతులు. జ్ఞానమజ్ఞానాన్ని పారదోలితే చాలు. అది ఇక ముక్తేనంటారు. అలాంటప్పుడిక శరీర పాతందాకా వేచి ఉండటం దేనికి. పైగా జ్ఞానం మన కుత్పన్నం కావాలంటే దానికి శరీరాద్యుపకరణాలుండాలి. అవి ఉన్నప్పుడే కలగని జ్ఞానం రేపు ఆ పరికరాలన్నీ పోయిన తరువాత కలగటమెలా సంభవం. జ్ఞానమే కలగకపోతే తన్నిమిత్తమైన ముక్తికెలా నోచుకోగలం. కాబట్టి శరీరాద్యుపాధులున్నా ముక్తి నొప్పుకోక తప్పదు.

# బాధితానువృత్తి

అయితే ఒక ఆక్షేపణ. సరే మీ మాట ప్రకారం జీవన్ముక్తి నొప్పుకొంటాము. బాగానే ఉంది. కాని ముక్తి అంటే ఇంతకుముందు మనలనంటి పట్టుకొన్న ఉపాధులన్నీ లయమైపోవాలి గదా – మరి ఈ శరీరమనే ఉపాధి ఎలా ఉండగలదు. ఉంటే ఇక ముక్తి అనే మాట కర్ధమేముంది. ఆ మేరకు మరలా అది బంధమే గదా. నిజమే. శరీరమనే ఉపాధి కూడా న్యాయమైతే తొలగిపోవలసిందే. సందేహంలేదు. కాని జీవుడి ప్రారబ్ధ కర్మవల్ల అది ఇంకా తొలగకుండా అలాగే నిలిచి ఉందంటారు శంకరులవారు. ఇంకా వాడికి కర్మ ఎక్కడిదని ఆశ్చర్యపడరాదు. కర్మఅనేది మూడు విధాలుగా ఉంటుందని మొదటనే చెప్పాము. మూడింటిలో అటు సంచితమూ–ఇటు ఆగామీ ఇవి రెండూ జ్ఞానోదయం కాగానే దగ్ధమయిపోతాయి. కూడబెట్టిన కర్మ పుంజమంతా పోయి ఇక దానికి కూడేది లేదు. కాబట్టి జ్ఞానికిక కర్మ నిమిత్తంగా జన్మ అంటూ ఉండబోదు. అంతవరకూ ఖాయం. పోతే ఈ వర్తమాన జన్మ మాత్రమప్పుడే మాఫీకాదు. కారణమేమంటే ఇది ప్రారబ్ధం చేత తయారయిన పదార్థం. ప్రారబ్ధమంటే అంతకు ముందుగానే జారీ అయిందని గదా పేర్కొన్నాము. అది జారీ అయి కూచున్న దాయె. అంచేత దాన్ని ఇది ఏమీ చేయలేదు. దాని ఫలితమది ఇచ్చి తీరుతుంది.

అయితే అలా ఇస్తూపోతే ఏమిటి మన గతి అని నిర్వేద పడనక్కరలేదు మరలా. **"ప్రారబ్ధమ్ భోగతో నశ్యేత్"**న్నారు పెద్దలు. ఫలానుభవం పూర్తి కాగానే దానిపాటికదే సమసిపోతుంది. **"ముక్తేషువ"** త్తన్నారు శంకరులు. ప్రారబ్ధమనేది విడిచిపెట్టిన బాణం లాంటిదట. బాణం విడిచిన తరువాత మధ్యలో మనం కాదనుకొన్నా దానినిక వెనుకకు తీసుకోలేము. మంచో చెడ్డో అది దాని లక్ష్యాన్ని పోయి భేదించవలసిందే. భేదించేంతవరకూ ప్రయాణం చేయక తప్పదది. అయితే ఆ ప్రయాణం కూడా ఎంతో కాలముంటుందనే భయం మనకక్కరలేదు. వేగమున్నంతవరకే అది. లక్ష్యాన్ని తగిలి భేదించగానే అది తన వేగాన్ని కోలుపోయి నేలమీద పడిపోతుంది. అలాగే ఒక కుమ్మరి సారెలాగా ఈ శరీరంకూడా ప్రారబ్ధకర్మ వేగం పని చేసినంతవరకూ భూమిమీద క్రుమ్మరుతు ఉంటుంది. ఆ వేగం తీరగానే ఇది తీరిపోతుంది. ఆ

తరువాత చూస్తామన్నా కనిపించదది. కాకున్నా అసలీ జన్మలో ఎంతో వయసు చెల్లిన తరువాతగాని కలగదు మనకు జ్ఞానం. కలిగిన తరువాత ఇక ఎంత ప్రారబ్ధమని. ఎంతకాలం బ్రతుకుతామని. **"తస్య తావ దేవ చిరమ్యావ న్నవి మోక్ష్యే"** అని ఘోషిస్తున్న దుపనిషత్తు. ఎంతో కాలముండదు జ్ఞానోదయమైన తరువాత ప్రారబ్ధం. అదుగో ఇదుగో మని చూస్తుండగానే దాని బాకీ తీరిపోతుంది మనకు. **"అథ సంపత్స్యే"** తీరటమేమిటి. సదేకరూపులమై ప్రకాశించటమేమిటి. ఏక కాలంలో జరిగిపోతుంది. అంచేత శరీరమింకా ఉంటుందే ఎలాగా అని కంగారు పడనక్కరలేదు. ఉంటే ఉండనీయండి. ప్రారబ్ధంతో వచ్చిందది. ప్రారబ్ధమున్నంత కాలమూ దాని ననుభవించటానికీ ఉపాధి ఉండవలసిందే ప్రారబ్ధం పోతే అదే పోతుందంటారు భగవత్పాదులు.

## అభిమానరాహిత్యం

అయితే అది ఇక ముక్తి ఎలా అయిందని అడగవచ్చు. ముక్తి అనేది శరీరముండటం లేకపోవటంతో లేదు. అది ఉన్నట్టు మనం భావించకపోతే చాలు. అదే ముక్తి అని ఇంతకుముందే వక్కాణించాము. శరీరమే నేననే తాదాత్మ్య బుద్ధి లేదా అభిమానమనేదే ప్రమాదం. అది లేకపోతే శరీరమున్నా ఫరవాలేదని శంకరుల వాదం. అయితే శరీరమున్నంత వరకూ అభిమానమెలా లేకపోతుందని చాలామంది కనుమానం. ఎందుకంటే శరీరమనే ఉపాధిఎప్పుడుందో అప్పుడది నాదనే బుద్ధి తప్పకుండా కలుగుతుంది. దాని కేర్పడే క్షుత్పిపాసలు నా అనుభవానికి రాకపోవు. అంతేగాక ఆధ్యాత్మికాదులైన బాధలెన్నో ఉంటాయి. వాటన్నిటికీ అది గురి అయినప్పుడల్లా ఆ అనుభవం మనకు సోకి తీరుతుంది. అసలనుభవమనేది మనకే గదా. అచేతనమైన శరీరానికనుభవమేముంది. మరి ఇలా అన్నీ అనుభవించవలసి వస్తే అది ఇక సంసారమే గదా మోక్షమెలా అవుతుందని ఆక్షేపణ.

అది కూడా అవిచార మూలకమేనని కొట్టివేస్తారు భగవత్పాదులు. ఆయన చెప్పేదేమంటే శరీరమున్నప్పటికీ ఆ శరీరమే నేననే అభిమానం లేదు ముక్తుడికి. అభిమానమెప్పుడు లేదో దానికి కలిగే బాధలికేవీ తనవిగా భావించదు. కష్టసుఖాలన్నీ దానికే వదలివేసి తాను వాటికి సాక్షిగా ఉండిపోతాడు. అంతేకాదు. వాటిని కూడా

తన స్వరూపంలోనే లయం చేసుకొని తన స్వరూపంగానే మార్చుకొని చూస్తాడు. అప్పుడనుభవమయినా అది అనుభవంలో చేరిక గాదు. మామూలు లోకుల అనుభవం వేరు. ముక్తుడి అనుభవం వేరు. లోకులిది జ్ఞానమది జ్ఞేయమనే ద్వైత దృష్టితో అనుభవిస్తారు. వాడికోజ్ఞేయ మనేది లేదసలు. అంతా జ్ఞానమే. అది తన స్వరూపమే. కాబట్టి స్వరూపాని కపృథ గ్భూతంగా Undifferentiated చూస్తూ అనుభవిస్తాడు ప్రతిదీ. అంచేత ఇది ఒక విధంగా చెబితే అనుభవం కాని అనుభవం. ఇలాంటి అఖండానుభవంలో ఇక సుఖమూ-దుఃఖమూ అనే ప్రశ్నేముంది. **"ప్రియా ప్రియే నస్పృశతః-సర్వమాత్మైవాభూత్"** అంతా తన స్వరూపమే. అలాంటప్పుడు శరీరమొకటి ఉందనే స్పృహ కూడా వాడికి లేదు. చరాచర ప్రపంచమంతా ఆత్మచైతన్యమే. అలాంటప్పుడిక దానిలో ఏకదేశమైన Part శరీరం మాట చెప్పేదేముంది. కరచరణా ద్యవయవాలతో కనపడుతున్నా అదీ బ్రహ్మమే వాడి పాలిటికి. అయితే ఈ కరచరణాదులుగా కనపడే దెవరికీ. అలా దర్శిస్తున్న మిగతా లోకుల దృష్టికే నంటారు భగవత్పాదులు.

మరి ఇలాంటి దశ జీవితంలో సంభవమా అని అడిగితే సంభవమేనని డంకా బజాయించి చాటుతారాయన. ఇక్కడ శాస్త్రం కాదిక వాడి స్వానుభవమే మనకు ప్రమాణం. వెధవది-సవిషయమైన సాహిత్యంలోనే ఫలానాచోట ఫలానా రసానుభవం కలుగుతుందా లేదా అంటే సహృదయ హృదయమే ప్రమాణం పొమ్మని నోరు మూయిస్తారు. అలాంటప్పుడిక నిర్విషయమైన ఆధ్యాత్మ రంగంలో అనుభవమే ప్రమాణమంటే తప్పేముంది. అందుకే **"స్వహృదయ ప్రత్యయ మిద"** మని పదేపదే హెచ్చరిక చేస్తుంటారు భగవత్పాదులు. అసలు శాస్త్రమనే దెప్పుడు గానీ మానవుడి అనుభవంతో మిళితమైనప్పుడే గదా దానికి ప్రామాణ్యం శాస్త్రం జ్ఞానమైతే Philosophy దాని అనుభవం విజ్ఞాన Mysticism మన్నది భగవద్గీత. మరొకచోట అదే దీనిని జ్ఞానమనీ-దానిని యోగమనీ- వ్యవహరించింది. రెండింటికి భాష్యం వ్రాస్తూ భగవత్పాదులొకటి కేవల శాస్త్ర జన్యమైతే మరొకటి స్వానుభవ కరణమని స్పష్టంగా వింగడించారు మనకు.

ఇలాంటి స్వానుభవాన్నే బయటపెట్టారా అనిపిస్తుందొక ఘట్టంలో ఆ పరమహంస పరివ్రాజకులు అనుక్షణ స్మరణీయమైన ఈ భాష్యపంక్తు లాలకించండి.

**"యథా భూతాత్మ దర్శన నిష్ఠస్సన్ శరీర స్థితిమాత్ర ప్రయోజనే భిక్షాటనాదౌ కర్మణి శరీరాది నిర్వర్త్యే-నైవకించిత్క రోమ్యహమ్-గుణా గుణేషు వర్తంత ఇత్యేవమ్ సదా పరి సంచక్షాణః ఆత్మనః కర్తృత్వా భావమ్ పశ్యన్ నైవకించి ద్భిక్షాటనాదికమ్ కర్మ కరోతి. లోక వ్యవహార సామాన్య దర్శనేనతు లౌకికైరేవ ఆరోపిత కర్తృత్వే భిక్షాటనాదౌ కర్మణి కర్తాభవతి. స్వానుభవేనతు శాస్త్రప్రమాణ జనితేన అకర్తైవ స ఏవమ్ పరాధ్యారోపిత కర్తృత్వః శరీరస్థితి మాత్ర ప్రయోజనమ్ భిక్షాటనాదికమ్ కర్మ కృత్వాపి నని బధ్యతే - బంధహేతోః కర్మణః సహేతుకస్య జ్ఞానాగ్నినా దగ్ధత్వాత్"** భిక్షటనాదికమైన ఏపని చేస్తున్నా ఇది నేను గాదు చేయటం. ప్రకృతి గుణాలైన ఇంద్రియాలు ప్రకృతి గుణాలైన విషయాలలో ప్రవర్తిస్తున్నాయని అనుక్షణమూ భావిస్తూ కర్తృత్వాభిమానాన్ని వదులుకొంటాడు జ్ఞాని. అలాంటప్పుడాభిక్షాటనాది కర్మలు చేస్తున్నా ఏదీ చేయని వాడే. అయితే లోకసామాన్య దృష్ట్యా లౌకికులారోపించిన కర్తృత్వం వల్ల అతడు కర్త అవుతున్నాడు. మరి శాస్త్ర ప్రమాణంవల్ల ఏర్పడిన తన అనుభవ దృష్ట్యా చూస్తే మాత్రమతడు దేనికీ కర్తకాడు. ఈ విధంగా ఇతరులధ్యారోపించిన కర్తృత్వంతో భిక్షాటనాది క్రియా కలాపం నిర్వరిస్తున్నా అతని కాకర్మ బంధకం కానేరదు. కారణం బంధహేతువైన కర్మను సహేతుకంగా వాడికి కలిగిన బ్రహ్మజ్ఞానమనే అగ్ని కాల్చివైచింది. ఇక ముక్తుడు కాకవాడు బద్ధెలా అవుతాడు. శరీరమున్నా - దానితో ఒకక్రియ చేస్తున్నట్టు కనిపించినా వాడు ముక్తుడే.

ఎంత గొప్ప అనుభవమిది. ఇలాంటి అనుభవాన్ని భగవత్పాదులు దహరించారంటే ఇది వారొక్కరిదే గాదు. సృష్టిలో ఎంతమంది భగవత్పాదులలాంటి మహనీయులందరికీ ఇలాంటి అనుభవమే కలిగి ఉండాలి. ఇక మీదట కూడా కలిగి తీరాలి. ఇందుకు నిత్యముక్తుడైన కృష్ణ భగవానుని మధురగీతలే మనకు సాక్ష్యం. **"కర్మణ్యభిప్రవృత్తోపి-నైవకించి త్కరోతిసః-శరీరస్థోపి కౌంతేయ కర్మభిర్న సబధ్యతే-నవ ద్వారేపురే దేహే నైవకుర్వన్నకారయన్"** ఇలాంటి వాక్యాలు బాగా విమర్శించి చేస్తే శరీరమనేది ఒకటి ఉన్నా - దానితో నిత్యమూ కార్యకలాపం నిర్వర్తిస్తున్నా అది జీవన్ముకుడి విషయంలో కర్మేగాదు-నిర్వర్తించటమే గాదని తేటపడుతున్నది. దానికి కారణం నవద్వారమైన ఈ శరీరమనే పట్టణంలోనే ఉన్నా దానినంటీ ముట్టకుండా బాటసారి ఒక సత్రంలో బస చేస్తున్నట్టుగా భావిస్తాడతడు.

మనమూ మన శరీరాలలోనే ఉన్నప్పటికీ శరీరమే నేననే తాదాత్మ్యంతో ఉంటాము. కాబట్టి ఒక గేహంలో మాదిరి ఒక దేహంలో ఉన్నామనే ప్రజ్ఞలేదు మనకు. అదే ముక్తుడికైతే ఉంటుంది. ఎందుచేత. దేహాది సంఘాతంకంటే నేను వ్యతిరిక్తుణ్ని అనే భావముంది వాడికి. అంచేత దేహం చేసే పనులుగాని వాటి ఫలంగాని వాడినంటదు. అది వాడి దృష్టిలో చచ్చినపాములాంటిది. అక్కడ ఉన్నా కనిపిస్తున్నా వాడికి లేనిదే.

విలక్షణమైన ఈ అనుభవాన్ని ఒక విచిత్రమైన దృష్టాంతంతో మనకు స్పష్టం చేస్తున్నది బృహదారణ్యకమనే ఉపనిషత్తు **"తద్యథా అహినిర్ల్వయనీ వల్మీకే మృతా ప్రత్యస్తాశయీత - ఏవమేవేదగ్ం శరీరగ్ం శేతే-అథాయ మశరీరో உమృతః"** నిర్ల్వయని అంటే పాము విడిచిన కుబుస. అది అంతకు ముందు దాని శరీరంలో భాగమే. శరీరమే. దానినే అది విసర్జించిన తరువాత అక్కడ పుట్టలోనే ఒక ప్రక్కన పడి ఉన్నా గాలికి కదులుతున్నా చేస్తున్నా నాది అనే భావంతో చూడదది. తన దేహంతో కలిసి ఉన్నప్పుడది సజీవమైనా ఇప్పుడది నిర్జీవం. అలాగే ముక్తుడి శరీరం కూడా ఆత్మజ్ఞాన బలంతో ఒక కుబుసం లాగానే ఊడిపోయింది. అది ప్రారబ్ధవశాత్తూ అక్కడా అక్కడా లోకంలో తిరుగుతున్నా దానిని తనదిగా చూడడు జీవన్ముక్తుడు. అది వాడి దృష్టికి మృత కళేబరం. మరి తానో అమృత స్వరూపుడు-అని చాటుతున్న దుపనిషత్తు. అలా శారీర లౌకికాది కర్మకలాపమంతా శరీరమే చేస్తుంది గాని నేను కించిత్తు కూడా చేయటం లేదని నిత్యమూ అలాంటి ప్రత్యయంతో Attitude ఉండాలంటే దానికెంత ధైర్యముండాలో ఆలోచించండి. బ్రహ్మాత్వభావం బాగా ఆరూఢమైన ముక్తపురుషుడే అలా ముక్తకంఠంతో చాటగలడు.

## అభ్యాసబలం

అయితే అదే సత్యమైన అనుభవమైననాడు సర్వులకూ అది కలగాలి గదా ప్రత్యేకించి ఒకానొక మానవుడికే కలగటమేమిటి. అలా కలిగితే కలిగిందో లేదో మనకేమిటి దాఖలా అని మరలా సందేహించవచ్చు. అలాంటి సందేహాలే విషయంలో నైనాఎవరికైనా కలిగేవేనంటారు భగవత్పాదులు. దానికి కారణం మనకా విద్యలో తగిన శిక్షణా ప్రవేశమూ లేకనే గాని మరేదీ గాదు. ముందు చెప్పినట్లు మొదట

మనకసలు గురు శుశ్రూషా వేదాంతార్థ శ్రవణమేలేదు. కొంచెమున్నప్పటికి సరియైన ప్రమాణాలలో మనం పరిశ్రమ చేయము. అలా చేస్తున్నా బాహ్య విషయాలమీద ఉన్నంత ఆసక్తి వాటిమీద ఉండబోదు. అలాంటప్పుడంత గొప్ప అనుభవం కలగాలంటే ఎలా కలుగుతుంది. తీర్థానికి తీర్థం ప్రసాదానికి ప్రసాదమన్నట్టే ఉంటుంది మన వ్యవహారం. అక్కడే ఉన్నా – అత్యంత ప్రసిద్ధమైనా, అతి సులభమైనా, ఆత్మభూతమే అయినా అది మన సొమ్ముగాదు. అదే నిరంతరాభ్యాస శీలుడైన సిద్ధపురుషుడికైతే ముందు చెప్పిన సాధన సమగ్రి పరిపాకముంది కాబట్టి అసలీ ప్రపంచం ప్రపంచంగానే కనిపించదు. **“లౌకిక గ్రాహ్యగ్రాహక ద్వైతవస్తుని సద్బుద్ధి ర్నితరామ్ దుస్సంపాదా – ఆత్మచైతన్య వ్యతిరేకేణ వస్త్వంతర స్యానుపలబ్ధేః”** అంటారు భగవత్పాదులు. లోకులంతా ఇది నాకు గ్రాహ్యమైన ప్రపంచమనీ నేను నా జ్ఞానంతో దీనిని గ్రహిస్తున్నాననీ ద్వైతదృష్టితో చూస్తుంటే ఈ ముక్తుడు దానినంతా తన ఆత్మచైతన్య విభూతిగానే దర్శిస్తాడు. ఆత్మకంటే భిన్నంగా వాడికేదీ లేదు. అది కూడా పరోక్షం కాదు. అపరోక్షమే వాడికి. దాని విషయం తెలియక పూర్వమది తనకు పరోక్షంగా ఎక్కడో ఉందనే అపోహ ఉన్నా ప్రస్తుతమది ఫలానా అని ప్రత్యభిజ్ఞ Recognition ఎప్పుడు కలిగిందో ఇక ఎక్కడ బడితే అక్కడ అది అపరోక్షంగానే సాక్షాత్కరిస్తుంది. అలాంటి సర్వాత్మకమైన అనుభవంలో ఇక అది శరీరమనిగానీ ప్రపంచమనిగానీ విశేషదృష్టి కవకాశమే లేదు ముక్తుడికి.

## ముక్త వ్యవహారం

జీవన్ముక్తుడవలంబించే అనితర సాధారణమైన వ్యవహారాన్నే అత్యద్భుతంగా చిత్రించారు తన శత శ్లోకిలో ఒకచోట ఆచార్యులవారు. **“ఆత్మాం భోధేస్తరంగో స్మ్యహ మితి గమనే భావయన్”** ఒక చోటికి వెళ్ళేటపుడల్లా తన ఆత్మ చైతన్యమనే సాగరంలో నుంచి పైకి లేచిన ఒక తరంగమే అలా వెళుతూన్నట్టు భావిస్తాడట. **“ఆసనస్థ స్సంవిత్సూత్రాను విద్ధో మణిరహ మితి వాస్మి”** కదలకుండా ఉన్నచోట కూచొని ఉన్నప్పుడంతా ఆత్మ సంవేదన అనే దారంలో కూర్చిన ఒక రత్నంలాగా తన్ను భావిస్తాడట. **“ఇంద్రియార్థ ప్రతీతా దృష్టో స్మ్యాత్మావ లోకాదితి”** మరి తన చక్షురాది కరణాలకూ ఈ బాహ్యప్రపంచానికీ సంసర్గమేర్పడుతున్నప్పుడల్లా నా

చైతన్య మహాదీప్తిలో నాకు నేనే కనిపిస్తున్నా ననే భావంతో ఉంటాడట. **"శయన విధౌ మగ్న ఆనంద సింధౌ"** పోతే ఇక రాత్రి పడుకొని నిద్రపోయేటప్పుడైతే నేనిపుడు నా చిదానంద సాగరంలోనే మునుకలు వేస్తున్నానని కులుకుతాడట. ఇలా నిరంతరాంతర్నిష్ఠుడై బ్రహ్మజ్ఞాని తన జీవితకాలం గడుపుతాడంటా రాయన.

చూడండి. యాదృచ్ఛికంగా చెప్పినట్టు కనిపించినా ఇందులో చెప్పిన నాలుగే అసలు దైనందిన జీవితంలో ఉన్న దశలు కూడా. అంతకు మించి మరేదశా మనకు జీవితంలో తారసిల్లదు. ఎప్పుడు చేసినా ఒక చలనమైనా చేస్తుంటాము. చలించకుండా నైనా ఊరుకొంటాము. లేదా శబ్ద స్పర్శాదులైన విషయాలతోనైనా వ్యవహరిస్తుంటాము. ఇక ఏదీ లేదంటే పడుకొని నిద్ర అయినా పోతాము. ఇంతే మనం నిత్యమూ చేసే పనులు. ఈ నాలుగు పనులలోనూ మనం నాలుగు దృష్టులతో ఉంటాము. అందులో ఆత్మదృష్టి కసలు జాగాయే లేదు. పోతే ముక్తుడైన వాడీ నాలుగింటినీ ఆత్మదృష్టితోనే భావిస్తాడు కాబట్టి వాడికంతా ఆత్మే. అనాత్మగా కనిపించదేదీ.

మరొక శ్లోకంలో కూడా చూడండి ఈ ఆత్మానుభవాన్ని ఎంత మనోహరంగా వర్ణించారో. **"యావాన్ పిండో గుడస్య-స్ఫురతి మధురిమా తత్ర సర్వోపితావాన్ యావాన్ కర్పూర పిండః పరిమళతి సదా మోద ఏవాత్ర తావాన్-విశ్వమ్ యావద్విభాతి ద్రుమనగ నగరారామ చైత్యాభిరామమ్- తావచ్చైతన్య మేకమ్ ప్రవి కసతి యతోంతే తదాత్మావ శేషమ్"** గుడ పిండమంటే ఉండగా ఉండే బెల్లం. ఉండలో బెల్లమనే పదార్థమెంత దూరముందో అంత దూరమూ దాని అణువణువూ వ్యాపించి ఉంది మాధుర్యం. బెల్లమంతా మాధుర్యమే. మరేదీ గాదు. అలాగే ఒక గడ్డ కట్టిన కర్పూరముందంటే అది కొనా మొదలూ పరిమళమే. మరేదీ గాదు. ఈ బెల్లమూ కర్పూరం మాదిరే ఇప్పుడీ వననదీ సముద్ర పర్వత పట్టణ పృథివ్యంత రిక్షాది ప్రపంచమంతా. బెల్లమంతా మాధుర్యమూ-కర్పూరమంతా పరిమళమూ- అయినట్టే ఈ విశ్వమంతా ఎంత ఉందో అంతా ఆ చైతన్యమే. చైతన్యమే సృష్టిలో ప్రతి అణువూ లోపలా వెలపలా సందు లేకుండా క్రిక్కిరిసి ఎక్కడ చూచినా పిక్కటిల్లి Replete ఉంది. చైతన్యం వినా మరేదీ కానరాదు. కారణం దానితోనే చివర కీకార్య జగత్తంతా పర్యవసిత మవుతున్నది.

ఇలాంటిదీ బ్రహ్మవేత్తలైన ముక్తపురుషుల అనుభవం. వారాకాల మీకాల మనకుండా ఏ కాలంలోనైనా ఉంటారు. మన మధ్యనే తిరుగుతుంటారు కూడా. అయినా వారి వ్యవహారం మనకేమాత్రమూ అంతుపట్టదు. కారణం వారు నిరంతరం బ్రహ్మాకార వృత్తితో జీవయాత్ర గడుపుతుంటారు. **"నిమేషార్ధమ్-నతిష్ఠంతి వృత్తిమ్ జ్ఞానమయీమ్ వినా - యథా తిష్ఠంతి బ్రహ్మాద్యాః సనకాద్యాః శుకాదయః"** అర నిమిషం కూడా బ్రహ్మవృత్తి నెడబాసి ఉండరు వారు. అలా ఎడబాయకున్న వారేనట ఇప్పుడు సత్యలోకంలో పద్మాసనాసీనుడైన చతుర్ముఖ బ్రహ్మ సనకసనంద నాదులైన మహర్షులు - శుక ప్రముఖులైన భాగవతులూ ఏ మాత్రమే మరుపాటు చెందినా మరలా ఈ సంసార వాసనలు క్రమ్ముకొనే ప్రమాదముంది. వారు ముక్తజీవులు గదా అంటే ఎంత ముక్తులైనా ప్రారబ్ధమనే దొకటి ఉందనే సంగతి మరచిపోరాదు. ధృతరాష్ట్రుడికి లాగా వెయ్యేనుగుల బలముంది దానికి. దగ్గర చేరిందంటే ఉక్కులాంటి వ్యక్తినైనా నుగ్గు నూచం చేయగలదు. ఊచముట్టగా జ్ఞాన ధనాన్ని దోచుకొని పోగలదు. అందుకే అసలు ఆహారం దగ్గరినుంచీ శుద్ధి కావాలన్నారు. ఆహార శుద్ధౌ సత్త్వశుద్ధిః ఆహారం మొదట శుద్ధి అయితేనే సత్త్వం శుద్ధి అవుతుంది. ఆహారమనేది రెండు విధాలు. భౌతికం-మానసికం కూడా రెండూ పరిశుద్ధమైతే అదీ రజస్తమో మాలిన్యాన్ని పోగొట్టి సత్త్వాన్ని శోధిస్తుంది. సత్త్వశుద్ధౌ ధ్రువాస్మృతిః అన్నారు. శుద్ధసత్త్వం వల్ల బ్రహ్మ భావన దృఢంగా నిలుస్తుందట. **"స్మృతిలంభే సర్వగ్రంథీనామ్ విప్రమోక్షః"** అది నిలిస్తే ఇంకేముంది. **"భిద్యతే హృదయ గ్రంథిః"** అన్నట్టు జీవిత సమస్యలన్నీ పటాపంచెలయి మోక్షం కరతలామలక మవుతుందని హామీ ఇస్తుంది ఛాందోగ్యం అందుచేత బహు జాగ్రత్తగా ఉండాలి ఎంత జ్ఞాని అయినా - ముక్తుడయినా.

## నిత్యాను సంధానం

అసలిక్కడ ఉన్న చిక్కేమిటంటే జీవన్ముక్తుడికి ప్రతివాదులు చెప్పినట్టు దేహమనే ప్రతిబంధమింకా ఒకటున్నది. అది ప్రారబ్ధ సంతానమే కాబట్టి ఉన్నంత కాలమూ ఏదో ఒక సంతాపాన్ని కలిగిస్తూనే ఉంటుంది. దానితో ఆ బ్రహ్మాత్మ భావాన్ని నిరంతరమూ మనం నిలుపుకోట మంత సుకరం కాదు. **"అవ్యక్తా హిగతిర్దుః ఖమ్ దేహవద్భి రవాప్యతే"** అని భగవానుడు కూడా దేహధారుల కా పదవి అంత సులువుగా

దక్కదని హెచ్చరిస్తున్నాడు. సిద్ధాంతం కోసమొక వేళ అది ముక్తి అని ఒప్పుకొన్నా ప్రారబ్ధమింకా అంటుకొని ఉన్న నేరానికి దాని ధాటి కెప్పటి కప్పుడు జవాబు చెప్పే ఆత్మాను సంధానం మాత్రం సాగుతూ పోవలసిందేనని సలహా ఇస్తారు భగవత్పాదులు కూడా. మరి ముక్తే గదా అంటే వాస్తవమే. ముక్తి కాదనలేదు మేము. అలాగే భావించి నిలుపుకొన్నప్పుడే అక్షరాలా అది ముక్తి అవుతుంది. ఎంత పెద్ద పిత్రార్జితమైనా దక్కించుకొంటేనే గదా మన ధనమయ్యేది. లేకపోతే అది ఎవరిదో. **"పయః పిబతి యస్తస్యా - ధేనుస్త స్యేతి నిశ్చయః"** అన్నారు వ్యాసులవారు. ఈగో వెవరిదని ప్రశ్న వచ్చిందట. ఎవరు దాని పాలుతాగే అదృష్టానికి నోచుకొంటే వారిదేనని జవాబిచ్చారు. ఆ అదృష్టం దాని దూడదైనా కావచ్చు. దొంగదైనా కావచ్చు. ఆ ఇంటి యజమానిదైనా కావచ్చు. ఎవరు దక్కించుకో గలిగితే వారిదా సొమ్ము. అలాగే ఈ ముక్తావస్థ కూడా.

అందుకే **"విజ్ఞాయ ప్రజ్ఞామ్ కుర్వీత"** అని ఘోషిస్తున్న దుపనిషత్తు. విజ్ఞానం అసలు విషయం తెలిసి పట్టుకోటానికైతే - ప్రజ్ఞాన మాపట్టిన పట్టు పట్టు వదలకుండా నిలుపుకోటాని కన్నారు స్వామివారు. దీనికే నిదిధ్యాసనమని శాస్త్రం పేరు పెట్టింది. విజాతీయ భావ తిరస్కారి అయిన సజాతీయ భావ ప్రవాహకరణమే నిదిధ్యాస. తిరస్కరణమంటే ప్రవిలాపనమే. ప్రవిలాపన చేయవలసింది దేన్ని. విజాతీయ భావాన్నా. ఆత్మ చైతన్యానికి విజాతీయ మీ అనాత్మ జగద్వాసనలే. అవి నిశ్శేషంగా కరిగిపోవాలి. దేనిలో. సజాతీయ భావాగ్నిలో. అది ఆత్మాకారమైన వృత్తే. ఆ వృత్తి నిత్యమూ ఆ వృత్తి అవుతూపోతే గాని ఆత్మవృత్తి నిలవదు. ఇలా నిలుపుకొంటేనే అది ముక్తి అనిపించుకొనేది. దీనికే జ్ఞానాభి నివేశమనీ - సంతానకరణమనీ రెండు పేర్లు పెట్టారు ఆచార్యులవారు. జ్ఞాన నిష్ఠ అన్నా ఇదే, పరాభక్తి అనీ - అనన్య భక్తి అనీ దీనికే మరొక పేరు. భక్తి అంటే మామూలుగా మన మనుకొనేది వేరు. ఇది వేరు. మన మనుకొనే భక్తి బ్రహ్మజ్ఞానానికి ముందుండ వలసింది. అది జ్ఞానానికి పూర్వరంగం. సగుణరూపమది. పోతే ఇది అలాంటిది కాదు. నిర్గుణమైనది. జ్ఞానం మనకు లభించిన తరువాత కలిగే భక్తి ఇది. దీనికీ భక్తి అనే పేరు పెట్టటంవల్ల భాగవతాది గ్రంథాల తాత్పర్యం పెద్ద పండితులకు కూడా అంతు పట్టటం లేదు. అందుకే దీన్ని పేర్కొనవలసి నప్పుడల్లా గీతాచార్యుడనన్య - పరా - అనే మాటలు

ముందు తగిలిస్తుంటాడు. జ్ఞాన నిష్ఠకు మారుపేరీ అనన్య భక్తి. **"తత్రచ సర్వమ్ నివృత్తి విధాయి శాస్త్రమ్ వేదాంతేతి హాస పురాణ స్మృతి లక్షణమ్ న్యాయప్రసిద్ధమ్ అర్థవద్భవతి"** ఇందులోనే మోక్ష పురుషార్థ బోధకమైన ఉపనిషత్పురాణేతి హాసాది వాఙ్మయమంతా తత్తన్న్యాయ కలాపంతో సహా చరితార్థమవుతుందని ముక్తకంఠంతో చాటుతారు అద్వైత కంఠీరవులాచార్యులవారు. ఇంతుకు మించి మరేదీ లేదు సాధక జీవితానికి పరాకాష్ఠ Climax.

ఇలాంటి నిష్ఠ నిలుపుకోగలిగినప్పుడే అది ముక్తి. అయితే నిలుపు కోటమనేది అంత సులభం కాదని చెప్పాము. కారణం ముక్తుడింకా దేహధారి అయి ఉండటమే. దేహమున్నా దేహాభిమానం లేకుంటే అది ముక్తేనన్నారు గదా అని ఆశంక చేయవచ్చు. వాస్తవమే. సిద్ధాంతమదే అయినప్పటికీ దైనందిన జీవితంలో అడపా దడపా కొంత శైథిల్యమేర్పడవచ్చు. దానికి కారణ మీ శరీర ధారణమే అందుకు నిమిత్తం ప్రారబ్ధమే. తన్నిమిత్తంగా కలిగే క్షుత్పిపాసాది వ్యవహారానికైనా లోనుగాక తప్పదు జ్ఞాని. అయితే ఆ మేరకు బ్రహ్మనిష్ఠలో కొంత వార చోటు చేసుకోకపోదు. ఈ విషయమే మాండుక్యకారికా భాష్యంలో ఒక చోట బయటపెడతారు భగవత్పాదులు. **"చలాచల నికేతశ్చ యతి ర్యాదృచ్ఛికో భవేత్"** అనే కారికార్థాన్ని వాఖ్యానిస్తూ **"చలమ్ శరీరమ్ ప్రతి క్షణ మన్యథా భావాత్ - అచలమ్ - ఆత్మతత్త్వమ్ - యదా కదాచి ద్భోజనాది సంవ్యవహార నిమిత్త - మాకాశవ దచలమ్ స్వరూప మాత్మ తత్త్వమ్ ఆత్మనో నికేత మాశ్రయం ఆత్మస్థితిం విస్మృత్య-అహమితి మన్యతే యదా తదాచలో దేహో నికేతో యస్య సోయ మేవం చలా చల నికేతో యతిః"** అని అర్థం చెప్పారాయన. చలాచల రూపమైన నికేతం లేదా స్థితి గలవాడెవడో వాడట యతి. చలమేమిటి. అనుక్షణమూ ఏదో ఒక క్రియతో మారిపోయే శరీరమే చలం. స్నానపాన భోజనాదులే ఆ క్రియలు. తన్నిమిత్తంగా తాను అచలమైన ఆత్మ స్వరూప స్థితిలో ఉండి కూడా దాని నప్పుడప్పుడూ విస్మరించవలసి వస్తుంది. విస్మరించిన దశలో చలనికేతుడవుతాడు యతి. మరలా స్మృతి వహిస్తే అచల నికేతుడే అనిపించుకొంటాడు. అయితే యదృచ్ఛా ప్రాప్త గ్రాసవాస కౌపీనా చ్ఛాదన మాత్ర సంతృప్తుడే గాని బాహ్యావిషయ సంజాత తృష్ణుడు కాదని మాత్రమే మనం సంతోషించవలసింది. ఈ మాటలలో ఉన్న సత్యాన్ని నిర్భయంగా చాటారు స్వామివారు.

దీనిని బట్టి మనం గ్రహించవలసిన రహస్యమేమంటే జీవన్ముక్తి అనేది లేదని గాదు. నిరాఘాటంగా ఉన్నది. ఉన్నప్పటికీ ఆ దశలో ప్రారబ్ధమింకా పని చేస్తుంది కాబట్టి శారీర లౌకిక కర్మలు నిర్వర్తించే సమయంలో తన స్వరూప స్థితి సడలకుండా కడుజాగ్రతతో మెలగాలి జీవన్ముక్తుడు. అదే జ్ఞాన నిష్ఠా లక్షణమైన నిదిధ్యాసన. **"సదా పరి సంచక్షాణః"** అని భాష్య పంక్తి నింతకు ముందొకచోట ఉదహరించి ఉన్నాము. పరిసంఖ్యానమంటే ఎప్పటికప్పుడు తన ఆత్మ భావాన్ని గుర్తుకు తెచ్చుకోటం అలా తెచ్చుకొంటూ పోతే అనాత్మ వ్యవహారమంతా దానిలో ప్రవిలయంకావటమిక అయత్న సిద్ధం. దానితో ఆత్మైక నిష్ఠా రూపమైన ముక్తి నిక్షేపం సురక్షితమవుతుంది. **"ముంజా దిషీకామివ దృశ్యవర్గా - త్ప్రత్యంచ మాత్మాన మసంగ మవ్యయమ్ - వివిచ్య తత్ర ప్రవిలాప్య సర్వమ్ - తదాత్మనా తిష్ఠతి యస్సముక్తః"** అని ఆచార్యులవారి చూడామణి. తములపాకు నుంచి ఈనె తీసినట్టు మొదట ఈ ఉపాధి వర్గం నుంచి ఆత్మను వేరుగా పట్టుకొని ఆ స్వరూపంలోనే మరలా ఈ సమస్తమూ ఎప్పటికప్పుడు ప్రవిలాపనం చేసుకొంటూ తద్రూపంగా నిలవ గలిగితేనే వాడు ముక్తుడు. లేకుంటే సక్తుడే.

ఇలా జీవితాంతమూ నిలుపుకొనే ప్రయత్నమే అయితే ఇక అది ముక్తి ఎలా అవుతుందని ఆక్షేపణ రావచ్చు.ఎప్పటికప్పుడు ప్రవిలాపనం జరుగుతూ పోతుంది కాబట్టి ముక్తే అది. యావజ్జీవమూ ఈ విధంగా అనుసంధాన యత్నంతో ప్రారబ్ధాన్ని అనుభవిస్తూ పోతే - చివరకా ప్రారబ్ధం తీరి శరీరపాతమయ్యే క్షణానికిటు లోక వ్యవహారమూ - అటు అనుసంధాన ప్రయత్నమూ రెండూ సుందోప సుంద న్యాయంగా సమకాలంలో సమసిపోతాయి. పోతే ఇక దేహధారణమనే ప్రసక్తే లేదు కాబట్టి స్వరూపనిష్ఠ కెలాటి విచ్ఛేదమూ లేక అది విదేహముక్తిగానే పరిణమిస్తుంది. అంచేత ఇంతకూ జీవన్ముక్తి అనేది సంభవమే. అది బ్రహ్మవేత్తలైన మహాత్ములందరికీ స్వానుభవ సిద్ధమే. ప్రారబ్ధ నిమిత్తంగా లోకవ్యవహార మడ్డు తగులుతున్నా ఎప్పటికప్పు డాత్మాను సంధాన మేమరకుండా ప్రవిలయ మవుతుంటుంది కాబట్టి మోక్షానుభవమ ప్రతిహతమే. ఇందులో సందేహ గంధం కూడా లేదు.

# లోకసంగ్రహం

పోతే ఈ జీవన్ముక్తులనే వారు మరలా రెండు వర్గాలు. ఒకరు ఆత్మారాములు. మరి ఒకరు లోక సంగ్రహ పరాయణులు ఇందులో ఆత్మారాములనేవారు మనకు కనిపించరు. ఏ హిమాలయాలకో ఎక్కడికోపోయి అక్కడే బ్రహ్మనిష్ఠలో ఉంటారు వారు. వారికీ లోకంతో ప్రమేయం లేదు. **“యస్త్వాత్మ రతిరేవ స్యాత్... తస్యకార్యమ్ న విద్యతే”** అని భగవానప్యువాచ. పోతే లోకసంగ్రహ పరులే మనమధ్య తిరుగుతుండే ఆచార్యపురుషులు. వీరికే ఆధికారికులని కూడా పేరు. ముక్తులైనా వీరు తమ ప్రారబ్ధకర్మ ముగిసేదాకా బ్రతుకుండాలి కాబట్టి వారికా నిత్యముక్తుడైన ఈశ్వరుడొక కర్తవ్యదీక్ష నొప్పగిస్తాడు. దానికే అధికార Divine Deputation మని పేరు. జిజ్ఞాసువులూ ముముక్షువులూ అయిన లోకుల నుద్ధరించటమే ఈ అధికారం. అందు కవసరమైన బోధలు చేస్తూ దేశంలో అక్కడక్కడ సంచారం చేస్తుంటారు వీరు. శంకరులవంటి ఆచార్యులంతా ఇలాంటివారే. వీరికందరికీ ప్రారబ్ధకర్మ అనేది అంతో ఇంతో అంటుకొని ఉంటుంది. అది ఒకవైపు అనుభవిస్తూనే వీరు తమ వాక్కులద్వారా రచనల ద్వారా బ్రహ్మజ్ఞానాన్ని లోకులకు పంచి పెడుతుంటారు. ప్రారబ్ధావసానంలో తాము విదేహముక్తులయి మరికొందరిని జీవన్ముక్తులుగా తయారుచేసి పోతారు.

ఈ రీతిగా గురుశిష్య సంప్రదాయమనేది అవిచ్ఛిన్నంగా ఈ మానవ లోకంలో సాగుతూ పోతుంది ఈ పవిత్ర కార్యాన్ని నిర్వహించటానికే నిత్యముక్తుడైన భగవాను డీముక్త జీవులైన ఆచార్యులందరికీ ఇలాంటి సంకల్పాన్ని కలిగిస్తాడు. అలా కలిగించిన వారే పూర్వం వేదవ్యాసాది మహర్షులంతా నని చాటుతారు భగవత్పాదులు. వ్యాస భగవానుడు మొదట అపాంతరతముడనే వేదాచార్యుడు. అంతరమైన తమస్సు అపాకృతమైన వాడు. పురాణముని. విష్ణుదేవుని ఆదేశానుసార మాయన కలిద్వాపర సంధిలో కృష్ణద్వైపాయనుడనే పేర జన్మించాడట. మరి వసిష్ఠ మహర్షి బ్రహ్మ మానసపుత్రుడు. నిమి అనే వాడి శాపం నిమిత్తంగా పూర్వదేహం కోలుపోయి మరలా మిత్రావరణులు మూలంగా జన్మ ఎత్తాడట. కనుకనే ఆయనకు మైత్రావరుణి అని పేరు వచ్చింది. పోతే భృగ్వాదులు కూడా బ్రహ్మ మానసకుమారులే. వారంతా

వరుణుడు చేసిన ఒకానొక యజ్ఞంలో మరలా సంభవించారని ఐతిహ్యం. అంతెందుకు. సనత్కుమారుడు కూడా మానసపుత్రుడే. రుద్రుడికి స్వయంగా వరప్రదానం చేసి ఆయన స్కందుడనే పేరుతో అవతరించాడని ఉంది. ఇవన్నీ ఇతిహాస పురాణాదులలో కనిపించే ఉదంతాలు. పోతే వేదంలో ఇక మంత్రార్థవాద భాగాలను పరిశీలిస్తే ఎన్నైనా దొరుకుతాయి ఇలాంటి గాథలు మనకు.

ఇందులో కొందరు వెనుకటి దేహం పతనమైన వెనుక దేహాంతరాన్ని స్వీకరించారు. మరికొందరీ దేహముండగానే యోగైశ్వర్య ప్రభావంతో Wielding the cosmic power మరొక దేహాన్ని సృష్టించుకొని అందులో ప్రవేశిస్తూ వచ్చారు. వీరందరూ సక్రమంగా వేదార్థాన్నంతటినీ ఆ పోశనం పట్టిన మహామేధావులు. వీరంతా ఇలా శరీరాలు మార్చుకొంటూ జన్మిస్తూ వచ్చారంటే ఏమిటర్థం. ప్రారబ్ధం తీరేవరకూ లోక ప్రయోజనాన్ని దృష్టిలో పెట్టుకొని పరమేశ్వర ప్రచోదితులై వేదధర్మాన్ని ప్రచారం చేసి అధికారాన్ని చేపడుతారు. ప్రారబ్ధం కడముట్టగానే ఒక క్షణకాలమైనా ఉండరిక. వెంటనే విదేహ కైవల్య సుఖాన్ని చూరగొంటారు.

ఈ ప్రకారంగా ఒక మహర్షులే గాదు. ఆయా దేవతలూ - దేవతా జ్యేష్ఠుడైన హిరణ్యగర్భుడూ - ఆ మాటకు వస్తే మనకిపుడు ప్రత్యక్షంగా కనపడే ఈ సూర్య భగవానుడూ - వీరు కూడా నిజాని కాయా అధికారాలలో నియుక్తులైన ముక్తజీవులే. జగచ్చక్షు The eye of the world వైన ఈ సూర్యదేవుడైతే ఒక వేయియుగాలదాకా తన అధికారాన్ని నిర్వర్తించి దాని పర్యవసానంలో ఉదయాస్తమయ వర్జితమైన కైవల్య సుఖాన్ని అనుభవిస్తాడని వేదంలోనే ఉంది. **“అథ తత ఊర్ధ్వ ఉదేత్య -నైవో దేతా - నాస్తమేతా ఏకల ఏవ మధ్యే స్థాతా”** అని శ్రుతి వచనం. అయితే ఇదంతా ఏ శ్రుతులలోనో స్మృతులలోనో ఎప్పుడో మనకు తెలియని కాలంలో జరిగిన కథలని సందేహించవచ్చు మానవుడు దానికి కూడా సమాధానమిచ్చారు శంకరులు. అప్పుడే కాదు. ఇప్పుడీ వర్తమాన కాలంలో కూడా అలాంటి బ్రహ్మవేత్త లెందరో ఉన్నారని ఎంతో ఆత్మవిశ్వాసంతో చాటిస్తారాయన. **“యథాచ వర్తమానా బ్రహ్మవిదః ఆరబ్ధ భోగక్షయే కైవల్యమను భవంతి”** ఇది మన బోటి సాధకుల కెంత ఆశాజనకమైన మాటో గదా.

కాబట్టి ఇంతకూ జీవన్ముక్తులైన వారటు ఏకాంత వాసులే గాక లోక సంగ్రహార్థం సంచరించే మహాత్ములు కూడా ఉన్నారని అర్ధమవుతున్నది. అయితే మన మధ్యలో తిరుగుతూంటే వీరు కూడా మనలాంటి సామాన్యులేనని వారి నవజ్ఞా దృష్టితో Disdainful look చూడటం లోకుల కలవాటు. **"అవజానంతి మామ్ మూఢా - మానుషీమ్ తను మాశ్రిత"**మ్మని భగవానుడే మొరపెట్టాడు. ఇకమిగతా వాళ్ళను గురించి చెప్పేదేముంది. తెలివైన వాడైతే అలాటి మహానుభావులను గుర్తించి వారి దర్శనం చేసుకొని ప్రణిపాత పరిప్రశ్న సేవాదులచేత వారి మనసు నావర్జించి తదుపదేశ భాగ్యం వల్ల తన జన్మ కడతేర్చుకొని పోతాడు. అలాగైతేనే వారు తలపెట్టిన పరమేశ్వరుడు వారి కప్పగించిన లోకసంగ్రహరూపమైన అధికారం చరితార్థమవుతుంది.

# విదేహముక్తి

ఈ ప్రకారంగా జీవన్ముక్తులై వారు తమ అధికారం నెరవేర్చిన తరువాత వారూ - ఆ మొదట చెప్పిన ఆత్మారాములూ-అందరూ కూడా వర్తమాన శరీరపాతం కాగానే ఇక విదేహముక్తినే పొందుతారు. విదేహమంటే దేహం పోవటమేనని మరలా అపోహ పడరాదు. దేహం పోవటమే ముక్తి అయితే ప్రాకృత మానవులు ordinary persons కూడా మరణ సమయంలో దేహాన్ని కోలుపోతూనే ఉన్నారు. అప్పటికి వారు కూడా విదేహ విముక్తులేనని చెప్పవలసి వస్తుంది కాబట్టి దేహపాత మాత్రం కాదు విదేహమంటే మరలా ఇక దేహమనేది లేకపోవటమని అర్థం చెప్పారు భగవత్పాదులు. ఎందుకంటే ఈ దేహ ప్రయోజనం ప్రారబ్ధావసానంతో తీరిపోతుంది. మరి సంచితాగామి కర్మలా - జ్ఞానాగ్ని చేత ఎప్పుడో దగ్ధమయి పోయాయి. అంటే ఏమన్నమాట. కర్మవాసన అనేది లేశమాత్రం కూడా మిగలలేదు జ్ఞానికి. కర్మలేకపోతే జన్మలేదని పేర్కొన్నాము గదా. అంచేత జీవన్ముక్తుడికి శరీరం పోవటమే తడవు. ఇక శరీరమూ లేదు. జన్మ ఎత్తటమూలేదు. అందుకే దీనికి విదేహముక్తి అని వ్యవహార మేర్పడింది.

అయితే శరీరం పతనమై పోవటమందిరికీ సమానంగానే కనిపిస్తున్నది గదా జీవన్ముక్తుడి శరీర పాతంలో ఉన్న విశిష్టత ఏమిటని ప్రశ్న వస్తుంది. జీవన్ముక్తుడి ప్రాణాలెక్కడికీ పోవు. **"న తస్య ప్రాణా ఉత్క్రామంతి - ఇహైవ సమవనీయంతే"**

మిగతా వాళ్ళ ప్రాణాల మాదిరి ఉత్క్రమణ చెందకుండా అవి ఇక్కడే సమసిపోతాయని చాటుతుందుపనిషత్తు. ఎందుకంటే ఉత్క్రమణ చెందటమనే ప్రసక్తి కర్మ ఫలమనుభవించవలసి ఉంటేనే. అలాంటివారు స్థూల శరీరం పడిపోగానే సూక్ష్మ శరీరంలో కూచొని లోకాంతరాలకు ప్రయాణం కడతారు. వారిలో కేవల కర్మిష్ఠులైతే పితృలోకాలకూ- ఉపాసకులైతే సత్యలోకానికి పోయి చేరుతారు. కాగా ఒక్క విదేహముక్తులు మాత్రమే ఎక్కడికీ వెళ్ళరు. కేవలం నిర్గుణ తత్త్వజ్ఞులువారు. తత్త్వజ్ఞాన ప్రభావంచేత వారికి కర్మా-కర్మతోపాటు స్థూల సూక్ష్మకారణాలనే త్రివిధ శరీరాలు కూడా ఎగిరిపోయాయి. ఇక ఎక్కడికీ పోవటానికి గానీ సాధన Conveyance మేముంది వారికి. సాధ్య సాధనాత్మక Ends & Means మైన సంసారమంతా వారి దృష్టికి బ్రహ్మస్వరూపమే. అది ఆత్మాభిన్నమే.

అంచేత దేహపాతం కాగానే ప్రాణం దగ్గరి నుంచీ, మనస్సు దగ్గరినుంచీ అన్ని ఉపాధులూ వారికాత్మ చైతన్యంలోనే పనగలిసిపోతాయి. అది ఎలాగ అని అడిగితే **"యథా ఊర్మయ స్సముద్రే"** అన్నారు భగవత్పాదులు. సముద్రంలో తరంగాల మాదిరట. సముద్రంలో నుంచే ఉదయిస్తాయి తరంగాలు. సముద్ర జలంకన్నా విలక్షణంగా కనిపిస్తాయి. మరలా ఒడ్డుకు వచ్చి అక్కడ విరిగిపోతే విరిసి ఆ సముద్రంలోనే కలిసిపోతాయి. అప్పుడిక అంతా సముద్రమే. తరంగమనేది ఎక్కడ లయమయిందో ఎవరికీ అంతుపట్టదు. అలాంటిదే విదేహముక్తుడి దశ కూడా నన్నారు. మహాభారతం మోక్ష ధర్మ పర్వంలో ఈ దశనిలా వర్ణించారు వ్యాసభగవానులు. **"శకునీనామివా కాశే - మత్స్యా నాంతు యథాజలే - పదమ్ యథా నదృశ్యేత - తథా జ్ఞానవతామ్ గతిః"** ఆకాశంలో పక్షులు పోయిన జాడ - నీళ్ళల్లో చేపలు పోయిన జాడ ఎలా మనకు గుర్తు చిక్కదో - అలాగే ముక్తులు పోయే జాడ కూడా మనకంతు చిక్కదట. ముక్తులలో చక్రవర్తి అయన శకుమహర్షి జీవితంలో ఇది చక్కగా వ్యక్తమవుతుంది మనకు. **"శకస్తు మారుతా చ్ఛీఘ్రామ్-గతిమ్ కృత్వాం తరిక్షగః దర్శయిత్వా ప్రభావం స్వం సర్వభూత గతోఽ భవత్"** గాలికన్నా శీఘ్రమైన గమనంతో శుకుడంతరిక్షాని కెగిరిపోయి అనంతర మీ సకల భూతాల అంతరంగాలలోనూ ప్రవేశించి అదృశ్యమయి పోయాడట.

కాబట్టి మరణమనేది సామాన్యంగానే Equal సంభవించినట్టు కనిపించినా ముక్తుడికీ ఇతరులకూ తేడా ఉంది. ముక్తుడికి ప్రాణోత్క్రమణం లేదు. తన్నిమిత్తమైన ప్రయాణమూ లేదు. దానికి కారణమొక్కటే. మిగతా లోకులంతా అజ్ఞానంతో అనృతాభి సంధులై పోతే వీడు బ్రహ్మజ్ఞాన బలంతో సత్యాభి సంధి అయి ఉంటాడు. కాబట్టి ఎక్కడికీ కదలిపోనక్కరలేదు. అభిసంధి అంటే సంకల్పం లేదా ఉద్దేశ Intention మని అర్థం. అది సత్యం మీదనే ఉంటే వాడు సత్యాభి సంధుడు. అలాకాక అనృతం మీద ఉంటే అనృతాభిసంధుడు. దీనినొక చక్కని లోకవృత్తంతో ముడిపెట్టి మన మనసుకు పట్టే లాగా వక్కాణించి చెబుతున్నది ఛాందోగ్యోపనిషత్తు. ఒకడు దొంగతనం చేశాడని అనుమానించి వాణ్ణి రాజభటులు పట్టుకుపోతున్నారట. వాడు నేనే పాపమెరుగను చాలామంచి వాడనని నలుగురినీ చూచి మొరబెడుతున్నాడట. అప్పుడక్కడ ఉన్న పెద్ద మనుషులంతా చేరి వాడికొక పరీక్ష పెడతారట. అదేమిటంటే గాడి పోయిలో బాగా ఎఱ్ఱగాకాల్చి తీసిన గడ్డ పార వాడిచేతి కివ్వమంటారు. వాడది రెండు చేతులతో గట్టిగా పట్టుకొని దూస్తూ పోవాలి. అలా దూసిన తరువాత వాడి చేతులు కాలటంగాని బొబ్బలెక్కటంగాని లేకపోతే వాడు సత్యాభిసంధుడు. లోపల ఎలాగో పైకి అలాగే ఉన్నాడని అర్థం. మరి దూసిన వెంటనే కాలి బొబ్బలెక్కాయో వాడనృతాభిసంధుడు. లోపల దొంగనని తెలిసి కూడా పైకి కాదని బుకాయిస్తున్నాడు. ఇందులో సత్యాభిసంధుడేనని ఋజువయితే వాణ్ణి వదిలేస్తారు. అలా కాని వాణ్ని మాత్రం చావగొట్టి చెవులు మూస్తారు. ఇలాంటి వ్యవహారమిప్పటికీ మనం పామరులనుకొనే అడవి కొండ జాతులలో కనిపిస్తూనే ఉంది. మనం చూస్తున్నాము. ఈ సంగతి ఉపనిషత్తుకూడా ఉదహరించిందంటే అది ఇక ఎప్పటినుంచి చెలామణిలో ఉందో ఆలోచించండి.

ప్రస్తుత మీ దృష్టాంతాన్ని మనం దార్ష్టాంతికంతో సరిపోల్చుకొని చూడవలలసి ఉంది. మనకిక్కడ సత్యాభిసంధుడు జీవన్ముక్తుడు. వాడు యావజ్జీవమూ పరమ సత్యమైన బ్రహ్మాత్మ భావాన్నే పట్టుకొని కూచున్నాడు. మనోవాక్శరీరాలు మూడూ తదాకారంగా భావిస్తూ ఉన్నాడతడు. ఆ అనుసంధాన బలంతో రేపు అవసానం సమీపించినపుడు కరణవర్గం మనసులో – మనసు ప్రాణంలో – ప్రాణం తేజస్సులో – ఆ తేజస్సు సదాఖ్యమైన మూల తత్త్వంలో కలుస్తుంటే నేనీ సదాఖ్యతత్త్వమేనని

భావిస్తూ అదే అయిపోతాడు. **"యద్భావస్తద్భవతి"** అని గదా అభిజ్ఞుల మాట. **"సదాతద్భావ భావితః"** అని భగవద్గీత కూడా చాటుతున్నది. మొదటి నుంచీ శాస్త్రాచార్యోపదేశ జనితమైన జ్ఞానమొకటి పని చేస్తున్నది. ఆ జ్ఞానదీపం నిత్యమూ ప్రకాశిస్తుంటే ఆ వెలుగులోనే గడిపాడు జీవితమంతా. చివర కవసాన సమయంలో కూడా ఆ వెలుగులోనే సర్వత్రా పరచినట్టు కనిపించే తన సర్వాత్మ భావంతోనే తాను తాదాత్మ్యం చెందుతున్నాడు. ఇకవాణ్ణి ఈ ప్రకృతి ధర్మాలనే రాజపురుషులేమీ చేయలేవు. తమకట్లు విప్పుకొని వెళ్ళిపోతుంటే గుడ్లప్పగించి చూస్తుండవలసిందే.

పోతే అనృతాభిసంధుడనే వాడిక్కడ మామూలు సంసారి. వీడికింకా ఆ బ్రహ్మజ్ఞానమనేది ఉదయించలేదు. జీవితమంతా పామరంగానే బ్రతుకుతుంటాడు. వాడు మనసుతో మాటతో కాయంతో పట్టుకొని కూచున్నదంతా ఈ సాంసారికమైన భావాలే. అవి సదాభాసలే గాని ఎప్పుడు సత్యం కావు. అంటే నూటికి నూరుపాళ్ళూ అనృతమే. ఇలాంటి అనృతాన్నే జీవితాంతమూ తన సర్వస్వమని భావిస్తూ కూచున్నాడు. కాబట్టి చివరకు చచ్చేనాడు కూడా దాని సంస్కారాలతోనే చస్తాడు మానవుడు. అంటే తేజోమాత్రలో చేరిన జీవుడు సదాఖ్య తత్త్వాన్ని దర్శించే జ్ఞానజ్యోతిని కోలుపోయి ఆ మహాతమస్సులో తదాభాస అయిన అవిద్యారూపిణి అయిన బీజశక్తి ఒడిలోనే పోయి పడతాడు. పడగానే అది సత్యాన్ని కప్పి పుచ్చటమే కాబట్టి ప్రకృతి శక్తులనే రాజభటులు నలుగురు చేరి వీడు అబద్ధాలకోరని చెప్పి చావబాదుతారు. అంటే ఏమన్నమాట. మరలా భద్రంగా తెచ్చి ఈ సంసారమనే బందిఖానాలో తోసిపోతారని భావం.

అంచేత ముక్తుడికీ బద్ధుడికీ మరణ క్రమమనేది సమానమే అయినా ముక్తుడు సత్యాభిసంధి గనుక బద్ధుడిలాగా మరణించడు. అంటే మరలా దేహసంబంధమనేది లేదు వాడికి. సత్సాయుజ్య సంపన్నుడయి అలాగే నిలిచి ఉంటాడు. ఎక్కడ ఎలా అనే ప్రశ్న కూడా లేదు. సత్యమనేది సర్వత్రా సర్వదా ఉంది గనుక సర్వత్రా సర్వదా సర్వమూ తానే అయి ఉంటాడు. అంతకుముందు కూడా ఆ మాటకు వస్తే సర్వత్రా ఉన్నవాడే. ఎందుకంటే జీవించి ఉండగానే ముక్తుడయ్యాడతడు. అయినా ప్రారబ్ధమింకా తీరలేదు కాబట్టి ఒక శరీరమనేది అతణ్ని కరచుకొని ఉన్నది. అలా ఉన్నా అది బాధితాను వృత్తి Continues though contradicted రూపమే కాబట్టి

అతడికి నిజంగా బాధకం కాదు. కేవలం లోకదృష్టికి మాత్రమే అలా భాసిస్తుంది. అతని దృష్టికది తన చైతన్యానికొక ఛాయ Shadow మాత్రమే. అంతకు మించి అస్తిత్వం లేదు దానికి. దీనికే దగ్ధపటవత్తని వర్ణించారు వేదాంతులు. కాలి మసి అయిపోయిన వస్త్రం లాంటిదది. మసి అయిన వస్త్రం మడతలు అలాగే కనపడుతుంటాయి. అయినా సుఖం లేదు. కట్టటానికి లేదు ఒకరికి పెట్టటానికి లేదు. అలాంటీదీ వాడికంటుకొన్న ఈ శరీరాది సంఘాతం. కాగా ఇప్పుడా అంటుకొన్న శరీరం కూడా తుప్పులాగా రాలిపోయింది. అంతే తేడా. అయితే ఎంత చెడ్డా శరీరమున్న నేరానికప్పుడాకలి దప్పులని, కష్టసుఖాలని ఇలాంటివి అనుభవించక తప్పింది కాదు. ఇప్పుడో ఆ అనుభవం కూడా లేదు.

## దృష్టిభేదం

ఈ రెండవస్థలకూ ఉన్న తేడా మన మనస్సుకింకా స్పష్టంగా బోధపడటానికి సంప్రదాయజ్ఞులొక రెండు చక్కని దృష్టాంతాలు కూడా ఉదహరిస్తారు. ఒకటి దారుగజ దృష్టాంతం. ఇంకొకటి లవణజల దృష్టాంతం. ఒక కొయ్యలో ఏనుగును నిర్మించి కొంత దూరాన ఒకచోట నిలిపారనుకోండి. ఏమీ తెలియని పిల్లలది దారువనేసంగతే మరచి నిజంగా ఏనుగేనని గుడ్లప్పగించిచూస్తుంటారు. కాని అన్నీ తెలిసిన పెద్దమనిషి అలా ఎన్నటికీ చూడడు. అతడి కది దారువుతో తయారయిన పదార్థమని తెలుసు. ఆ మేరకు దారు దృష్టి ఉంది. అలాగే ఆ దారువులో చెక్కినశుండా దంతకర్ణ పాదోదరాది విశిష్టమైన ఒక ఆకృతిని కూడా చూస్తుంటాడు. ఆ మేరకు గజదృష్టి కూడా ఉంది. అయితే దారువనే మూల ద్రవ్యాన్ని మరచిన గజదృష్టి కాదది. దారువనే అధిష్ఠానాన్ని substance or stuff పట్టుకొనే గజాకృతిని కూడా చూస్తుంటాడు. అలాగే చూస్తాడు జీవన్ముక్తుడీ ప్రపంచాన్ని. దీన్ని పూర్తిగా వదల లేదతడు. అలాగని బ్రహ్మతత్త్వాన్ని మరవలేదు. బ్రహ్మమనే అధిష్ఠానంలో శరీరాది ప్రపంచాన్నంతా దర్శిస్తాడు.

పోతే విదేహముక్తుడి దశ ఇంతకన్నా అతీతమైనది. అది లవణజలం లాంటిదని వర్ణిస్తారు. ఒక లవణ పిండం జలంలో కలిసిపోతే ఇక జలంకన్నా అది వేరుగా ఎక్కడా కనిపించదు. జలమే ఒకప్పుడు లవణమై మరలా ఇప్పుడది జలమే అయి

కనిపిస్తున్నదంత మాత్రమే. ఇప్పుడది ఎక్కడ చేతికి తీసుకొని చూచినా జలమే జలం. అలాగే విదేహముక్తుడికిక ప్రపంచ వాసనలేదు. నామరూపాత్మకమైన ఈ ప్రపంచమంతా ఒక లవణ పిండం మాదిరే మరి చైతన్య రసంలో కరగి చిదేక రసంగానే అనుభవానికి వస్తుంది. అప్పుడంతా వాడికి చైతన్యమే చైతన్యం. మరేదీలేదు. ఇలా ముక్తుడైన మానవుడే మరలా ముక్తుడవుతున్నాడు. అప్పుడు సదేహముక్తుడైతే ఇప్పుడు విదేహముక్తుడు. అందుకే **"విముక్తశ్చ విముచ్యతే"** అని చాటుతున్న దుపనిషత్తు.

## ముక్తి సామ్రాజ్యం

పోతే ఇక ఈ విదేహముక్తి లభించిన తరువాత దాని స్వరూపమేమిటి తన్మూలంగా జీవిత పరమార్థం మనకెలా సిద్ధిస్తున్నదని ప్రశ్న. విదేహముక్తుడికి జీవన్ముక్తుడికున్న ప్రారబ్ధకర్మ కూడా లేదు. ఆ దశ అందుకొనే సరికి కర్మకోశమంతా నిశ్శేషంగా విశ్రాణితమై పోతుంది. దానితో శరీర సంబంధమూ పోయింది.

ప్రపంచ సంబంధమూ పోయింది. పిండాండ బ్రహ్మాండాలు రెండూ పోతే ఇక ఆ ముక్తుడెక్కడ ఉన్నట్టు. ఎక్కడ అని ప్రశ్నే లేదు. ఎక్కడా ఎప్పుడనేవి దేశకాలాలు Space & Time అవి రెండూ వాడి స్వరూపమే అయి వాడిలోకే వచ్చేశాయి. కాబట్టి వాడిక ఎక్కడైనా ఉండాలంటే ఎక్కడా ఉండలేదు. తను దాన తాన అన్నట్లు తనలో తానే ఉండాలి. **"స్వమహిమ్ని ప్రతిష్ఠితః"** అన్న దుపనిషత్తు. మహిమ అంటే విస్తారం Expanse. తన విస్తారంలో తానున్నదట ఆ బ్రహ్మం. ముక్తుడూ ప్రస్తుతం బ్రహ్మమే అయ్యాడు కాబట్టి తనలోనే తానుంటాడు. అంటే ఏమన్నమాట. సచ్ఛిద్రూపంగా సర్వమూతానే అయిపోతాడని తాత్పర్యం. సర్వత్రా సర్వ పదార్థాలలో ఉన్నదనే గదా.

దీనినే **"అస్మాచ్ఛరీరా త్సముత్థాయ - పరమ్‌జ్యోతి రుపసంపద్య స్వేనరూపేణ అభినిష్పద్యతే"** అని శాస్త్రం వర్ణించి చెబుతున్నది. ఈ శరీరం నుంచి లేచిపోయి తదతీతమైన జ్యోతినాశ్రయించి తన స్వరూపాన్ని తాను పొందుతాడట. లేవటం, ఆశ్రయించటం, పొందటమనేసరికి మరలాద్వైత దృష్టి ఏర్పడవచ్చు మనకు. అలాంటి భ్రాంతి పడనక్కరలేదంటారు భాష్యకారులు శరీరం నుంచి లేవటమంటే అంతకు ముందు జీవన్ముక్త దశలో శరీరాత్మ భావమెలాగూపోయింది. ఇప్పుడా ప్రారబ్ధకృతమైన

శరీరం కూడా పోతుందని అర్థం. పోతే ఇక పరంజ్యోతి ఏమిటి. భౌతికమైన సౌరచాంద్రమసాది జ్యోతులేవీ కావు. ఆత్మ చైతన్యమే ఆ జ్యోతి. దాన్ని పొందటమంటే అదే నేనని భావించటం. అభి నిష్పత్తి కూడా ఇక్కడ ఏదో మరో రూపంలో తయారవుతాడని కాదు. ఆ తయారయ్యే రూప మాగంతుకం కాదు. స్వరూపమే. స్వేనరూపేణ అనే మాటలోని స్వారస్యం గ్రహించాలి మనం. స్వేనరూపేణ అంటే ఆత్మరూపేణ అని అర్థం. ఆత్మకేమిటి రూపం శుద్ధ చైతన్యమే. అదిప్పుడూ ఉన్నదేగదా ఆత్మకు. ఇక తయారయ్యేదేముంది. పోతే సర్వజ్ఞతా సర్వశక్తతాదులు కూడా చెప్పాడు జైమిని. కాదంటాడు ఔడులోమి అనే ఆచార్యుడు. పరవాలేదు. రెండూ ఉండవచ్చునన్నారు బాదరాయణులు. చైతన్యమనేది పారమార్థికమైతే సర్వజ్ఞత్వాదులు వ్యావహారిక దృష్ట్యా చెప్పుకోవచ్చు నంటారాయన. ఇంతకూ తాను చేరేది ముక్తుడికి తన స్వరూపమే గాని అంతకన్నా భిన్నమైనది కాదు. అవిభక్తమైన ఆ స్వరూపమే ఇంతకుముందు శరీరాద్యుపాధుల మూలంగా విభక్తమై కనిపించింది. ప్రస్తుతమవన్నీ పూర్తిగా లయమైపోయాయికాబట్టి మరలా అవిభక్తంగానే అనుభవానికి వస్తుందని గ్రహించాలి మనం.

శరీరాద్యుపాధి రహితుడెప్పుడయ్యాడో ఇక వాడికి సుఖదుఃఖాది సంసర్గమే లేదు. **"అశరీరమ్ వావ సంతమ్ న ప్రియాప్రియే స్పృశతః"** అనే ఉపనిషద్వాక్యానికిదే అర్థం. శరీరమున్నంత వరకే ప్రియా ప్రియ సంపర్కం. అది లేకపోతే వాటి స్పర్శకూడా లేదు వాడికి. జీవన్ముక్తుడికే లేదు. ఇక విదేహముక్తుడి మాట చెప్పేదేముంది. అయితే మరి ముక్తులమై మనకిక సుఖమేమిటి. కేవల మీ సంసార దుఃఖం లేకపోవటమే కాదు గదా. దానిని మించి సాక్షాత్తుగా ఒక సుఖమనేది కూడా కలగాలి ముక్తుడికి. సుఖం కోసమే గదా మానవుడు ముక్తిని కోరటం. ఇంత కష్టపడి దాన్ని అందుకొన్న తరువాత దానిలో సుఖానుభవం లేదంటే ఏమి ప్రయోజనం గురువుగారి మరచెంబు కథే అవుతుందని ప్రశ్న వస్తుంది. ఈ ప్రశ్న పూర్వం ఇంద్ర విరోచనులనే ప్రాజాపత్యులకే వచ్చింది. సర్వలోకాల మీదా ఆధిపత్యం కలిగి సకల సుఖాలూ అనుభవించే మార్గమేమిటో తెలపమని వారు పితామహుణ్ణి పోయి ప్రాధేయపడతారు. ఆయన వారికి సర్వాత్మ భావ The subjective one ness of all creation రూపమైన బ్రహ్మవిద్యనుపదేశించి ఇదే దానికి జవాబు పొమ్మంటాడు. బ్రహ్మవిద్యవారి ప్రశ్నకెలా

జవాబయింది.బ్రహ్మజ్ఞానం కలిగితే సర్వమూ నేననే భావమనుభవానికి వస్తుంది. దీనికే సర్వాత్మభావమని పేరు. సర్వానికీ వాడాత్మ. సర్వమూ వాడికాత్మ. రెండు విధాలుగా నిర్వచించారు దీన్ని భగవత్పాదులు. ఇందులో సర్వమూ కనిపిస్తూ ప్రతి ఒక్క దానిలోనూ తాను ప్రవేశించి తన స్వరూపంగానే వాటి ననుభవించవచ్చు. అంతటా తానే అయినప్పుడన్నీ అనుభవింటంలో అభ్యంతరమేమున్నది.

ఇందులో మొదటిది వాడి స్వరూపస్థితి అయితే ఇది దానివల్ల అయత్న సిద్ధంగా కలిగే విభూతి. దీనినే ఐశ్వర్య Power of manifestation మని కూడా వ్యవహరిస్తారు. తద్ద్వారా సర్వజ్ఞతతోపాటు సర్వశక్తులూ వాడికి వశపడతాయి. **"సర్వకామః సర్వగంధః సర్వరసః సత్యకామః సత్యసంకల్పః"** అని ఎంతగానో వర్ణించింది శాస్త్రం. ఏది కావలసి వస్తే అది తన సంకల్ప బలంతోనే సాధించగలడు ముక్తుడు. **"సయదా పితృలోకకామోభవతి – తదా సంకల్పాదేవ పితర స్సముత్తిష్ఠంతే"** ఎప్పుడు వాడు ఏ కాలాన్ని చూడాలన్నా ఏ భోగమనుభవించాలన్నా అన్నీ చూడగలడు. అనుభవించగలడు. మన పురాణాలలో నారద మహర్షి త్రిలోక సంచారమూ విశ్వామిత్రుని అభినవ సృష్టీ ఇలాంటిదే. వ్యాసభగవానుడు ధృతరాష్ట్రాదులకు యుద్ధంలో చచ్చిన బంధుమిత్రాదుల నందరినీ కండ్లకు కట్టినట్టు చూపటంకూడా ఇలాంటిదే. అంతకుముందు విదురుడు ధృతరాష్ట్రునికి ఆత్మప్రబోధం చేయటానికి తన గురువైన సనత్సుజాతుణ్ని బ్రహ్మలోకం నుంచి రాత్రికి రాత్రి హస్తినాపురానికి ఆవాహన చేయటం కూడా మరి ఇలాంటి సత్యసంకల్పమే ఇలా ఎన్నో ఉన్నాయి సందర్భాలు. ఇవన్నీ జీవన్ముక్తి దశలో కలిగినసంఘటనలే అయినా కైముతిక న్యాయంచేత what then to speak of విదేహ ముక్తుడికిక చెప్పనే అక్కరలేదని ఊహించవచ్చు. కాబట్టి ముక్తిలో సుఖం కోసమని వెతుక్కోనక్కరలేదు. ఏ సుఖం కావలసినా ఉంది. హస్తిపాదంలో సమస్త జంతువుల పాదాలూ ఇమిడి పోయినట్టు అన్ని సుఖాలూ అందులోనే పొందుపడి ఉన్నాయి.

అయితే మరలా ఒక సందేహం. ముక్తుడంటే అన్ని బంధాలనుంచీ విడుదల అయిన వాడని గదా అర్థం చెప్పారు. విదేహముక్తుడి విషయంలో అది అక్షరాలా సరిపోవాలి గదా. అలాంటప్పుడతడికీ సంకల్పాలూ – ఈ పితృలోకాది సందర్శనమూ

ఎలా సంభవం. వాస్తవమే. అన్నీ వాడి స్వరూపానికి భిన్నమనే భావన ఉంటే అది ముక్తికాదు. బంధమే. కాని చిత్రమేమంటే అతడేది సంకల్పించినా దానితో అతడేది దర్శించినా ఆత్మ చైతన్యాని కనతిరిక్తంగానే దర్శిస్తుంటాడు. ప్రతి ఒక్కటీ చైతన్య పరిధిలో చైతన్యాత్మకంగానే అనుభానికి వస్తుంటుంది. ఇది బంధావస్థలో లేదు. ముక్తావస్థలో మాత్రమే కనిపించే విచిత్రం. ఇది వాడికి స్వానుభవైక వేద్యం కాబట్టి సంసార బంధంలో సతమతమవుతున్న మన బోంట్ల కంతుపట్టేది కాదు. పట్టకుండా ప్రశ్నవేస్తే సుఖం లేదు. అనేక వికల్పాలకది దారితీస్తుంది. అలా వికల్పించినవారే పూర్వం బాదరి మొదలైన ఆచార్యులంతా. బాదరి ముక్తావస్థలో శరీరేంద్రియాల ఉనికి నంగీకరించడు. జైమిని శరీరేంద్రియాలు కూడా ఉన్నాయంటాడు. రెండింటికీ అవకాశముందని సమన్వయించారు బాదరాయణులు. ఆయన చెప్పేదేమంటే ముక్తుడైన వాడిక బ్రహ్మమే. బ్రహ్మానికన్ని శక్తులూ ఎలా సహజంగా ఉన్నవో వాడికీ అవి సంక్రమించవలసిందే. తన్మూలంగా ఏదైనా సంకల్పించవచ్చు. ఏదైనా సాధించవచ్చు. ఇందులో సంకల్పించటం Planning జ్ఞానశక్తి అయితే సాధించటం Execution క్రియాశక్తి. లేదా ఐశ్వర్యం. ఈ జ్ఞానైశ్వర్యాలు రెండూ ఎంత మోతాదులలో ఉండాలో అంతమోతాదులలోనూ ఉంటాయి ఆ దశలో. ఇక ముక్తుడికి కొదవ ఏముంది.

ఇందులో రహస్యమేమంటే ముక్తుడు బ్రహ్మీభూతుడే కాబట్టి బ్రహ్మంలాగా ద్విపాత్రాభినయం చేయగలడు. ఏమిటా ద్విపాత్రలు. నిరుపాధిక Transcendent మొకటి. సోపాధిక Immanent మొకటి. మొదటిది అద్వితీయమైన చైతన్యమైతే రెండవది సద్వితీయమైన విభూతి. మొదటి దానిలో ఏ అనుభవమూ లేదు ముక్తుడికి స్వరూపానుభవం తప్ప. రెండవ దానిలో అలా కాదు. సంకల్ప బలంతో అన్ని భావాలూ సృష్టిస్తాడు. కాబట్టి స్వరూపానుభవమే కాక అన్ని అనుభవాలూ ఉంటాయి. అలా ఉన్నప్పుడే అది పరిపూర్ణత Perfection లేకుంటే పరిపూర్ణ మనిపించుకోదు. పరిపూర్ణం కాకుంటే అది మోక్షమే కాదు. అందుకే **"తస్మిన్ దృష్టే పరావరే"** అంటుందుపనిషత్తు. పరమంటే కారణ రూపం. అవరమంటే కార్యరూపం. కారణ కార్యరూపాలు రెండూ అదే. **"పూర్ణమదః-పూర్ణమిదమ్"** అది పూర్ణమైతే దాని

సంకల్పం వల్ల సృష్టి అయిన ఇదీ పూర్ణమే. అయితే ఆ దృష్టితో చూడాలి ఎటు వచ్చీ. చూడకుంటే మరలా అపూర్ణమేనని హెచ్చరిస్తారు భగవత్పాదులు. ముక్తుడు ప్రస్తుతమిలాంటి పూర్ణైక దృష్టితోనే ఉంటాడు కాబట్టి సహజమైన జ్ఞానశక్తితో సంసారానికంతా అతీతుడయి ఉంటాడు. మరలా తన మాయా శక్తితో జగత్సృష్టి స్థితిలయాల కాధిపత్యమూ వహిస్తుంటాడు. జగద్వ్యాపార వర్జమనీ సగుణ ముక్తులకు చెప్పిందేగాని విదేహముక్తుడికా కొఱత లేదు. సగుణ ముక్తులు సద్యోముక్తులు కారు. వారు క్రమ ముక్తులు. దేహావసానంలో సత్యలోకానికి పోయి అక్కడ **"పరస్యాంతే కృతా త్మానః ప్రవిశంతి పరమ్ పద"**మ్మని క్రమంగా శిక్షణ పొందిగాని ముక్తులు కారు.

పోతే ఈ విదేహముక్తులలా కాదు. వీరు సద్యోముక్తులు. వీరికి బ్రహ్మలోకాది గమనం లేదని చెప్పాము. కాబట్టి నిత్యముక్తుడైన ఈశ్వరుడిలాగా సృష్టిలయాదులు చేయగలరు. అలా చేస్తున్నా ఆ ఈశ్వరుడిలాగానే ఏదీ అంటి ముట్టకుండా ఉండగలరు. అన్ని సుఖాలూ అనుభవించగలరు. అలా అనుభవిస్తూ ఏ అనుభవమూ లేని స్వరూపావస్థలో ఉండగలరు. ఒకరేదీ వారికివ్వ నక్కరలేదు. అంతా స్వరూపమయి నప్పుడెవరున్నారు గనుక. తమ ఇచ్ఛతోనే తామన్నీ సృష్టించుకొని అనుభవిస్తుంటారు. అది తమ స్వరూపమే కాబట్టి తమ అద్వైత భావానికెప్పుడూ ముప్పువాటిల్లదు. **"ఏక మేవా ద్వితీయమ్ బ్రహ్మ."** స్వస్థత అంటే అసలిదేనన్నారు భగవత్పాదులు. **"స్వస్మిం స్తిష్ఠతీతి స్వస్థః తస్యభావః స్వస్థతా"** తనలో తానుండటమే స్వస్థత. ఎక్కడ ఉన్నా ఉన్నది తనస్వరూపమే కాబట్టి ముక్తుడెప్పుడూ తనలోతానే ఉంటాడు. అదే అచ్యుతమైన ఆరోగ్యం మనం పాలిటికి. ఇక దానికి మరలా పునరావృత్తి అనే రోగం లేదు. సకల సంసార దుఃఖాలూ నివృత్తి అయి – సర్వసుఖాలూ చేకూరినట్టే. దానితో సమస్త పురుషార్థాలు కూడా సిద్ధించినట్టే. సిద్ధిస్తే ఇక పురుషుడు నిజంగా పురుషుడే. **'పురిశయనా త్పురుషః'** మొదట ఈ శరీరమనే పురంలో ప్రవేశించాడు. **'పూరణా త్పురుషః'** తరువాత బ్రహ్మవిద్య నార్జించి దాని బలంతో సర్వ ప్రపంచాన్నీ పూరించి నిండిపోయాడు. **'పూర్ణత్వా త్పురుషః'** ఆ పిమ్మట అంతా స్వరూపంగానే అనుభవిస్తూ పరిపూర్ణుడయి నిలిచాడు. అందుకే అతడు పూర్ణ పురుషుడు.

# ఫలితాంశము

మొత్తం మీద ఇంతవరకూ సాగిన ఈ దీర్ఘమైన విచారణకంతటికీ ఏమిటి ఫలితాంశమని ప్రశ్న. మానవుడు శాస్త్రోక్తంగా సాధనచేసి చివరకు పొందవలసిన ప్రయోజనం ముక్తి. ముక్తి అంటే విడుదల అని అర్థం. సంసార దుఃఖభారం నుంచి వైదొలగటం కాబట్టి అది ముక్తి అయింది. ఇది జీవన్ముక్తి-విదేహముక్తి అని రెండు విధాలు. జీవన్ముక్తుడికి ప్రారబ్ధమనే కర్మమాత్రముంటుంది. అయినా అది బ్రహ్మ నిష్ఠాబలంతో నిగ్రహించుకోగలడు. కాబట్టి శరీరాదులున్నా అతణ్ణి బాధించలేవు. కేవలమొక నీడలాగా అనుసరించి ఉంటుందది. ఇలాంటి జీవన్ముక్తులు మరలా రెండు జాతులు. ఒకరు ఆత్మారాములు. వారికి లోకంతో పనిలేదు. పోతే లోకంతో పని ఉన్నవారు రెండవ జాతికి చెందిన ఆచార్యపురుషులు. వీరంతా లోకోద్ధరణ కోసమని పరమాత్మచేత నియోగింపబడతారు. వేదవ్యాసాది మహర్షులంతా ఇలాంటివారే. వారు తమ బోధలద్వారా వ్రాతల ద్వారా ముముక్షు జనాన్ని సాధకులుగా తీర్చిదిద్దుతారు. ఇది ఒక చక్కని సంప్రదాయంగా Tradition పరిణమిస్తుంది. దానివలన విద్య విచారాత్మకమే Visionary గాక ప్రచారాత్మకం Missionary కూడా అయి వ్యాప్తి చెందుతుంది. పోతే ఈ జీవన్ముక్తుడు శరీరపాతమైన తరువాత విదేహముక్తుడవుతాడు. ఈ దేహం పోయి మరలా ఇక దేహం రాకపోవటమే విదేహమంటే. అందులో జ్ఞానంతోపాటు సర్వశక్తులూ వశమవుతాయి కాబట్టి నిర్గుణంగానే గాక సగుణంగా కూడా భాసించవచ్చు. తన్మూలంగా సృష్టిస్థితి సంహార తిరోధానానుగ్రహాది క్రియల కన్నింటికీ సమర్థుడవుతాడు ముక్తుడు. సమస్త క్లేశాలూ అస్తమించి సకల సుఖాలూ అనుభవిస్తూ ఏ కార్యమైనా చేయగలిగి మరలా అదంతా తన స్వరూపంగానే చూడగలిగిన అపరోక్షాద్వైతానుభూతి అది. దానితో పురుషార్థమనేది అప్రయత్నంగా ఫలిస్తుంది. ఇంతకన్నా మానవ జీవితానికి వాంఛింప దగిన గమ్యం మరొకటి లేదు.

**సాకాష్ఠా-సా పరాగతిః**

**అహ మేవ పరమ్ బ్రహ్మ**

**బ్రహ్మాఽ హమ్ పరమమ్ మతమ్**

# ఉపసంహారము

ఇంతవరకూ మనం శంకరాద్వైత విజ్ఞానమార్గంలో ప్రయాణం చేస్తూ వచ్చి ఇప్పటికి గమ్యస్థానం చేరుకొన్నాము. ఈ మార్గంలో మొత్తం మీద ఆరు మజిలీలను దర్శించాము మనం. ఆరూ కలిసి ఒకదానికొకటి మనలను నడిపిస్తూ శాస్త్ర ప్రమేయా Scope of the Subject న్నంతటినీ అరచేతిలో ఆమలకంలాగా మనకందజేస్తున్నాయి. అందులో ఈ కనిపించే ప్రపంచమే సత్యమని చూస్తుంటే మనం – ఇది వాస్తవంలో లేదు – ఉన్నదొక్క బ్రహ్మమేనని తేల్చివేసింది మొదటి భూమిక. అయితే అది ఒక్కటే ఉండాలి గదా ఈ ప్రపంచం కూడా ఇలా ఎందుకు కనిపిస్తుందనే దానికిది కేవలం వ్యావహారికమే దీనినొక ఆలంబనంగా చేసుకొని మనమెప్పటికైనా ఆ పారమార్థికాన్ని అందుకోవాలని చెబుతుంది రెండవ భూమిక. అలా చేరటానికి సాధనమేమిటని అడిగితే పురుషతంత్రమైన కర్మా ఉపాసనా గాదు కేవలం వస్తు తంత్రమైన జ్ఞానమేనని చాటుతుంది మూడవది. ఆ జ్ఞానమనేది ఎలా పనిచేస్తుంది దాని బలంతో తత్త్వాన్ని మనమెలా అనుభవానికి తెచ్చుకోవాలని ప్రశ్న వస్తే అనాత్మ రూపమైన ప్రపంచాన్ని మొదట ఆధ్యారోపం చేసి అంతా అపవదిస్తే చివర కాత్మ రూపంగా అదే భాసిస్తుందని బోధిస్తుంది నాలుగవది. అయితే ఇది అందరికీ ఫలితమివ్వటం లేదే కారణమేమిటని అడిగితే ప్రాక్తన కర్మ ప్రతిబంధమే కారణం అని చెప్పి దాన్ని రూపుమాపటానికి మొదట శమాదులూ పిమ్మట శ్రవణాదులూ అభ్యసించాలని సలహా ఇస్తుందయిదవది. పోతే ఇలాంటి సాధన వల్ల మనకు కలగబోయే ఆమోక్షమనే ఫలాన్ని కర్ణపేయంగా వర్ణిస్తుంది ఆఖరిదైన ఆరవ భూమిక. ఒక్క మాటలో చెబితే జీవిత సత్యమేదో దాన్ని నిర్ధారణ చేసుకొని సాధన చేస్తూ పోతే ఈ సంసార బంధం నుంచి మనం శాశ్వతంగా విముక్తి పొందగలమని సిద్ధాంతం.

శంకర గ్రంథావళిలో విస్తరించి ఉన్న ఈ అద్వైత సిద్ధాంతాన్నే నేనీ గ్రంథంలో సంగ్రహంగా పొందుపరిచి తమకందజేశాను. కేవలం భాష్యానుసారిగా రచించిన గ్రంథమే అయినప్పటికీ అక్కడక్కడ కొంత స్వాతంత్ర్య మవలంబించవలసి వచ్చింది. అది ఆధునికుల బుద్ధులకు భాష్యార్థాన్ని మలచి చెప్పటానికి చేసిన ప్రయత్నమే గాని మరేదీ గాదు. భాష్యాక్షరాన్ని గాక అందులో దాగి ఉన్న భాష్యకర్త హృదయాన్ని

పట్టుకొని వ్రాసేటప్పుడు కేవల శాస్త్రాభ్యాసులకు కొంత వింతగా భాసించవచ్చు. హత ప్రహతమైన మార్గం తప్పకుండా పోవటం మంచిదే అయినా దానికి కొంత స్వకీయమయిన మననం కూడాఉండాలని వారికి నా సలహా. ఇందులో కూడా ఆచార్యులవారే నాకు మార్గదర్శకులు.ఎంత గురూపదేశమనిఆయన ఘోషిస్తున్నా కేవలం గురుముఖంగా లభించిన విద్యతోనే ఆయన తృప్తి చెందిన వాడు కాదు. దానిమీద ఎంత దీర్ఘంగానో చింతన చేశాడాయన. అలాటి చింతన ఫలమే ఆయన భాష్య రచన. భాష్యంలో కొంతచూపు పెట్టి వెదకితే అంతకు ముందెవ్వరూ చెప్పని ఆశ్చర్యం గొలిపే స్వతంత్ర భావాలు ఎన్నో దొరుకుతాయి మనకు. సంప్రదాయానికి విరుద్ధంగా చెబుతున్నట్టు కూడా భాసిస్తుందొక్కొక్క చోట. ప్రత్యక్షాను మానాలంటే శ్రుతి స్మృతులని అర్థం చెప్పారాయన. యా నిశా సర్వభూతానామనే చోట నిశా శబ్దానికి పరమాత్మ అని అర్థం చెప్పారు. మరి ఆత్మ, యోగ, ప్రకృతి ఇలాంటి శబ్దాల కొక్కొక్క చోట ఒక్కొక్క అర్థం చెబుతూ వచ్చారు. **"బ్రహ్మచరేణాధి గచ్ఛతి"** అని ఉంటే బ్రహ్మ శబ్దానికి సన్న్యాసమని కూడా అర్థం చెబుతారు. ఒక శబ్దమనే గాదు. శ్లోకాలకూ సూత్రాలకూ కూడా అలాగే వ్యాఖ్య చేస్తారు. **"కర్మణ్యా కర్మ"** - **"యావా నర్థ ఉదపానే"** ఇలాంటివెన్నో ఉన్నాయి ఉదాహరణకు.

అయితే ఇవన్నీ విరోధాభాసలేగాని విరోధాలు కావు. శాస్త్రంలో పూర్వాపరాలు బాగా కలియబోసుకొని దాన్ని తన అనుభవంతో చక్కగా మేళవించుకొని చెబుతారాయన ఏది చెప్పినా. కేవలం చిలక చదువుగా చెప్పరు. ఆ స్థాయి కెదిగి పట్టుకొంటేనే అది మన కర్థమవుతుంది గాని లేకుంటే కాదు. అలా ఎదిగి చూడమనే మనకు గూడా సలహా ఇస్తారాయన. **"సుహృద్భూత్వా ఆచార్యః ఆచష్టే"** అనేది ఆయన కిష్టమైన వాక్యం. దీనికి సాంప్రదాయికమైన అర్థమిదే అయినా మనం దాన్ని ఇలాగే తీసుకోనక్కరలేదు. యథావకాశంగా పోవచ్చునని మన మేలుకోరి బాదరాయణులు చెబుతున్నారంటారాయన. సత్యాన్ని మరుగుపరచకుండా శాస్త్ర సిద్ధాంతానికి దెబ్బ తగలకుండా చెప్పినంతవరకూ ఎలా చెప్పినా పరవాలేదు. తద్విరుద్ధంగా పోయినప్పుడే ప్రమాదం. **"నహి వరఘాతాయ కన్యా ముద్వాహ యంతి"** పెండ్లికొడుకు ప్రాణానికి ముప్పుతెచ్చే పెండ్లి పనికి రాదని ఆయనే అంటారు హాస్యంగా. అలాంటి ముప్పు తెచ్చే వ్యాఖ్యానమెప్పుడూ చేయలేదాయన. ఆయనే

చేయకపోతే ఆయన గారి అడుగు జాడలలోనే పయనించే మనం చేయటమిక ఎలా సంభవం. మూల గ్రంథాల మీద విచారణ సాగించి వాటి హృదయాన్ని పట్టుకొని వారెలా బయట పెట్టారో వారి విచార సాగరాన్ని మథించి దాని ఫలితంగా వచ్చిన నవనీతాన్నే నేనూ తమ ముందు పెట్టాను. ఇందులో ఎలాటి అపశ్రుతికి గానీ చోటు లేదు. అంతవరకూ నిస్సంకోచంగా చాటగలను.

అంతేగాదు. దీనిని రచించే నేనూ పఠించి మీరూ ఆయనకేదో ఒక కిరీటం పెడుతున్నామని కూడా భావించనక్కరలేదు. మకుటంలేని మహారాజాయన. ఆ మహనీయుడికి మనం చేసేదేముంది మేలు. ఆయన విజ్ఞానాన్ని అందుకొని ఆస్వాదించటమే మనకు పదివేలు. మరి విజ్ఞానమంటే ఇలాటి అలాటి విజ్ఞానం కూడా కాదది. నిరంతర సత్యాన్వేషణ శీలుడైన మానవుడి సమస్త విజ్ఞానానికీ గీచిన సరిహద్దులాంటి దాయన మనకందించి పోయిన అద్వైత విజ్ఞానం. దీనికి సాక్ష్యం మనమెంతో దూరంపోయి వెదకనక్కరలేదు. ఒక్క సంగతి ఆలోచిస్తే మనకు చక్కగా తెలిసిపోతుంది. అదేమిటంటే ఈ ప్రపంచంలో ఎన్నో ఉన్నాయి దేశాలు. ఒక్కొక్క దేశంలో ఒక్కొక్క జాతి, ఒక్కొక్క నాగరికతా కనిపిస్తున్నాయి. ఈ నాగరికతా చరిత్ర పరిశీలిస్తే మొదట ఒక అంధమైన విశ్వాసంతో Superstition ఆరంభమవుతుంది జాతి. తరువాత కొంత కాలాని కదిహేతు వాదానికి Reason or Science దారితీస్తుంది. అది కొన్నాళ్ళకు ఇహానికే గాక పరానికి కూడా ఎగబ్రాకి మతంగా Religion చెలామణి అవుతుంది. దాన్ని మరలా హేతు దృష్టాంతాలతో నిరూపణ చేసి చూపితే తత్త్వ విజ్ఞానంగా Philosophy అవతరిస్తుంది. అది మరలా మానవుడి అనుభవానికి వచ్చేసరికి కేవల మద్వైత దర్శనంలోనే పరిసమాప్తి చెందుతున్నది.

ఇలా ప్రతి ఒక్కటీ లోకంలో కేవలద్వైత దృష్టితో ప్రారంభమై చివరకు కేవలా ద్వైత దృష్టితో అంతమవుతున్నదంటే శంకరులు బోధించిన ఈ అద్వైత విజ్ఞానమెంత గొప్ప విజ్ఞానమో చెప్పనక్కరలేదు. ప్రతి ఒక్క మతమూ పరిశీలిస్తే కట్టకడపట మన ఈ అద్వైత దర్శనానికే పట్టం కట్టి కూచున్నది. ప్రపంచమంతా వ్యాప్తిలో ఉన్న పెద్ద పెద్ద మతాలన్నీ గాలించి చూడండి. ఈ రహస్యం బయట పడుతుంది. Mysticism అని ఒక భావ మీ రోజులలో చాలా బహుళ ప్రచారంలో ఉన్నట్టు కనిపిస్తుంది. ఆది మానవుడి విజ్ఞానానికంతటికీ ఆఖరి మెట్టని లోకంలో ఉన్న మేధావులందరూ

అంగీకరించిన సత్యం. Mysticism అంటే ఏదో గాదు. జీవజగదీశ్వరులు మూడూ కలిసి ఏకమని చెప్పే అద్వైత భావమే. రహస్య విజ్ఞానమని దీని నెప్పుడో పేర్కొన్నారు శంకర భగవత్పాదులు. ఉపనిషత్తనే మాటకు రహస్య విజ్ఞానమనే Secret or Esoteric knowledge ఆయన చెప్పిన అర్థం. అపరోక్షానుభూతి అని యోగవిద్య అని కూడా అక్కడక్కడ దానినే వ్యవహరిస్తూ వచ్చారాయన. ప్రస్తుతమే మతం చూచినా సరే. అది క్రైస్తవమేగాదు ఇసలామే గాదు. బౌద్ధమే గాదు. జైనమే గాదు. ప్రతి ఒక్కటీ ఇప్పుడీ రహస్య విద్యనే పరాయణంగా Goal or End భావిస్తున్నది. క్రైస్తవం Christian Mysticism లేదా New thought అని ఒక మార్గాన్ని బోధిస్తున్నది మనకు. ఇస్లాములో తసవ్వుఫ్ అనే క్రొత్తశాఖ అవతరించిఅది "వహ దతుల్‌వుజూద్" అంతా కలిసి ఒకే ఒక సత్త అని తీర్మానించింది. మరి బౌద్ధం Zen Budhism గా రూపుమారిపోయింది.పోతే ఇక హైందవాన్ని గూర్చి చెప్పనే అక్కరలేదు. సాంఖ్య యోగభేద - భేదా భేదవాదాల నన్నింటినీ పూర్వపక్షం చేసి అది ఎప్పుడో అద్వైత జ్ఞానానికి పట్టాభిషేకం చేసి కూచున్నది. **"ఏకమే వాద్వితీయమ్ బ్రహ్మ నేహ నానాస్తి కించన - సర్వమ్ ఖల్విదమ్ బ్రహ్మ అయ మాత్మా బ్రహ్మ, అహమ్ బ్రహ్మాస్మి"** అని ఉపనిషత్తులు ఘోషించే ప్రతిమాటలో అద్వైత భావమే ప్రతిధ్వనిస్తుంది.

ఇలాంటి విశ్వజనీన మయిన విజ్ఞానాన్ని మనకు అన్ని హంగులతో ప్రసాదించి పోయారు శంకర భగవత్పాదులు. అందులకీ మానవజాతి అంతా ఆయన కెంతైనా ఋణపడి ఉంది. కాని ఆ మహనీయుణ్ణి అనుకొనే నాథుడు లేడు. లోకంలో ఆయనకు రావలసినంత పేరు రాలేదు. అదే ఒక గౌతముడో ఒక క్రీస్తో ఒక మహావీరుడో మరొకరో అయితే ఎక్కడ లేని పేరూ, ప్రతిష్ఠా దేశంలోనే కాదు. విదేశాలలో కూడా మారుమోగుతూ ఉంది. అంతెందుకు. మనమింతగా నెత్తిన బెట్టుకొని ఊరేగే గౌతముని లాంటి మహాపురుషులు కూడా ఆధ్యాత్మిక రంగంలో ఈ మానవ సమాజానికి చేసిన మేలేదీ లేదు. మీదు మిక్కిలి కావలసినంత కీడు చేసి పోయారు. ఈ మాట నేనూ మీరు అనటంగాదు. శంకర భగవత్పాదుల నోట వచ్చిందంటే ఇక ఆలోచించండి.

అవిరోధ పాదంలో బౌద్ధ మత సిద్ధాంతాలనూ ఖండిస్తూ ఇలా అంటారాయన. **"అపిచ బాహ్యార్థ విజ్ఞాన శూన్యవాద త్రయ - మితరేతర విరుద్ధ ముపది శతాసుగతేన**

**స్పష్టీకృతమాత్మనః అసంబద్ధ ప్రలా పిత్వమ్, ప్రద్వేషోవా ప్రజాసు-విరుద్ధార్థ ప్రతిపత్యా విముహ్యేయు రిమాః ప్రజాఇతి - సర్వథాపి అనాదరణీయో యమ్ సుగత సమయః శ్రేయస్కామైః"** బాహ్యార్ధవాదమని, విజ్ఞానవాదమని, శూన్యవాదమని ఒకదానికొకటి సంబంధం లేని మూడు వాదాలు లేవదీసి లోకాని కుపదేశించాడు. బుద్ధుడు ఇంత అసంబద్ధంగా మాటాడే వాడాయన సుగతు Aman with right under standing డెలా అయ్యాడో అర్ధం కావటంలేదు. ఇలాంటి విరుద్ధమైన భావాలు ప్రజల కాయనబోధించి పోయాడంటే ప్రజలమీద ఆయనకెంతటి ద్వేషముందో మన మూహించుకోవచ్చు. ప్రజలందరూ ఈ బోధలు విని దిక్కు తెలియక పాడయిపోవాలని బహుశా ఆయన ఆశయమయి ఉండవచ్చు. అంచేత శ్రేయస్కాముడైన వాడెవడూ కూడా ఈ బౌద్ధ సిద్ధాంతాన్ని కన్నెత్తి అయినా చూడగూడదు.

శంకరుని ఈ హెచ్చరిక బాగా గమనించామంటే మనకు రెండు సత్యాలు బయట పడతాయి. బుద్ధుడు తన ప్రవర్తనలో గొప్పవాడైతే కావచ్చుగాని ఆయన విజ్ఞానం మాత్రమేమంత గొప్పది గాదు. నీతివేరు. అనుభూతి వేరు. ఆయనకు కలిగిందని చెప్పే ఆధ్యాత్మికానుభూతి చాలా పరిమితమైనది. అది బుద్ధి విజ్ఞానాన్ని Intellect దాటి పైకిపోలేదు. ఇది ఒక సత్యం. పోతే రెండవదేమంటే అదే సర్వస్వమని చెప్పి తగుదునమ్మా అని లోకానికి బోధించి పోయే సాహసానికాయన గారు పూనుకోవటం.

దీనిని బట్టి చూస్తే శంకరుని దృష్టిలో ఒక మతమనీ మతాచార్యుడనీ గాదు. ప్రజాహితమే ప్రధానమని తేటపడుతున్నది. నిజానికొక జగద్గురువైన వాడికుండ వలసిన దృష్టి అదే. అది పరమార్థాన్ని The Ultimate Reality అనుభవానికి తెచ్చుకొన్న వాడికే అబ్బుతుంది. దానినే సమ్యగ్దర్శన Right Knowledge మని పేర్కొంటారు శంకరులు. ఇలాంటి దర్శనం లేక నోరుంది గదా అని ఊరక వాగేవాళ్ళనెవరినైనా ఎంత పేరున్న వారినైనా క్షమించడాయన. మహావీరుడి లాంటివాణ్ణి ఆయన అన్నమాట లెలాంటివో ఆలకించండి. **"కథమ్ ప్రమాణ భూత స్సంస్తీర్థ కరః ప్రమాణప్రమేయ ప్రమాతృ ప్రమితి ష్వనిర్ధారితాసు-ఉపదేష్టుమ్ శక్నుయాత్-కథమ్వా తదభి ప్రాయాను సారిణః తదుపదిష్టే ఽ ర్థే అనిర్ధారిత రూపే ప్రవర్తేరన్. ఐకాంతిక ఫలత్వ నిర్ధారణేహి సతి తత్సాధనానుష్ఠానాయ సర్వోలోకో ఽ**

**నాకులః ప్రవర్తతే, నాన్యథా అతశ్చానిర్ధారి తార్థమ్ శాస్త్రమ్ ప్రణయ న్మత్తోన్మత్తవ దను పాదేయ వచనః స్యాత్"** తీర్థం కరుడంటేవాడెంతో జవాబుదారీ వహించాలి. వాడు చెప్పే ప్రతి మాటా లోకులకు ప్రామాణికంగా Authoritative ఉండాలి. ఎప్పుడలా ప్రామాణికమవుతుంది. ప్రమాణ ప్రమేయాదులను చక్కగా నిర్ధారణ చేసి ఒక సిద్ధాంతాన్ని బోధించినప్పుడే. లేకుంటే అది ఒక పిచ్చివాడి ప్రేలాపన అని చెప్పి వాడి మాటలకు విలువ నివ్వరు లోకులు. కాకపోయినా అలాంటి మాటలు విని ఎవరు బాగుపడాలని. ఎంత కఠినమైన మాటలో చూడండి ఇవి.

ఇలాగే సాంఖ్య సిద్ధాంత ప్రవర్తకుడైన కపిలుణ్ణి కొందరు గొప్ప చేసి చాటిస్తుంటే వారినిలా మందలిస్తారు భగవత్పాదులు. కపిలుణ్ని మీరు సిద్ధపురుషుడుగా Accomplished soul భావిస్తే భావించవచ్చు. కాని ఆ సిద్ధి అకస్మాత్తుగా రాలేదతనికి. విశిష్ట ధర్మానుష్ఠానం వల్లనే కలుగుతుంది ఏ సిద్ధి అయినా, ఆ ధర్మం శ్రుతి చోదనా మూలకం. అలాంటప్పుడు శ్రుతివిరుద్ధమైన ప్రసంగమెలా చేశాడు కపిలుడు. అతడు శ్రుతులన్నీ బోధించే సర్వాత్మ దర్శనాన్ని సమ్మతించడు గదా. ఆత్మభేదాన్నే సిద్ధాంతీకరించి కూచున్నాడు. అంతేగాదు. ప్రకృతి అనేది పరమేశ్వరా శ్రయ అని శ్రుతులన్నీ ఘోషిస్తుంటే అది సర్వ స్వతంత్ర అని వాదిస్తాడు కపిలుడు. ఇలాంటి కపిలుణ్ణి ఆర్ష విజ్ఞాన సంపన్నుడని చెప్పి ఆయనను పట్టుకొని వ్రేలాడతారు లోకులు. మేమెంత ప్రామాణికంగా వ్రాసినా బోధ చేసినా మా మాట నమ్మరు. ముప్పాతిక మూడుపాళ్ళు పరతంత్ర ప్రజ్ఞులీలోకులు. పేరు ప్రఖ్యాతులను బట్టి పోతారే గాని ప్రామాణికమా కాదా అని పరామర్శించి చూడరు. ఇలా సాంఖ్యాచార్యుడైన కపిలుణ్నే గాక అతణ్ణి పట్టుకు ప్రాకులాడే లోకులను కూడా చీవాట్లు పెట్టారు.

అలాగే తోటి మీ మాంసకులను కూడా లెక్క చేయలేదాయన. వేద ప్రామాణ్యా మంగీకరించక మిగతా వాళ్ళు చెడితే అంగీకరించి కూడా చెడిపోయారు వీరు. అజావి పాలురకంటే హీనమని హేళన చేస్తారు వారినాయన. ఎందుకంటే అంతటి అవివేకులు వారు. తమకు తెలిసిందే ఆత్మ అని సంతోషిస్తున్నారే గాని వారు తెలుసుననుకొంటున్నది అసలైన ఆత్మకాదు. అదినకిలీ ఆత్మ False self. అసలైన ఆత్మ అహంకారానికి గూడా సాక్షి అయి ఉంటుంది. అదికాదు మీమాంసకులు పట్టుకొన్నది. వారు పట్టుకొన్నది కర్తృరూపమైన అహంకారం.దానినే వారు నిజమైన

ఆత్మ అని బోల్తా పడుతున్నారు. కనుక గొర్లకాపరుల కన్నా శోచనీయులైన పండితమ్మన్యులీ కర్మ మీమాంసకులంటారు శంకరులు. పైగా ఇలాంటి పండితమ్మన్యులు మాలో ఉన్నా మేము క్షమించమంటూ "అస్మదీయాశ్చ కేచన" అని ఉత్తర మీమాంసకులను కూడా మందలించారు.

ఇక తార్కికులనైతే ఎన్ని విధాల ఎత్తి పొడిచారో చెప్పలేము. కుతార్కిక భేదదృష్టి - తార్కికకు దృష్టి అని చమత్కారంగా అంటారొకచోట. తార్కికుల దృష్టి శని దృష్టిలాగా వక్రమైన దృష్టి అట. ఉన్నదొకటైతే వారు ఊహించేది మరొకటి. **"అపుచ్ఛ విషాణాః తార్కిక బలీ వర్దాః"** అంచేత తోకలూ కొమ్ములూ లేని పోతుటెద్దులాగా విశృంఖలంగా విహరిస్తుంటారట వారు. అంతేకాదు. వారి తెలివి తేటలెంత అమోఘమంటే **"ఖేపిశాకునమ్ పద మన్వేష్టుమ్ శక్నువంతి"** ఆకాశంలో తిరిగే పక్షుల జాడగూడ తీయగలరు. **"ఖమపి ముష్టినా హంతుమ్ ప్రభవంతి"** దాన్ని పిడికటి పోట్లతో కుమ్మి పారేయగలరు. **"వయంతు తత్కర్తు మశక్తాః"** మరి అంతలేసి పనులు మావంటి అసమర్థులమెలా చేయగలమని ఎత్తి పొడుస్తారు. ఇక బౌద్ధులలో శూన్యవాదుల Nihilists నైతే **"సర్వ ప్రమాణ విరుద్ధత్వాత్ తన్నిరా కరణే నాదరః క్రియతే"** ఏ ప్రమాణానికీ లొంగిరానిదది ఒక వాదమేమిటి పొమ్మని దాన్ని ప్రతిఘటించటానికే ఆదరం చూపరాయన.

ఈ విధంగా చూస్తూ పోతే ఆయన చీవాట్లు పెట్టని మతాచార్యుడే లేడనుకోండి. అయితే ఇంతమంది ఆచార్యుల మత మప్రమాణమయి తనది మాత్రమే ప్రమాణమెలా అయిందని మనకాయన మీద పట్టరాని ఆగ్రహం రావచ్చు. దానికాయన గారే ఇచ్చారు సమాధానం. సత్యం కోసమని గదా మనమంతా అన్వేషిస్తున్నాము. ఆ సత్యమనేది ఎప్పుడూ ఒకే ఒకరూపంలో ఉంటుంది గాని నిమిష నిమిషానికి దాని రూపం మారుతూ పోదు. అలా మారితే అది సత్యమే గాదు. మరి సత్యాన్వేషకులమని చెప్పుకొంటున్నప్పుడు మన కర్తవ్యమేమిటి. ఏకరూపంగా Uniform Consistant నిలిచి ఉన్నదేదో దాన్నే పట్టుకోవాలి మనం. దాన్నే లోకులకు బోధించాలి. మరి ఏకరూప మెప్పుడవుతుంది సత్యం. జీవ జగదభిన్నంగా భావించినప్పుడే అవుతుంది. అలాకాక జీవుడు వేరు జగత్తు వేరని కూచుంటే ఏకరూపం కాదది. అనేక రూపం అనేకమైతే అది వికల్పానికి Diversity దారి తీస్తుందేగాని నిర్వికల్పమైన సత్యం కానేరదు.

ఈ న్యాయాన్ని బట్టి ఆలోచిస్తే ప్రస్తుత మీకపిల కణ భుగాదుల మతాలన్నీ ఇలా వికల్పాన్నే ప్రతిపాదిస్తున్నాయి.కాబట్టి అవి సత్యానికెంతో దూరమని ఊరక మెతుకు పట్టి చూస్తేనే చెప్పవచ్చు మనం. పోతే అద్వైతమనేది వాటన్నిటికీ భిన్నంగా అఖండమైన బ్రహ్మమొక్కటే ఉన్న పదార్థం. అది ఆత్మ స్వరూపమేనని సిద్ధాంతీ కరిస్తున్నది.కాబట్టి దానిలో వికల్పానికిక చోటులేదు. లేకుంటే అది ఏకరూపమే. ఇలాంటి ఏకరూపమైన సత్యాన్ని బోధిస్తుంది గనుక అది ఒక్కటే మనకు ప్రమాణమని వేరుగా చెప్పనక్కరలేదు. ఇదీ ఆచార్యుల వారు చేసిన పరిష్కారం. దీన్ని మనమెంత తార్కికంగా ఆలోచించినా కాదనలేము. కనుకనే అనన్య లభ్యమైన జగద్గురు బిరుదమాయన కొక్కరికే లభించింది. వ్యక్తులు కాదాయనకు కావలసింది. తత్త్వగవేషణ మాత్రమే. ఎంతటి మతాచార్యుడైనా తత్త్వాన్ని లోకులకు మభ్యపెట్టి చెబితే ఆయన సహించడు. లోకసంగ్రహం చేయవలసిన ఆచార్యుడికి లోకవంచన పనికి రాదు. అది కేవలమాత్మవంచనే అవుతుంది.

ఇలాంటి వంచన చేయవద్దనే ఆయా మతాచార్యులనందరినీ ఆయన మందలిస్తూ వచ్చారు. అంతేగాని వారిపైన ఆయనకు ద్వేషభావముండి గాదు. రాగద్వేషాలనేవి ఏ మాత్రమున్నా అది అసలు అద్వైత దర్శనానికే విరుద్ధం. అలాంటప్పుడద్వైతంలో పండిపోయిన జగద్గురువుల కలాటి భావాలనెలా అంటగట్టటం. ఈ విషయంలో ఆయన తనకు తానే ఇలా ఆత్మ విమర్శ చేసుకొన్నారు. ముముక్షువులైన వారికి మోక్షసాధనమైన మార్గమేదో దాన్ని నిరూపించి స్వపక్ష స్థాపనచేసుకోటమే ఉచితంగాని పరపక్షాన్ని అదే పనిగా ఖండించటం దేనికి. అది పర విద్వేషానికి దారి తీస్తుంది గదా. అని ప్రశ్నించుకొని దానికి తానే సమాధాన మిచ్చుకొన్నారు. **"సాంఖ్యాది తంత్రాణి సమ్యగ్దర్శనాపదేశేన ప్రవృత్తాని ఉపలభ్య భవేత్కేషాంచి న్మందమతీనా మేతాన్యపి సమ్యగ్దర్శనాయోపాదేయానీ త్యపేక్షా. తథాయుక్తి గాఢత్వ సంభవేన సర్వజ్ఞ భాషిత త్వాచ్చ శ్రద్ధాచ తేషు ఇత్యతస్త దసారతోప పాదనాయ ప్రయత్యతే."** సాంఖ్యాదులైన మతాలన్నీ సమ్యగ్దర్శనమనే పేరుతో లోకంలో చెలామణీ అవుతున్నాయి. అది చూచి కొందరు మందమతులివి నిజంగానే మనల నుద్ధరిస్తాయని విశ్వసిస్తున్నారు. పైగా గొప్ప హేతువాదముండటం వల్లా, గొప్పవారు వాటిని ప్రచారం చేయటంవల్ల అవి అంటే ప్రత్యేకమైన అభిమానం కూడా

ఉండవచ్చు. అంచేత లోకోపకారార్థం మేము వాటిని నిస్సారమని చాటవలసి వస్తున్నది. అంతేగాని మాకు వారిమీద ఎలాటి ద్వేష భావమూ ఉండి గాదు.

ఆ మాటకు వస్తే రాగద్వేషాలు మాకుకాదు. భేదవాదులైన మిగతా మతాచార్యులకే ఉన్నాయని ప్రతివాదుల మీదనే అభియోగం మోపారాయన. అద్వైతులు తప్ప మిగతా సాంఖ్య యోగవై శేషికనై యాయి కాదులంతా భేదవాదులే. భేదవాదు లోకరి వాదాన్ని ఒక రంగీకరించరు. ఎవరిది వారు సత్యమని చెప్పి ఇతరులను తప్పు పడతారు. రోషాలు పెంచుకొని ఒకరి నొకరు ద్వేషిస్తారు. అలా ద్వేషించవలసిన అగత్యం మాకులేదు. మేమనన్య వాదులమైన అద్వైతులం. శరీరంలో కరచరణా ద్యవయవాల లాగా అన్ని వాదాలూ మాలో చేరిపోయేవే కాబట్టి మా కందరూ సమానమే. వ్యష్టితో చూచి ఒకవేళ ఇతర మతాచార్యులు మమ్మ తూలనాడినా ప్రచ్ఛన్న బౌద్ధుడని మమ్మ పరిహసించినా మేము వారినేమీ అనలేము. వారి అజ్ఞానానికి కేవలం మా మనసులోనేనవ్వుకొంటామని చెబుతూ దీనికొక చమత్కారమైన దృష్టాంతాన్ని సెలవిస్తారు భగవత్పాదులు. ఒక పిచ్చివాడు నేలమీద నిలుచోని ఏనుగుమీద కూచొని ఎదురుగా వచ్చే ఒక మావటిని చూచి "నేనూ ఏనుగునెక్కే ఉన్నాను – నీ ఏనుగును నా మీదికి తోలు – చూతామని" సవాలు చేస్తాడనుకోండి. అంత మాత్రాన వాడా ఏనుగును వీడి మీదికి తోలుతాడా. ఎప్పటికీ తోలడు. ఏమి కారణం. వీడు వట్టి వెఱ్ఱివాడని తెలుసు వాడికి. అలాగే కేవలం వెఱ్ఱి వాళ్ళే ద్వైతవాదులు. వాస్తవంగా ఏదీ లేకపోయినా ఏదో ఉందని వేళ్లాడుతున్నారు. వారు పట్టుకొని వేళ్లాడేది కూడా మా అద్వైత సత్యంలోనే అంతర్భవిస్తుంది కాబట్టి మాకు కోపం లేదు. వారిని మేము చక్కగా అర్థం చేసుకోగలం అని ఉన్న విషయమున్నట్టు లోకానికి చాటుతారాయన.

దీనిని బట్టి శంకర భగవత్పాదుల హృదయమేమిటో మనకిప్పుడు స్పష్టంగా తెలిసిపోయింది. పరమతాలనూ, మతాచార్యులనూ తప్పని చెప్పటంలో కూడా వారికి ద్వేషం లేదు. వారి భాషలో చెబితే అది కేవల మాభాసే. అదైనా ఎందుకు చేశారంటే లోకులంతా అదే సరియైన మార్గమని నమ్మి చెడిపోతారని. జగద్గురువులు కావటంవల్ల లోకోద్ధరణ గావించవలసిన బాధ్యత ఉందాయనకు. ఆ బాధ్యత నిర్వహించటంలో వీరు వారనే దాక్షిణ్యముండ గూడదిక. ఉంటే సత్యానికి కాకుండా వ్యక్తులకు విలువ

ఇచ్చినట్టవుతుంది. అన్నిటికన్నా విలువైనది సత్యం. అంచేత అచ్చమైన అద్వైత సత్యాన్ని ప్రకటించి శాయశక్తులా ఈ మానవ సమాజాన్ని ఉద్ధరించటానికే ఆయన చేసిన ఖండన మండనలన్నీ అంతేకాదు. అవైదికమైన నాస్తిక పాషండాది మతాలన్నింటినీ దేశంలో నుంచి పారదోలటమూ, దేశం నలుమూలలా తిరిగి దిగ్విజయం చేసి నాలుగు విజ్ఞాన పీఠాలు నెలకొల్పటమూ తద్వారా జ్ఞాన ప్రచారం చేయటమూ కూడా ఇందుకోసమే. ఇలాంటి విశ్వజనీనమైన వ్యక్తిత్వమున్నవాడు గనుకనే జగద్గురువనే మాట ఆయన ఎడలనే సార్ధకమయింది.

అయినా **"ద్విషంతి మందా శ్చరితమ్ మహాత్మనా"** మన్నట్టు ఆయనను దుయ్యబట్టే ప్రబుద్ధులుండనే ఉంటారు. ఆయన కేవలం వైదిక మతాభిమాని అని కొందరు. బూజు పట్టిన వర్ణాశ్రమ ధర్మాలను ప్రోత్సహించాడని కొందరు. హింసాత్మకమైన యజ్ఞయాగాదులను కూడా సమర్ధించాడని కొందరు. మరి హైందవమైన సంకుచిత దృష్టి తప్ప అంతకు మించి విశ్వతో ముఖమైన విశాలదృష్టి ఆయనకు లేదని మరి కొందరు. ఇలా ప్రతి ఒక్కటింగణా ఆయనను తప్పు పట్టేవాడే.

ఇవన్నీ ఒక్క మాటలో చెబితే అవివేక మూలకమైన ప్రసంగాలు. వేదశాస్త్రాల కాయన ప్రాధాన్యమిచ్చాడంటే అందులో ఎంతో అంతరార్ధముంది. వేదమంటే కేవలం తాటాకులూ, గంటమూ, అక్షరాలూ కాదు. "ఉపనిషన్నామ నశబ్దరాశిః" అని ఆయనే సెలవిచ్చారు. అవి దానికి బాహ్యమైన సంకేతాలు మాత్రమే. పోతే వాటి వెనకాల దాగిన మనప్రాచీన మహర్షుల Great Seers అనుభవమే వేదమంటే. అది అతీంద్రియం Supra Mental గనుక పరమార్ధ విచారణలో అది ఒక్కటే సాధనమని ఆయన మనకిచ్చే సలహా. అయితే దాన్ని సాధనం గానే చూడాలి గాని అదే పర్వస్వమని మరలా భావించరాదని హెచ్చరిస్తారాయన. **"జ్ఞాపక మేవహి శాస్త్రమ్ - నకారకమ్"** శాస్త్రమెప్పుడూ మనకొకవిషయం తెలపటానికే గాని లేనిదాన్ని సృష్టించటానికి గాదు. ప్రమాణాంతరానికి విరుద్ధమైన మాట శ్రుతి చెప్పినా ఒప్పుకోబని లేదంటారాయన. సిద్ధమైన పదార్ధాన్ని ఏదిగానీ క్రొత్తగా సృష్టించలేదు. కేవలం దాన్ని వర్ణించవలసిందే. అది కూడా విషయరూపంగా ఉంటేనే. బ్రహ్మమనేది దేనికీ విషయమయ్యేది కాదు. కాబట్టి శాస్త్రంకూడా దాన్ని సాక్షాత్తుగా Direct నిర్దేశించలేదు. భంగ్యంతరంగా Indirect మన దృష్టికి తేవలసిందే. అలా తెచ్చిన

తరువాత ఇక ఎంత శాస్త్రమైనా దానికి స్థానం లేదు. దాని ప్రయోజన మక్కడికి సమసిపోతుందంటారాయన. **"అత్రవేదా అవేదాః"** వేదం కూడా ఆ దశలో ఇక అవేదమే. ఇలా వేదానికి ప్రాధాన్యమిస్తూనే దాని పరిధి ఎంత వరకో నిర్ణయించారు భగవత్పాదులు. ఇక ఆయన వైదిక మతాభిమాని అయి చేసిందేమిటి. అంధమైన అభిమానమైతే తప్పుగాని సహేతుకమైతే అది తప్పెలా అవుతుంది. మీదు మిక్కిలి శాస్త్రీయమైన దృష్టి Scientific Approach అని కొనియాడాలి దాన్ని.

పోతే వర్ణాశ్రమాదులూ, యజ్ఞయాగాదులూ వీటిని గురించిన ఆక్షేపణ ఇది కూడా ఆయన మనస్తత్వాన్ని బాగా అర్థం చేసుకోక చేసే తొందరపాటు ఆక్షేపణేనని తోస్తుంది. వ్యావహారికమనీ, పారమార్థికమనీ సత్యాన్ని ఆయన రెండు శాఖలుగా విభజించి ఉన్నాడనే సంగతి మనం మరచి పోతున్నాము. సత్యమనేది ఏకమే అయినా అది లోకుల దృష్టి భేదాన్ని బట్టి అనేక విధాలుగా భాసిస్తున్నది. ఈ ఆభాస నాధారం చేసుకొనిఏర్పడ్డదే వేదంలో చెప్పిన కర్మకాండ అంతా. వర్ణాశ్రమాలుగానీ, యజ్ఞయాగాదులుగానీ, ఇప్పుడీ కర్మకాండ క్రిందికే వస్తాయి. ఇదంతా కేవల మాభాసే. అంటే మానవుడి అజ్ఞానం చేత కల్పితమయినదే. వాస్తవంలో లేదు. అజ్ఞానదశలో ఉన్నవాడికే ఉన్నదిదంతా. అది లేని వాడికి లేనే లేదు. అయితే ఈ అజ్ఞానమున్న జీవులెప్పుడూ ఉంటారు కాబట్టి ఈ వర్ణాశ్రమాలు కూడా ఒక వ్యవస్థగా System ఏర్పడ్డాయి. అవి మానవులు పాటించవలసిన విధులను Duties వారి వారి వయోఽవస్థా ప్రజ్ఞా సంస్కారపాటవాన్ని బట్టి విభజించి చూపుతాయి. అందుల కనురూపంగా ఆచరిస్తే దానికి ఫలమైన అభ్యుదయాన్ని Prosperity చూఱగొంటాడు మానవుడు. ఇందులో పొరపొచ్చె మేముంది. సంకుచిత భావమేముంది. ఆ మాటకు వస్తే సంకుచిత భావం వర్ణాశ్రమ విభాగంలో గాదు. తన్మూల భూతమయిన మానవుల అజ్ఞానంలో ఉంది. దాన్ని ఒక ప్రక్క దగ్గర ఉంచుకొనే దీన్ని ప్రక్కకు త్రోసివేయాలంటే ఎలా పోతుంది. అది ఉన్నంతదనుకా ఇదీ ఉండవలసిందే తప్పదు మరి.

అలాగే పశు హింసాత్మకమయిన యజ్ఞాదులు కూడా మన కపరిహార్యమే అయి కూచున్నాయి. వర్ణాశ్రమాలు కేవలం మన అజ్ఞానం వల్లనైతే ఇవి అజ్ఞానం వల్లనే గాక కామం వల్ల కూడా ఆవిర్భవించాయి. మానవుడికి కామ Craving మనేదే లేకపోతే ఏ యజ్ఞమూ అక్కరలేదు. ఏ యాగమూ అక్కరలేదు. కనుకనే

వేదాంత మార్గంలో కామ్య కర్మలెప్పుడూ పనికి రావంటారు భగవత్పాదులు. **"తపసా అనాశకేన"** అనే చోట అనాశకమనే మాట కర్థం చెబుతూ **"కామానశనమ్‌నతు భోజన నివృత్తిః"** అని వ్యాఖ్యానించారు. అయితే చిత్రమేమంటే కామవాసన లేనివాడే లేదు ప్రపంచంలో. ఈ పని చేసి ఏదో ఫలితం పొందాలనే ఉంటుంది ప్రతివాడికీ. దాన్ని అనుసరించే శాస్త్రం వాడి కాయా కామ్యకర్మలు నిర్దేశించింది. ఒకవేళ శాస్త్రం చెప్పకపోయినా చేసే స్వభావమున్నవాడు చేయనే చేస్తాడంటారు భగవత్పాదులు. శాస్త్రమనేది ఒక దీపంలాంటిదని గదా ఆయన చెప్పిన మాట. దీపానికెదురుగా ఏపనైనా జరగవచ్చు. ఏది జరిగినా పుణ్యం పాపమాజరిపే మానవుడిదే. దీపానికేదీ లేదు. అది కేవలం సాక్షి మాత్రంగా వెలుగు నివ్వటం వరకే. అలాగే శాస్త్రం కూడా మనం ఫలానా కోరిక నాకు కావాలని అడిగితే ఆ కోరికకు తగిన మార్గం సూచిస్తుంది. ఏ కోరికా లేకపోతే ఎలాగైనా ఈ పనిచేసి దాన్ని పొందమని బలవంతం చేసి చెప్పదు.

దీనిని బట్టి తేలిన సారాంశమేమంటే శాస్త్రం వర్ణించి చెప్పే వర్ణాశ్రమ ధర్మాలుగానీ, కామ్యరూపమైన యజ్ఞాదులుగానీ, లోకుల దృష్టి ననుసరించి చెప్పినవే. మరి ఈ లోకుల మనస్తత్త్వంలో ఉండే వైవిధ్యం Variety చూతామంటే ఇంతా అంతా గాదు. సృష్ట్యాది నుంచీ అది అంతమయ్యేదాకా ఈ వైచిత్రి ఉండనే ఉంటుంది. అంతా కలిపి ఏకం చేయటమనేది నీవల్లా నావల్లా అయ్యే పనిగాదు. ఒక భేదాన్ని తొలగిస్తే మరి ఒకటి తల ఎత్తుతుంది. మొత్తానికి చిల్లిగాదు తూటన్నట్టు ఇది గాకపోతే ఇంకొక్కటైనా ఉండవలసిందే. అంతా తొలగించటం సాధ్యమయ్యేట్టయితే, మన పూర్వులే దాన్ని ఎప్పుడో సాధించి ఉండేవారు. ఎంత ప్రయత్నించి కూడా వారు సాధించలేక పోయారంటే అది ఇక అసాధ్యమని వేరుగా చెప్పబని లేదు.

అంచేత శంకరులు చేసింది ఏమీలేదు. ఆయన క్రొత్తగా తెచ్చిపెట్టింది ఏదీలేదు. లోకంలో ఉన్న వ్యవస్థనే శాస్త్రం చెబుతుంటే ఆ శాస్త్రాన్నే ఆయన బలపరిచారు. అన్నిటికీ మూలమీ లోకమే గదా. అయితే ఈ లోకం కూడా అసలు సత్యం కాదు. ఇది కేవలం వ్యావహారికమే Temporary. మన అజ్ఞానం వల్ల కనిపిస్తున్నదే గాని జ్ఞానోదయమైతే ఏదీలేదు. అంతా ఒకే ఒక సత్యమని చెప్పి ఇంకా గొప్ప పరిష్కార మార్గం చూపాడా మహానుభావుడు. ఆ పరిస్థితిలో ఆయన ఇక వర్ణాశ్రమాదులు

గాని, మిగతా కర్మకాండగాని, అసలు వేదప్రామాణ్యమే గాని, ఏ ఒకటీ ఒప్పుకోరు. అంతా త్రోసిపారేస్తారు. ఇలాంటి ధైర్యంగాని, సాహసంగాని ఏ మతాచార్యుడికీ కానరాదు. అంతా ఒప్పుకొంటూనే ఏదీ కాదనటం ఆయనకొక్కరికే చెల్లింది. అజ్ఞానంలో అన్నీ ఉన్నాయి. జ్ఞానంలో ఏదీలేదు. దీనితో ఇటు అజ్ఞానులనూ, అటు జ్ఞానులనూ, ఇద్దరినీ కాదనకుండా సమస్య పరిష్కరించ గలిగారాయన. ఇంతకన్నా సార్వజనీనత Public spirit or altruism ఏముంది.

దీనితో హైందవ మతానికే, అందులోనూ బ్రాహ్మణ ప్రాశస్త్యానికే ఆయన దత్తమయ్యారనేమాట కూడా పొరబాటేనని తేటపడుతున్నది. అపేత బ్రహ్మక్షత్రాది భేదమని వర్ణిస్తారు బ్రహ్మతత్త్వాన్ని ఆయన. మరి బ్రాహ్మణుడెవడంటే బ్రహ్మజ్ఞానమున్నవాడే. ఆ శబ్దానికి ముఖ్యార్థ Primary sense మదే. మిగతా జాతి బ్రహ్మణత్వం కేవల గౌణార్థం Secondary sense లోనే అని లోకానికి చాటిన అతి విశాల హృదయ మాయనది. పైగా కర్మానుష్ఠానమనేది తూచా తప్పకుండా పాటించనక్కరలేదు. అది లేకున్నా తీవ్రమైన జిజ్ఞాస ఒకటి ఉంటే చాలు. బ్రహ్మజ్ఞానానికెవడైనా అర్హుడనే చాటారు. అది కూడా ఏ దేవతలకో మహర్షులకో హక్కు భుక్తమనుకోనక్కరలేదు. జిజ్ఞాసువైన ప్రతి ఒక్కడికీ అది సొమ్మేనన్నారు. చీమ మొదలు బ్రహ్మదాకా అందరమూ బ్రహ్మవంశ్యులమేనని ఆయన చాటినమాట. పోతే శాస్త్ర చోదితమైన నిత్యనైమిత్తికాలూ, యజ్ఞయాగాలూ, జపతపోవ్రత పూజా పురస్కారాదులూ, వీటివల్ల కలిగే స్వర్గాదిఫలాలూ, జన్మాంతరాలూ, పుణ్యపాపాలూ ఇవన్నీ ముముక్షువైన వాడికి స్వప్న మాయా మరీచ్యుదక గంధర్వనగ రోపమమనీ, జ్ఞానదృష్టితో చూస్తే అంతా హుళక్కేననీ, ముక్త కంఠంతో చాటి ఈనాటి హేతువాదులకన్నా సంఘ సంస్కర్తలకన్నా ప్రగతిశీల Progressive మైన దృక్పథాన్ని ప్రదర్శించారు. ప్రాచీనతలోనే ఇంత నవీనత చూపిన ఆచార్యుడు గాని, ప్రవక్తగాని ఎవడున్నాడు ? ఇప్పటికి లేడు. ఇక ఉండబోడు. పరిపూర్ణాద్వైతి గనుకనే చెల్లిందది.

ఏవం గుణ విశిష్ట సర్వాతిగ దృష్టి ఉన్నవాడు గనుకనే ఆయన భగవత్పాదులయ్యారు. అది మరలా ప్రతి ఒక్క మానవుడికీ ఉపదేశించి లోకోద్ధరణకు బద్ధకంకణుడు కావటంవల్ల జగద్గురువులయ్యారు. పరిపూర్ణమైన అద్వైత భావంతో సర్వభావాలూ సమన్వయం చేసి చూపిన ఆ మహాత్ముడు జగద్గురువు కావటంలో

ఆశ్చర్యమేముంది. అంచేత మానవ జీవిత పరమార్థమేమిటో తెలుసుకొని తరించాలంటే ఎప్పటికైనా ఏ దేశంలో పుట్టిన ఏ మానవుడైనా సరే, శంకర భగవత్పాదుల ఈ ఉపదేశ సుధాసారాన్ని తనివితీర గ్రోలవలసిందే. ఆ అమృతసారాన్నే నేనారు పాయలుగా ప్రవహింపజేసి పరమార్థ జ్ఞాన రస పిపాసువులైన మీకందరికీ కర్ణపేయం చేయగలిగాను. దీని నాస్వాదించి మీరందరూ మరలా మీకు స్వాభావికమైన అమృతత్వాన్నే అందుకోగలిగితే అంతకన్నా కావలసింది లేదు. **"ఆచార్యవాన్ పురుషోవేద"** అన్నట్టు భగవత్పాదుల ఆచార్యకంలో మనకన్నీ సంపన్నం కాకతప్పదు. మరి తన ఎనిమిదవ ఏటనే సకల శాస్త్ర పారంగతుడయి సన్న్యసించి పన్నెండవ ఏటనే సద్గురూపదేశాన్ని సాధించి పదహారవ ఏట భాష్య రచనాదులు కావించి ఇరువదవ ఏట ఆసేతు శీతాచలమూ జైత్రయాత్ర చేసి దేశం నలువైపులా విజయస్తంభాల లాంటి నాలుగు విజ్ఞాన పీఠాలు నెలకొల్పి మహారాజుల మన్ననలు పొంది దిగ్దంతుల లాంటి శిష్య ప్రకాండులను తీర్చిదిద్ది ఎన్నో చర్చలుచేసి మహిమలు చూపి ముప్పది రెండవ ఏటనే సమస్తమూ ముగించుకొని బ్రహ్మభూయాన్ని బడసిన ఆ మహనీయుని కంటే మనకిక ఆచార్య పురుషుడెవరు. నిజాని కాయన కాయనే సాటి.

*శంకర శ్శంకర స్సాక్షా - ద్వ్యాసో నారాయణో హరిః*

# ప్రతిశ్రుతమ్

జగద్గురూణా ముపదేశ వార్నిధిమ్
ప్రవిశ్య తత్పార ముపైతు మిచ్ఛతా
మియమ్ కృతిర్నౌరివ మార్గగామినీ
క్రమేణ కుర్యాత్స ఫలమ్ మనోరథమ్

